సద్గురువర్యులు

ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము

గారికి భక్తితో

—రచయిత

# ఉపోద్ఘాతము

ఆంధ్రజాతి అతి ప్రాచీనమైనది. ఐతరేయ బ్రాహ్మణమునందాంధ్రుల ప్రశంస యున్నది. రామాయణ మహాభారత, భాగవతాది పురాణములందు సందర్భానుసారము ఆంధ్రులు ప్రశంసింపబడినారు. ఆంధ్రజాతి సముజ్జ్వలమైన జాతి. ఆంధ్రజాతి జీవనము, తక్కిన జాతులవారి జీవనముకంటె ప్రత్యేక జీవనము, ప్రత్యేక సంస్కృతిని, సాంఘికాచార వ్యవహారములను కలిగియున్నది.

ఆంధ్ర జాతి విశిష్టమైనది. ఆంధ్ర సంస్కృతి ప్రాచీన కాలమునుండి ప్రపంచమున గౌరవింపబడి విదేశీయులను ముగ్ధులగావించినది. ఆంధ్రుల సాంఘిక జీవనము ప్రత్యేకత కలిగినట్టిది. ఆంధ్ర ప్రజల గృహ నిర్మాణ పద్ధతులు, వేషభాషలు, అలంకారములు, ఆభరణములు, ఆహార విహారములు, ఆచార సంప్రదాయములు, కుటుంబ నిర్వహణా పద్ధతులు, వారసత్వపు హక్కులు, వినోదములు, క్రీడలు, పండుగలు-పర్వదినములు, పరిశ్రమలు, సంఘము, గ్రామనిర్మాణ పద్ధతులు, పట్టణములు, దుర్గములు, రాజ్యపరిపాలనా విధానము, గ్రామపరిపాలనా విధానము, పంచాయితీలు, వాటి నిర్వహణ-వర్ణ వ్యవస్థ, ప్రజల వృత్తులు,వ్యవసాయము-పంటలు, వ్యాపారము,విదేశ వ్యాపారము నౌకాయానము-రేవు పట్టణములు, నగర జీవన విధానము, విద్యా వైదుష్యములు కళాపోషణ, దేశ రక్షణ-సైనిక వ్యవస్థ యుద్ధతంత్రము, ఆయుధములు, ఆర్థిక వ్యవస్థ-నాణెములు, ప్రజాహిత కార్యములు, చిత్ర లేఖనము, మతము, దేవాలయ నిర్మాణము, సంగీతము, శిల్పము, నృత్యము దానధర్మములు మొదలగునవి, సాంఘిక జీవన విధానమును తెలుపునట్టివి.

కీర్తిశేషులు శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు తమ సాంఘిక చరిత్ర ద్వితీయ ముద్రణ పీఠికాంతమున "ఇకముందు ఈ సాంఘిక చరిత్ర పూర్వ భాగమును శాలివాహనుల కాలమునుండి రాజరాజనరేంద్రుని కాలమువరకు వ్రాయుటకు పూనుకొందును" అని వ్రాసినారు. పూజ్యులు ప్రతాపరెడ్డిగారు సాంఘిక చరిత్ర పూర్వభాగము రచించుట కారంభించియుండిరో లేక కొన్ని అధ్యాయములను రచించి యుండిరో తెలియదు. మన దురదృష్టము వలన వారు

పరమపదించినారు. శ్రీ ప్రతాపరెడ్డిగారే ఆంధ్రుల సాంఘిక చరిత్ర పూర్వభాగ మును రచించిన యెడల నది సమగ్రముగను, ఆంధ్రుల సాంఘిక జీవనమును ప్రతిబింబింపజేయు అద్దమువలెను ఉండెడిది. అట్టి మహద్భాగ్యమునకు నోచుకో లేనివార మైనాము.

ఈ గ్రంథమున ఆంధ్రుల సాంఘిక చరిత్ర అశోక చక్రవర్తి కాలము నుండి రేనాటి చోళులకాలమువరకు వ్రాయబడినది. ఈ గ్రంథమసమగ్రమనియే నానమ్మకము. నావంటి అల్పజ్ఞుడిట్టి గ్రంథ రచన కుద్యమించుట న్యాయమైన పని కాదు. కాని శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు అసంపూర్తిగా వదిలిన సాంఘిక చరిత్ర పూర్వభాగము రచింపవలెనను ఉత్సాహము, పట్టుదల నన్నీ రచనకు పురికొల్పినవి

ఆంధ్ర చారిత్రకులలో నగ్రగణ్యులైన బ్ర. శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు, డా॥ నేలటూరి వేంకట రమణయ్యగారు, డా॥ మారేమండ రామారావు గారు, ఆదిరాజు వీరభద్రరావు పంతులుగారు, రాళ్ళ బండి సుబ్బారావుగారు, ఖండవల్లి లక్ష్మీరంజనముగారు, మొదలగు మహా మహుల గ్రంథములు, వివిధ రాజవంశీయుల కాలపు, రాజకీయ, మత, ఆర్థిక, సాంఘిక, విద్యా, వైదుష్య, శిల్ప, చిత్ర, కళలకు సంబంధించిన వ్యాసరాజములను, శాతవాహనులాది చాళుక్య వంశీయుల కాలమువరకు వెలసిన శాసనములను చదివి, నాకు దోచిన విధమున ఈ సాంఘిక చరిత్ర పూర్వ భాగమును రచించినాను.

ఎనిమిది ప్రకరణములలో ఈ గ్రంథము వ్రాయబడినది.

ఇందు కళింగాంధ్రులు అను ప్రకరణము "గాంగరాజులనాటి కళింగాంధ్రుల సాంఘికచరిత్ర" అను వ్యాసముగా భారతి-1969 ఆగస్టు, సెప్టెంబరు సంచికలలోను, "రేనాటి చోళయుగము" "సాహితీ వాల్లభ్యము" అను గ్రంథములో 'రేనాటి చోళుల శాసనములను' వ్యాసముగను, 'శాతవాహనుల పరిపాలనా విధానము' ఆంధ్రప్రదేశ్ "మాస పత్రికలోను ప్రకటింపబడి నవి. ఆయా పత్రికాధిపతులకు నా కృతజ్ఞతలు. రాజవంశముల ననుసరించి ప్రకరణములకు యుగముల పేర్లు పెట్టబడినవి. వివిధ వంశీయుల కాలపు సాంఘిక చరిత్ర రచన కాయా వంశీయుల కాలమున వెలసిన శాసనములే ముఖ్యాధారము లుగ ఆయా ప్రకరణములు రచింపబడినవి. ఈ గ్రంథము వ్రాయుటకు

దోడ్పడిన గ్రంథములు, శాసన గ్రంథములు ప్రకరణాంతములందు పేర్కొన బడినవి.

ఈ గ్రంథము వ్రాయుటలో దోడ్పడిన గ్రంథముల రచయితలకు, శాసన సంపుటముల సంపాదకులకు, కృతజ్ఞుడను. చారిత్రకులు, విమర్శకులు సాంఘికులు గ్రంథమునగల లోపములను తెలిపిన కృతజ్ఞతతో స్వీకరించి మలి ముద్రణమున సవరించుకొందును.

శ్రమకోర్చి అత్యల్ప కాలములో ఈ గ్రంథ ప్రచురణ భారమును వహించిన, నాగార్జున ప్రింటింగ్ వర్క్సు నిర్వాహకులు, మిత్రులు శ్రీ ఎన్. వి నారాయణరావు గారికిని, శ్రీ గండయ్య, వారి సహచరులకును నా కృతజ్ఞతలు.

నారాయణగూడ
హైదరాబాదు–29

—బి. ఎన్. శాస్త్రి

# వి ష య సూ చి క

———

## 1వ ప్రకరణము

# సాతవాహనులకు పూర్వయుగము

"మానవుని సాంఘిక వైజ్ఞానిక ఆర్థిక, రాజకీయ, మత, సారస్వత, కళా విషయములను, ప్రాంతీయముగ జాతీయముగ కాక, యావత్ప్రపంచ మానవ సమాజమునకు సంబంధించిన వానిగా తెలుంగుటను తెలుపునది సాంఘిక చరిత్ర" సారస్వతము, శాసనములు, స్థానిక చరిత్రలు, విదేశీయుల వ్రాతలు, శిల్పములు, చిత్తరువులు, నాణెములు, సామెతలు, వాఙ్మయములలోని సూచనలు దానపత్రములు, పురాతన వస్తు సమూహము, పాటలు, చాటువులు, జానపద గేయములు - సాంఘిక చరిత్ర నిర్మాణమునకాధారములు.

చరిత్ర రచనమునందు శాసనము లెట్లు ప్రాధాన్యము వహించుచున్నవో సాంఘిక చరిత్ర రచనమునందును అంత ఉపయోగపడుచున్నవి. శాసనములవలన ఆ యా యుగముల రాజకీయ భాషా, చరిత్రతోపాటు సాంఘిక చరిత్రకూడా తెలియును. క్రీ. పూ నుండియు ఈ శాసనములు వ్యాప్తిలో నున్నవి.

భారతదేశము సువిశాలమైన, సంపన్నమైన దేశము. భారతీయ సంస్కృతి విశిష్టమైనది. భారతీయ ఋషులు తత్త్వ జిజ్ఞాసాపరులు. దాన ధర్మములకు, దయా దాక్షిణ్యములకు, కళాపోషణమునకు, ప్రజాపరిపాలనాదక్షతకు ఆ నాటి భారతీయ ప్రభువులు ఆదర్శనీయులు.

వేదములు భారతీయులకు పరమ ప్రామాణిక గ్రంథములు. స్మృతి పురాణేతిహాసకావ్యాదులు భారతజాతి జీవితమున ప్రత్యేక స్థానము నాక్రమించుకున్నవి. జాతి ప్రత్యేకతను తెలుపు నీ గ్రంథములందలి వివిధ విషయ బోధనములవలన భారతీయ సంస్కృతి కొక విశిష్టత చేకూరినది. ప్రపంచమున భారతజాతి కొక ప్రత్యేకత ఏర్పడినది.

ఆంధ్రుల సాంఘిక చరిత్రకు ధారావాహికముగ గానవలసిన చారిత్రకాధారము లిప్పటివఱకు లేవు. ఐతరేయ బ్రాహ్మణము, పురాణములు, రామాయణ మహాభారత, భాగవతాది ఇతిహాసములు సాంఘిక చరిత్ర రచనమునకు గాక ఆంధ్రజాతి ప్రాచీనతను తెలుపుటలో మాత్రము సహకరించుచున్నవి.

ప్రభుత్వ శాసన పరిశోధన శాఖవారు, సంస్థలు, చారిత్రకులుగాక, దేశ చరిత్ర యందు అభిలాష, అభిమానము కలిగియున్న వ్యక్తులు సేకరించిన శిలా శాసనములు, లోహపు పట్టికలు, ఆయా యుగములందు వెలసిన ప్రాకృత, సంస్కృత గ్రంథములు, దేశ భాషలలో రచింపబడిన కావ్యాదులు, విదేశీయులు తమ పర్యటనమున చూచిన విశేషములను వివరించుచు వ్రాసియుంచిన గ్రంథములు, సాంఘిక చరిత్ర రచనమునందుపయోగపడుచున్నవి. ఒక జాతి యొక్క సాంఘిక చరిత్ర ఆ జాతి విశిష్టతను చూపుటయే గాక, జాతి యొక్క పూర్వ చరిత్రను, ప్రస్తుత చరిత్రను తెలిపి ఉన్నత ఆశయములతో భవిష్యత్ చరిత్ర ఉజ్జ్వలముగా నుండుటకు దోడ్పడును.

కీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగారు 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర'ను రచించి ఆంధ్రదేశమునకు మహోపకార మొనర్చినారు.

క్రీస్తు పూర్వము నుండి క్రీస్తు శకము పదునొకండవ శతాబ్దమువరకు ఆంధ్ర దేశమును పాలించిన రాజవంశముల చరిత్రలను, ఆయా యుగములయందాయా వంశపు రాజులు వేయించిన శాసనములను, ఆయా యుగములందు వెలసిన, ఆయా యుగములకు సంబంధించిన గ్రంథముల నాధారముగ జేసికొని ఆంధ్రుల సాంఘిక చరిత్ర క్లుప్తముగా వ్రాయబడుచున్నది.

మానవుడు సంఘ జీవి. సంఘమున జీవించుటయే మానవుని ప్రత్యేకత. అతి ప్రాచీన కాలము నుండియు మానవుడు సంఘము పైన నాధారపడి సాంఘిక చైతన్యముతో జీవించుచు భగవంతుని సృష్టిలో మహోన్నత స్థాయికి చెందినవాడై, సంఘ శక్తి వలన మానవ సమాజ నిర్మాణమునకు కారకుడైనాడు.

మానవ సమాజ నిర్మాణమునకు గార్హస్థ్యధర్మము, ఆ[illegible] - వా[illegible]ల్యము, స్వజాత్యభిమానము, సంతతి యందు ప్రేమ, బం[illegible]ల్పము, మతము - భౌతికపరిస్థితులు - కుటుంబము - కులము [illegible] - దేశము - ప్రజలు - భూమ్యుపరితలము - శీతోష్ణస్థితి - ప్ర[illegible]సంపద, ప్రకృతి ప్రభావములు కారణములు.

ఆంధ్రజాతి అతిప్రాచీనమైనది. ఈ జాతి మొదట ఐతరేయ బ్రాహ్మణమునందలి శునశ్శేప - హరిశ్చంద్ర — విశ్వామిత్రాదుల వృత్తాంతమున పేర్కొనబడినది.

"తానను వ్యాజహారాంతాన్వః
ప్రజా భక్షీష్టేతి - తఏతేంధ్రాః పుండ్రాః
శబరాః, పుళిందాః మూతిబా
ఇత్యుదంత్యా బహవో భవన్తి
వైశ్వామిత్రా దస్యూనాం భూయిష్ఠాః

(ఐతరేయ బ్రాహ్మణము)

ఐతరేయ బ్రాహ్మణము ఋగ్వేదమునందలి భాగము. విశ్వామిత్రుని నూర్వురు కుమారులలో మొదటి ఏబదుగురుగాక తక్కిన ఏబదిమంది పుత్రులను ఆర్యాశ్రమములయొక్క సరిహద్దు లందు నివసించు నట్లాతఁడు శపించెను. అట్లు శపింపబడినవారే ఆంధ్రులనియు, శబరులనియు, పుళిందులనియు, మూతిబులనియు, పిలువబడుచున్నారనియు, అట్టి విశ్వామిత్రసంతతివారే దస్యులలో నధిక భాగ మేర్పడిరని ఐతరేయ బ్రాహ్మణమునందలి పై మంత్ర మున తెలుపబడినది

ఆంధ్రశబ్దము మొదట జాతిపరము. విశ్వామిత్రుని శాపము వలన వీరికనార్యత్వము సిద్ధించునప్పటికే ఈ జాతి కా పేరు వ్యాప్తి లోనికి వచ్చినది. శాపానుసారము ఆంధ్రపుండ్రాది జాతులవారు ఆర్యాశ్రమప్రాంతములందు నివసించి, కాలక్రమమున జనసంఖ్య పెరుగుటవలన దక్షిణమునకు వ్యాపించిరి.

శాపము ననుసరించి వీరు ఆర్యాశ్రమములను వీడి గంగా నది వెంటనే వెళ్ళి తూర్పు సముద్ర తీరమును తాకి తూర్పు కనుమల కును సముద్రమునకును మధ్యగా పయనించి దక్షిణమునకు వచ్చి గోదావరీ తీరమునుండి పడమరకు వెడలినారు.

ఆంధ్రులు నివసించు దేశమునకు తొలుత యెట్టి పేరుండెనో తెలియదు. ఐతరేయ బ్రాహ్మణమున ఆంధ్రుల ప్రశంస యున్నను వారి నివాస స్థాన మేదియో పేర్కొనబడలేదు. ప్రాచీన కాలమున ఇప్పటి యాంధ్ర దేశము అగ్ని పర్వతములతో గూడుకొని జనా వాస యోగ్యమున క న ర్హ మై యుండెనని చెప్పవచ్చును. రామాయణ కాలమునందీ దేశము దండకారణ్య ప్రదేశముగా నుం డెను. శ్రీరాముఁడు పితృ వాక్య పరిపాలనార్థము వనవాసము

చేయదలంచి దండకారణ్యమునకు వచ్చునప్పటికే దక్షిణా పథమున ఆంధ్రు లుండిరి. విశ్వామిత్రుని శాపము నందినవారు తూర్పు సముద్ర తీరమునకు వచ్చి, అచట నుండి దక్షిణముగా వెడలి గోదావరిని దాటి పడమరగా వ్యాపించిరి. మనకు క్రమముగా పుండ్రా (గోండులు) శబరాః (సవరులు) పుళిందాః (పుళిందులు) కన్పట్టుదురు. ఆంధ్రులు కృష్ణా గోదావరీ నదుల మధ్య ప్రాంతము నాక్రమించిరి. జన సంఖ్య యందును. దేశ విస్తృతి యందును. నాగరికత యందును సంస్కృతి యందును పుండ్రాదులకన్న వీరు మిన్నలై యున్నారు.

రామాయణమున కిష్కింధాకాండలో సీతాన్వేషణమునకై దక్షిణ దిక్కున కేగు వానరులు చూడవలసిన వానిలో నాంధ్ర పుండ్రాది దేశములను సుగ్రీవుడు పేర్కొనినాడు.

"అన్వీక్ష దండకారణ్యం
సపర్వతనదీగుహం
నదీం గోదావరీంచైవ
సర్వమేవాను పశ్యత
తథై వాంధ్రాశ్చ పుండ్రాశ్చ
చోళాన్ పాండ్యాశ్చకేరళాన్
అయోముఖశ్చగ స్తవ్యః
పర్వతో ధాతు మండితః"

రామాయణము - కిష్కింధాకాండ.

రామాయణము తరువాత వెలసిన మహా భారతమునందును ఆంధ్రుల ప్రశంస కలదు. రాజసూయ యాగమునకు పూర్వము సహదేవుండు దక్షిణ దిగ్విజయమునకు బయలుదేరి పాండ్య ద్రవిడ

ఓఢ్ర కేరళ చోళులతో పాటాంధ్రులను కూడ జయించెనని ఈ క్రింది శ్లోకమున గలదు.

పాండ్యాశ్చ ద్రవిడాంశ్చైవ
సహితాం శ్చోఢ్ర కేరళైః
ఆంధ్రాంస్తలప నాంశ్చైవ
కళింగానోష్ట్ర కర్ణికాన్

భారతము–సభాపర్వము

ధర్మరాజు రాజసూయాధ్వరమునం దాతని పరివేష్టించి యుండిన పృథ్వీపతులలో అంగ వంగాది రాజులతో పాటాంధ్రులు కూడ నుండిరని.

తథాంగ వంగౌ సహపుంద్రకేణ
పాండ్యోఢ్ర రాజౌ సహచాంధ్రకేణ

భారతము – సభాపర్వము.

అను శ్లోకమును బట్టి తెలియుచున్నది.

ఆంధ్రజాతియొక్క సంపూర్ణ చరిత్ర దాని సంస్కృతి చరిత్ర యనబడును. జాతి జీవిత చరిత్ర (1) నిత్య జీవితము (2) శాశ్వత జీవితమని రెండు విధములు. నిత్యజీవితము (1) వ్యక్తిగత జీవితము (2) సంఘ జీవితము అని రెండు తెఱగులు.

వ్యక్తి జీవితము:—ఇందు వ్యక్తిగత విషయములకు ప్రాముఖ్యము కలదు. వ్యక్తి — అతనికి కావలసిన గృహనిర్మాణపద్ధతులు – సౌకర్యములు, ఆహారము, వేషము – భాష – అలంకారములు – కుటుంబపద్ధతి – వారసత్వపు హక్కులు – ఆచార సంప్రదాయముల వ్యవహారము – పండుగలు – పర్వదినములు – స్త్రీ పురుషుల విధులు– వారి బాధ్యతల నిర్వహణ – గృహపరిశ్రమలు, జనన మరణాదులందు చేయు సంస్కారములు చర్చింపబడును.

సంఘ జీవితము:—ఇందు - జాతి యొక్క స్థితి - సంఘ జీవన విధానము గ్రామ నిర్మాణ పద్ధతులు గ్రామ పరిపాలనా విధానము— పంచాయితీలు — వర్ణాశ్రమధర్మములు - వృత్తులు - వృత్తుల నిబంధనలు, వ్యవసాయము, పంటలు, నీటి సౌకర్యములు-పశుగణాభివృద్ధి, కరువు కాటకములు, వ్యాపారము-దాని యభివృద్ధి, విదేశ వర్తకము-నౌకాయానము నౌకా స్థానములు- రాకపోకల సౌకర్యములు నగరములు - నగర పాలక సంఘములు - నగర జీవితము, నాగరకుని విధులు - వాని నిర్వహణ - పరిశ్రమలు - ప్రజాభిప్రాయములు - ఉద్యమములు - విద్యాసంస్థలు - విద్యావిధానము — విశ్వవిద్యాలయములు - సంఘజీవనమున వాని పాత్ర, మఠములు రాజులదాతృత్వము - కళాపోషణము. అగ్రహారములు - దేవాలయములు - విద్యావ్యాసంగములు - స్త్రీ విద్య - వృత్తి విద్య - ప్రజారోగ్యము - ప్రభుత్వ పరిపాలనా విధానము - రాజ్య స్థాపన - రాజ్య పతనము - సామంత మాండలిక సేనాపతులు - దేశ రక్షణ, సైనికవ్యవస్థ - యుద్ధములు - ఆయుధములు - వాని విధములు - యుద్ధ వ్యూహరచన, యుద్ధతంత్రము - దేశసంపద - భూ సంపద - ఖనిజసంపద - ప్రకృతిసంపద - ఆర్థికవ్యవస్థ - ప్రజలు - ప్రజా సౌకర్యములు - ప్రజల భోగభాగ్యములు-ధనికులు, వారి ప్రజాహిత కార్యములు, చర్చింపబడును

ఆంధ్ర జాతియొక్క సాంఘిక జీవితమున పాప పుణ్యములు-మంచిచెడుల ధర్మాధర్మములు ఏ ఏ కార్యముల వలన కల్గునో తెలియును. మతము- ధర్మము, మతాభిప్రాయములు- జైన, బౌద్ధ హిందూ మతములు -శైవ వైష్ణవములు వివిధ మతములకు సంబంధించిన దేవాలయములు - మతముల ప్రాబల్యము. మతముయొక్క ప్రభావము. అన్య మతములపై చూపు సహానభావము - మతోద్ధర

ణము - మత కలహాములు — దానములు - దేవాలయ నిర్మాణము శాసనములు - జాతి శీలము - ప్రజల మనస్తత్వము - జాతి మానసిక వికాసము, శాస్త్రములయందు పరిశ్రమ - ఆంధ్రభాష. భాషా వ్యాప్తి - లేఖనములు - లిపి దాని పరిణామము. కళాజీవితము - శిల్పకళ. దేవాలయ నిర్మాణము - శిలా నిర్మాణములు - ఇటుక కట్టడములు - గుహాలయ శిల్పములు - చిత్రలేఖనము - గృహాలంకరణము - దేవాలయాలంకరణము - వస్తువులపై చిత్రములు - మట్టి పాత్రలపై చెక్కడములు. సంగీతము - నాట్యము - సాహిత్యము - జానపద సాహిత్యము - శిష్ట సాహిత్యము. కవులు - వారి చరిత్రము - శాసనములు - గ్రంథములు వాని వలన ఆ నాటి జాతి జీవన విధానము - సాంఘికాచారములు - మున్నగు విషయములు వచ్చును.

క్రీ పూ. ఆరవ శతాబ్దమున మగధ రాజ్యము శక్తి సమన్వితమై యుండెను. ఆ కాలమున శిశునాగ వంశీయులు మగధ నేలుచుండిరి బింబిసారుడు క్రీ. పూ. 543 నుండి 491 వఱకు మగధను పాలించెను. క్రీ. పూ 491లో బింబిసారుని చంపి అతని కుమారుడగు అజాత శత్రువు రాజై క్రీ. పూ. 459 వఱకు మగధ నేలెను. అజాత శత్రువు సమకాలికుడు గౌతమ బుద్ధుడు. తండ్రిని చంపిన పిదప పశ్చాత్తప్తుడై అజాతశత్రువు గౌతమ బుద్ధుని బోధనల వలన బౌద్ధ మతము స్వీకరించెను. బుద్ధుని కాలము క్రీ. పూ. 563-483. జైనమత స్థాపకుఁడగు వర్ధమానమహావీరుడు క్రీ. పూ. 491కి పూర్వమే మత ధర్మముల బోధించి నిర్యాణమొందెను.

ఆ కాలమున ఆంధ్ర దేశమును నాగ రాజులు పాలించుచుండిరి. విశ్వామిత్రుని కుమారులు శప్తులై దక్షిణాపథ మందంతట వ్యాపించిరి. అంధాంధ్రు లాంధ్ర దేశమున స్థిరపడిపోయిరి.

తెలివాహా నది ఆంధ్ర దేశమునకు ఉత్తర సరిహద్దుగా నుండెను. తేలి వాహా నది మహానదికి ఉపనది బౌద్ధ మత మాంధ్ర దేశము నా కాలమున పాలించుచుండిన నాగులచే ఆదరింపబడెను. ఒక నాగ రాజు కృష్ణానదీ తీరమున బౌద్ధ స్తూపమును నిర్మించినట్లు బౌద్ధ జాతక కథ యందున్నది. ఆ కాలమున సింహళ ద్వీపమునకును, మంజీరికా దేశమునకును వర్తక వ్యాపారములు సాగుచుండెను. ఆ నాడు సింహళద్వీపమునకు నాగద్వీపమనియు, ఆంధ్ర దేశము నకు మంజీరా నది ప్రవహించు ప్రదేశము కావున మంజీరికా దేశ మనియు పేర్లుండెను.

ఆంధ్రులు సముద్ర యానము చేయుచుండిరి. నౌకా నిర్మాణ పరిశ్రమ ఆంధ్ర దేశమున వృద్ధిలో నుండెను అందుకు దగిన సౌక ర్యము లాంధ్రుల కుండెను. నౌకా నిర్మాణానుకూలమైన కలప నిచ్చు యడవులు నౌకలునిలబడుటకు తగిన రేవులు ఆంధ్ర దేశ మందుండెను. ఓడలు పశ్చిమ తీరమున నున్న ఓడ రేవులగు భరు కచ్ఛము, శూర్పారాగమను రేవుల నుండి వెడలి సింహళ ద్వీప మును చుట్టి ఆంధ్ర దేశ తీరమున గల ఓడ రేవులను చూచుకొని తామ్రలిప్తి వఱకు పోవుచుండెను.

కృష్ణానదీతీరమున వజ్రాల దిన్నెయు పినాకినీ నదీతీరమందలి రేవు నగరమును, ఆకాలమున ముఖ్యమైన సముద్ర వర్తకస్థాన ములు. ఆంధ్రులు బర్మాదేశముతోను వర్తకము సాగించుకొను చుండిరి. ఆనాడు భారతీయ నౌకా నిర్మాణ పరిశ్రమ ఉన్నత స్థితియందుండెను. నౌకా నిర్మాణ శాస్త్ర గ్రంథములును ఆ నాడు వెలసినవి. నౌకాలక్షణములు వాని ఉపయోగములు – నౌకలకు వాడు కలప – దాని విధములు ఓడలలోని జాతుల ననుసరించి కలప విధములను నిర్మాణ శాస్త్రజ్ఞులు నిర్ణయించిరి. నౌకా నిర్మాణ

బోధాయనుని కాలమున అసందిగ్ధములుగా నున్న విషయ ములనాపస్తంబుడు సంస్కరించెను. అశాస్త్రీయ సంతానము నకు భాగమిచ్చుట తగదని చెప్పెను. జ్యేష్ఠపుత్రునకు ఆస్తిలో నధిక భాగ మీయరాదనియు సంకర సంతానమును ఔరసునితో సమానముగ నెంచవలెననియు, బ్రాహ్మణునకు శూద్రస్త్రీయందు జన్మించిన వానిని ఔరసునితో సమానముగా నంగీకరింపరాదనియు, భార్యాభర్తలలో నెవరైనను వివాహబంధమునకు బద్ధులు కానియె డల వారు నరకముపాలగుదురనియు ఆపస్తంబుడు తెలిపెను.

రాజులకు స్త్రీ బాలవృద్ధ వికలాంగాదులు పన్నులు చెల్లింప నవసరములేదనియు, గ్రామీణుల ఆస్తులను చోరు లపహరించిన గ్రామరక్షకులు ఆ నష్టమును భరింపవలెననియు, రాజు ప్రజలకు రెండు సంవత్సరముల వఱకు సరిపోవు ఆహార ధాన్యమును నిలవ యుంచవలెననియు ఆపస్తంబుడు నియమించెను.

యాగవేదికా నిర్మాణ సంబంధములైన శుల్బసూత్రముల నాపస్తంబ మహర్షి రచించెను. చైత్య నిర్మాణ విధులను, యజు ర్వేద సంబంధిత తైత్తిరీయ సంహితా బ్రాహ్మణములలో కఠర్షి ప్రోక్త అష్టకాండములను (కాఠకములను) ఏకాగ్నికాండమును కలిపి వేదశాఖనొకదానిని ప్రత్యేకముగ నీ మహర్షి యేర్పరచెను. ఇదియే ఆంధ్ర పాఠము.

శూద్రుడు వేదమును వినిన సీసము కఱిగించి అతని చెవిలో పోయనగునని శూద్రుల విషయమై కఠినముగ ఆపస్తంబుడు శాసిం చెను. కాని గౌతమ మహర్షి "వృద్ధుడైన శూద్రుడు సమీపింపిం చిన అతనికన్న వయసులో పిన్నవాడగు విప్రుడాతనిని గౌరవించ వలెనని" నియమించెను.

"అధాన్యః పూర్వః పౌరో ఆశాకావర శ్చ్యాద్రోపి అపత్యసమేన"

గౌతమ ధర్మ సూత్రములు

అధ్యాయము 5 _ 223 వ సూత్రము.

ఈ కాలము ఆర్యానార్య జాతుల సమ్మేళన కాలము. శైవమత మిప్పటి వరకే వ్యాపించినది శివుడనార్య జాతుల వారు పూజించు దైవము. వృషభ మాతని వాహనము. ఆర్యులు రుద్రుని పూజించిరి. ఆర్యానార్య జాతుల సమ్మేళనము వలన ఈ జాతిద్వయము పూజించు దైవమగు శివుని యందును మార్పులు వచ్చినవి. శివుడును, రుద్రుడును కలిసి ఈశ్వరుడుగా రూపొందినాడు. ఆర్యులు ఆచార వ్యవహారములను అనార్యు లనుసరించినారు. అనార్యుల మూఢ విశ్వాస ప్రభావము ఆర్యులపై బడుట వలన ఆర్యానార్యుల సమ్మేళనము జరిగినది. ఆర్యుల రాకకు పూర్వ మాంధ్ర దేశమున వర్ణాశ్రమ పద్ధతి లేకుండెను. ఈ జాతిద్వయ సమ్మిశ్రణము వలన వర్ణాశ్రమ ధర్మము ఆంధ్ర దేశమున నెలకొనినది.

ఉత్తర హిందూదేశమున శిశునాగ వంశీయుల యనంతరము మగధ రాజ్యమును నంద వంశీయులు పాలించిరి. క్రీ. పూ. 322లో నందవంశమును రూపు మాపి మౌర్య చంద్రగుప్తుడు రాజ్యమును స్థాపించెను. చంద్రగుప్తుని కుమారుడు బిందుసారుడు. బిందుసారుని యనంతరము అశోకుడు క్రీ. పూ. 272లో చక్రవర్తి యయ్యెను. అతడు కళింగ యుద్ధానంతరము అహింసా ధర్మమును బోధించు బౌద్ధ మతమును అవలంభించెను. బౌద్ధమత ప్రచారమును భారతావని యందే కాక విదేశము లందు సైతము గావించెను.

ఆంధ్రులు అశోకుని సామ్రాజ్యమున నుండిరి. వారాతని సామంతులుగనో, మిత్రులుగనో వ్యవహరించిరి అశోకుని ధర్మ శాసనము లాంధ్ర దేశమున లభించినవి. దక్షిణాపథము నందచ్చటచ్చట నున్నవి. అశోకుని పదమూడవ శిలాశాసనమందు యవన కాంభోజాదులతోపాటాంధ్రు లాతని రాజ్యమునందున్నట్లు చెప్పబడినది. షాహబాజ్‌గహి, మాన్సేర, గిర్నార్ శాసనము లందాంధ్రుల ప్రశంస యున్నది.

అశోకుని 13వ ధర్మ లిపి శాసన భాగము.

"ఏవమేవ ఇహరాజ విషయేషుయవనకన్బోజేషు, నాభకే నాభపంక్తిషు, భోజపితినిక్యేషు అన్ద్రపులిన్దేషు - సర్వత్ర దేవానాం ప్రియస్య ధర్మానుశిష్టమనువర్తన్తే"

" హిదలాజావిశపజియోనకంభోజేషు నాభకే నాభపంతిషు భోజపితినిక్యేషు"

"అధపాలదేషు షవతా దేవానాం పియషాధం మానుషధి అనువతంతి "

అంధ్ర దేశమున బౌద్ధ మత ప్రచారము గావించుట కశోక చక్రవర్తి మహాదేవుడను భిక్షువుని బంపెను. అశోకుడు బౌద్ధ మత ప్రచారార్థము బౌద్ధ భిక్షువును పంపుటకు పూర్వమే ఆంధ్ర దేశమున బౌద్ధ మతము వ్యాప్తి యందుండెనని తెలియుచున్నది.

మానవ సంఘము పటిష్టమైన తరువాత అందు సాంఘిక, మత, రాజకీయాది వ్యవస్థ లేర్పడినవి. దైవారాధన, యజ్ఞ యాగాదుల కార్య కలాపములు దేశమున పాదుకొనినవి. యాజ్ఞికులు, పౌరోహితులు, నైష్టికులు సంఘమున గౌరవము బడయుచుండిరి కాలక్రమమున యజ్ఞ యాగాది క్రతువులను ఆడంబరముగాచేయు

నాచారమేర్పడినది క్రతువుల సంఖ్య పెరుగుటవలన బ్రాహ్మణుల కాధిక్య మేర్పడినది. మంత్ర తంత్రముల వలనను క్రతుకార్య నిర్వహణా దక్షతవలనను. ప్రజలు బ్రాహ్మణులను గౌరవించుచుండిరి. రాజులు క్రతువులను నిర్వహించుచు బ్రాహ్మణుల కగ్రహారముల నొసంగుటయేగాక యభీప్సిత దానములు చేయుచుండిరి. మోక్ష సాధన కిది యొక మార్గమని యానాటి రాజుల యొక్క యభిప్రాయము. ఆనాటి ప్రజలు సైతమీ యుద్దేశ్యముతో దాన ధర్మములు చేయుచుండిరి. కర్మకాండ పెరుగుటవలన క్రొత్త సంప్రదాయము లేర్పడినవి. యజ్ఞ యాగాదులందు పశు హింస ప్రాధాన్యము వహించినది. బ్రాహ్మణులు హింసాత్మకమైన యజ్ఞ యాగాదులకు ప్రాధాన్య మొసంగుచు వానివలన కలుగు ఫలితములను దెల్పుచు ధనవంతులను, రాజులను ఈ కార్యమునకు పురికొల్పుచుండిరి. మరియొక దెస సాధారణ ప్రజానీకము సంఘమునందు కలుగు మార్పులను పరిశీలించుచు, కర్మకాండను విమర్శించు స్థితికి వచ్చిరి.

రాజులు, ధనికులు ఆదరించుటవలన బ్రాహ్మణులు సంఘమున గౌరవము పొందుటయేగాక వారొసంగు దానములను స్వీకరించి ధనాఢ్యులైరి. గో, భూ, హిరణ్య దానములపై బ్రాహ్మణులకు మోహ మధికమై తాము చెప్పినదే వేదవాక్యమనినట్లు ప్రవర్తించుచుండిరి రాజులు వైదిక కర్మల నాచరించుచు వేద విద్యల నభ్యసించుచు విప్రుల యనుగ్రహమున స్వర్గము సంప్రాప్త మగునని దలచిరి బ్రాహ్మణుల పిదప క్షత్రియులు, వారి తరువాత వైశ్యులు - వైశ్యుల తరువాత శూద్రులు ఒకరికన్న ఒకరు తక్కువగా పై వర్ణముల వారి ధర్మ బోధనలు వినుచు వారికి సేవలు చేయుచు కాలము గడుపుచుండిరి.

శూద్రులు వేదముచదువుట కనర్హులుగా పరిగణింపబడిరి. ఇతర వర్ణములవారికి మాత్రము తీరిక యెక్కుడిది. వేదపఠనము, మత విషయముల బోధన బ్రాహ్మణుల యధికారము నందుండెను, శూద్రులు మున్నగువారు బ్రాహ్మణుల ప్రవర్తన సహింపరాని దయ్యెను, వారి నేమియు యనజాలకుండిరి. క్రమముగా బ్రహ్మణుల యాధిక్యము, వారిప్రవర్తన— వారు కల్పించిన విధులు, ప్రతివారికి కంటకప్రాయము లయ్యెను.

ఇట్టి పరిస్థితులందే బౌద్ధమత మావిర్భవించెను. బౌద్ధమత స్థాపకుడగు బుద్ధుఁడు నేపాళ।ప్రాంతమును పాలించు శుద్ధోధన మహారాజు పుత్రుఁడు. శుద్ధోధనుడు శాక్యులకు రాజు. రాజ్యమును దారా పుత్రులను తల్లిదండ్రులను, భోగములను వీడి బుద్ధుడు మునివృత్తి నవలంబించి, తపస్సు గావించి, చివరకు గయలో బోధివృక్షముక్రింద దివ్యతేజస్సునుగాంచి, మోక్షమునకు సమ్యగ్దృష్టి, సమ్యక్సంకల్పము, సమ్యక్స్మృతి, సమ్యగ్వాక్కు, సమ్యగాజీవము, సమ్యక్కరణము, సమ్యగ్వ్యాయామము, సమ్యక్సమాధి మూలములని భావించి తపము చాలించి నూతనముగా తనలో కల్గిన భావములను ప్రజలకు బోధించుటకై దేశాటనమొనర్చి, ధర్మబోధచేయుచు, తనవాదమును ఖండించినవారి నెదిర్చి జయించి, బౌద్ధధర్మములను వ్యాపింపజేసెను.

బౌద్ధ మతమును రాజులు అదరించిరి. అజాతశత్రువు మగధ నేలుచు బౌద్ధ మతమును స్వీకరించి ఆమత వ్యాప్తి కొఱకు పాటుపడెను. దినదినము బౌద్ధ మతమును స్వీకరించు వారి సంఖ్య ఎక్కువయ్యెను. బ్రాహ్మణ మత నియమములవలన, బ్రాహ్మణుల ప్రవర్తనమువలన విసుగు జెందిన ప్రజలు ఈ నూతన మతము నాదరించుటయేగాక, మతమును స్వీకరించిరి. స్త్రీ, పురుష, బాల, వృద్ధ

వివక్షణ లేకుండ పల్లె పట్టులందును పట్టణములందును బౌద్ధమతము నాదరించుచుండిరి. బుద్ధుని బోధనలు, ఆ మత సిద్ధాంతములు ప్రజల కత్యంతాసక్తిని కల్గించెను. క్షత్రియ రాజులు, రాజవంశపు స్త్రీలు, తక్కుంగల వారందరును బౌద్ధమతమును స్వీకరించిరి. బుద్ధుడు మత ధర్మములను పెక్కు సంవత్సరములు బోధించి, తన ఎనుబదవ ఏట కుశనగరమున నిర్వాణము నందెను. "మకుటచందన" మను ప్రాంతమున బుద్ధుని శరీరమునకు దహన సంస్కారము జరిగెను. బుద్ధుని శరీరావశేషములకొఅకు జరిగిన కలహమును ద్రోణుడను విప్రుడు పరిష్కరించి, బుద్ధుని యవశేషములను పంచియిచ్చెను. బుద్ధుని యవశేషములపై ఎనిమిది స్థూపములను భారత దేశమున నిర్మించిరి

బుద్ధుని ఉపదేశములను గ్రంథస్థము జేయు తలంపుతో రాజ గృహమున బౌద్ధసంఘసమావేశ మేర్పాటు చేయబడెను. దీనికి "సంగతి" యని పేరు. తరువాత బౌద్ధ మతమున చీలిక లేర్పడినవి. వైశాలియందు జరిగిన రెండవ 'సంగతి' యందు థేరవాదులకన్న సాంఘికులే ఎక్కువగా నుండిరి. థేరవాదులనగా బౌద్ధ ధర్మములను పూర్వాచార సంప్రదాయములను తప్పక పాటించువారు. వీరికి వ్యతిరేకులు మహాసాంఘ్యులు. అశోక చక్రవర్తి పాటలీ నగరమున మరియొక సంగతి నేర్పరచెను. ఈ సభకు తిష్యుడనువాడధ్యక్షుడు. ఇతడు మౌద్గల్య పుత్రుడు. ఈ సభయందు థేరవాదులకు మహా సాంఘికులకు సరిపడక థేరవాదులు సభను విడిచి తుదకు మగధను వీడి ఉత్తర దేశములందు తమ మతసిద్ధాంత ప్రచారమును గావించు చుండిరి.

అశోకుడు ఎంతోమంది భిక్షువులను బౌద్ధమత ప్రచారార్థము దేశదేశములకు బంపెను. ఆంధ్ర దేశమున కశోకుని పనుపున వచ్చిన

మహాదేవ భిక్షువు కృష్ణానదీ తీరమున నున్న ధాన్యకటకమును తన నివాసముగా జేసికొని చైత్యకవాద సంప్రదాయమును నెలకొల్పెను ఈ సంప్రదాయము ననుసరించు వారిని చైత్యకులందురు. ఇట్లు అశోక చక్రవర్తికి పూర్వమే నాగరాజులచే ఆదరింపబడి ఆంధ్రమున వ్యాపించిన బౌద్ధ మతము అశోకుని యాదరణమున ఆంధ్ర దేశమున బహుళ ప్రచారము నందినది. ఆంధ్ర దేశమున ప్రచారము పొందిన బౌద్ధము మహా సాంఘిక వాద సంబంధితము

క్రీ. పూ. 236లో అశోకుడు మరణించెను. ఆంధ్రులు స్వాతంత్ర్యము వహించిరి. ఆంధ్రులతోపాటు కరిక, భోజక, పిటనిక, కళింగాది జాతులవారు మౌర్యుల యధికారము నంగీకరింపక స్వాతంత్ర్యము వహించిరి ఇట్లు స్వతంత్ర సామ్రాజ్యముల నిర్మించుకొని వివిధ వంశీయులు దక్షిణాపథమును పాలించుచుండిరి. కాలక్రమమున ఆంధ్రులు విజృంభించి, ఉత్తర భారతముపై దండెత్తి రాజ్యమును విస్తరింప జేసికొని దక్షిణాపథమును తమ యధికారము క్రిందికి దెచ్చుకొనిరి.

ఈ ప్రకరణమునకు ఆధారములు


1. చారిత్రక వ్యాసములు. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు.
2. ఆంధ్రుల చరిత్ర–సంస్కృతి. శ్రీ ఖండవల్లి సోదరులు
3 సాతవాహన సంచిక సం॥దా॥ మారేమండ రామారావు గారు
4. ప్రాఙ్నన్నయయుగము డా॥ దివాకర్ల వేంకటావధానిగారు.
5. అశోకుని ధర్మలిపి శాసనములు డా॥ చిలుకూరి నారాయణ రావుగారు.

# 2వ ప్రకరణము

# సాతవాహన యుగము

దక్షిణాపథ మహోజ్జ్వల చరిత్రయందు సాతవాహనులు పాలించినకాలము చారిత్రకముగా సాంస్కృతికముగా నతిముఖ్యమైనది ఉత్తర భారతమున అరాజకము ప్రబలియున్న సమయమున దక్షిణాపథమును తమ ఏకచ్ఛత్రాధిపత్యము క్రిందికి తీసికొని వచ్చి దేశమున శాంతి భద్రతలను నెలకొల్పి ఆంధ్రదేశచరిత్రకు పునాదులు వేసి తమ కీర్తిని శాశ్వతముగ నిలుపుకొనిన శాతవాహన వంశీయులు పరిపాలనా ధురంధరులు వీరిరాజ్యమునం దాంధ్రులు, మహారాష్ట్రులు, ద్రావిడ, ఘూర్జర, కాళింగ, కన్నడ, శక, యవన, పహ్లావాదులు కలిసి మెలిసి జీవించినారు.

సాతవాహనుల రాజధాని అమరావతి ఇది కృష్ణానదీ తీరమున నున్న పట్టణము. ధాన్యకటకము, ధనకటకము, ధాన్యవాటి యని దీనికిపేర్లు మహారాష్ట్రదేశమునందున్న పైఠను లేక ప్రతిష్ఠపురము వీరి రెండవ రాజధాని ఈ వంశపు రాజుల పరిపాలనా విధానము, ఆనాటి ప్రజల యాచార వ్యవహారములు, దానధర్మములు, కళాపోషణ, భాషాసేవ, సాంఘిక, సాంస్కృతిక జీవన విధానము తెలిసికొనుటకు ఈ రాజుల కాలమున వెలసిన శాసనములు, గ్రంథములు, సమకాలిక రాజుల శాసనములు - సాహిత్యము ముఖ్యములు గుహాలయములు — శిల్పము, దేవాలయములు — విద్యాలయ

ములు, ఆనాటి ప్రజాజీవన విధానమునకును, కళాపోషణమునకును తార్కాణము.

శాతవాహనుల కాలమున రెండు శకములు వ్యాప్తిలోనికి వచ్చినవి. 1 శాలివాహనశకము 2 విక్రమాదిత్యశకము. శాలివాహనశకము క్రీ శ 78 నుండియు, విక్రమశకము క్రీ. పూ 58 నుండియు లెక్కింపబడుచున్నవి. శాలివాహన శకము విక్రమ శకము తరువాతిదైనను, బహుళ ప్రచారమునందున్నది.

శాతవాహనయుగమందలి, సాంఘికచరిత్ర శాసనాధారముగను, గాథాసప్తశతి, వాత్స్యాయనీయముల ననుసరించియు, సమకాలిక ప్రభువుల శాసనములు, సమకాలిక వాఙ్మయము ననుసరించియు, వ్రాయబడుచున్నది

**సాతవాహనుల పరిపాలనా విధానము**—సువిశాలమైన సాతవాహన సామ్రాజ్యమున సమర్థనీయమైన పరిపాలనావిధాన ముండెను వీరి సామ్రాజ్యము 'పశ్చిమోత్తరముగా పుష్కరతీర్థము మొదలు, తూర్పు దక్షిణములుగా కడ్డలూరు వరకును, ప్రాగుత్తరమున కళింగపట్టణము మొదలు పశ్చిమ దక్షిణముగా వైజయంతి వరకును' వ్యాపించెను. సాతవాహన రాజు సర్వస్వతంత్రుడేకాక ఈ పరిపాలనమున కంతటికి మూలాధారుడు. ప్రజా క్షేమమునకు సామ్రాజ్య రక్షణమునకు రాజే బాధ్యుఁడు. ఈ వంశమున వారసత్వము పురుషులనుండియే లభించుచుండెను. గౌతమీపుత్ర సాతకర్ణి కుమారుడగు వాసిష్ఠీపుత్రపులోమావి నాసిక శాసనమున గౌతమీపుత్రసాతకర్ణి గురించి ఇట్లున్నది.

"6. అపరాజిత విజయపతాక (స) సతుజనదు పధసనీయ

7. పురవరస కులపురిస పరపరాగత విపుల రాజసదన అగమాన
నిలయస సపురిసానం అసయససిరీయ . . ."

వాసిష్ఠీపుత్రపులోమావి నాసిక శాసన భాగము.
E I Vol. VIII Nasic Inscriptions
No. 2.

రాజులు శాసనములందు క్షత్రియదర్పమాన మర్దనులుగను, అపరాజిత విజయ పతాకులుగను, ఏక ధనుర్ధరులుగను వర్ణింపబడినారు.

వారసత్వము మొదట జ్యేష్ఠ పుత్రునికి సంక్రమించుచుండెను. ఆపైన అతనికి పుత్రులు లేని యెడల అతని తమ్ములు రాజ్యాధిపతులగుచుండిరి ఒకవేళ వారసుడు పిన్న వయస్కుడైన అతని పినతండ్రి కాని, తల్లి కాని రాజ్య పాలనము చేయుచుండిరి. సిముకుని మరణానంతరము అతని కుమారుడగు మొదటి సాతకర్ణి బాలుఁడగుటవలన సిముకుని సోదరుడగు కృష్ణుడు సాతవాహన సామ్రాజ్యాధిపతి యయ్యెను అట్లే మొదటి సాతకర్ణి మరణానంతరము అతని పుత్రులలో జ్యేష్ఠుడగు వేదిశ్రీ బాలుఁడగుట వలన సాతకర్ణి భార్య దేవీ నాగానీక పరిపాలన సాగించెను. నానేఘాటు శాసనమును నాగానీక వేదిశ్రీ కాలమున వేయించెను. రాజు పరిపాలనా విషయములందు శక్తిసమన్వితుఁడు కాని యెడల అతని తల్లి రాజకీయ వ్యవహారములందు తోడ్పడుచుండెను.

గౌతమీ పుత్ర సాతకర్ణి నాసిక శాసనమువలన మనకీ విషయము తెలియును.

"1. సిద్ధ – గోవధనె అమచస సామికసదెయొ రాజాణితొ
2. రజొ గొతమిపుతస సాతకణిస మహాదేవీయచ జీవసుతాయ రాజమాతాయ వచనెన గొవధనే చా సామకొఅరొ గవత వాతతొఎవచ
3, వతవొఎధ అంహి హిపవతె—"

E I. Vol. VIII Nasic Inscriptions
No 5

("గోవర్ధనమునం దమాత్యుఁడగు శ్యామకునికి ఇయ్యవలసిన రాజాజ్ఞ – రాజగు గౌతమీ పుత్ర సాతకర్ణి యొక్కయు, రాజ మాతయు, జీవసుతయు అగు మహాదేవి యొక్క మాటలుగా గోవర్ధనమున అమాత్యుడగు శ్యామకుడు ఆరోగ్యము అడుగబడు గాక – అమిది ఇట్లు చెప్పబడుగాక............" [1] రాజకీయ వ్యవహారములందు గౌతమీ పుత్రి సాతకర్ణి తన తల్లియొక్క సలహాలను పొందుచుండెనని పై శాసనమున తల్లి కొడుకుల ఆజ్ఞలను శ్యామకునికి దెలుపుటవలన రాజకీయ వ్యవహారములం దానాడు స్త్రీలు ప్రముఖమైన పాత్రను వహించుచుండిరని తెలియుచున్నది.

ఆనాటి రాజ ధర్మములు ప్రజల కనుకూలముగా నుండెను. రాజ్యమందలి ప్రజల కభయ మొసంగి ప్రతివారును నిశ్చింతగ జీవించుట కవకాశము కల్పించి, ప్రజల కష్ట సుఖములను తమవిగా జూచుకొని రాష్ట్రమున కితరులవలన ఉపద్రవములు కలుగకుండ చూచుకొనుట, ధర్మమార్గమున సువిదిత నియమానుసారము సుంకములను వసూలుచేయుట సక్రమ మార్గమున ధనమును వినియోగించుట, వర్ణాశ్రమ ధర్మము నశింపకుండ చూచుట, పెద్దలయెడ గౌరవము కల్గియుండుట ఆనాటి సాధారణ రాజ ధర్మములు.

---

1 సాతవాహన సంచిక.

రాజకార్య నిర్వహణమునందు సామంతులు, రాజోద్యోగులు, రాజులకు సహాయపడుచుండిరి పరిపాలనా సౌకర్యార్థము దేశము అసిక, అసక, ములక, సురర, కుకుర, అపరాంత, అనూప, విదర్భ, అకర, అవంతి, వైజయంతి మొదలగు రాష్ట్రములుగా విభజింపబడి ఆయా రాష్ట్రములకు ప్రతినిధులుగా కొందరు నియమింపబడి పాలించుచుండిరి.

వాశిష్ఠీపుత్ర పులోమావినాసిక శాసనము వలన గౌతమీపుత్ర సాతకర్ణి అసిక, అసకాది రాష్ట్రముల కధిపతి యని తెలియుచున్నది.

"2 అసిక అసక ముళక సురర కుకురాపరంత అనుప విదభ, ఆకరావతి - రాజసవిఝ ఛవత పారిచాత సహ్య కణ్హగిరి మచసిరిటన మలయ మహిద.

3. సెటగిరిచకొర పవతపతిస"

వాసిష్ఠీపుత్రపులోమావి నాసిక శాసనభాగము.

E I Vol VIII Nasic Inscriptions No 2.

("అసిక అసక ముళక సురర కుకుర అపరంత అనుప విదభ, అకరావంతులకు రాజును, వింధ్య ఛవత, పారిచాత సహ్యకణ్హగిరి, మచసిరిటన మలయ మహేంద్ర సెటగిరి చకోర పర్వతములకు పతియును)" [1] అని గౌతమీపుత్ర శాతకర్ణికి గల విశేషములు

శాతవాహన రాజులు అన్యరాజ్యములనుజయించి ఆ రాజులను తమ సామంతులుగా స్వీకరించుచుండెడివారు ఆనాడు 'మహా

1 శాతవాహనసంచిక

రరి', 'మహాభోజ' అను బిరుదములు కలిగిన సామంతులు ఉండిరి. మొదటి సాతకర్ణి భార్య దేవీనాగనీక. ఆమె 'మహారరి' త్రణయిక రో కుమార్తె. 'మహారరి' త్రణయికరో సిముకునికి ఉత్తరాపథము నందలి రాజ్యములను దక్షిణాపథ పతులను జయించుటయందు తోడ్ప డినవాడు. సిముకుడు ప్రతిభావంతుడు. మహారాష్ట్ర దేశమును ఆక్ర మించిన తరువాత అచటి నాయకులలో ప్రముఖు డనబడు మహా రరి త్రణయికరోతో సంబంధ బాంధవ్యముల నెరపెను. అందువలన బలవంతులగు మహారరులు, మహాభోజులు సాతవాహన రాజులకు సామంతులై సామ్రాజ్యమునకు అండగా నిలిచిరి.

'మహారరి' 'మహాభోజ' పదములు ఆనాటి శాసనములందును పేర్కొనబడినవి. ఈ పేర్లు నాణెములందును కలవు. 'మహారరి'శబ్దము వాసిష్ఠీపుత్ర పులోమావి కార్లాశాసనమునందు కలదు

"1. రఞో వాసిఠి పుతస సామిసిరి (పు) స సవచరె 7. (గిం) హపఖె పచమె 5

2. దివసె పథమె 1 ఎతాయపువాయ ఒఖళకియాన మహారథిస కొసికి పుతస మితదెవసపుతెన.

3. . .హారథినా వాసిఠిపుతెన సొమదెవెన గామొదతొ వలురక సఘస వలురకలెనాన సకరుకరొసదెయ.

4 మెయొ"

E I Vol VII Karle Inscriptions.
No 14.

("రాజశ్రీ వాసిష్ఠీపుత్రపులోమావి 7వ రాజ్య సంవత్సరమున గ్రీష్మర్తు పంచమ పక్ష ప్రథమ దినమున ఒఖలకీయులలోని మహారథి కౌశికీ పుత్రమిత దేవుని కుమారుడగు మహారథి వాసిష్ఠీపుత్ర సోమదేవునిచే వలురక గుహ

లందువసించు వలూరక సంఘమునకు ఒక గ్రామము సకరసదెయ మెయముగ ఇయ్యబడినది" [1]

దీనినిబట్టి 'మహారరి' యనునది బిరుదమని తెలియుచున్నది.

'మహాభోజ' శబ్దము కన్హేరి శాసనములందున్నది ఈ మహారరులు, 'మహాభోజులు' సామంతరాజులు వీరి స్త్రీలకు సైతము మహారరిని, మహాభోజి అను బిరుదములుండెను ఈ బిరుదములు కలిగిన సామంతరాజులు సాతవాహనులకు లోబడి యుండిరనుటకు, గౌతమీపుత్ర సాతకర్ణికిగల "సర్వ రాజలోక మండల ప్రతిగృహీత శాసనస్య" "సర్వమండలాభివాదితచరణస్య" అను బిరుదములు తార్కాణము. ఈ బిరుదములు గౌతమీపుత్ర సాతకర్ణికి ఉన్నట్లు వాసిష్ఠీ పుత్రపులోమావి నాసిక శాసనమువలన తెలియుచున్నది.

"3 సెటగిరి చకొరపవతపతిన సవరాజ లోకమడలపతిగహీత సాసనస....

6. నసఖఖరాతవస నిరవసెసకరిస సాతవాహనకుల యసపతిథాప నకరస సవమడలాభివాదిత చణస వివతిత చాతురణస కరస ."

E.I Vol VIII. Nasic Inscriptions
No 2.

అట్లే కార్లా చైత్యగృహము యొక్క ప్రాంగణమున సింహస్తంభము నెత్తించినవాడు 'మహారరి' పుత్రుడగు 'మహారరి' చిత్తల దుర్గమున లభించిన నాణెములు కళలాయ 'మహారరి'వి.

మెగస్తనీసు అను గ్రీకు రాయబారి మౌర్య చంద్రగుప్తుని ఆస్థానమునకు వచ్చియుండెను అతడు భారత దేశమున పర్యటించి, భారత దేశమున తన పర్యటానుభవమును ఒక గ్రంథముగా రచిం

1 సాతవాహన సంచిక.

చెను. ఆ గ్రంథము పేరు 'ఇండికా'. అందాతడు మగధ రాజ్యము తరువాత పేర్కొనదగిన రాజ్యము ఆంధ్ర రాజ్యమని, ఆంధ్ర రాజునకు ముప్పది దుర్గములు, లక్ష కాల్బలము, రెండువేల గుఱ్ఱపు దళము, సహస్ర గజములతో కూడిన సైన్య ముండెనని, ప్రజలురాజును, అతని పరిపాలనమును గౌరవించుచుండిరనియు తెలిపినాడు [1] మెగస్తనీసు తెలిపిన ముప్పదిసంఖ్య గల నగరములలో పైరన్, ఘణిగిరి, కొండాపురము, విజయపురి, ధరణికోట, భట్టి ప్రోలు, గాజుల బండ, వేంగి, మూషికనగరము మొదలగునవి ముఖ్యమైనవి. ఈ పట్టణములు చాలవరకు తెలంగాణమునందు అవే పేర్లతో నున్నవి.

ఈ పట్టణములను నగరములని, నిగమములని పిలుచుచుండెడి వారు నగర పరిపాలన కేంద్రాధికారమునకు లోబడిన పౌరసంఘ నిర్వహణాధికారమున నుండెను. విశేషాధికారములను రాజు నుండి పొందిన నాగరికుడు అను ప్రభుత్వోద్యోగి నగర పరిపాలనా బాధ్య తను వహించి నగర ప్రజలకు సౌకర్యములు కలిగించుచుండెను ఇత నికి కొందరు సహోద్యోగులు సహకరించుచుండిరి. రాజునకు మహా సేనాపతి ముఖ్యుడు. ఇతడు రాజ్యాంగ వ్యవహారములను నిర్వహించు బాధ్యత గల ప్రధాన వ్యక్తి. రాజున కితడు ముఖ్యుడే కాక, అంతరంగిక కార్యదర్శిగా కూడ వ్యవహరించెడివాడు

మహా సేనాని యగు యెధునుడు నాసికలోని ఒక శాసన మును లిఖించెను.

---

Next Come the Andhras, A still more powerful race which possesses numerous villages and thirty two defended by walls and towers and which supplies its King with an army of 100000 infantry 2000 cavalry and 1000 elephants

Indian Antiquery Vol. VI P 337.

"4 ఎతచగామ సమలిపద పనిహారెచ ఎధనిబథాపెహిసుద
నగామస చసుదసనాన వినిబధకారెహి అణతా మహాసెనాపతినా
యెధునెన నాభతొబటికా."

E I Vol VIII Nasic Inscriptions
No 3

అట్లే మహా సేనాపతియగు స్కందనాగుడు సాతవాహాని హారమునకు పరిపాలకుడుగా నుండెనని పులోమావి మ్యాకదోని శాసనము వలన తెలియుచున్నది.

"1 (సిధం) రజొ సాతవాహనానం (సి) రిపుళు (మా) విసనవ8 హేమ 2 దివ 1

2. (మస) మహాసేనాప (తి) సఖంద (నా) కస జనపాదే (సా)త వాహనిహారే

3 (గు) మికస కుమారదతస గామే వేపురకేవధవేన గహపతికేన (కొం) తావం (సంబే)న

4 తళాకం ఖానితం"

పులోమావిమ్యాకదోని శాసనము
E. I Vol XIV. P 153-155

ఒక్కొక్క ఆహారమునకు ఒక్కొక్క పాలకుడుండెను. ఇట్లు ఆహారములకు పరిపాలకులుగా నియమింపబడినవారు మహామాత్యులు అమాత్యులు సేనాధిపతులుకాక మహాతారక, క్రమనిరుంగకార అను ప్రముఖ రాజోద్యోగులును ఆ నాడుండిరి

శాతవాహన సామ్రాజ్యము, రాష్ట్రములుగను, నిగమములుగను, జనపదములుగను విభాగముచేయబడినది. ఈ నిగమములనే పట్టణములందురు. నిగమములకు ప్రత్యేక పరిపాలనా వ్యవస్థ యుండెను. రాజశాసనములు నిగమము లందు గ్రంథస్థము చేయబడుచుం

డెను.ఆహారమనునది ఒక రాష్ట్ర విభాగము గోవర్ధనాహారము, శాతవాహనాహారము, వామూలహారము అను రాష్ట్రముల పేర్లు "మ్యాకదోని" శాసనమందును, 'నాసిక' శాసనమందును, మరికొన్ని శాసనములందును కాన్పించుచున్నవి గ్రామమునకు గుమిక, గ్రామిక, గ్రామణి అను అధికారి యుండెను గ్రామమును శాసించుటయందు గ్రామాధికారులకు సంపూర్ణాధికార ముండెను. గ్రామాధికారులు మండలాధిపతులకు, మండలాధిపతులు రాష్ట్రాధిపతులకు, రాష్ట్రాధిపతులు కేంద్రమునకు అనగా రాజునకు లోబడి యుండెడివారు

గ్రామమున పంచాయతీ సభలుండెను. వ్యక్తి హక్కులను కాపాడుట యందును, ప్రజల క్షేమ సమాచారము లరయుటయందును, గ్రామ రక్షణ యందును గ్రామ పంచాయతీ బాధ్యత వహించెడిది.

గ్రామమునందు గల భూమిపై సమిష్టి యాజమాన్య ముండినను, వ్యక్తిగత కుటుంబములచే వ్యవసాయము చేయబడెడిది. వ్యవసాయదారుల నుండి పన్నులు వసూలుచేసి గ్రామాధికారులు ప్రభుత్వమునకు నిర్ణీత పన్నులు చెల్లించెడివారు. సంతలోని పన్ను వసూలుహక్కు, చేపలు పట్టు హక్కు, బంజరుభూములపై హక్కు, నీళ్ళు మున్నగు ప్రకృతి సంపద పైన కేంద్ర ప్రభుత్వ అధికార ముండెడిది.

ఆ కాలమున సామాన్య వ్యవస్థ కౌటిల్యుని అర్థ శాస్త్రము ననుసరించి యుండెను.

ఒక్కొక్క రాష్ట్ర విభాగము ఆయా రాష్ట్రమునకు గల కేంద్ర నామముతో వ్యవహరింపబడుచుండెడిది. పథము, రాష్ట్రము

అను ప భాగములును ఆనాడు రాష్ట్రముల కుండెను. పూగేరర లేక పుగి రాష్ట్రము అమరావతి శాసనమున పేర్కొనబడినది.

ఈ రాష్ట్రముల పరిపాలకులుగ అమాత్యులే నిర్ణయింపబడు చుండిరి. ఆ కాలమున కఠిన శిక్ష లుండెను జనులకు రాజును ఎన్ను కొను అధికారముకూడ కొన్ని ప్రాంతములందుండెను. రుద్రదాముని "జునాగడ్" శాసనమున ఈ విషయము ప్రస్తావింపబడినది.

3. " రాజ్ఞోమహాక్షత్రపస్య సుగృహీ

4 తన్నామః స్వామిచష్టనస్య పౌత్రస్య రాజ్ఞఃక్షత్రపస్య సుగృహీత నామ్నః స్వామి జయదామ్నః పుత్రస్య రాజ్ఞోమహాక్షత్రపస్య రుద్రదామ్నోవర్షే ద్విసప్తతితమే 70. 2

6. సర్వ్వవర్ణై రభిగమ్య రక్షణార్థం పతిత్వేవృతేన.

రుద్రదాముని 'జునాగడ్ శాసనభాగము'

ఆర్థిక వ్యవస్థ — సాతవాహనుల పరిపాలనా కాలమున ప్రజలు సౌఖ్యమున కలవడియుండిరి. దైనందిన జీవితమున బహు విధములగు వస్తువుల నుపయోగించుచుండిరి. అనేక వృత్తులకు సంబంధించినవారు గ్రామములందు నివసించుచుండిరి. ధనికులు, చర్మకారులు, గంధికులు, కమారులు, తెసకారులు, కాసా కారులు, మాలాకారులు,కోలికులు, తిలపిష్టకులు, ఒదయంత్రికులు, మారికులు, మణికారులు, సెలవధకినులు మున్నగు వృత్తులవారుండిరి. ఒకే వృత్తిని స్వీకరించువారు సంఘములుగ విభజింపబడి వృత్తి ధర్మముల రక్షణకై సభల నేర్పరచుకొనుటయేగాక, అయా సమ

తూర్పుతీరప్రాంతము, ఆంధ్రప్రదేశ్, మైసూరు, మద్రాసు ప్రాంతము లందును, ఉత్తరాపథమున ఉత్తర ప్రదేశ్, బీహార్, బరోడా ప్రాంతములందును శాతవాహనుల నాణెములు లభించినవి. వీనిలో కొన్ని గుండ్రముగను, చతురస్రములుగను, అండాకృతిగలవిగను కొన్నిటి మీద ఒక వైపు మరి కొన్నింటిపైన రెండు వైపులను చిహ్నములుండును. రాజుల పేర్లు చెక్కియుండును. ఇప్పటి వరకు సాతవాహన వంశపు రాజులలో 18 మంది నాణెములు లభించినట్లు తెలియుచున్నది. 1 సాతవాహనుడు 2 మొదటి సాతకర్ణి 3, రెండవ సాతకర్ణి 4 అపిలకుడు 5. మేఘస్వాతి 6 గౌతమీపుత్ర సాతకర్ణి 7. వాసిష్ఠీపుత్ర పులోమావి 8. వాసిష్ఠీపుత్ర శివశ్రీ 9 వాసిష్ఠీపుత్ర సాతకర్ణి 10. గౌతమీపుత్ర యజ్ఞశ్రీ 11 శకసేనుడు 12. వాసిష్ఠీ పుత్ర చంద్రసాతకర్ణి 13 శ్రీ సాతకర్ణి 14 రుద్ర సాతకర్ణి 15. కృష్ణ సాతకర్ణి 16 కుంభసాతకర్ణి 17, కర్ణసాతకర్ణి 18. కౌశికీపుత్ర సాతకర్ణి వీరి నాణెములు లభించినవి.

ఇంతవరకు లభించిన నాణెములపై వివిధములగు చిహ్నము లున్నవి. ఏనుగ, గుఱ్ఱము, వృషభము, సింహము, మనుష్యుడు, చైత్యము, వృక్షము, వృషభముల చిహ్నము, త్రిరత్న చిహ్నము, మూడు అగ్రములు కల ధ్వజము, స్వస్తిక, నందిపాదము, అడ్డగీతలు రెండువైపుల ఉండు సున్న, డమరు, గుండ్రనివస్తువుయొక్క చిహ్నము, అంకుశము, కిరణ ప్రసారము చేయుచున్నట్లుండు సూర్య బింబము, చేపలుగల నది, శంఖము, కమలము, నాగ చిహ్నములు గల నాణెములు కలకత్తా హైద్రాబాదు మ్యూజియము లందును, మరికొన్ని మ్యూజియములందును భద్రపరుచబడి యున్నవి పరిశోధకుల వద్దనున్న నాణెములను, ప్రకటింపబడని నాణెములను ప్రకటించిన సాతవాహనులకు సంబంధించిన మరికొన్ని విశేషములు తెలియును. కొల్హాపూర్, జోగల్తెంబి, తరహాలా

అను ప్రాంతములందు పాతులు లభించినవి ఈ రాజులకు సంబంధించిన వెండి నాణెములు చాల తక్కువ. అవియు గౌతమీపుత్ర సాతకర్ణి, గౌతమీపుత్ర యజ్ఞశ్రీ అను వారివి మాత్రమే దొరికినవి. ఈ శాసనములలో ప్రాచీనమైనవి సీసపు నాణెములు.

**విదేశ వ్యాపారము** —సాతవాహన సామ్రాజ్యము వర్ధిల్లిన కాలమున వ్యాపారము ఉన్నతస్థితియందుండెను వివిధములైన వైనందిన వస్తువుల ఉత్పత్తి జరుగుచుండెను వర్తక సంఘములుండెను. వస్తువుల నుత్పత్తి చేయు కర్మాగారములలో పనిచేయు కార్మికులు సంఘము లేర్పరచుకొనుచుండిరి. వస్తువుల ఉత్పత్తి విరివిగా సాగుచుండెను వర్తకులు క్రయవిక్రయములు సాగించుచు ఒక ప్రాంతమునుండి మరియొక ప్రాంతమునకు వెళ్ళుచుండిరి. మనదేశమందు తయారైన వస్తువుల కానాడు విదేశములందు మంచి ధరలు వచ్చుచుండెను. ఇచటసిద్ధమైన సన్ననూలు బట్టల కానాడు విశేష ప్రచారముండెను.

పైఠన్, తగర, జున్నార్, కరహాటక, నాసిక, గోవర్ధనము, వైజయంతి మున్నగు నగరములు ప్రముఖ వర్తక స్థానములుగ నుండెను. ధాన్యకటకము, కెవురూర, విజయపురి పట్టణములు కూడ విరివిగా వ్యాపారము చేయుచుండెను

ఆ కాలమున భారతీయ వర్తకులు తూర్పుసముద్రమునందు గల జావా, సుమిత్ర, బోర్నియో, మున్నగు దీవులతోను, మలయా, బర్మా, సయాం, చైనా మున్నగు దేశములతోను, పశ్చిమమున ఈజిప్టు, మెసపుటేమియా, బాబిలోన్, రోమ్ మున్నగు ప్రముఖ వర్తక కేంద్రములతోను వ్యాపారము చేయుచుండిరి. 'సన్ననూలు బట్టలు, సుగంధద్రవ్యములు, తదితర దైనందిన ఉపయోగ వస్తువులు

ఓడలందు నింపుకొని విదేశములకు వెళ్ళి, వ్యాపారము సాగించుచు, ధనము నార్జించుచుండిరి. మన దేశమున ఉత్పత్తియగు వస్తువుల కానాడు విదేశములందు మంచి ధర పలుకుచుండెను.

**ఆనాటి రాజమార్గములు**:—కృష్ణానది ముఖద్వారమునుండి అనగా నేటి బందరు రేవునుండి ప్రాగ్దేశములకు వెళ్ళు నౌకలు బయలుదేరెడివి. ప్రాగ్దేశములనుండి వచ్చు వస్తువులను బందరు రేవునకుచేర్చెడివారు. గుంటూరులోని వినుకొండనుండి మరియొక మార్గమును, బందరునుండి వచ్చు మార్గమును నేటి హైదరాబాదు ప్రాంతమున మూసీనదీతీరమున కలిసెడివి. ఇచ్చటినుండి కల్యాణి, తగర, పైరన్ నగరములమీదుగా సార్థవాహులు పయనించి నాసిక చేరెడివారు. అటుపిమ్మట నాటుమార్గమున పశ్చిమసముద్ర తీరము నందున్న భరుకచ్ఛము అను ఓడరేవు పట్టణము చేరి విదేశములకు వెడలు ఓడలలో తాము తెచ్చిన సరుకులను నింపెడివారు. సన్న నూలు బట్టలు, ద్రాతురసము, రాగి, సీనారేకు, సీసము, పగడములు, గోమేధికములు, దంతము, పట్టు, చెకుముకిరాళ్ళు, వెండి, బంగారము తదితర వస్తువులు పశ్చిమ దేశములకు పంపబడెడివి. పశ్చిమ తీరమున లెక్కలేని ఓడరేవు లానాడుండెను అందు ముఖ్యమైన ఓడరేవు పట్టణము భరుకచ్ఛము. సోపార, కల్యాణము, మందగోర, బలిపట్టణము, మలయగిరి, విజయదుర్గము కొన్ని ముఖ్యమైన వర్తక కేంద్రములు. మలే దీపకల్పాది ప్రాచ్య దేశములకు వెళ్ళు నౌకలు 'పోరంకి' ప్రాంతమునుండి బయలుదేరెడివి. క్రీ. శ. ఒకటి, రెండు శతాబ్దములనాటి రోమను నాణెములు తూర్పు సముద్రతీర ప్రాంతమున లభించినవి వాసిష్ఠీపుత్ర పులోమావి యొక్క ఓడ ముద్రలు గల నాణెములు మద్రాసు - కడలూరు మధ్యగల తీర

ప్రాంతములందు లభించినవి. ప్రాచ్యదేశములందు ఆంధ్ర నగరముల పేర్లు, రాష్ట్రముల పేర్లు గల నగరములు రాష్ట్రములు ఉన్నవి. ప్రాచీన పల్లవ లిపిలో వ్రాయబడిన శాసనములుకూడ అచటనున్నవి. అమరావతీ స్థూపమునందలి బుద్ధ విగ్రహములవంటి విగ్రహములు ప్రాగ్దేశములందు లభించినవి.

శాతవాహనుల కాలమున విదేశ వర్తకము విరివిగా సాగెననుటకు ప్రబలమైన నిదర్శనములున్నవి. రోమను నాణెములు ప్రాగాంధ్రమున లభించుట, ప్రాక్పశ్చిమ దేశములందు భారతీయ నాగరికతా చిహ్నము లగుపడుట, ఆంధ్ర శిల్పకళా సంపదను పోలిన విగ్రహములు విదేశములందు లభించుట, మున్నగు విషయముల నను సరించి ఆ నాడు ఆంధ్రదేశము ఆర్థికముగ మహోన్నత స్థితియందుండెననియు, ఆంధ్రులు వర్తక వ్యాపారమును విరివిగా చేయుచుండిరనియు తెలియుచున్నది. వినుకొండ ప్రాంతమున లోహ పరిశ్రమ బాగుగా సాగుచుండెను. పలనాటి సీమలో వజ్రపు గనులుండెను వివిధములైన ఆయుధములను తయారుచేయు కర్మాగారములు ఆనాడు ఆంధ్రదేశమున ముఖ్యమైన నగరములందుండెను. తెలంగాణములోని కొండాపురము బౌద్ధకళలకావాసమై సాతవాహన సామ్రాజ్య వైభవమును చాటుచుండెడిది. కొండాపురమున ఆ నాడు టంకసాలయుండెడిది. సాతవాహన నాణెములలో కొన్ని ఇచ్చట ముద్రింపబడుచుండెనని చెప్పవచ్చును. ఆనాటి వర్తకులకు సమస్త సదుపాయములుండెను. వర్తకుల సౌకర్యార్థము ధనాఢ్యులు, మంత్రులు, సామంతాదులు ధర్మశాలలు కట్టించుచుండిరి. ప్రజలు వ్యవసాయమునే ముఖ్యవృత్తిగా స్వీకరించి పంటలు పండించి, యేలోపము లేకుండ సుఖజీవనము చేయుచుండిరి. ఆ నాటి పల్లెజీవనము సుఖసంతోషముల కాలవాలమై యుండెను.

పల్లెపట్టులందు ప్రజలు మారకపు పద్ధతిన తమకు కావలసిన వస్తువు లను సమకూర్చుకొనుచుండిరి. విదేశ వస్తువులను కొనుచుండిరి.

సాతవాహనులు పాలించిన కాలమున ఆంధ్రదేశము సిరిసంపదలతో తులతూగుచు ఆర్థికముగా ఉన్నత స్థితి యందుండెను. సాతవాహనుల పరిపాలనా వ్యవస్థ కౌటిల్యుని అర్థశాస్త్ర ప్రకారము ఏర్పాటుపబడినది ఆనాడు అర్థిక సంపద దేశమున విరివిగా నుండెను. అర్థశాస్త్రరీత్యా యేర్పడిన ఆర్థికవ్యవస్థ పటిష్టముగా నుండెననుటలో సందియము లేదు.

**మత పరిస్థితులు** —సాతవాహనుల కాలమునాటి మత సామరస్యము అభినందింప దగినది. సాతవాహన సామ్రాజ్యమున, వివిధ మతములవారుండిరి వివిధమతావలంబకులేగాక, పలు భాషలు మాట్లాడు ప్రజలు అన్నదమ్ములవలె కలిసిమెలిసి యుండిరి. ఆంధ్రులు, కాళింగులు, ఘూర్జరులు, మహారాష్ట్రులు, కన్నడిగులు, తమిళులు మున్నగువారు కలిసి జీవించుచుండిరి. ఆ కాలమున వివిధ మతములు వ్యాప్తిలో నుండెను. ప్రజలలో నధిక సంఖ్యాకులు వైదిక మతావలంబకులు జైన మతము వ్యాప్తిలో నుండెను బౌద్ధము ఎక్కువ ప్రచారములో నుండెను. ఒక ప్రదేశమునందొక మతము నాదరించు వారెక్కువగా నున్న మరియొక ప్రాంతమున రెండవ మతమునకాదర మెక్కువగా నుండెను ఐనను ఆ నాటి ప్రజలలో ఏ మతము ననుసరించిన వారైనను, వైషమ్యములుకాని, సంఘర్షణలు కాని జరిగినట్లు తెలియదు మతము ఏదైనను, ఆ నాటి జనులొకరినొకరు ఆదరించి, గౌరవించి పరస్పరము సహకరించుకొనుచుండిరి.

సాతవాహనుల కాలమున వైదికమతము వర్ధిల్లినది పురాణములు కాణ్వ వంశీయులను పేర్కొనినవిమ్మట సజాతీయుడగు

సిముకుని చెప్పుటవలన సాతవాహనులు బ్రాహ్మణులని తెలియుచున్నది. కాణ్వులు బ్రాహ్మణులు. వారి సజాతీయులగు సిముకాదులును బ్రాహ్మణులే.[1] ఏదెట్లున్నను ఈ కాలమున మతములెన్ని వర్థిల్లినను మత సహనమును కల్గియున్న రాజుల పరిపాలనమున ప్రజలుసైతము అట్టిభావముల నలవరచుకొని జీవించుట గర్వించదగినది.

గౌతమీపుత్ర సాతకర్ణి, క్షత్రియ దర్పమాన మర్దనుడని ఏక బ్రాహ్మణుడని వర్ణింపబడినాడు.[2]

మహాకవి కాళిదాసు రచించిన రఘు వంశ మహా కావ్యమునందలి 13వ సర్గలోని 34వ శ్లోకములో సాతకర్ణి యను బ్రాహ్మణ ఋషి పేర్కొనబడినాడు. ఆ మహర్షి సంతతివారే సాతవాహనులై యుందురని డా॥ మారేమండ రామారావుగారు సాతవాహన సంచిక'లో తెలిపినారు. సాతవాహనులు వైదిక మతాభిమానులు.

---

1. కాణ్వాయ నాస్తతో భూపాః
సుశర్మాణః ప్రసహ్యతాం
శుంగానాంచైవ యచ్ఛేషం
క్షపిత్వాతు బలీయసః
శిశుకోఽన్ధ్రః సజాతీయః
ప్రాప్స్యతీమాం వసుంధరాం
త్రయో వింశత్సమా రాజా
శిశుకస్తు భవిష్యతి.

మత్స్య పురాణము

2. గౌతమీ బాలశ్రీ నాసిక శాసనము.
E. i. Vol. VIII. Nasic Inscriptions No.

వారు యజ్ఞ యాగాది క్రతువులు నిర్వహించుటయేకాక వైదిక మతోద్ధరణమునకు ప్రయత్నించినారు. సాతవాహన వంశీయులలో కృష్ణుడు, వేదశ్రీ, శక్తిశ్రీ, స్కంద సాతకర్ణి, శివస్వాతి, యజ్ఞశ్రీ, చంద్రశ్రీ ఇత్యాది నామములు గల రాజులుండుటవలన వైదిక మతాభిమానము వలన ఈ పేర్లు పెట్టుకొనినారని తెలియుటయే గాక వారి వైదిక ధర్మనిరతి, తెలియుచున్నది.

సాతవాహనుల కాలమున వైదిక క్రతువులపై ప్రజల కభిమాన ముండెను బ్రాహ్మణ మతమునకు సంబంధించిన దేవతలను భక్తి శ్రద్ధలతో ప్రజలు ఆరాధించెడివారు రాజులు సైతము యజ్ఞ యాగాది క్రతువులను చేయుటయేగాక, దాన ధర్మము లొసంగుచు మోక్ష కాముకులై అగ్రహారములను విప్రులకు సర్వకరపరిహార ముగ నొసంగుచుండెడివారు. సాతవాహనులు వేయించిన శాసనము లందు ఆరంభమున అష్టదిక్పాలకులకు తదితర వైదికదేవతలకు నమస్కారములు తెల్పుచుండిరి.

మొదటి సాతకర్ణి భార్య దేవీ నాగానీక వేయించిన నానే ఘాట్ శాసనమున, లోకపాలురకును, ఇంద్ర, సంకర్షణ, వాసుదేవ చంద్రాదిత్యులకు, యమ, వరుణ, కుబేరాదులకు నమస్కారములు చెప్పబడినవి.

"(సిధం) — నో ధంమస నమొ ఈదస నమొ సంకసన వాసుదేవానాం చంద సూరానాం (మహిమావ) తానం చతునం చ లోకపాలానాం యమ వరున కుబేర వాసవానం నమో

నాగానీక నానేఘాట్ శాసన భాగము
Selected inscriptions 1 P. 186.
By Sircar'

సాతవాహన రాజులలో హాలుడు ప్రసిద్ధుడు ఈతని కాలమున ప్రాకృత భాష మహోన్నత స్థితి యందుండెను. ఈ మహారాజు 'గాథాసప్తశతి' యను గ్రంధమును సంకలనము చేసెను. ఈ గాథాసప్తశతియందు ఆనాటి ప్రజల నాగరికత, సాంఘిక పరిస్థితులు, ఆచార వ్యవహారములు వర్ణింపబడినవి. ఆనాటి ప్రజలు దారునిర్మిత ఇంద్ర ప్రతిమల నారాధించుచుండిరని గాథాశప్తశతి యందు చెప్పబడినది.[1]

పౌరాణిక దైవములగు శివుని, విష్ణువును ప్రజ లారాధించుచుండిరి. రాధాకృష్ణుల ప్రేమ గాధలు, కృష్ణుని లీలలకు సంబంధించిన కథ లా నాడు వ్యాప్తి యందుండెను.[2]

హరి, త్రివిక్రమాది నామములతో విష్ణువు ఆరాధింపబడుచుండెను. క్షీర సాగర మధనము, లక్ష్మి జననము, బలిచక్రవర్తి విషయము, విష్ణువు వామనావతార మెత్తి బలిని పాతాళమున కణచుట ఇత్యాది విష్ణుమూర్తికి సంబంధించిన గాధలానాడు బహుళ ప్రచారము నందుండెను.[3]

ఆనాటి ప్రజలు త్రిమూర్తులలో నొకడగు శివుని కూడ పూజించుచుండిరి. శివపార్వతుల ఆలయము లుండెను. శివునికి

---

1. సప్తశతి – వెబర్ గాథా 864.
2. సప్తశతి – వెబర్ గాథ 89.
3. సప్తశతి – వెబర్ గాథా 358.

పార్వతి యెడగల ప్రణయానురాగములు, దక్షాధ్వర ధ్వంసము మున్నగు శివ లీలలు, శైవ గాథలు ప్రచారము నందుండెను.[1]

దేశమున చరకులను సన్యాసులు మత ప్రచారార్థము సంచరించుచుండిరి. సోపార, సువర్ణముఖి, గోవర్ధనము మున్నగు ప్రాంతములు వీరికి ముఖ్య కేంద్రములు.

శైవులలో పాశుపతులు, కాపాలికులను వారుండిరి.[2]

మొదటి సాతకర్ణి సిముకుని కుమారుడు. అశోక చక్రవర్తి ఆదరమున బౌద్ధ మతము భారతదేశమందే కాక విదేశములందును వ్యాపించినది. అశోకుని పిమ్మట 56 సంవత్సరములకు మొదటి సాతకర్ణి రాజయ్యెను. రాజైన పిదప ఎన్నియో వైదిక క్రతువుల నొనర్చెను. అతడు అగ్న్యాధేయ, అనారంభణీయ, భగలాదశరాత్ర, గర్గత్రిరాత్ర, గవామయన, ఆప్తుర్యామ, అంగిరసామయన, శతాతిరాత్ర, అంగిరసత్రిరాత్ర, ఛందోమపవమానత్రిరాత్రాది క్రతువుల నొనర్చెను. ఇవి కాక, రెండు అశ్వమేధ యాగములను, ఒక రాజసూయ యాగమును చేసెను. రాజసూయ యాగము చేయుట సామాన్యవిషయము కాదు. ఈ యాగము నారంభించుటకు ముందు దేశమునందలి రాజుల నందర నోడింపవలయును.

---

1. సప్తశతి – వెబర్ – గాథా 172, 440.

2. సప్తశతి – వెబర్ – గాథా 408.

ఇట్లాతడు అశ్వమేధ, రాజసూయ, అగ్న్యాధేయ అనారంభణీయాది యాగము లొనర్చుటకు, స్వమతాభిమానము, అనగా బ్రాహ్మణ మతాభిమానము తోడయ్యెను. అంతియే గాక, ఇతడు అధికార ప్రాభవ ప్రకటనమును గావించుటకును, బౌద్ధమత విజృంభణమున కనుమరుగై పోవుచున్న వైదిక మతము నుద్ధరించుటకును, ఇట్టి యజ్ఞముల నాచరించి యుండవచ్చును.

సాతవాహన రాజులలో ప్రబలశక్తి సమన్వితుడగు గౌతమీ పుత్ర సాతకర్ణి వైదిక మతోద్ధారకుడు గౌతమీ బాలశ్రీ నాసిక శాసనము వలన గౌతమీపుత్ర సాతకర్ణి, 'ద్విజవరకుటుంబవర్ధనుడని', 'ఆగమనిలయుడని', 'ఏక బ్రాహ్మణుడని' 'వర్ణాశ్రమధర్మ పరిత్రాత' యని తెలియుచున్నది

గౌతమీపుత్ర సాతకర్ణి క్రీ. శ. 1వ శతాబ్దివాడు. బౌద్ధమత మిప్పటికి దేశమున మహోన్నత స్థాన మాక్రమించినది. విదేశీయులగు శక, యవన, పహ్లావాదులు భారతదేశమున స్థిరనివాసులై రాజ్యముల నెలకొల్పినారు. కొందరు జైనమతమును, మరికొందరు వైదికమతమును, మరికొందరు బౌద్ధమతమును అవలంబించినారు బౌద్ధమత వ్యాప్తివలన వైదికధర్మమునకు, వర్ణాశ్రమ ధర్మమునకు వ్యాప్తి నశించినది. ఈ విషయ మెరింగి గౌతమీ పుత్ర సాతకర్ణి వైదిక మతము నుద్ధరించెను.

మొదటి సాతకర్ణి భార్య దేవీనాగానిక. ఆమె భర్తచేయు దానములకు దోడ్పడెను. ఆమె మాసోపవాసిని, గృహతాపసి,

చరిత బ్రహ్మచర్య, దీక్షావ్రతయజ్ఞశీల యని నానేఘాట్ శాసనము వలన తెలియుచున్నది.

"5. నాగవదమినియ మాసోపవాసినియ గహతాపసాయ చరితబ్రహ్మచరియాయ దిఖవతయజ్ఞసుండాయ యజ్ఞహంతా ధూపన సుగంధాయ నియ ..."

నానేఘాట్ శాసనము

Select Inscriptions I. P 186
By
Sircar.

గౌతమీపుత్ర శాతకర్ణి మాతృగారి బాలశ్రీ "సత్యవచన, దాన, క్షమ, అహింసానిరత, తపదమనియమోపవాస తత్పర, రాజర్షి వధూ లక్షణ సమన్విత" అని నాసిక శాసనమున పేర్కొనబడినది

వైదికమతమునకేకాక బౌద్ధమతమునకు, బౌద్ధ చరిత్ర యందు ఈ రాజులకాలము స్వర్ణయుగముగా పరిగణింపబడినది. ఆంధ్రదేశమున బౌద్ధము విశేషముగా నాదరింపబడినది. బౌద్ధ భిక్షువులకు, బౌద్ధ సన్యాసులకు ప్రజలానాడు స్వాగత మిచ్చు చుండిరి బౌద్ధ విహారములకు, స్థూపములకు, సంఘారామములకు ప్రజలు సహాయపడుచుండిరి. బౌద్ధమత సంబంధములగు గ్రంథము లును ఆనాడు వెలసినవి. బౌద్ధమతము నాదరించి, పోషించిన మహారాజులు, ధనికులు, ప్రజలు, బౌద్ధసన్యాసులకు ఆరామ, విహా రములను నిర్మించి యిచ్చుటయేగాక, ఆ యా సంఘములకు, విహా

రములకు గ్రామములను దానముచేసి, సంఘారామముల యభివృద్ధికి దోడ్పడిరి.

బుద్ధుని మరణానంతరము బౌద్ధమతస్థులు 'సంగతి' లేక సంగీతి' అను సభను రాజ గృహ నగరమున యేర్పాటు చేసినట్లు చదివితిమి. ఈ సభయందు, బౌద్ధమతముయొక్క ఆచార వ్యవహార ములగుఱించియు, నియమములగూర్చియు, సమావేశమైన బౌద్ధ సన్యాసులకేకాభిప్రాయము కుదురలేదు వైశాలీ నగరమున రెండవ బౌద్ధ 'సంగీతి' జరిగెను. ఈ 'సంగీతి'యందు బౌద్ధమతమున చీలిక లేర్పడినవి. పూర్వాచార సంప్రదాయానుసారము బౌద్ధమత ప్రచారము జేయువారు థేరవాదులుగను, పూర్వాచార సంప్రదాయము లలో మార్పులనుకోరువారు మహా సాంఘికులుగను విడిపోయిరి అటుపిమ్మట అశోకచక్రవర్తి బౌద్ధమతమునందేర్పడిన చీలికలను తొలగించుటకు మూడవ 'సంగీతి'ని జరిపించెను

అశోకుని కాలమునాటికి బౌద్ధమతమున థేరవాదము, సర్వాస్తివాదము, మహాసాంఘికవాదము, అంధకవాదము, ఉత్తరా పథక వాదము, సమ్మితియ వాదము, మహిసాసక వాదము అను భేదము లేర్పడినవి మహాయాన బౌద్ధమతము కాలక్రమమున ముఖ్యమైన శాఖగా పేరువడసినది. ఈ మతముదేశమున విశేషవ్యాప్తి నందినది ఉత్తరా పథమును కుషాను వంశీయుడగు కనిష్కుడు పాలించు కాలమున మహాయాన బౌద్ధము విశేషముగ నాదరింప బడినది ఐనను హీనయాన బౌద్ధముకూడ వ్యాప్తిలో నుండెను. హీనయాన మహాయాన బౌద్ధములు ముఖ్యమైన శాఖలుగా నేర్పడి నవి. మహిసాసక వాదమనునది మూడవశాఖ.

హీనయాన బౌద్ధమున 1. వజ్జిపుత్తక వాదము 2. భద్రయానిక వాదము 3. చన్నగిరిక వాదము 4. సమ్మితియవాదము 5. ధమ్ముత్తరియ వాదము అను ఐదు ఉపశాఖలు కలది థేరవాదము.

1. గోకులిక వాదము 2. బహుస్సుతక వాదము 3. పణ్ణాత్తి వాదము 4 చెతియవాదము 5 ఎకబ్యావహారికవాదము అను ఐదు వాదములు కలది మహాసాంఘికవాదము.

1. కస్సపికవాదము 2. సంక్రాంతికవాదము 3 సుబ్బత్తి వాదము 4. సుత్తవాదము 5. ధమ్మత్తికవాదము అను ఉపశాఖలు కలది మహిసాసకవాదము.

తరువాత 1. హైమవతిక, 2. అంధకశాఖ లేర్పడినవి.

అంధకశాఖలో 1 రాజగిరిక 2. సిద్ధార్థిక 3. పూర్వశైలీయ 4. అపర శైలీయ 5. వాజిరియ అను ఉపశాఖలు కల్గినవి.

కాలక్రమమున బౌద్ధిమతమున వివిధ శాఖ లేర్పడినవి.

---

# థేరవాదము




# మహాసాంఘిక వాదము



శాతవాహనుల కాలమున వెలసిన శాసనములందు బౌద్ధ మతము నందేర్పడిన శాఖలు సందర్భానుసారము పేర్కొనబడినవి. నాసిక, కార్లా, నానేఘాట్, సాంచీ. కన్హేరి శాసనములందు మహా సాంఘిక, చైత్యక, భద్రాయణీయ ధర్మోత్తరీయాది బౌద్ధ శాఖల ప్రశంస కలదు కొండవలి, అమరావతి, చినగంజాం, మ్యాకదోని ఆది గాగల శాసనములందు చైత్యక, రాజగిరిక, పూర్వశైలీయ, అపర శైలీయాది శాఖల పేర్లు తెలుపబడినవి.

గౌతమ బుద్ధుడు మహారాష్ట్రాంధ్ర కళింగాది ప్రాంతము లందు పర్యటించెనని క్రీ పూ. 7, 6 శతాబ్దములందు వ్యాప్తిలో నున్న బౌద్ధ గాథల ననుసరించి తెలియుచున్నది. గౌతమబుద్ధుని బోధనల నాతని కాలముననే ఆంధ్రులు తెలిసికొని ఆ దివ్య బోధ నలను తెల్పు బౌద్ధ మతము నాదరించియుందురు పిరల్ కోరా గుహలందును కోల్హాపురమునందును స్థూపమున లభించిన బుద్ధుని యవశేషపాత్రపైన చెక్కబడిన శాసనము ననుసరించి అశోకునికి పూర్వమే మహారాష్ట్రాంధ్ర దేశములందు బౌద్ధము వ్యాపించెనని యూహింపవచ్చును.

భట్టిప్రోలు స్థూపమున మౌర్య లిపిలో నున్న శాసనములు లభించుట వలనను, అశోకుడు మహాదేవ భిక్షువు నాంధ్ర దేశమున మత ప్రచారార్థము పంపుట వలనను, ఆంధ్ర దేశమున బౌద్ధము ఆద రింపబడెనని తెలియుచున్నది.

బుద్ధుని యవశేషములపై నిర్మించిన ఎనిమిది స్థూపములను అశోకుడు తెరిపించి, బుద్ధుని యవశేషములను ముక్కలు చేయించి వివిధ ప్రాంతములకు పంపుటవలన ఆయవశేషములపై మొత్తము 84000 స్థూపములు నిర్మింపబడెనను గాథ యున్నది. అట్టి వానిలో

ఆంధ్ర దేశమున వెలసిన భట్టిప్రోలు, నాగార్జున కొండ, అమరావతి, స్తూపములు ముఖ్యములు.

సాతవాహన యుగమున బౌద్ధ మతము విజృంభించినది. బీద, ధనిక అను భేదము లేకుండ ప్రజలీ మతము నాదరించినారు. వర్తకులు, వర్తక సంఘములు, ఆరామ, విహారములను, గుహలను, చైత్యాలయములను నిర్మించి, బౌద్ధ సన్యాసులకు దానము చేయుటయే గాక, వారికి సమస్త సదుపాయములను సమకూర్చుచుండిరి. పర్వత గుహలందు నివాసమునకు దగిన ఏర్పాట్లు చేయుచుండిరి. ఆంధ్ర దేశమునందు గల గుంటుపల్లిలోనిగుహలు బౌద్ధులకావాసమై యుండెను. ఒక్క గుహలందే కాక, పర్వతముల పైనను, సమతలమునను సంఘారామములు, చైత్య గృహములు, సమావేశ భవనములు నిర్మింపబడినవి. ఈ గుహలు, స్తూపములు దక్షిణాపథమున ఎన్నియో వెలసినవి.

క్రీ పూ. 3వ శతాబ్దిలో పిరల్ కోరా గుహలును, క్రీ పూ 2వ శతాబ్దిలో అజంతా గుహలు, క్రీ, పూ. 1వ శతాబ్దిలో కార్లా, కుడా, జునార్, కన్హేరీ, నాసిక మున్నగు గుహలునిర్మింపబడినవి. క్రీ పూ 3, 2శతాబ్దములలో అమరావతి భట్టిప్రోలుస్తూపములు విహారములు, చైత్య గృహములు నిర్మింపబడినవి.

క్రీ.శ. రెండవశతాబ్దమున బౌద్ధమతమున గొప్ప మార్పు వచ్చినది మతసిద్ధాంతములలోను, ఆచారవ్యవహారములందునువిప్లవాత్మకమైనమార్పు కలిగి మాధ్యమిక వాద మావిర్భవించినది. ఈ వాదమునకు మూల పురుషు డాచార్య నాగార్జునుడు. ఇప్పటి వరకు బౌద్ధ శిల్పమున బుద్ధుని సాంకేతికముగ ఆరాధించినట్లు చూపించినారు. బుద్ధ పాదములు, బోధి వృక్షము చైత్యము, ధర్మచక్రము, శూన్య

సింహాసనము బుద్ధునికి ప్రత్యామ్నాయముగ పూజింపబడుచుండెను. కాని మాధ్యమిక వాద సిద్ధాంతములు వ్యాప్తిలోనికి వచ్చిన తరువాత, బుద్ధుని ప్రతిమలను చెక్కుట, బుద్ధ ప్రతిమల నారాధించుట మొదలిడినారు. వైదిక మతము పునరుద్ధరింపబడుచుండుటవలన, ప్రజలు విగ్రహారాధనమునకు సుముఖులై ఉత్సాహమును చూపుట వలన బౌద్ధముననను విగ్రహారాధనము ప్రవేశపెట్టబడినది. ప్రజలలో బౌద్ధమతానుయాయులలో, బౌద్ధులలో నూతనోత్సాహము కలిగినది. బౌద్ధ శిల్పమున బుద్ధుడు స్థిరపడినాడు. జాతక కథలు, బుద్ధుని జీవిత గాథలు శిల్పమునకెక్కినవి శిల్ప సృష్టికి ఆంధ్ర దేశము ఖ్యాతి నందినది. వందల కొలది బౌద్ధ క్షేత్రములు ఉత్తరమున శాలిహుండము మొదలు చినగంజాము వరకును, తూర్పున ఆదుర్రు మొదలు పడమర కొండాపురము వరకును గల సువిశాల ప్రదేశమున ఆంధ్ర దేశమున వర్ధిల్లినవి.

సాతవాహనుల కాలమున జైనమతము ప్రబలముగా వ్యాపించియుండెను. అశోకుని కాలమున కూడ జైన మతము వర్ధిల్లినది. బౌద్ధమతము నాదరించి విదేశములందు సైతము వ్యాపింపజేసిన అశోకుడు జైన మతమును సైతము పోషించెను. అశోకుడు మత సహనము కలవాడు. బరబరా కొండలలో తాను త్రవ్వించిన గుహాలను అజవీక యోగులకు దానమిచ్చెను. ఈ అజవీక యోగులు దిగంబర జైనులకు చెందినవారు అశోకుని యనంతరము కొద్ది కాలముననే సాతవాహనుల పరిపాలన స్థిరపడినది. వీరి కాలమున జైనము కొన్ని ప్రాంతములందు విశేషముగ నాదరింపబడి అవలంబింపబడినది మల్కాపురము, జయనులపాడు, పెనుగంచిప్రోలు మున్నగునవి ఆ నాటి సుప్రసిద్ధ జైన మత కేంద్రములు.

సాతవాహనుల కాలమున వైదిక మతము, బౌద్ధము, జైనము ఆదరింపబడి పోషింపబడినవి. శకయవన పహ్లావాదులు విదేశీయులైనను భారతావనియందు స్థిరపడి తమకు నచ్చిన మతమును స్వీకరించి మతాభివృద్ధికి పాటుపడినారు మత సహనము మత పోషణము ముఖ్య కర్తవ్యముగ పాటించి ప్రజాపాలనా ధురంధరులైన సాతవాహనుల కాలమున వైదిక మత ముద్ధరింపబడి, ఆదరింపబడి జైనము గౌరవింపబడి, పోషింపబడుట గర్వించదగిన విషయము

వైదుష్యము :— సాతవాహనుల కాలమున విద్యావైదుష్యములు మహోన్నత స్థాయిలో నుండెను. దేశము సర్వసమృద్ధమై సిరిసంపదలతో తులతూగుచుండెను. రాజులు కళలను విద్యలను పోషించుచుండెడివారు. కవులు, పండితులు కవితా వ్యవసాయము చేయుచు రాజాస్థానముల నలంకరించుచుండిరి ధనికులు, సామాన్య ప్రజానీకము కవుల నాదరించుచు, మధురమంజులశబ్దవిన్యాసముతో గూడిన కవుల రచనములను విని యానందించుచుండిరి. దేశభాషలు, ప్రాకృతము, సంస్కృతము వాడుకలో నుండెను. పల్లెపట్టులందు దేశ భాషలు వాడుకలో నున్నను ఆ నాటి రాజ భాష ప్రాకృతము కావున ప్రజలు ప్రాకృత భాషను అభ్యసించిరి.

ప్రాకృత భాష ఆ కాలమున మహోన్నత స్థితిలో నుండెను. బౌద్ధ మత ప్రచారమునకు వాడిన భాష ప్రాకృతము అశోక చక్రవర్తి వేయించిన శాసనములన్నియు ప్రాకృత భాషలో నున్నవి. అశోకుని యనంతరము వచ్చిన రాజులు సైతము ప్రాకృత భాషలో శాసనములు వేయించిరి జనసామాన్యమున ప్రాకృతము దేశ భాషలు వాడుకలో నుండెను. ఆనాటి శాసనములన్నియు ప్రాకృత భాషలో వ్రాయబడినవి. శ్లేష చమత్కారములు, ధ్వనికల్పనములీ భాషయం'దానాడు కవులు చూపించుచుండిరి.

గాథాసప్తశతి:-హాల సాతవాహన చక్రవర్తి పాలించినకాలము ప్రాకృతభాషకు స్వర్ణయుగమువంటిది. హాలుడు స్వయముగా కవియేకాదు కవిపండిత పక్షపాతి. ఇతని యాస్థానము నలంకరించిన కవులు ఉద్దండులు. పండితకవులు. రసవత్తర కావ్య రచనా కౌశలులు. వివిధ ప్రాంతములనుండి వచ్చు కవులు హాలుని యాస్థానమున తమ కవితలను, కావ్యములను వినిపించుచుండెడివారు. రాజు మన్ననలు బడయుటకును, తమ పాండిత్యమును, ప్రతిభను వెల్లడించుటకును, కవులు పద్యములు చెప్పెడివారు కవులు చెప్పిన పద్యములను రాజోద్యోగులు వ్రాసి భద్రపరచుచుండిరి అసంఖ్యాకములుగా నున్న ఈ పద్యములను పర్చి ఏడువందల గాధలుగా కూర్చి గాథాసప్తశతి పేర నొక గ్రంధమును హాలుడు సంతరించెను

విద్వత్కవియు, రసికుడును నగు హాలసాతవాహన చక్రవర్తి గాథాసప్తశతిలోని కొన్ని గాధలను మాత్రమే రచించెను. మిగిలిన గాథలాకాలపు కవులయొక్కయు, కవయిత్రులయొక్క యు రచనలు. ఇందలి రసవత్తరమైన గాధలు హాలునియాస్థానకవియగు శ్రీపాలితుడు కూర్చినవి.

గాధా సప్తశతి కావ్యమున శృంగారరసము పోషింపబడినను నది రసమునకును, సభ్యతకును భంగకరమైనట్టిదికాదు

హాలుని పట్టపురాణి మలయవతి సంస్కృతాది భాషలయందపారమైన ప్రజ్ఞకలది. ఆమె నుల్లాసపరుచుటకును తన కవితాభిమానమును వెల్లడించుటకును, హాలుడు పండిత గోష్ఠులుచేయుచు, కవి పండితుల గౌరవించి సన్మానించుచుండెడివాడు ఈ రాజకవి యాస్థానకవులలో కుమారిల, శ్రీపాలితులు ముఖ్యులు హాలుని యాస్థానమున కప్పుడప్పుడు వచ్చిన కవులు చెప్పిన పద్యములను

రాజాస్థానములోని యుద్యోగులు వ్రాసియుంచెడివారు. ఇట్లు షారు సంగ్రహించిన గాథాకోటిలోని సాలంకార సప్తశతగాథలను శ్రీపాలితుడు హాలుని పేర గాథాసప్తశతిని సంతరించినాడు.

సప్తశతిలోని గాథలందు గోదావరి, నర్మదా నదుల ప్రశంస యున్నది. చాలమంది కవులు ఒకే ప్రాంతమునకు చెందినవారని చెప్పవచ్చును.

ఈ గ్రంథమున మూడువందల యేబది కవుల రచనలున్నవి.

| | |
|---|---|
| అమిత | అసిరస |
| అనురాగ | అనిరుద్ధ |
| అహాక | అలంకార |
| అరికేసరి | అనంగ |
| అల్ల | అసమసాహ |
| అవజ్ఞాంగ | అరతు |
| ఆంధ్ర | అనురాగ |
| అలతు | అనురాధ |
| అశోక | అర్జున |
| అతుక | అలిక |
| ఆహావశక్తి | ఆమిక |
| ఇంద్ర | ఈశాన |
| ఉచ్ఛేక | ఉద్ధవ |
| ఉదధి | కల్లాన |
| కడ్డిల | కటిల |
| కంతేశ్వర | కవిరాజ |
| కడలిహార | కల్యాణశీల |

కంతేశ్వర
కుమారిల
కాంతాపర
కులగుప్త
కుమార
కువలయ
కాలఖండ
గుణాఢ్య
గజసింహ
గ్రామకూట
చంద్రహస్తి
జీవదేవ
త్రిలోక
దేవదేవ
దామోదర
దుర్విదగ్ధ
నాగహస్తి
నరవాహన
నిరుపమ
నందివృద్ధ
పరాక్రమ
పూర్ణభోజక
ప్రసన్న
ప్రమాణ
పండి
ప్రణాల

కాలసార
కేశవ
కాలదేవ
కైలాస
కువింద
కుందీపుత్ర
గతలంఘిక
గుణమండిత
గజ
చంద్రస్వామి
చంద్ర
జగనందసార
తుంగక
దేవ
ధనంజయ
నరసింహ
నిష్పట
నిష్కలంక
నందన
నీల
పాలిత
పర్వతకుమార
పొట్టిస
పుండరిక
పాలిత
బహురస

భోజక
భోజ
భ్రమర
భావుక
బ్రహ్మగతి
మకరందక
మకరధ్వజ
మత్తగజేంద్ర
మందర
మహాదేవ
ముగ్ధశీల
మనోరథ
మలయశేఖర
మన్మథ
మ్లేచ్ఛక
రతిరాజ
రాజహస్తి
రాజకర్ణ
విణ్ణ
వజ్ర
వసంత
వోదిత
విజయగతి
విగహ
విగ్రహ
వసుచారి

బోట్టక
బహురాగ
భానుశక్తి
బ్రహ్మరాజ
బప్పస్వామి
ముగ్ధదీప
మధ్య
మందసువర్ణ
మృగాంక
మహేంద్ర
మండలిక
మాన
మాతంగ
మంగలకలశ
ముద్ర
రామ
రాగరసిక
విధివిగ్రహ
వాహావ
వంగవిహార
వల్లభ
వత్స
విలాస
వీరశక్తి
విశ్రమ
విశ్వేశ్వరసింహ

| | |
|---|---|
| వజ్రదేవ | శక |
| శంకరశక్తి | శక్తిహస్తి |
| శూర | శాలిక |
| శంకర | శ్యామక |
| శ్రీసత్తిక | శ్రీసుందర |
| శ్రీరాజ | శ్రీధర్మక |
| శ్రీశాతి | సుచరిత |
| సింహ | సరల |
| సురభివత్స | సువరశక్తి |
| సింహనాద | సూరన |
| సత్యస్వామి | సుశీల |
| సద్గుణకలశ | సిరివల |
| సురభివంశ | స్ఫోడ |

అనుకవుల రచనలు,

| | |
|---|---|
| హాల | హారికాల |
| హారకుంత | అవంతీవర్మ |
| మాఉరాజ | జయరాజ |
| కవిరాజ | వాహనరాజ |
| మాధవసేన | విషయసేన |
| గర్గరాజ | వాసవరాజ |
| మాణిక్యరాజ | ముఖరాజ |
| ప్రవరరాజ | అర్ధరాజ |
| మహారాజ | సత్యసేన |
| ఆయుధరాజ | అవంతివర్మ |
| వసంతవర్మ | ఆహావశక్తి |
| మాతృరాజ | విషమరాజ |
| మల్లసేన | విక్రమరాజ |

| | |
|---|---|
| మణిరాజ | శశిరాజ |
| కీర్తిరాజ | కుసుమరాజ |
| రవిరాజ | సర్గవర్మ |
| వప్రరాజ | |

అను రాజుల రచనలు,

| | |
|---|---|
| అనులక్ష్మి | అనులబ్ధ |
| రేవా | ప్రహాతా |
| వర్ధవతీ | శశిప్రభా |
| రోహా | మాధవీ |

అను కవయిత్రుల రచనలు గాథాసప్తశతియందుకలవు

గాథాసప్తశతియందు, పల్లె వాతావరణము, ప్రకృతిశోభలు, శివ పార్వతుల, లక్ష్మి నారాయణుల విపరీత రత్యాద్యవస్థలు వర్ణింపబడినవి. దీనితో పోల్చదగిన కావ్యము ప్రపంచ సాహిత్యమునందింకొక్కటిలేదు.

గాథాసప్తశతి ప్రాకృత భాషలో రచింపబడినది. 'ప్రకృతేరాగతం ప్రాకృతం' ప్రకృతి యగు సంస్కృత భాష నుండి పుట్టిన భాష కావున ప్రాకృత మనబడునని ప్రాకృత శబ్దమునకు ఆచార్య హేమచంద్రుడు వ్యుత్పత్తిని దెల్పినాడు. మొదట సంస్కృతభాష నుండి మహారాష్ట్రి, శౌరసేనీ, మాగధి, మున్నగు భాషలు బయలుదేరినవి. ఈ భాషలకు ప్రాకృత మనునది సాధారణనామము. వరరుచి తన ప్రాకృత ప్రకాశికయందు మహారాష్ట్రి, పైశాచి, శౌరశేని, మాగధీ యను నాలుగు భాషలకు లక్షణములను వివరించెను. త్రివిక్రమమార్కండేయాదులు

"మాగధ్యవంతికా ప్రాచ్యాశౌరసేన్యర్ధమాగధీ
బాహ్లీకా దాక్షిణాత్యాచ సప్తభాషా ప్రకీర్తితాః"

అని యేడు భాషలకు లక్షణములను వ్రాసినాడు  దండి తన కావ్యాదర్శమున

"తద్భవ స్తత్సమో దేశీత్యనేకః ప్రాకృతక్రమః" అనినాడు. ప్రాకృత భాష లన్నింటిలో,

'మహారాష్ట్రాశ్రయం భాషా ప్రకృష్టం ప్రాకృత విదుః
సాగరస్సూక్తిరత్నానాం సేతుబంధాది యుగ్మయమ్'

అను దండి వాక్యాను సారముగా ప్రాకృతభాష లన్నింటిలో మహారాష్ట్రి భాష ఉత్కృష్టమైనది కాని గాధా సప్తశతి ప్రాకృత భాష ఉన్నతస్థితియందున్న కాలమున మహారాష్ట్రి మాగధీ మున్నగు విభేదములు కలుగకముందు కూర్చబడినది.

గాధాసప్తశతి ప్రతి శతకాంతమున

'రసి అజణహి అలదఇఏ
కఇ వచ్ఛల పము హాసుక ఇణిమ్మవిఏ'

అని యున్నది. మరియు మొదటి శతకములోని మూడవగాధ

'సత్తస తాఇం కఇవచ్ఛలేణికోడీ అమజ్ఞ ఆరమ్మి
హాలేణ విరఇ ఆఇం సాలజ్కా రాణంగాహాణమ్' లో

హాలునికి 'కవి వత్సలు'డను బిరుదమున్నట్లున్నది. కావున ఆ నాటి ముఖ్య కవుల గాథలను గ్రథించి వారికీర్తిని ప్రతిష్ఠించుటచే నీ బిరుదము కల్గినట్లు చెప్పవచ్చును.

ముక్తక కావ్యసంగ్రహాము అనగా స్వతంత్రముగా జెప్పు నది. సాధారణ కవులిట్టి ముక్తకములను వ్రాయలేరు

గాథాసప్తశతి యొక ముక్తకమును గురించి అభినవగుప్త పాదుల వారు తమ గ్రంథమున

ముక్తకం అన్యేన నాలింగితమ్
స్వతంత్ర యా పరి సమాప్తి
నిరాకాంక్షార్థ మపిప్రబంధ
మధ్యవర్తి ముక్తక మిత్యుచ్యతే

అని చెప్పినారు

"తంత్రముక్తకేషు రసబంధాభినివేశినః కవేస్తదాశ్రయంఔచిత్యమ్
ముక్తకేషు ప్రబంధేష్వివ రసబంధాభినివేశినః కవయోదృశ్యన్తే"

అని ధన్యాలోక కర్త.

ఈ ముక్తకము నాలుగు పాదములు గలది. ఇందు మొదటి పాదము, మూడవ పాదము పండ్రెండు మాత్రలు కలిగియుండును. రెండవ పాదమున పదునెనిమిదిమాత్రలుండును నాలుగవ పాద మున పదునైదు మాత్రలుండును ఇవి చదువుట కనువైనవిగాను, రాగాలాపనమునకు వీలైనట్టివిగాను ఉండును. ఒక్కొక్క ముక్త కము రచించిన కవి యొక్క రసవత్ప్రబంధ శత నిర్మాణదక్షతను వెల్లడించును ప్రతిభావంతుడైన కవి మాత్రమే ముక్తకకావ్య నిర్మాణము గావించును.

ఇక గాథ యన ఉదాత్త, రసానుకూల ఉత్తమ ఏకైక సంఘ టమును దెల్పునది. ఒక విధమగు ఛందో నిబద్ధ రచనమునకు, గాథ యని పేరు. ప్రాకృతమున నీ గాథ ప్రసిద్ధి నందినది.

గాథాసప్తశతి ననుసరించి అమరుకుని 'అమరుకము', గోవర్ధనాచార్యుని 'ఆర్యాసప్తశతి', విహారిమిశ్రా 'విహారిసతసఈ' ఆది గ్రంథములు వ్రాయబడినవి. కుల బాల దేవుడు, గంగాధరభట్టు, భట్టశ్రీ, మధురానాథశాస్త్రి మున్నగువారు గాథాసప్తశతికి టీకలు వ్రాసినారు.

గాథాసప్తశతి యందు ప్రాకృతుల జీవితము, ఆచార వ్యవహారములు, ప్రణయము, జ్యోతిషము, ప్రకృతి, మున్నగు వర్ణనలతో బాటు నీతిసూక్తులు సైతము చెప్పబడినవి. గాథాసప్తశతి శృంగార రస సమన్వితమైనను, సందర్భోచితముగా చక్కని సూక్తులు గల పద్యములు గ్రంథింపబడినవి అందలి కొన్ని పద్యములను నేనిచట నెత్తి చూపుదును.

1. ఆరమ్భన్తస్సధుఅం లచ్ఛీ మరణం విహో ఇ పురిసస్స
తం మరిణ మణారమ్భో విహో ఇ లచ్ఛీఉణణహో ఇ

1—12

ఎక్కువగా ప్రయత్నించినవానికి లక్ష్మికాని, జ్యేష్ఠ కాని వశమగును. ఒక్కొక్కప్పుడు ప్రయత్నించకున్నను జ్యేష్ఠ ఆవహించును. కాని ప్రయత్నించినను లక్ష్మి మాత్రము వశ్యము కాదు

2. వసఇజహిం చెఅఖలో పోసిజ్జన్తో సిణెహ దాణెహిం
తంచె ఆఅల అందీ అ ఓవ్వ అ ఇరేణ మ ఇలెఇ

2—35

మనతో అతి సన్నిహితముగా సంచరించినను, స్నేహము చేసినను, దుర్మార్గుడైన వానిని మనము రహస్యములను మాటలాడ

రాదు. అట్టివా డతి సన్నిహితుడైనను గుట్టు విప్పి చెప్పరాదు. అట్లు గావించిన నాతడు మనకే హాని కల్గించును.

3. హో స్తివి ణివ్వలచ్ఛి అమణరిద్ధిహో ఇకివిణ పరిసస్స
గిహ్మే అవసంత త్తస్సణి అఆఛా హివ్వఫదా అస్స

2—36

ఆహారము భుజించుచు, భుజించు చేతితోనైనను కాకి నదల్పనట్టి పరమ లోభికి సిరి సంపదలు, ఐశ్వర్యము కల్గినను నది వ్యర్థమగును. ఎట్లన వేసవి కాలమున మధ్యాహ్నమున మండుటెండలో పయనించు బాటసారికి తన్ననుసరించివచ్చు నీడవలన లాభమెట్లు కల్గునో అట్లే లోభి వాని సంపదయు వ్యర్థము.

4. సర్వ మహద్ధ దాణం అత్తేసిసిరా ఇం వాహిరుహ్లాఇం
జా అఇం కువి అగజ్జణహి అ అసరి చ్చాఇంసలిలాఇం.

2—86

గంభీరాశయములు గలవారికి కోపము వచ్చినను వారు తమ కోపమును ప్రకటింపజాలరు. శరత్కమలాకరములోని యుదకము పైకి వెచ్చగా నుండి లోపల చల్లగా నుండునట్లు గంభీరాశయము గల వారి కోపము అవసరమును బట్టి తగినంత పైకి గాన్పించును.

5. ఉప్పణ్ణత్తే కజ్జే అఇ చిన్తనో గుణాగుణే తమ్మి
చిర ఆలమన్ద పెచ్ఛిత్తణేణ పురిసో హణఇ కజ్జమ్.

3—14

కలసివచ్చువట్టి కార్యములందు మావప్పుడు మంచిచెడుముల నాలోచింపక, కార్య సాఫల్యమునకు యత్నింపక మిన్నకుండెనేని

ఆ కార్యమును తాను నెరవేర్చలేక పోవుటయే గాక తానాశించిన ఫలితమును వమ్ము చేసికొనును

6 తామజ్ఝిమోవ్వి అవరం దుజ్జణగుమణేహిం దోహింవిణకజ్జమ్
జహవిట్ఠో తవఇఖలో తహె అసుఅణో అఈసన్తో

3—24

లోకమున సజ్జను లితరులకు హాని దలపెట్టరు మధ్యములును ఉత్తములునునైన వ్యక్తులు దుర్జన సాంగత్యము వీడవలయును దుష్టుడైన వానికి దూరముగా నుండకున్న వాడా సజ్జనుల నేడిపించును.

7 చజ్జఇ పహుస్సలలి అంపి ఆఇమాణోఖమాసమత్థస్స
జాణన్తస్స అభణి అం మోణంచ అ అణమానస్స

3—43

విద్యాభ్యాస మొనర్చు వాని యోర్పు, వాక్పటుత్వము గల వాని వచనములు, మూఢులైన మానవుని మౌనవృత్తి, ప్రియురాలి కోపము, ప్రభుని స్వేచ్ఛా ప్రవృత్తి లోకమున శోభించును.

సుఅణోణ కుప్ప ఇవ్విఅ అహకుప్పఇ విప్పి అంణచిన్తై
అహచిన్తైఇణ జమ్పఇ అహజమ్ప ఇలజ్జి ఓహో ఇ.

3—50

మంచి వాడెన్నడును కోపగించడు. కోపగించినను ప్రతిక్రియ జేయవలయునని యాలోచింపడు ఒకవేళ యాలోచించినను తన యాలోచనను వెల్లడించడు. ఒకవేళ వెల్లడించినచో సిగ్గుపడి సగము చిక్కిపోవును.

9 సో అత్థో జో హత్థేతం మిత్తం జం ఙిర స్తరం వసణె
తంరూ అం జత్థ గుణాతం విణ్ణాణం జహిం ధమ్మో

3—51

ప్రస్తుతము చేతియందున్నదే మొల్లె యనబడును ఆపదలందు విడిపోక సన్నిహితుడుగానుండి కష్టములందు భాగము గొన్నవాడే స్నేహితుడు విజ్ఞానమే సురుచిర గుణములు గల రూపము ఇది ప్రకృతి ధర్మము

10 అ ఉలిణో దాముహాఓ తామహురో భో అణం ముహేజావ
మురఓవ్వఖలొ జిణ్ణమ్మిభో అణె విరిసమారసఇ

3—53

రెండు విధములు మాటలు మాట్లాడువాడును, కొండెములు చెప్పువాడును, హీన వంశోద్భవుడును నగువాడు భుక్తి లభించినంత వరకు ముఖస్తుతులు పలుకును భుక్తి లభింపని నాడు విరసత బూని వ్యతిరిక్తముగా మాటలాడును

11 ఇహూ అస్తిలహుం పురిసంపవ్వ అమెత్తం పిదో వికజ్జాఇం
ణివ్వరణ మణివ్వఢె ణివ్వఢెజం అణివ్వాఇణమ్

3—35

పని నెరవేర్చకముందే ప్రగల్భములు పలుకుట తగని పని. పని సాధించిన పిదప నే నీ కార్యమును నిర్వహించినానని పొగడు కొనుటయు తగని పని మహోన్నతాశయములు గల వాడును, గొప్ప వ్యక్తి యనబడినవాడును కార్యనిర్వాహణమునకు పూర్వమే పలికినను, కార్య సాధనానంతరము తన్ను దా బొగడుకొన్నను వా డితరుల దృష్టిలో జులకన యగును.

12. అణువత్తణం కుణన్తోవెసె వి జణె అహిణ్ణముహరా ఓ
అప్పవణో విహూ సులణో పరవ్వసో ఆహి అఈఏ.

3—65

సత్పురుషు డొకానొక సమయమున తనలోకల్గిన మార్పును బయల్పరుపక, తన ప్రియుల కప్రియమైన వారితో సఖ్యము చేసి నను, ఆతని నిజాభి జాత్యమున కనువైన గుణమున కా కార్యము చెప్పరానిది.

13. ఫలసంపత్తీ అసమోణఆఇం తుఙ్గాఇం ఫల విపత్తీ ఎ
హి అఆఇ సుపరిసాణం మహాతరూణం వ సిహరా ఇం

3—82

వృక్షములు ఫల సంపద దభివృద్ధి నందు వేళ మిక్కిలి వంగి నవై యుండి, కాలక్రమమున తఱుగు పోగా ఫల భారముతో గొప్ప మేలిమిని చూపుచుండును. అట్లే మహాత్ముల మానసములు ఎత్తైన చెట్ల యొక్క గొప్ప శిఖరములవలె శోభిల్లుచుండును.

14. దృఢరోసకలుసి అస్సవిను అణస్సముహోహిం విప్పి అంకన్తో
రాహు ముహమ్మవి ససి ణోకిరణా అమ అంవి అము అన్తి

4—19

రోషముతో నున్నప్పుడు సైతము సజ్జనుడు అప్రియ భాష ణమ్ముల జేయఁడు. భయంకర రాహు ముఖాంతరమున చిక్కినను చంద్రుడు చల్లని కిరణములనే ప్రసారము చేయునుకదా! అట్లే సత్పురుషుడు అనవరతము ప్రియముగనే మాటలాడును.

15. అవమాణిఓవి ణతహో దుమ్మిజ్జఇసజ్జణో విహవహీణో
పడికా ఉం అ సమత్థొ మాణిజ్జన్తొ జహాపరేణ.

4—20

ప్రజలందరు ప్రత్యుపకార మొనర్పజాలని యల్పుడని తలచి అవమానపరచినను, ధనవంతుడైన దుర్మార్గుని విధమున విషాద మొంది కృశింపక, సత్పురుషుడు మిన్నకుండును.

16. కలహ స్తరెవి అవిణిగ్గ ఆఇంహి అ అమ్మిజరమువగ ఆ ఇం
సుఅణక ఆఇం రహస్సాఇం డహఇఅ ఉక్షవ అగ్గీ
4—21

సత్పురుషుని వీనులు సోకిన రహస్యము కలహములు కలిగి నను, వెల్లడి కావు అట్టి రహస్య విషయము లాతని మనస్సునందే జీర్ణమైపోవును.

17. స న్తమస న్తం దుక్ఖం సుహం చజా ఓ ఘరస్సజాణన్తి
తాపు త్త అమహిలా ఓ సెసా ఓజరా మనుస్సాణమ్.
6—12

గృహమున మంచి చెడ్డలు, కష్ట సుఖములను గృహిణులు గుర్తెరుంగుదురు అట్టి వనితలే గృహిణులు. అన్య స్త్రీలు పతుల మెడలను నులిమి వేయునట్టి ఢాకినులవంటివారు.

18 జీహా ఇకుణ న్తిపి అంభవ న్తిహి అ అమ్మిణివ్వ ఇంకా ఉమ్
పీడిజ్జన్తావిర సంజణ న్తి ఉచ్ఛుకు వీణా అ.
6—41

[illegible]పెరిన చెఱుకుగడలు పీడింపబడినను తీయని రసము నిచ్చును కులీనులైన వారితో కలహము సంభవించినను వారి మాటలు హితమునే కోరును. మనస్సు కానందము నే[illegible] కల్గించి శ్రేయము చేకూర్చును

19 ధణ్ణాబహిరా అన్థాతెచ్చి అజీ అ న్ధిమాణు సెలో ఏ
ణసుణం తిపిసుణవ ఆణం ఖలాణం రిద్ధింణపేష న్తి
7—95

చెవిటి వారు, గ్రుడ్డి వారు ధన్యజీవులు. వారే ఈ ప్రపంచ మున బ్రతుకదగినవారు. చెవిటివారు చెడు మాటలను చెవులతో వినజాలరు. గ్రుడ్డి వారు పాప కార్యములను, పాపులను కన్నులతో చూడలేరు.

శృంగార వర్ణనములు చేయుచు అన్యాపదేశముగా చెప్పిన ఈ నీతి సూక్తులు గాథాసప్తశతియం దచ్చటచ్చట గాన్పించును. ఏ దెట్లున్నను ప్రాకృత వాఙ్మయమున గాథాసప్తశతి తలమాని కము ఎంటిది. అట్టి గ్రంథములలో వివిధ కవుల రచనలను సేకరించి, రస భావాలంకార సమన్వితమైన వాని నేర్చి కూర్చిన హాల సాత వాహన చక్రవర్తి అజరామరుడు

బృహత్కథ - ఈ కాలమున వెలసిన మరియొక గ్రంథము 'బృహత్కథ' సంస్కృత కవు లీ గ్రంథమును పొగడిరి. దీని రచ యిత 'గుణాఢ్యుడు'. ఇది ఈ నాడు లభించుట లేదు

స్రాతవాహన రాజు పైఠన్‌ను రాజధానిగా నాంధ్రదేశమును పాలించు కాలమున శర్వవర్మాది మంత్రు లతని కొలువు కూటము నం దుండిరి, గుణాఢ్య పండితుడు రాజు మన్ననల నంది మంత్రిగా నియుక్తు డయ్యెను. సాతవాహన రాజొకనాడు జలక్రీడ సలుపు చుండి హేలగా భార్యల మీదికి నీళ్ళు కొట్టుటవలన అందొక రాణి ఆ బాధ కోర్వక "మోదకైర్దేవ పరితాడయమాం" (దేవా నీళ్ళతో నన్ను కొట్టకుము) అను వాక్యములోని మొదటి మాట నపార్థము చేసికొని రాజు ఉండ్రాళ్ళను తెప్పించ, రాజు చర్యకు రాణి నవ్వి

"ఈ సమయమున మోదకము లెందుకు? మా, ఉదక శబ్ద సంధినైన నెరుంగని మూర్ఖుడవా?" అని పరిహసించ నచటి వారందరును నవ్విరి. రాజు అవమానముచే ఖిన్నుడై ఆహార పానీయములు మానివేయ శర్వ వర్మాదు లాతని మాటలచే నలరింప జేసిరి.

రాజు వారిని "ఎంత కాలము కృషిచేసిన నేను సంస్కృత భాషలో పండితుడ నగుదు"నని ప్రశ్నించ గుణాఢ్యుడు తాను ద్వాదశ వర్షములలో పండితుని చేయుదు ననెను 'తా నారు మాసములలో నా పని గావింతు' నన- శర్మవర్మ అట్లుచేసిన తాను సంస్కృత ప్రాకృత దేశ భాషలను త్యజింతునని గుణాఢ్యుడు అనెను రాజును ఆరు మాసములలో బండితునిగా జేయకున్న పంద్రెండు సంవత్సరములు గుణాఢ్యుని పాదుకలు మోయుదునని శర్వవర్మ పలికెను కుమారస్వామి నారాధించి శర్వవర్మ కాతంత్ర వ్యాకరణము రచించి ఆరు మాసములలో రాజును సంస్కృతభాషా కోవిదునిగ జేసెను అందులకు రాజు శర్వవర్మకు 'భరుకచ్ఛనగరము' నొసంగి గౌరవించెను

గుణాఢ్యు డడవి కేగి పిశాచ భాష నభ్యసించి బృహత్కథ యను గ్రంథమును రచించి తన శిష్యులచే రాజున కంపించెను. రక్తాక్షరములతో భూర్జర పత్రములపై పైశాచిక భాషలో వ్రాయబడిన బృహత్కథా గ్రంథమును రాజు నిరాకరించుటవలన గుణాఢ్యు డొక్కొక్క పత్రమునే అగ్ని కాహుతి చేయుచుండెను. ఈ విషయ మెరింగి రాజు గుణాఢ్యుని వేడుకొనుటవలన గుణాఢ్యుడు గ్రంథ దహనోద్యమము మానివేసెను ఆరు 'లంబకము'లలో నైదగ్నికి నాహుతి కాగా ఒక్క 'లంబకము' మాత్రమే మిగిలినది. దానినే సోమదేవసూరి 'కథాసరిత్సాగరముగ' రచించినాడు. ఆచార్య

గోవర్ధనుడు వ్యాసమహర్షియే గుణాఢ్యునిగా జన్మించినాడని తెల్పినాడు.

బృహత్కథ' అను గ్రంథము దేశి యొక్క అపభ్రంశ రూపమగు పైశాచీ భాషలో వ్రాయబడినది. ఈ గ్రంథము ప్రపంచ కథా వాఙ్మయమున మొదటిది ఈ గ్రంథమును గుణాఢ్యుడు తెలంగాణము నందలి 'కొండాపురము'న నుండి రచించెనని తెలియుచున్నది. గుణాఢ్యుడు రచించిన పైశాచీ బృహత్కథ కాని అందలి భాగములు కాని ఇప్పుడు లభించుటలేదు. కవి బుధస్వామి క్రీ శ తొమ్మిదవ శతాబ్దివాడు అతడు పైశాచీ బృహత్కథ ననుసరించి 'బృహత్కథా శ్లోక సంగ్రహము' అను కావ్యమును రచించెను 'బృహత్కథా మంజరి' అను పేరుతో క్షేమేంద్రుడీ గ్రంథమును సంస్కృతీకరించెను.

గుణాఢ్య పండితుని జన్మ స్థలము ప్రతిష్ఠానము. ఇందు రసవత్తరమైన కథలు, ఘట్టములు, రాజుల చరిత్రములు, బ్రహ్మ క్షత్రియ వైశ్యులకు సంబంధించిన కథలు కార్మికుల కష్టసుఖములు, వర్తక వ్యాపార విశేషములు, ఆ నాటి ప్రజల సముద్ర యాన సాహస కృత్యములు, ద్వీపాంతరములందుండు వారి పరిస్థితు లాది విషయము లెన్నియో ఇందు వర్ణింపబడినవి.

లీలావతీ కావ్యము.- మహారాష్ట్రి ప్రాకృతమున వ్రాయబడిన గ్రంథమిది. ఈ గ్రంథము ప్రాకృతమున లీలావఈ' అని పిలువబడు చున్నది. శృంగార వర్ణనములతో కూడి, రసవత్తరమైన పద్యములతో పదునెనిమిది వందల యనుష్టుప్ శ్లోక సంయుతమై ఈ గ్రంథమును కుతూహలుఁడను కవి రచించెను ఇతడు బ్రాహ్మణుడు. ఇతని తండ్రి భూషణభట్టు వేద వేదాంగవిదుడు. భూషణభట్టు

తండ్రి బహులాదిత్యుడు బహులాదిత్యు డధీతవేదత్రయుడే కాక నిరతాగ్నిహోత్రికూడ.

బహులాదిత్యుని ధర్మపత్ని సావిత్రి. సావిత్రి బహులాదిత్యు లొకనాటి పండువెన్నెల రాత్రి సౌధోపరిభాగమున ఉపవిష్టులై యుండిరి. వినోదార్థము, ఉల్లాసమునకు ఒక దివ్య మానుషీ కథను ప్రాకృతమున జెప్పుమని సావిత్రి బహులాదిత్యు నడిగెను. అతడు లీలావతీ కథ నామెకు చెప్పెను.

సాతవాహన రాజగు హాలుని యొక్కయు సింహళ ద్వీప రాజకుమార్తె యగు లీలావతి యొక్కయు, ప్రేమగాథ ఇందు వర్ణితము.

మహానుమతి, కువలయావలి, లీలావతీ వృత్తాంతము లిందు కలవు సప్త గోదావరీ తీరమున గల భీమేశ్వర క్షేత్రమున లీలావతీ హాలుల వివాహము జరిగెను

వాత్స్యాయనీయము - భారతీయ కామకళా గ్రంథములలో ప్రాచీనమైనదియు, ప్రామాణికమైనట్టిదియు నగు గ్రంథము వాత్స్యాయన మహర్షి రచించిన కామసూత్రములు. ఇది ఈకళకు సంబంధించినంతవరకు సమగ్రమైనది. వాత్స్యాయన మహర్షి తనకు పూర్వమున్న కామ కళా చార్యులను పేర్కొని వారి మతములను విమర్శించినాడు. కామకళాశాస్త్ర పారంగతుడగు నీ మహర్షి వ్రాసిన 'కామసూత్రములు' 160 భాషలలోని కనువదింపబడినవి.

ఆంగ్లమున 11 అనువాదములు, ఫ్రెంచిభాషలో 20 అను వాద గ్రంథములు, జర్మనులో నలుబది యనువాద గ్రంథములును ఇతరేతర భాషలలోను అనువాద గ్రంథములు పెక్కు లున్నవి.

యశోధర మహారాజు వాత్స్యాయనుని కామ సూత్రములకు 'జయమంగళ'మను పేరుతో వ్యాఖ్య వ్రాసెను వీరభద్రుడను నతడు 'కందర్ప చూడామణి' యను పేర క్రీ శ 1577లో కామ సూత్రములను వ్యాఖ్యానించెను భాస్కరసింహుడు క్రీ శ 1789లో కామసూత్రములకు వృత్తిని వ్రాసినాడు.

వాత్స్యాయనుని కాలము క్రీ. శ. 150 ప్రాంతమనియు, క్రీ. శ. మూడవ శతాబ్ది మధ్యభాగమున అత డుండె ననియు చారిత్రకులలో నభిప్రాయము లున్నవి.

ఇతడు మూడవ శతాబ్దిలో నుండెనని ఎక్కువమంది అంగీకరించినారు.

ఆచార్య నాగార్జునుడు – బౌద్ధ మతమునకు నూతన వికాసము కల్గించి బౌద్ధులలో నూతనోత్తేజమును సృష్టించి మాధ్యమిక వాదమునకు మూల పురుషుడుగా నిలచి విదేశములందు బౌద్ధమత ధర్మములను, బౌద్ధ శిల్పమును వ్యాపింపజేసిన మహనీయుడు ఆచార్య నాగార్జునుడు. ఈ మహామహుడు తన జీవితములో చాల భాగము ఆంధ్ర దేశమున బౌద్ధ క్షేత్రములుగా వర్ధిల్లిన విజయపురి, ధాన్యకటకములందు గడిపెను

ఈతడు తాను నివసించిన ప్రాంతములందు విద్యా పీఠములను, గ్రంథాలయములను పరిశోధనాగారములను నెలకొల్పి బౌద్ధ మత ప్రచారము గావించుటయేగాక, సామాన్య ప్రజానీకమునకు సేవ లొనర్చెను.

నాగార్జునాచార్యుని జన్మ స్థలము విదర్భయని కొందరు కాంచీనగరమని కొందరు ఊహించుచున్నారు. సాతవాహనుల

కాలము వాడు కావున ఆంధ్ర సాతవాహన సామ్రాజ్యమున విదర్భ యందో, లేక కాంచీ నగరమందో జన్మించినను ఆంధ్ర మహా సామ్రాజ్యమున వర్ధిల్లిన వాడగుటవలనను, ఆంధ్ర రాజులచే నాదరింపబడి తన కొఱకై నిర్మింపబడిన (శ్రీ) పర్వత సంఘారామమున నివసించి బౌద్ధ ధర్మములను అచ్చటినుండియే దేశమందే కాక విదేశములందును వ్యాపింప జేసినవాడు కావున నాగార్జునాచార్యు డాంధ్రుడా? ఆంధ్ర దేశ మాతని జన్మ స్థలమా? యను విషయముల గురించి యాలోచించుట భావ్యము కాదు

తన యనంతర మారు వందల యేండ్లకు నాగాహ్వాయుడను భిక్షువు జన్మించునని బుద్ధుడు చెప్పినట్లు లంకావతార సూత్రమను గ్రంథమున నున్నట్లు తెలియుచున్నది. 'నాగ' అను పేరు కల్గిన ఈ ఆచార్యుడు 'అర్జున' వృక్షము క్రింద తప మొనరించి సిద్ధి పొందినాడు కావున నాగార్జునుడను పేరు కల్గిన దను ఐతిహ్యము కలదు.

ఏడవ సంవత్సరమున గండ మున్నదని జ్యోతిష్కులుచెప్పగా నాగార్జునుడు సన్యసించిన యెడల గండము తప్పునని తలచి సన్యసించె నను గాథ వ్యాప్తి యందున్నది. కాని నాగార్జునాచార్యుడు వైదిక ధర్మముల నెఱింగినవాడే కాక పండితుడగుటవలన మొదట వైదిక మతము ననుసరించి, విద్యా విషయములందు సాటిలేనివాడై యుండెననియు, తెలియుచున్నది. ఇత డా కాలమున వ్యభిచారిగా నుండి రాజాంతఃపురమునకు వచ్చుచు పోవుచు పట్టుపడుటవలన గండము తప్పిన సన్యసింతునని తలచి, అట్లే చేసెననియు మొదట హీనయాన బౌద్ధ మవలంబించి తరువాత మహాయాన మతమును స్వీకరించి తపస్సు చేసి కాంచీనగరమున 'తారాదేవ్యుపాసనమున' సిద్ధుడై నాడనియు, నలందాలో చండిక నుపాసించినాడనియు, గాథలు కలవు. నాగార్జునాచార్యుని కాలము వరకు నాలందా

ప్రసిద్ధి నొందలేదు, కావున కాంచీనగరమున తారాదేవ్యుపాసన మున సిద్ధు డయ్యె ననుట సమంజసముగా నున్నది ఆచార్య నాగా ర్జునుడు సిద్ధిని పొంది తంత్ర శాస్త్రము నభ్యసించినాడు. మయూరీ విద్య నభ్యసించి, ఏ వస్తువునైనను సువర్ణముగా మార్చు శక్తిగలినట్టి, కావలసినపుడు మాయమగుట మున్నగు విద్యల నభ్యసించి, దేశ సంచార మొనర్చి, మత వివాదములందు పాల్గొని విజయములందెను. మహాయాన బౌద్ధమతమును గూర్చి పరిశోధనలు జరిపి, మహా నాగ బోధిసత్వుని వలన, వజ్రసత్వుని వలన, బుద్ధ అమితాభునివలన తత్వోప దేశములనుపొంది సింహళ ద్వీపమున కేగి, ప్రజ్ఞాపారమతసూత్ర, వైపుల్య సూత్రములను గ్రంథములను బుద్ధ ధాతువులున్న కరండి కను సంపాదించి సాతవాహనరాజు తనకు నిర్మించి యిచ్చిన సంఘా రామమున నివసించి బౌద్ధ మత ప్రచార మొనర్చినాడని తెలియు చున్నది.

సాతవాహన రాజు ఆచార్య నాగార్జుమునికి నిర్మించి ఇచ్చిన సంఘారామము 'పారావత విహారము'- ఐదంతస్థులు కలిగి యున్నది. నేల మట్టమునకున్న దానిలో 500 గదులుండి గజాకారముగను, రెండవ యంతస్థులో 400 గదులుండి సింహాకారముగను, మూడవ యంతస్థు హయాకృతిగనుండి 300 గదులను కల్గియు, నాల్గవ దానిలో 200 గదులుండి వృషభాకృతిగను, ఐదవ అంతస్థు పావు రము వలె నుండి వంద గదులును కల్గియుండెను ఐదవ అంతస్థుపైన జలాశయ ముండెను. దానిని చైనా యాత్రికుడగు ఫాహియాన్ 'పోలోయూ' అని యనినాడు.

క్రీ. శ. 7వ శతాబ్దిలో భారతావని యందు పర్యటించుటకు వచ్చిన హ్యూయాత్సాంగ్ అను చైనా యాత్రికుడు నాగార్జునా చార్యుడు నివసించుటకు సాతవాహనరాజు పోలో మోలకిలీ'లోమున్న

సంఘా రామమును తొలిపించెననియు, ఇందున్న భవనములలో ఐదంతస్థుల భవనము ముఖ్యమైనదనియు, అందు విహారములు చతుశ్శాలలు ఉన్నవనియు, ప్రతి విహారమున ఒక బంగారు బుద్ధ విగ్రహముండెననియు, పై అంతస్థులో బుద్ధుని గ్రంథములు బౌద్ధమత గ్రంథము లుండెననియు, క్రింది యంతస్థులో, భోజన సామగ్రి యుండెననియు, బౌద్ధ ఉపాసకు లీసంఘారామమున నివసించు చుండిరనియు తెలిపినాడు. చైనా యాత్రికులు 'పారావత విహార' మని పేర్కొనినారు. పారావతమే పార్వతసంఘారామము. ఇదియే శ్రీ పర్వతము లేక నాగార్జున కొండ.

నాగార్జునాచార్యుడు రసాయన శాస్త్ర పండితుడు. పాదరసమును, వజ్రములను శుద్ధిచేసి, ఔషధముల కుపయోగించుటయే గాక, 'రసరత్నాకర'మను గ్రంథమును రచించెను మూలికలను పరిశోధించి,-కాయ కల్ప చికిత్సను కనుగొని, సాతవాహన రాజు తాను దీర్ఘ కాలము జీవించునట్లా చికిత్సను రాజుకు చేసెను తాను పొందెను సుశ్కృత గ్రంథమును సంస్కరించి, కక్షపుటతంత్రము, ఆరోగ్య మంజరీ అను గ్రంథముల రచించుటయేగాక విష వైద్యము నేత్ర వైద్యముల నభ్యసించి, బౌద్ధ ధర్మములతో బాటు రోగములకు చికిత్సల నెట్లు చేయవలయునో రాళ్ళపై స్థంభములపై చెక్కించి ప్రచారము గావించెను ఇట్టి మహానుభావుడు నలుబది సంవత్సరములు బౌద్ధ తత్వమును ప్రచారము చేసి, శూన్య వాదమునకు ప్రాధాన్య మొసంగి, శంకరాచార్యుల మాయావాదమునకు దోహదము కల్గించినాడు

ఆర్య నాగార్జునుడు బహు గ్రంథములను రచించినాడు. అందు ఇరువది నాలుగు మాత్రము లభించినవి. ఈ గ్రంథములు టిబెట్టు, చైనా భాషలలోనికి అనువదింపబడినవి అందు 1. ప్రజ్ఞాపార

మిత శాస్త్రము 2 ప్రజ్ఞామూల శాస్త్రటీక 3. ప్రజ్ఞాప్రదీప శాస్త్ర కారిక 4. మూల మాధ్యమిక శాస్త్రము 5. శూన్యసప్తాది 6. మాధ్యాంతానుగమ శాస్త్రము 7. దశభూమి విభాసాశాస్త్రము 8. ద్వాదశ నికాయశాస్త్రము 9. వివాద సమాన శాస్త్రము 10. ప్రమాణ వివేచనము 11. ఉపాయకౌశల్య హృదయ శాస్త్రము 12. విగ్రహవ్యావర్తిన్యాదులు ముఖ్యమైనవి. నాగార్జునాచార్యుడు సాతవాహన రాజునకు వ్రాసిన లేఖను సుహృల్లేఖ' యందురు

ఆర్య నాగార్జునుడు క్రీ. శ 2వ శతాబ్దివాడు. కనిష్కుని యాస్థాన కవి యగు అశ్వఘోషుని ప్రశంస నాగార్జునాచార్యుని గ్రంథములందున్నది ఈ మహామహుని కాలము క్రీ శ 137 నుండి 194 వరకని యూహింపబడినది

సాంఘిక పరిస్థితులు:—సాతవాహనుల కాలమున ప్రజలు సౌఖ్య మనుభవించుచు ప్రశాంతమైన జీవితమును గడిపిరి. సంఘమునకు వ్యక్తికిగల సంబంధము విడరానిది సంఘము లేనిదే వ్యక్తి లేడు వ్యక్తుల సమిష్ఠిజీవనమే సంఘము. సంఘమున కలుగు మార్పులు, సంఘ సభ్యుల ఆచార వ్యవహారములు, మతాభిమానము, ఆర్థిక, రాజకీయాది విషయములను తెలుపునది సాంఘిక స్థితి. ఆ నాటి ప్రజల సాంఘిక జీవితము నెరుంగుటకు సాతవాహనుల శాసనములు, గాథా సప్తశతి, వాత్స్యాయనీయము శిల్ప సంపద, సమకాలికరాజుల శాసనములు, సాహిత్యము ముఖ్యాధారములు.

సాతవాహనుల కాలమున బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్ర అను వర్ణవ్యవస్థ యుండెను వర్ణాశ్రమధర్మమునానాటి రాజులు పోషించినారు. గౌతమీ బాలశ్రీ వేయించిన నాసిక శాసనమువలన

గౌతమీపుత్ర సాతకర్ణి వర్ణాశ్రమ ధర్మముల నుద్ధరించినాడని తెలియు చున్నది.

> "6 సవమడలాభివాదిత చణస వినివతిత చాతువణసకరస అనెక
> సమరావజిత సతుసఘస అపరాజిత విజయపతాక (స) "

నాసిక శాసన భాగము.

E I. Vol VIII Nasic Inscriptions,
No 2

నహపానుని యల్లుఁడగు ఉషవదత్తుడు బ్రాహ్మణుల కనేక దానములు అందు ముఖ్యముగా భూ సువర్ణదానములు చేసినట్లిది వరలో చదివినాము గౌతమీపుత్ర సాతకర్ణి క్షత్రియదర్పమాన మర్దనుడుగ శాసనమున పేర్కొనబడినాడు

'గజసేన' 'గజమిత్ర' అను పేర్లుగల సోదరులు గౌతమీపుత్ర యజ్ఞ (శ్రీ) సాతకర్ణి కాలమున గుహను తొలిపించి భదాయనీయ బౌద్ధ సంఘమునకు దానమిచ్చినారని కన్హేరీ శాసనమువలన తెలయుచున్నది.

> "గజసేనేన సహ గజమితేనసహ
> కాపిలేయీ చేతియారాపితా దేయ ధమ
> ఆచారియాననికాయానచ ఉపా
> ధియాన . "

కన్హేరీ శాసన భాగము
Ludhers list No. 98/.

కొన్ని శాసనములు ఆనాటి వర్తకులు, ధనికులు చేసిన దాన ధర్మములను తెలుపుచున్నవి చతుర్ధవర్ణమునకు చెందిన హాలిక, మూర్ధక, గోలికాది శాఖల నామములు శాసనములందున్నవి.

ఆనాడు దేశమున వ్యాప్తిలోనున్న మతములలో వైదిక మతము, బౌద్ధమతము ముఖ్యమైనవి. విదేశీయులు భారత దేశమున స్థిర వాసులైరి. అందు యవనులు, శకులు ముఖ్యులు. శకులలో నధిక సంఖ్యాకులు వైదిక మతమవలంబించిరి. ఒక్కొక్క శక రాజు ప్రతి దినము లక్షమంది బ్రాహ్మణులకు అన్నదానము చేయుచుండె నని తెలియుచున్నది. యవనులు బౌద్ధమతము నాదరించి స్వీకరించి నారు. విదేశీయులు భారతావనియందు స్థిరనివాసులై హిందూ బౌద్ధమతములను స్వీకరించి, ఆ యా మతముల ననుసరించువారు మత సంప్రదాయము ననుసరించి ఆ మత సంబంధమైన నామములనే ధరించి తమ మతాభిమానమును ప్రకటించిరి.

వర్ణాశ్రమ ధర్మ ప్రకార మానాటి ప్రజలు వర్తించుచుండిరి ఆనాడు సమిష్టి కుటుంబములు వర్ధిల్లినవి కుటుంబములోని వ్యక్తులు అన్యోన్యముగా నుండి సమిష్టి కుటుంబ నిర్వహణమున తగిన బాధ్య తలను వహించి కుటుంబ యజమానికి తోడ్పడుచుండిరి కుటుంబ మునకు తండ్రి యజమాని అతనికి గహపతి లేక గృహపతియనియు అతని భార్యకు గహపతిని లేక గృహపతిని లేక గృహ పత్ని యను పేర్లు వాడుకలో నుండెను కుటుంబ పెద్ద ఆ కుటుంబములోని వ్యక్తుల పోషణమును, వారి యున్నతికిని సంబంధించిన బాధ్యతను వహించెడివాడు గహపతికి చేదోడు వాదోడుగా కుటుంబ వ్యక్తు లుండిరి

పుణ్య క్షేత్రములను సందర్శించు సమయమున సమిష్టికుటుంబ వ్యక్తు లందరును కలిసి వెళ్లెడివారు గుహలను తొలిపించుట, దేవా లయములను కట్టించుట, స్థంభములను చెక్కించుట, సత్రములను కాని విహారములనుకాని కట్టించుట ఆది ధర్మకార్యాచరణమునందు కుటుం బములోని వ్యక్తులందరును సమిష్టిగ, వ్యవహరించుచు, తమ భక్తిని.

ధర్మబుద్ధిని ప్రకటించుచుండిరి అమరావతీ, నాసిక, కార్లా మున్నగు శాసనముల వలన సమిష్టిగా కుటుంబములోనివ్యక్తులు కలిసి ధర్మము లాచరించినట్లు తెలియుచున్నది. సమిష్టి కుటుంబము లా నాడు వర్ధిల్లిన వనుటకు గాథాసప్తశతిలో అన్న దమ్ములు, అత్త కోడండ్రు కలిసి యుండినట్లు పలు తావుల చెప్పబడినది తార్కాణము.

ఆనాటి స్త్రీలకు సంఘమున సమున్నత స్థాన ముండెను. దేవీ నాగానీక, గౌతమీ బాలశ్రీ మున్నగు స్త్రీలు రాజకీయ వ్యవహార నిర్వహణమునందు తమ సంతతికి దోడ్పడిరి అంతియే కాక వారు రాజ్య తంత్రమును నడిపి, దాన ధర్మములుచేసి శాసనములు వేయించి, గుహలను తొలిపించి గౌరవనీయమైన స్థాన మాక్రమించిరి. రాజవంశపు స్త్రీలే కాక సామాన్య కుటుంబములకు జెందిన స్త్రీలు దాన ధర్మములకు, ఆరామ తటాకాది ప్రతిష్టలకును ధనమును వెచ్చించుచుండిరి దైవారాధనమందును, వినోద కార్యక్రమము లందును, పండుగ పర్వ దినములందును స్త్రీలు పురుషులతో సమానముగ పాల్గొనుటయే కాక, భక్తి ప్రపత్తులు కలిగి, భర్తలు చేయు సత్కార్యములకు దోహద మొసంగుచుండిరి గాథాసప్తశతి యందు స్త్రీలకు విహారములందు స్వాతంత్ర్య మున్నట్లు వర్ణింపబడినది

అమరావతి, సాంచి, అజంతా ప్రాంతము లందలి శిల్పముల ననుసరించి, ఆనాటి రాజులు, ఆడంబరోపేతమైన జీవితమును గడుపుచుండిరనియు, నాటి రాజాస్థానము లతివైభవముగా నుండెననియు తెలియుచున్నది ఛత్ర చామరవాల వ్యాజనములు ఖడ్గము, పాదుకలు, ధ్వజము, సింహాసనము, ఉష్ణీషము మున్నగునవి రాజలాంఛనములుగా ఉపయోగింపబడినవి. వివిధములైన భూషణముల నానాటి రాజులు ధరించుచుండిరి సామాన్యులు ధనికులును వివిధాభరణములను ధరించుచుండిరి.

ఖడ్గవానరులు, ప్రతీహారులు, కంచుకి, కుబ్జులు, వామనులు, శృంగవాహికలు మున్నగువారు రాజులకు పరివారము. ఆందోళికలు, అశ్వములు, గజములు రాజులకు వాహనములుగా నుపయోగపడుచుండెను.

రాణులు సైతము లాంఛనములు, పరివారమునుకల్గి ఆభరణములు ధరించుచుండిరి అమరావతీ అజంతా శిల్పము లందలి జాతక కథ లందు రాజులు, రాణులు, రాణివాసపు స్త్రీలు, రాజాంతఃపురములు కన్పించుచుండుటవలనను అమరావతీశిల్పమునందు, సామాన్య ప్రజలలో వివిధ వర్ణములకు జెందిన స్త్రీ పురుషులు వివిధములైన ఆభరణములు ధరించినట్లు చెక్కబడినవి కాన ఆనాడు రాజులు, ధనికులు, సామాన్య జనులు సుఖమయ జీవితమును గడిపినారని చెప్పవచ్చును. పలురకములైన ఆభరణములు ధరించినట్లా శిల్పమున చూపబడినది.

శిరోభూషణములు - చటులాతిలకమణ్యాదులు.

<u>కర్ణభూషణములు:-</u>

1 చూడామణి
2. మకరిక
3, మృష్టకుండలములు
4. కాంచనతాల పత్రముల్లు
5. కర్ణికలు
6 త్రికంటకలు
7. బాలికలు
8. మకరకుండలములు
9. మృణాలకుండలములు మున్నగునవి.

కంఠభూషణములు –

1 యష్టి
2 అపవర్తకము
3 ప్రకాండకము
4 ఏకావళి
5 శీర్షకము
6, రత్నావళి
7. ఫలకహారము
8 కరిక – ఆదులు

రక్షాబంధములు :–

1. కనకదోరము
2. జాలవలయము
3. మణిబంధనము
4. ఫలకవలయము
5. రత్నవలయము మొదలగునవి

హస్తభూషణములు :– కంకణము, అంగుళీయకము మున్నగునవి.

కటిభూషణములు –

1, కాంచీ
2 రత్నమేఖల
3 కాయబంధము
4. రశనము
5. మణిమేఖల ఆదుల్ఘు.

పాదభూషణములు.- మంజీరము, నూపురము, కింకిణ్యాదులు.

ఉదర బంధము, వైకక్షకము, ముక్తాయజ్ఞోపవీతాది ఆభరణములసంఖ్యాకములగు శిల్ప భేదముతో నొప్పారుచున్నవి ఈ శిల్పమున చెక్కబడిన యాభరణములను పోలిన యాభరణములు సాతవాహన సామ్రాజ్యము కాలమున వెలసిన కొండాపురమందును, ఇతర ప్రాంతములందును ఉండెను. కొండాపురమున గల శిధిలములను త్రవ్వుచుండగా, అమరావత్యాది శిల్పములందు కన్పించు యాభరణముల పోలిక గల బంగారు మట్టి, ఎముక, శంఖములతో చేయబడిన యాభరణములు లభించినవి.

ధనవంతులు, రాజవంశీయులు, రాజులు, సన్ననూలుబట్టలు ధరించుచుండిరి అట్టి వస్త్రములకు వివిధమైన రంగులలో చిత్రాతిచిత్రమై, వస్త్రములకు వింత శోభను గూర్చునట్టి అంచులుండెను అంతరీయము, ఉత్తరీయములను ప్రతివారును తప్పనిసరిగా ధరించుచుండిరి అంతరీయ మన కట్టుబట్ట ఉత్తరీయముపైన వేసుకొనునది ఇప్పటికిని పల్లె పట్టులం దీరెంటిని ధరించు యాచారము కన్పించును ఆనాటి స్త్రీలు ఎరుపు రంగుల చీరలను ధరించుటయందభిలాష కలవారై యుండిరి బౌద్ధ సన్యాసులు, సన్యాసినులు కాషాయ వస్త్రముల ధరించుచుండిరి. ఆనాటి ప్రజలు పంచెలను నేర్పుగా కట్టెడివారు. 1. విరుపుకట్టు 2. పంచకచ్ఛము 3 మత్స్యవాలకము 4. హస్తితుండకము 5 గుల్ఫావలంబి మొదలగునవి పంచెలను కట్టు విధములు బౌద్ధ భిక్షువులొక కాషాయాంబరమును ధరించుటకును, మరియొక దానిని ఎడమ భుజముపైకి వేసికొనెడివారు. దాని మరియొక కొస కుడి చేతిక్రిందికి జారియుండెడిది,

ఆనాటి ప్రజలు సౌందర్య పోషణమునకెక్కువ ప్రాముఖ్యము నిచ్చుచుండిరి స్త్రీలు, పురుషులు సౌందర్య పోషణమునం దాసక్తి కలిగియుండుటయే కాక తమతమ యభిరుచుల కనుగుణముగా వస్తువులను సమకూర్చుకొనుచుండిరి రాజుల యంతఃపురములందు, ధనాఢ్యులైన వారి గృహములందును సైరంధ్రులుండిరి. అంతఃపుర స్త్రీల నలంకరించుటలో ఈ సైరంధ్రులు తమ చాకచక్యమును, అలంకరణమున తమకు గల ప్రజ్ఞా పాటవమును జూపుచుండిరి ధనిక వర్గమునకు జెందిన స్త్రీలు సైతము అలంకరించుకొనుటలో సైరంధ్రుల సహాయము వడయుచుండిరి స్త్రీలు, గోళ్ళకు, పాదములకు ఆలక్తకమును వేసికొనుచుండిరి అమరావత్యాది ప్రాంతములందలి బౌద్ధ శిల్పమున దువ్వెనలు, అద్దములు, తైలపాత్రలు, అంగ రాగము, మాల్యము లాది గాన్పించుచున్నవి స్త్రీలే కాక ఆ నాటి పురుషులుకూడ శిరోజములను వివిధములగు ముడులుగను, జడలుగను ముడుచుకొనుండిరి.

ఆ కాలపు కట్టడములు బలిష్ఠమైనవి శిధిల రూపములోనున్న కొన్ని ప్రాంతము లందలి కట్టడములు, వాని రక్షణార్థ మనుసరించిన పద్ధతులు ఆ నాటి వాస్తు శాస్త్రజ్ఞుల బుద్ధికుశలతకు దార్కాణము ఆనాటి నగరముల చుట్టు ఎత్తైన ప్రాకారములు, ప్రాకారముల కడుగు భాగమున కందకములు ఉండుటయేగాక, ప్రాకారమున కెన్నియో ద్వారములు, ద్వారములకు ముందు తోరణములు శిల్పకళావైభవముతో నొప్పారుచు ద్వారముల కలంకారముగ నుండెడివి నగరములకేగాక భవనములకు సైతమిట్టి ద్వారతోరణము లుండెడివి ఆనాటి రాజప్రాసాదములు, భవనములు ఎన్నియో అంతర్వులు కలిగి యుండెడివి అడుగు అంతర్వులో స్తంభములు - పై అంతర్వులకు వెళ్ళుటకు సోపానములుండెడివి,

అంతరువు అంతరువుకు మధ్య గదులు, వానిచుట్టు వరండాలుండెడివి. అన్నిటికన్న పై అంతరువులో చాల రూపములు గల వలభులును, వానిపై గుఱ్ఱపు నాడము వంటి కప్పులును ఉండెడివి. ఈ భవనాంతరములలో 1. శాలలు 2 నివేశనములు 3 క్రీడా గృహములు 4. శుద్ధాంతములు 5 మండపములు 6 కపోతపాలికలు 7. గవాక్షములు 8 కోటాగారములు ఉండెడివి. ఇవి ధనికులకు, రాజులకు, పెద్ద యధికారులకు సంబంధించినవి సామాన్య ప్రజలకు సామాన్య గృహములు, పూరి గుడిసెలును ఉండెడివి.

విహారములు, చైత్యాలయములు, దేవాలయములు కళలకావాసమై యుండెను.

సాతవాహనుల కాలము నాటి ప్రజలు నాట్యము, సంగీతము మున్నగు కళల నభ్యసించుచుండెడివారు. నగరములందే కాక పల్లె పట్టు లందును ప్రజలు వీణాది వాద్యములను సంగీత సమావేశము లం దుపయోగించుచుండిరి. పండుగలందును పర్వదినములందును ఇట్టి సంగీతసమావేశములను ప్రజలేర్పాటు చేసికొనుచుండిరి. నగరములందు, రాజాంతఃపురములలోను ఈ సంగీత నృత్త సమావేశములు తరుచుగా జరుగుచుండెను అమరావతి, నాగార్జునకొండ గోలి మున్నగు ప్రాంతము లందలి స్థూప, విగ్రహ, శిల్పములలో వీణలు, వేణువు, మృదంగాది వాద్యములు కన్పించుచున్నవి ఇవి కాక శంఖము, పటహము, మర్దలము మున్నగునవి ఆనాడు వ్యాప్తిలో నుండెను. నృత్త విద్యను సర్వ వర్ణముల వారును అభ్యసించు చుండిరి. పల్లెలందు ప్రజలు నృత్తవిద్యతో వినోదించుచుండిరని గాథాస ప్తశతి వలన తెలియుచున్నది.

అమరావతీ శిల్పములందు రాజాంతఃపురమున జరిగిన నాట్యమును, బుద్ధుని యవశేషములను విభజించుకొనినప్పుడు అచట సమావేశమైన బౌద్ధ సన్యాసుల యెదుట నడచిన నాట్యమును చిత్రింపబడినవి. బౌద్ధ శిల్పమే గాక హిందూమత సంబంధమైన దేవతల నృత్యమును చిత్రింపబడినది.

శాతవాహనుల కాలమున ప్రజలు సుఖ సంతోషములతో జీవించియుండిరి నాటి ప్రజలుపయోగించిన ఆసనములలో 1 సింహాసనములు 2 ఆసందులు 3 మంచములు 4 పర్యంకములు 5. అర్ధ పర్యంకములు ముఖ్యమైనవి. భోజనము చేయునపుడు ప్రత్యేకాసనములను నుపయోగించుచుండిరి. భోజన ఫలకములు కూడ వాడుకలో నుండెను ముక్కాలి పీటలు, పాద పీఠములు, పలు రకముల పేటికలును ఆనాడు వాడుకలో నుండెను.

వివిధములైన వాహనములను ప్రయాణములకు ఉపయోగించు చుండిరి ఎద్దు బండ్లు, సామాను బండ్లు, శిబికలు, పడవలు ప్రయాణముల కుపయోగపడుచుండెను.

ఆనాటి ప్రజలు వివిధములైన పాత్రలను వాడుచుండిరి ధాన్యము నిలవ యుంచుకొనుటకు పెద్ద పెద్ద బానలను వాడుచుండిరి ఈ బానలు నీళ్లు నింపుటకును, పెద్ద బానలలోని నీళ్లు తోడుటకు చిన్న చెంబులవంటి పాత్రలును వాడుకలో నుండెను తబుకులు, గరిటెలు, చెంబులు, జాడీలు, బాశీలు, పానపాత్రలు, కలశములు, మట్టితోను, లోహముతోను చేయబడినవి ఆనాడు వ్యాప్తిలో నుండెను. గృహావసరములను దీర్చునట్టివియు, ముఖ్యముగా నిత్య జీవితమున స్త్రీలకు ఉపయోగపడునట్టి చేటలు, రోకళ్ళు, తిరుగళ్ళు రోళ్ళు మున్నగు వస్తువులు వాడుకలో నుండెను. పిల్లల ఆటవస్తు

వులలో, బాణములు, ధనుస్సులు జంతువులు, మున్నగు
నవి ముఖ్యమైనవి

సాతవాహనుల కాలమున వెలసిన గ్రంధములలో ముఖ్య
మైనది గాథాసప్తశతి సప్తశతిలోని గాథలందు ఆనాటి గ్రామ జీవి
తము చక్కగా సందర్భానుసారము వర్ణింపబడినది ఆనాటి
గ్రామములు స్వయంసమృద్ధములై యుండెను. గ్రామ పరి
పాలన గ్రామ పంచాయతీ యధీనమునం దుండెను 'గ్రామణి'
యను గ్రామపెద్ద గ్రామవ్యవహార పరిష్కారముల బాధ్యత
వహించుచుండెను వర్షములు వచ్చినపుడు గ్రామములందు రాక
పోకలకు కష్టము కల్గుచుండెను గ్రామము చుట్టు సువిశాలమైన
హాల క్షేత్రముండెను. హాల క్షేత్రమనగా వ్యవసాయమున కను
కూలమైన భూమి ఈ భూమిని వ్యవసాయదారులు దున్ని తిలలు,
చెఱకు, శాలిధాన్యము మున్నగు వస్తువుల నుత్పత్తి చేసెడివారు.
ఆనాడు గూడ యంత్రములు వాడుకలో నుండెను క్షేత్రములందు
పండించిన చెఱకు నుండి గూడయంత్రముల నుపయోగించి రస
మును దీసి బెల్లము తయారు చేయుచుండిరి పల్లె ప్రజల యవ
సరములను వారికుటుంబములోని వ్యక్తుల సంఖ్యనుబట్టి బహువిధము
లైన గృహములను నిర్మించుచుండిరి ఆగృహములనెంతో రమణీ
యముగా నలంకరించుచుండిరి సాతవాహనులనాటి ప్రజలు అలం
కారప్రియులు, కళాభిమానులు గృహములందలి కుడ్యములపై
రామాయణ మహాభారతాది ఇతిహాసములలోని నాయకుల చరిత్ర
లకు సంబంధించిన ఘట్టములు వర్ణములలో చిత్రింపబడుచుండెను
గృహములందు శారికలు పంజరములలో నుంచబడెడివి ఆనాటి
కుటుంబములు సమిష్టి కుటుంబములుగా వ్యవహరించుచుండెను
నాటి ప్రజలలో కొన్ని ఆచార వ్యవహారములు వాడుకలో నుండెను

వాటి నా నాడు వారు పాటించుచుండిరి 1 దేవర ప్రణయము 2 ఋతిమతి యగు స్త్రీ ముఖమునకు వర్ణఘృతలేపన మొనర్చుకొనుట 3 స్నాన సమయమున స్త్రీలు పసుపును వాడుట 4 హరితాళవస్తువులతో ముఖమునకు రంగులు వేసికొనుట 5 సురత సమయమున మదిరమును సేవించుట 6 యువతుల ప్రథమ సంగమము తరువాత మదన పటమును ప్రదర్శించుట 7 జంబూకషాయము నుపయోగించుట 8 సంతతికి పండ్లు వచ్చునంతవరకు రతికి పూనుకొనకుండుట 9. పండుగలందు ప్రతి యింటికి వాయనములిచ్చుట 10. అపశకునములను నమ్ముట 11. వివాహము మంగళాచరణ పూర్వకముగ ప్రారంభించి, శేష హోమ నాగవల్లి క్రియలతో సమాప్తి చేయుట మున్నగునవి ఆచారములు. 1. హోలికోత్సవము 2 ఫాల్గుణోత్సవము 3 ఉత్ఫుల్లికా 4 చూతలతికా 5 మధూత్సవములను, 1. శ్యామశబల 2. చతుర్థి 3. అగ్నిపానీయాది వ్రతములను ఆచరించుచుండిరి నృత్యము, వాద్యము, వీణావాదనము, రేఖా చిత్ర రచనము వర్ణ చిత్ర రచనములాదులు ఆ నాటి ప్రజల వినోదములు

వాత్స్యాయనీయ మను కామ కళా గ్రంథమున సాతవాహనుల కాలపు నాగరిక జీవితము సందర్భానుసారము వర్ణింపబడినది. మొదటి అధికరణములోని నాల్గవ యధ్యాయమున నాగరక వృత్త ప్రకరణమున "చక్కని నీటి వసతి కలిగి, ఉద్యానవన నిర్మాణ యోగ్యమైన స్థలమున గృహమును నిర్మించుకొనవలయు ననియు, ఆ గృహమున రహస్యముగ నుండుటకు వీలైన భాగ ముండవలె ననియు, గృహమందు తగిన మంచములు, కుర్చీలు, బల్లలు, సుగంధ ద్రవ్యములు, జంత్ర గాత్రాది సాధనములు, తాంబూల ద్రవ్యములు, గ్రంథములు, పక్షులున్న పంజరములు, అద్దములు, ద్యూతఫలకాదు లుండవలెననియు, నాగరికుడు కాలకృత్యముల

నిర్వర్తించి, శుక శారికలతోను, లావకకుక్కుట మేష యుద్ధములు ఇతరములగు వేడుకలతో ప్రొద్దు పుచ్చవలె ననియు, కామసూత్రము లందు చెప్పబడినది

**సాతవాహనుల నాటి ప్రజావినోదములు -**

సాతవాహనుల కాలమున ప్రజలు సౌఖ్యమున కలవడి యుండిరి నగరము లందు నివసించు వారును, పల్లెపట్టులందు జీవించు వారును వినోద విలాసముల కలవడి ప్రొద్దు పుచ్చుచుండిరి దైవారాధన, మతాభిమానము, మత సహనము, ఐకమత్యము, దేశభక్తి రాజు అధికారమును, ఆజ్ఞలను శిరసావహించుట, కళాపోషణము, భాషాపోషణము కవి పండితాదరణ మాది విషయము లందానాటి ప్రజలానక్తిని కలిగియుండిరి అరువది నాలుగు కళయందారితేరిన స్త్రీపురుషులానా డుండిరి ఆ కాలము నాటి ప్రజావినోదము లెన్నియోయున్నవి అందు కొన్నింటిని ఇచట నుదహరించడ మైనది.

1 ఘటా నిబంధనము - నాగరికులందరు ఒకచోట చేరి సమిష్టిగా దేవతల నుద్దేశించి, నిర్వహించు కార్యము ఘటానిబంధనము పక్షాంత్య లేక మాసాంత్య దినములందు గాని భాద్రపద శుద్ధ చవితియందు గాని, సరస్వతీ పంచమినాడుగాని, శివాష్టమీ తిథియందుగాని ఈ ఉత్సవము ఆచరింపబడును. స్థానికులు ఇతర ప్రాంతముల నుండి వచ్చిన వారును అగు నటులు నర్తకులు ఒకచోట చేరి తమ నటనా నైపుణ్యమును, నాట్య వైభవమును ప్రదర్శించెడివారు.

2. గోష్టిసమవాయము:- తమ స్వంత ఇంటిలో కాని, వేశ్యాగృహ మందు కాని స్నేహితుల ఇండ్ల యందు కాని ఈ వినోదము

జరుపబడును సమానమైన విద్యావైదుష్యములు, బుద్ధి శీలము, డబ్బు, వయస్సు కలిగియున్న వారును, విద్యా లావణ్యములచే శోభించువారుననగు వేశ్యలుకలిసి కార్యము లకును, భరత శాస్త్రమునకును సంబంధించిన చర్చలు జరుపు దురు ఇందు సమస్యా కల్పనము, సమస్యా పూరణములు వాద వివాదములు చేసి అంతమున ఒకరినొకరు సత్కరించు కొందురు

3 సమాపానకము – సమాన వయో విద్యా లావణ్య శీలసంపద గలవారు, పక్షమునకో, మాసమునకో వంతుల ప్రకారము ఒక్కొక్కరి యింట సమావేశమై మధువు మున్నగు పానీయ ములను సేవింతురు

4 ఉద్యానగమనము :– నాగరికు లందరు కలిసి ప్రాతఃకాలమున ఉద్యానమున కేగుట, మధ్యాహ్న సమయమున కుక్కుట లావక మేషాది యుద్ధములతోను ద్యూతములతోను వినో దించి, సాయం సమయము వరకు ఇండ్లకు మరలుదురు.

5 యక్షరాత్రి – దీనినే పక్షరాత్రి యనియు సుఖ రాత్రి యునియు నందురు కార్తీక పౌర్ణమినాడో, మాఘ శుద్ధ పంచమి నాడో నాగరికులు జూదమాడుటను యక్ష రాత్రి యందురు.

6. కౌముదీ జాగరణము – ఆనాటి నాగరికులకిది కౌముదీ మహోత్సవము. ఆశ్వీయుజ పౌర్ణమి నాటి వెన్నెల రాత్రిలో నాగరికులు జాగరణము చేసి, ఊయల లూగుచు, జూద మాడుచు, దేవతలను పూజించు వినోదముతో కాలము గడుపుట కౌముదీ జాగరణము.

7 సువసంతకము – దీనినే మదనోత్సవ మందురు. ఈ ఉత్సవ మును తొమ్మిది రోజులు చేయుదురు ఈవసంత నవరాత్రము లందు శాస్త్ర చర్చలు, కవి పండిత గోష్టులు, నృత్య గీత వాద్యములు, నాట్యప్రదర్శనములు ఏర్పాటు చేయబడును

8. సహకారభంజిక – నాగరికులు స్త్రీ జనులతో గూడి సహకార వృక్షముల తోటకు పోయి, చెట్ల క్రింద నిలబడి మామిడి పండ్ల గుత్తుల నుండి పండ్లను ఎగిరి నోటితో కోయుటను సహకారభంజిక యందురు

9 అభ్యూషఖాదిక - పొలములోనికి వెళ్ళి జొన్న కంకులను, శనగ కాయలను తెచ్చి చెట్టు క్రింద మంట చేసి మంటలో పోసి కాల్చి తినుటను అభ్యూషఖాదిక యందురు.

10 బిసఖాదిక తామర సరస్సులో దిగి, వంగి నోటితో తామర తూండ్లను లాగుట బిసఖాదిక యనబడును

11 నవపత్రిక - గుజ్జన గూళ్ళ వలె చెట్లకు వివాహము చేయుట యని కొందరు, పచ్చిక బయళ్ళలో మొదటపడిన వర్షములకు చిగురించిన లేత గడ్డి మొక్కలను లేళ్ళ వలె విహరించుచు, నోటితో గడ్డిని ఊడబెరుకుట యని కొందరును యభిప్రాయ పడినారు.

12. ఉదకక్ష్వేడిక - నాగరికులు వెదురుగొట్టము అనగా చిమ్మెన గొట్టముతో ఒకరిపై నొకరు నీళ్ళు కొట్టుకొనుటను ఉదక క్ష్వేడిక యందురు దీనిని శృంగక్రీడ యని కూడ నందురు.

13. పాంచాలానుయానము :- బొమ్మల పెండ్లిండ్లు ఉత్సాహముతో చేయుట

14 ఏకశాల్మలీ పుష్పములతో శోభిల్లుచు మనోహరముగ నున్న బూరుగు వృక్షము నెక్కి దానిపై క్రీడించుట. దీనినే కోతికొమ్మచ్చి లేక ఝూడ్ బందర్ యనవచ్చును

15. యవచతుర్థీ :- వైశాఖ శుద్ధ చవితి నాడు నాగరికు లందరు ఒక చోట చేరి సుగంధ ద్రవ్యమిశ్రిత యవచూర్ణము నొకరిపై నొకరు చల్లుకొందురు

16. అలోలచతుర్థీ :- శ్రావణ శుద తదియ నాడు నాగరికులు కలిసి ఊయల లూగుట

17. మదనోత్సవము :- యువకులు అందరును కలిసి చైత్ర శుద్ధ చతుర్దశి నాడు మన్మధుని ప్రతిమను చేసి ఉత్సాహముతో దానికి పూజ లొనర్చుట

18. దమనభంజిక :- చైత్ర శుక్ల ద్వాదశి నాడు దమనమును కోసి ఒకరి నొకరు అలంకరించుకొనుటను దమనభంజిక యందురు

19. హోలాక :- ఫాల్గుణ మాస పౌర్ణమి నాడు కింశుకపరాగాదులు కలిపి రంగు నీళ్ళతో వెదురుగొట్టములతో పిచికారిలతో ఒకరిపై నొకరు కొట్టుకొనుట దీనినే హోలీ యనియు లేక కాముని పున్నమ యనియు నందురు.

20. అశోకోత్తంసిక - చైత్ర మాసమున శుక్ల పక్షమున అష్టమి తిథి యందు అశోక పుష్పములను కోసి ఒకరి శిరముపై ఒకరు అలంకరించుటను అశోకోత్తంసిక యందురు.

21. పుష్పాపచాయిక - వేడుకతో పుష్పములను కోయుట.

22 చూతలతికా - చూత వృక్షము యొక్క చిగుళ్ళను కోసి వానితో అలంకరించుకొనుట

23. ఇక్షుభంజికా - చెరకు గడలను ముక్కలు ముక్కలుగ చేసి వానితో దండలు గ్రుచ్చి వేసుకొనుట

24 కదంబ యుద్ధము - కృత్రిమములైన ఆయుధములను చేసి వానికి కదంబ పుష్పముల నమర్చి ఆ ఆయుధములతో యుద్ధము చేయుచు వినోదించుట

ఆనాటి ప్రజలు నిత్య నైమిత్తికములగు క్రీడలతో వినోదించుచు, సుఖముగా జీవించుచుండిరి.

ఆనాడు అగ్ని వర్ణనములకుజెందిన స్త్రీలు, కళల నభ్యసించుచుండిరి గణికలు, విద్య నార్జించి, కళల యందపారమైన ప్రజ్ఞ నార్జించి సంస్కృతిని కలిగి సంఘమున సమున్నత స్థానమాక్రమించి యుండిరి.

వాత్స్యాయన మహర్షి విరచిత కామ సూత్ర గ్రంథమున ప్రథమాధికరణమున మూడవ యధ్యాయమున విద్యా సముద్దేశ ప్రకరణమున ఆ కాలమున ప్రజలు అభ్యసించుచుండిన యరువది నాలుగు కళలను పేర్కొనినాడు. వాని నీ క్రింద నుదహరించుచున్నాను.

1. గీతము 2. వాద్యము 3. నృత్యము 4 విశేషకచ్ఛేద్యము 5. తండులకుసుమవలివికారము 6. పుష్పాస్తరణము 7 దశనవసన

నాంగరాగము 8 మణిభూమికాకర్మ 9 ఆలేఖ్యము 10. శయన రచనము 11. ఉదకవాద్యము 12 ఉదకాఘాతము 13. చిత్ర యోగము 14 మాల్యగ్రథనవికల్పము 15 శేఖరకాపీడయోజనము 16. నేపథ్య ప్రయోగము 17 కర్ణ పత్రభంగము 18 గంధయుక్తి 19. భూషణ యోజనము 20 ఐంద్ర జాలము 21. కౌచుమారము 22. హస్తలాఘవము 23 విచిత్ర శాకయూష భక్ష్య వికారక్రియ 24. పానక రసరాగసవయోజనము 25 సూచీవానకర్మ 26 సూత్ర క్రీడ 27. ప్రహేళిక 28 ప్రతిమాల 29 దుర్వాచకయోగములు 30. పుస్తక వాచనము 31. కావ్యసమస్యాపూరణము 32. నాటకాఖ్యాయికా దర్శనము 33 తక్షకర్మ 34 పట్టికావేత్రవానవికల్పము 35. తక్షణము 36. వాస్తు విద్య 37 రూప్యరత్న పరీక్ష 38 ధాతువాదము 39 మణిరాగాకారజ్ఞానము 40 వృక్షాయుర్వేదయోగము 41 మేష కుక్కుటలావక యుద్ధవిధి 42 శుక శారికా ప్రలాపనము 43. ఉత్సాదనసంవాహన కేశమర్దన కౌశలము 44 అక్షరముష్టికాకథనము 45 దేశభాషావిజ్ఞానము 46 పుష్పశకటిక 47. నిమిత్తజ్ఞానము 48 మ్లేచ్ఛితావికల్పము 49. యంత్రమాతృక 50. ధారణ మాతృక 51 సంపాఠ్యము 52. మానసీ 53 కావ్యక్రియ 54. అభిధాన కోశము 55 ఛందోజ్ఞానము 56. ఛలితకయోగములు 57. క్రియాకల్పము 58 వస్త్రగోపనము 59. ద్యూతము 60 అకర్ష క్రీడ 61 బాలక్రీడనకములు 62 వైనయికీయ విద్య 63. వైజయకీయ విద్య.64. వ్యాయామకాన విద్య.

ఇట్లు సాతవాహనుల కాలమున ప్రజలు కళలయం దాసక్తి కలిగి ఆర్థికముగానే యిబ్బందులులేక ప్రశాంత జీవనమున కలవడి యుండిరి. రాజులు సైతము ప్రజాభ్యున్నతికి పాటుపడుచు, దేశ రక్షణమున అప్రమత్తులై యుండిరి సాంఘికముగా చూచిన వీరు పాలించిన కాలము దక్షిణా పథ మందే కాక యావత్భారతావని

యందును స్వర్ణయుగమని చెప్పవచ్చును. ఇక సాతవాహనుల కాలమున వెలసిన శిల్పములు, గుహలు, స్తూపములు ఆ కాలపు ప్రజల మతాభిమానమునకును, ధర్మకార్యనిర్వహణా కౌతూహలమునకును తార్కాణము.

సాతవాహన యుగము శిల్ప కళా వైభవమునకు ప్రఖ్యాతి నందిన కాలము. ఈ కాలమున వెలసిన శిల్పము శిల్ప కళా శోభకు ఉత్కృష్టమైన నిదర్శనము. సాంచీద్వారములు, అమరావత్యాది మహా చైత్యములు శిల్పసంపదకు నిధుల వంటివి భారతావని యందు పశ్చిమోత్తరమున ఆ కాలమున వ్యాప్తి నందిన శిల్పము గాంధార శిల్పము. ఈ గాంధార శిల్పము గ్రీకు, భారతీయ శిల్ప కళా మిశ్రమము. గాంధార శిల్పమునందు గాంభీర్యము, విస్తృతము ప్రధానాంగములు. అమరావతి, నాగార్జున కొండ మున్నగు ప్రాంతములందు వెలసిన శిల్పము జాతీయ శిల్పము. ఈ శిల్పమున లాలిత్యము, మృదుత్వము, శిల్పమును చెక్కుటలో గల నైపుణ్యము ప్రస్ఫుటముగ గాన్పించును.

భారతీయ శిల్పకళ అతి ప్రాచీనమైనది. అశోక చక్రవర్తి నిర్మించిన సాంచీ, బార్హాట్, సారనాథ్ గయా స్తూపములు అమరావత్యాది స్తూపములు శిల్పకళా కేంద్రములుగ వర్ధిల్లినవి. అశోకుడు బరబరా కొండలలో త్రవ్వించిన గుహలును, సాతవాహనుల కాలమున వెలసిన గుహలును శిల్పసంపదకు నిలయములు. సాంచీద్వారములందలి శిల్పము అమరావతీ స్తూప మందలి శిల్పములును, ప్రపంచ ప్రఖ్యాతి నందినభి- కార్లాచైత్య గృహము, నాసికలోని గుహాశిల్పములు తదితర శిల్ప కళా ఖండములు లోకోత్తరములు.

సాతవాహనుల కాలమున వెలసిన శిల్పకళ బౌద్ధ మత సంబంధితము బౌద్ధమత వ్యాప్తికి ఆనాడు చిత్రకళ వాస్తుశిల్ప కళలు సహాకరించినవి. బుద్ధుని జీవితగాధలు, జాతక కధలను చిత్రించిన నాటి శిల్పాచార్యుల శిల్పరచనానైపుణ్యమును నేటికిని మనము శిధిల రూపముననున్న స్తూపములందును, మహా చైత్యములందును, గుహాలయందును చూచుచున్నాము,

సాతవాహనుల కాలపు వాస్తు శిల్పమును మూడు భాగములుగ విభజింపవచ్చును.

1. గుహాలు
2. ఇటుక కట్టడములు
3. ద్వారములు

ఈ గుహాలలో 1. చైత్య గృహాములు 2. విహారములు 3 సమావేశ భవనములు అను రకము లున్నవి.

చైత్య గృహాములు కొండలలో తొలువబడినవే కాక ఇటుకలతో కట్టినవి కూడ నున్నవి. అందు కొన్ని కొండలపైనను, మరికొన్ని సమతలముల యందున్నవియు కలవు. చైత్య గృహాములలో రామ తీర్థము నందున్న చైత్యాలయము పెద్దది. దీని పొడవు 60 అడుగులు. వెడల్పు 13 అడుగులు. ఈ చైత్యములు ఆరాధన చైత్యములు. చైత్యము చుట్టు అనేక స్తూపములు నిర్మించెడివారు. స్తూపములు. మూడు విధములు.

1. శారీరక స్తూపములు-దంతములు, నఖములు, కేశములు, ధాతువులు, చితాభస్మము మున్నగువానిమీద నిర్మించిన స్తూపములు

శారీరక స్తూపములు.

2. పారిభోగిక స్తూపములు - వ్యక్తు లుపయోగించిన వస్తువులపైనను, వారి కిష్టమైన వస్తువులపైనను నిర్మించిన స్తూపములు పారిభోగికములు.

3 ఉద్దేశికములు ,- వ్యక్తుల జ్ఞాపకార్థము నిర్మింపబడిన స్తూపములు ఉద్దేశికములు

స్తూపములను బౌద్ధులు, జైనులు నిర్మించినారు. బుద్ధునికి పూర్వ మీ స్తూప నిర్మాణము వాడుకలోనుండెనని తెలియుచున్నది. బుద్ధుని కాలమున ఈ యాచారము పాటింపబడినది మహా వ్యక్తుల శరీరావశేషములపై నిట్టి స్తూప నిర్మాణము జరుగుచుండెను. బుద్ధుని ధాతువులపై నిర్మింపబడిన స్తూపములలో ఆంధ్ర దేశమున అమరావతి, నాగార్జునకొండ, భట్టిప్రోలు ప్రాంతములందలివి ముఖ్యమైనవి.

స్తూపములు గుహలలో నిర్మింపబడినవి కొన్ని ఇటుకతోనిర్మింపబడినవి కొన్ని యున్నవి. కొండలలో రాతిలో తొలువబడిన స్తూపములలోని కెల్ల అరువది నాలుగడుగుల ఎనిమిది యంగుళముల వ్యాసముగల బొజ్జన్నకొండ శిఖరమున నున్న ఏకశిలా స్తూపము చాలా పెద్దది ఏకశిలాస్తూపములలో చిన్న స్తూపములుకూడ నిచట నున్నవి అమరావతీ మహా చైత్యము ఇటుకతో నిర్మింపబడిన వానిలో మిక్కిలి పెద్దది దీని ఎత్తు 100 అడుగులు వ్యాసము 138 అడుగులు. భట్టిప్రోలు స్తూపము అమరావతీ స్తూపముకన్న చిన్నది.

ఆంధ్ర దేశమున, శాలిహుండము, రామతీర్థము, ధారపాలెము సంఘారామము, ఆదుర్రు, కొడవలి. పిఠాపురము, గుంటుపల్లి, అరు

గోలను, జగ్గయ్యపేట, నందిగామ, గుడివాడ, ఘంటసాల, విద్యాధర పురము, అమరావతి, నాగార్జునకొండ, భట్టిప్రోలు, గోలి, చినగంజాం, పెదగంజాం, గరికపాడు, బుద్ధాం, మాడుగుల, అల్లూరు, గుమ్మడిదుర్రు, ఫణిగిరి, గాజులబండ, కొండాపురం ప్రాంతము లందు స్తూపములున్నవి.

విహారములనునవి బౌద్ధ భిక్షువుల వసతికై నేర్పరుపబడినవి. ఇవియుగుహాలందును, సమతలముననను నిర్మింపబడినవి ఈ విహారములందు చిన్నచిన్న నదులుండుటయేగాక, అరుగులు, నీటికుండ్లు బౌద్ధభిక్షువులకు కావలసిన సదుపాయములకు తగినట్లుండును ఇందు పారశాలలు, స్నానాగారములు, మురికినీటి కాలువలు ఉండును. ఆకాలమున బౌద్ధ ధర్మములను, బోధించుటకును ధర్మవిషయములపై చర్చలను సాగించుటకును, బౌద్ధభిక్షువులు భిక్షుకీగణములును సమావేశమై బౌద్ధమతాభివృద్ధికి తోడ్పడుచుండిరి బౌద్ధమత సంబంధమును కలిగినవారును, ఉపాసకులును బౌద్ధ సమావేశములకు వచ్చుచుండిరి ఇట్టిసమావేశముల నేర్పాటుచేయుటకు సమావేశ భవనములను నిర్మించినారు కన్హేరీ, కార్లా, నాసిక ప్రాంతము లందు పెద్ద పెద్ద సమావేశ భవనములు నిర్మింప బడినవి రామ తీర్థము గుంటుపల్లి, నాగార్జునకొండ సంఘారామ ప్రాంతములందును ఇట్టి సమావేశ భవనములు వెలసినవి

సాంచీ స్తూపద్వారములు జగత్ప్రసిద్ధములు ఆంధ్రులకళాభిమానమునకును, శిల్పకళా నైపుణ్యమునకును, భావవైచిత్ర్యమునకును ఇవి నిదర్శనములు. సాంచీద్వారముల మీద చెక్కబడిన శిల్పమందలి కళానైపుణ్యం, ఆనాటి శిల్పుల ప్రతిభను చాటుచున్నది.

ఆంధ్రదేశమున వెలసిన అమరావతీ స్తూపము అశోకచక్రవర్తికి పూర్వమే నిర్మింపబడినది ఆస్తూపమును అకాలము నందాంధ్ర

దేశమును పాలించుచుండిన నాగరాజు ప్రారంభించినట్లు తెలియుచున్నది అశోకుడు ఆ స్తూపమును వృద్ధిచేసినాడు. బుద్ధదేవుని యవశేషముపై నిర్మింపబడిన స్తూపము అమరావతీ స్తూపము అశోకుని యనంతరము సాతవాహనుల కాలమున అమరావతీ స్తూపము వృద్ధి చేయబడుట యేగాక వింతశోభను కూర్చుకొని, దక్షిణాపథ బౌద్ధ చరిత్రయందేకాక బౌద్ధచరిత్రయందు సమున్నత స్థానమాక్రమించినది. అమరావతీమహా చైత్యము చుట్టును శిల్ప, చిత్రసంయుతమహాప్రాకార నిర్మాణమునుగావించిన మహనీయుడు ఆచార్య నాగార్జునుడు. అమరావతీ చిత్రములందు భావము ప్రస్ఫుటముగ గాన్పించును. కరుణము, సంతోషము, దుఃఖము, ఆధ్యాత్మికయుక్త మానసికానందము మున్నగు భావములు, రసములు ఈ చిత్రములందు స్ఫురించును

అమరావతీ మహా చైత్యముయొక్క ప్రాకారము వెలుపలి భాగమందనేక జంతువుల బొమ్మలు చెక్కబడినవి. స్తూపమున, చైత్యమున కాన్పించు స్తంభములపై బోధి వృక్షము, ధర్మచక్రము నాగ, యక్ష చిత్రములు, పూర్ణ అర్ధ కమలములు, త్రిరత్నము మున్నగు చిత్రము లున్నవి. కొన్నిటియందు మహాభినిష్క్రమణము. అస్త్ర విద్యా ప్రదర్శనము, అంగుళిమాలునికథ లాది కథలు చిత్రింపబడినవి. ఈ మహా చైత్యము క్రీ. శ. 2వ శతాబ్దిలో మహోన్నత స్థితి యందుండెను. క్రీ. శ. 150 ప్రాంతమున వెలసిన శిల్ప మనుపమము. ఈ కాలపునాటి శిల్పమున మెరక పల్లములతో దూర సామీప్యములు చూపబడుట విశేషము.

దగ్గరగానున్న దృశ్యములు, లోతుగను, దూరముగ నున్నవి. మెరకగను చిత్రింపబడినవి. ఇంతటి చిత్రములలో ఒక దానికన్న నొకటి మనోహరముగ నుండుటయేగాక ప్రత్యేకతను కల్గియుండును.

చిత్రములే కాదు, స్త్రీ పురుషుల ప్రతిమలును, చూడ ముచ్చటగా నుండును. చైత్య శిల్పమున కానవచ్చు వందలాది కమలములందే రెండైనను ఒక్కరీతిగా నుండక భిన్నముగనుండి ఒక విధమైన ప్రత్యేకతను కల్గియుండును. బుద్ధ జాతక కధలు, జీవిత ఘట్టములు అందు చిత్రింపబడినవి. శిల్పమునందు హాస్యరసము పోషింపబడిన దనుటకు అచ్చటచ్చట కుబ్జ చిత్రములు రచింపబడుటయే తార్కాణము.

శాలిహుండ మొక ప్రఖ్యాత బౌద్ధకేంద్రము. ఇందలి చైత్య ప్రాకార రేఖకు నాలుగు వైపుల ద్వారము లుండెను ఈ ద్వార ముల కభి ముఖముగ నున్న వేదికపై ఐదేసి కల్యాణ మండపము లున్నవి. మండప స్తంభాగ్ర భాగములందు యక్షప్రతిమ లుండును. ఆయక స్తంభములపై పంచకల్యాణములను చెక్కుట ఆనాటి బౌద్ధ శిల్ప సంప్రదాయము. పంచకల్యాణము లనగా బౌద్ధమత సంబంధ మైనవియు, బుద్ధుని జీవితమునకు సంబంధించినవియునగు 1 బుద్ధ జననము 2 మహాభి నిష్క్రమణము 3. బుద్ధ బోధ 4 మృగ వనమున బుద్ధుడు చేసిన మొదటి బోధ 5. మహాపరినిర్వాణ మనునవి ఆంధ్ర దేశమున వెలసిన బౌద్ధ తీర్థములగు రామతీర్థము, బొజ్జన్న కొండ, గుడివాడ, శంఖరం, భట్టిప్రోలు, ఘంటసాల, చేజెర్ల, గోలి, చేబ్రోలు, వేల్పూరు, కనుపర్తి, బుద్ధాం, ముక్త్యాల, మోటుపల్లి, సమాధానపురము, రెంటాల, మంచికల్లు, మాడుగుల, నాగార్జున కొండ, అమరావత్యాదులు ప్రఖ్యాతి నందినవి ఇందలి శిల్పకళా ఖండము లానాడు బౌద్ధ శిల్పము పరాకాష్టనందినదనుటకు నిదర్శన ములు. తెలంగాణము నందలి కొండాపురము, గాజులబండ ప్రాంతము లందత్యద్భుతములతో గూడుకొనిన పనితనముగల మట్టి ప్రతిమలు లభించినవి.

సాతవాహన యుగ మందలి మహారాష్ట్రములోని గుహాలు శిల్ప నైపుణ్యమునకు ప్రసిద్ధి వడసినవి. ఈ గుహాలందు దొలిచిన స్తంభముల పై భాగమున, స్వస్తిక, త్రిశూలము, కమలము, జంతువులు, పూర్ణ కలశములు చెక్కబడినవి. చైత్యములందు వేదిక పైగల ప్రాకార శిల్పమున త్రిరత్న చిహ్నములు, తామరతీవలు, సింహములు మొదలగునవి చెక్కబడినవి అజంతా ఎల్లోరా గుహాలు ప్రపంచ ప్రసిద్ధి నంచినవి. అజంతా గుహాలలోని 8, 9, 10, 12, 13 నెంబర్లు గల గుహాలు సాతవాహనుల కాలము నాటివి. ఇందలి చిత్రములు గుహాలలోని పై కప్పు చిత్రములందలి ప్రకృతిదృశ్యములు, చెక్కడములు, గోడలమీదనున్న బౌద్ధజాతకకథలు, బుద్ధుని జీవిత ఘట్టములు మనోహరముగనుండి చూపరులనాకర్షించుచుండును.

ఎల్లోరా గుహాలు శిల్పకళ కావాసమై ఆనాటి శిల్ప కళా వైభవమును చాటుచున్నవి ఈ గుహాలందు 12 అడుగులనుండి 15 అడుగుల ఎత్తువరకుగల బుద్ధ విగ్రహాము లున్నవి గుహాద్వారముల పైనను గోడల పైనను స్త్రీ పురుషుల జంటలు వివిధ భంగిమలలో నాట్యము చేయుచున్నట్లు చెక్కబడినవి బుద్ధుని విగ్రహాములలో నొక ప్రత్యేకత కన్పించును ప్రతి విగ్రహామును మరొక విగ్రహాముతో ఏదో ఒక విషయమున భిన్నముగ నుండును. అజంతా ఎల్లోరా గుహ లానాటి భారతీయ చిత్ర కళా సృష్టికిని, శిల్ప కళా సృష్టికిని తార్కాణములు.

మహారాష్ట్రము నందలి గుహాలలోకూడా మహార్, కోల్, సిర్వాల్, వాయ్, కరాద్, కొండనె, భాజా, బేడ్సా, పిరల్ కోరా, శైలర్వాడీ, జున్నార్, తులజా, గణేశలేనా, సులేమాన్ కొండల లోని గుహాలును, కొండ్యేటే, నానేఘాట్, నాసిక, కన్హేరీ, కార్లా,

అజంతా ఎల్లోరా గుహలును బౌద్ధ శిల్పమునకును, బౌద్ధకళలకును ఆవాసములు. ఆంధ్ర దేశము నందలి గుహలలో గుంటుపల్లి, శంఖరం, ఆదులు ముఖ్యమైనవి.

సాతవాహనులు పాలించిన నాల్గున్నర శతాబ్దులకాలము మత సాంఘిక రాజకీయార్థిక సాహిత్య కళారంగములందు మహోన్నత స్థాన మాక్రమించి ఆంధ్ర సామ్రాజ్య వైభవమును చాటి దక్షిణాపథ చరిత్రయందే కాక భారత దేశ చరిత్ర యందత్యున్నతమైన స్థాన మాక్రమించినది. ఆనాటి రాజులు ప్రజల సుఖమునుగోరి, వారికి తగిన సౌకర్యము లేర్పరచుటయేగాక, మత సహనము కలిగి, మతోద్ధరణమునకు బూనుకొని సాహిత్యము, శిల్పము మున్నగు కళలను పోషించి, ప్రజలు సైతము తమ మార్గము ననుసరించునట్లు గావించి ఆంధ్రుల కీర్తిని వ్యాపింపజేసినారు ఇట్టి సాతవాహనాంధ్రుల కాలపు సాంఘిక స్థితిగతులు తెలిసికొనుట కింకను పరిశోధకులు పూనుకొనిన సమగ్రాంధ్ర చరిత్రతోపా టాంధ్రుల సంపూర్ణ సాంఘిక చరిత్ర నిర్మాణమున కవకాశము కల్గు ననుటలో సందియము లేదు.

ఈ ప్రకరణమునకు ముఖ్యాధార గ్రంథములు.


1. సాతవాహన సంచిక. సం॥ డా॥ మారేమండ రామారావుగారు

2 ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి శ్రీ ఖండవల్లి సోదరులు

3 చారిత్రక వ్యాసములు. శ్రీ మల్లంపల్లి సోమ శేఖరశర్మగారు

4. గాధాసప్తశతి

5. Epigraphia Indica, Vols. VII, VIII, & XIV.

# 3వ ప్రకరణము

# ఇక్ష్వాకుల యుగము

సాతవాహనుల పరిపాలన మంతరించిన తరువాత ఆంధ్రసామ్రాజ్యము విచ్ఛిన్నమై సామంతరాజ్యములు స్వతంత్రములైనవి. ఆంధ్రదేశము చిన్నచిన్న రాజ్యములుగ విభజింపబడి వివిధవంశముల వారి పరిపాలనము లోనికి వచ్చినది. స్వతంత్రరాజ్యములను స్థాపించినవారిలో ఇక్ష్వాకులు, పల్లవులు, ఆనందగోత్రికులు, బృహత్ఫలాయనులు, శాలంకాయనులు, విష్ణుకుండినులు, కళింగ రాజులు ముఖ్యులు

ఇక్ష్వాకు వంశీయులు విజయపురిని రాజధానిగా నాంధ్ర దేశమును సుమారు ఏబది సంవత్సరములు పాలించినారు. వీరి పరిపాలనాకాలము క్రీ శ. 218—270. సాతవాహనులవలె వీరును తమ శాసనములను ప్రాకృతభాషలో వేయించినారు

వీరికి సంబంధించిన శాసనములు, నాగార్జునకొండ, జగ్గయ్యపేట, రామిరెడ్డిపల్లి, గురజాల ప్రాంతములందు లభించినవి ఈశాసనములు, **Epigraphia Indica vols XX, XXI, XXIV, and vol XXIX** లో ప్రకటింపబడినవి.

ఈ వంశీయులలో నలుగురు రాజులుమాత్రమే ఆంధ్ర దేశమును పాలించినట్లు తెలియుచున్నది

1. మొదటి శాంతమూలుడు
2. శ్రీ వీరపురుషదత్తుడు

3. ఏహువుల శాంతమూలుడు

4. రుళు పురుషదత్తుడు

ఇందు మొదటిరాజగు వాసిష్ఠీపుత్ర శ్రీ శాంతమూలుడు. అశ్వమేధవాజపేయాది యజ్ఞములను చేసిన ప్రతిభావంతుడు సమ్రాట్, సార్వభౌమాది బిరుదాంచితుడు.

ఈవంశీయుల కాలమున ఆంధ్రదేశము ఉన్నత స్థితియందుండె నని తెలియుచున్నది. ఇక్ష్వాకులు పాలించిన కాలము అర్ధశతాబ్ది మాత్రమే యైనను ఆంధ్రదేశచరిత్రలో, ఆంధ్రదేశ సాంఘికచరిత్రలో ప్రాముఖ్యము వహించుచున్నది. వీరికాలమున వైదిక మతమునకు ప్రోత్సాహము లభించినది. బౌద్ధమతము మహోన్నతస్థానమాక్ర మించినది. ప్రజలుసుఖమయ జీవితమును గడిపినారు. సాతవాహనుల యనంతర మాంధ్రదేశమును పాలించినవారు కావున ఈవంశీయుల పరిపాలనా విధానమంతయు సాతవాహనుల పరిపాలనా పద్ధతుల ననుసరించియే సాగినది. మీదుమిక్కిలి వీరు సాతవాహనులకు సామం తులుగనుండి సాతవాహనవంశ మంతరించు సమయమున స్వాతంత్ర మువహించిన వారు కావున వీరికాలపు సాంఘిక పరిస్థితులందున్నపెద్ద మార్పులు కనిపింపవు. వీరుపాలించిన అర్ధశతాబ్ది కాలపు సాంఘిక చరిత్ర, వీరికి సంబంధించిన శాసనముల ననుసరించియు. నాగార్జున కొండ, జగ్గయ్యపేట మున్నగు ప్రాంతములందు వెలసిన శిల్పస్తంభద బౌద్ధసంఘారామముల యొక్కయు, మహాచైత్యముల యొక్కయు కళాసంపద ననుసరించియు వ్రాయబడుచున్నది. ఈవంశీయులలో మొదటివాడగు వాసిష్ఠీ పుత్ర శాంతమూలుడు వైదిక మతోద్ధార కుడు. మాఢరీపుత్ర శ్రీవీరపురుషదత్తుడు వైదిక మతమును వదలి బౌద్ధమును స్వీకరించి దానివ్యాప్తికి పాటుపడినవాడు.

## ఇక్ష్వాకుల పరిపాలనా విధానము:—

సుమారు ఏబది సంవత్సరములు మాత్రమే పరిపాలించిన ఇక్ష్వాకు వంశీయులు సమర్థులైన పరిపాలకులు ఆంధ్ర దేశ చరిత్ర యందు వీరి పరిపాలనా కాలము ప్రాముఖ్యము వహించినది. మహా సామ్రాజ్య స్థాపకులగు సాతవాహనుల కాలమున బౌద్ధ మతము సర్వాతిశాయియై వర్ధిల్లినది. ఉత్తరాపథమున భారశివ నాగులు మత రాజకీయ రంగములందు విప్లవమును రేపి, వైదిక మతోద్ధరణ మునకు బూనుకొనినారు దక్షిణాపథమున సాతవాహన సామ్రాజ్యానంతరము చిన్న చిన్న రాజ్యము లేర్పడుటయే కాక మత రాజకీయాది రంగము లందును మార్పులు వచ్చుచుండుటవలన ఇక్ష్వాకువంశమున మొదటివాడగు శాంతమూలుడు వైదిక మతము నాదరించి పోషించుచు, ఆంధ్ర దేశ మల్లకల్లోలముకాకుండ సమర్ధనీయమైన పరిపాలనాపద్ధతులను ప్రవేశ పెట్టుట వలన ఇక్ష్వాకు వంశీయులకు చరిత్ర యందు ప్రాముఖ్య మేర్పడినది.

వీరి సామ్రాజ్యము ఎంతవరకు వ్యాపించినదో తెలిసికొనుటకు దగిన యాధారములు లేకున్నను, వీరి శాసనములు నాగార్జున కొండ, జగ్గయ్య పేట ప్రాంతములందు లభించినవి. కావున గుంటూరు కృష్ణా మండలములు వీరి పాలనములో నుండె ననవచ్చును. కాని కొన్ని యాధారములను బట్టి "ఇక్ష్వాకు సామ్రాజ్యము పశ్చిమోత్తరమున ఉజ్జయినీ రాజ్యమును, పశ్చిమమున ఆభీర రాజ్యమును, దక్షిణ పశ్చిమమున వనవాసి రాజ్యమును అంటి యుండెనని చెప్పవచ్చునని" డా॥ మారేమండ రామారావు గారి యభిప్రాయము 1.

---

1. నాగార్జున కొండ సంచిక P. 23.

ఇక్ష్వాకుల స్వతంత్ర పాలనమును స్థాపించిన మహనీయుడు వాసిష్ఠీ పుత్ర శాంతమూలుడు ఇతనిని ఇక్ష్వాకు స్వామి యందురు. ఇతని శాసనము లేవియు లభింపకున్నను ఈతని సోదరి, కుమారులు, వేయించిన శాసనముల వలన ఈ మహారాజు గురించి తెలియు చున్నది. శాంతిశ్రీ వేయించిన శాసనమున ఈతడు మహారాజుగను, స్వామి మహాసేన పరిగృహీతునిగను, అనేక కోటి హిరణ్య గోహాల సహస్రములను దానము చేసినట్లుగను, అప్రతిహత శాసనుడనియు, వాసిష్ఠీ పుత్రుడనియు వర్ణింపబడినాడు

"3 మహారజస విరూప
4 ఖపతి - మహాసెన - పరిగహితస హిరణ

కొటి గొ - సత సహస - హల - స -
తసహ (స) దాయిస

5 సవధెసు అపతిహత - సంకపస వాసిఠి
పుతస ఇఖాకుస సిరి చాతమూలస "

C 3 E 1 Vol XX

మరియొక శాసనము వలన ఈతడు వాజపేయాశ్వమేధాగ్నిష్టోమాగ్నిహోత్ర యాగములను చేసినట్లు తెలియుచున్నది.

"1. సిధం నమో భగవతొ బుధస చెతియఘర మహా
రాజస విరూపాఖపతి - మహా
2 సెన పరిగహితస అగిహోతాగి ధోమ - వాజపెయా
సమెధ యాజిస అనెక—హిరణ కోటి గొ.
సతసహస - హసతసహసపదాయిస సవధెసు అపతిహత సంకపస -
వాసెఠి పుతస ఇఖా కులస
E. E. 1 Vol XX

వాజపేయ యాగము మహా శక్తిసంపన్నుడైన రాజు మాత్రమే చేయగలుగును. అశ్వమేధ యాగముచేయు రాజు తక్కుంగల రాజులను జయించవలెను. శాంతమూల మహారాజు స్వాతంత్ర్యము వహించుటయేగాక ఎంతోమంది రాజులను, మండలాధిపతులను జయించి, యజ్ఞము లొనర్చి సార్వభౌమాది బిరుదములను పొందెనని తెలియుచున్నది. శాసనములందీ రాజు దక్షిణాపథ చక్రవర్తిగా పేర్కొనబడినాడు.

శాంతమూల మహారాజు రాజ నీతి చతురుడు. బలవంతులైన రాజులతో ఈతడు సంబంధ బాంధవ్యముల నెరపెను. ఈతడు మారరీ గోత్రవతి యగు విప్ర కన్యను వివాహమాడెను. తన సోదరి యగు శాంతిశ్రీని పూగి వంశీయుడగు స్కందశ్రీ కిచ్చి వివాహ మొనర్చి ఆతనికి 'మహాతలవర' మహా సేనాపతి పదవుల నొసంగెను. తన కుమార్తె యగు అడవి శాంతిశ్రీని ధనకుల తెగకు చెందిన స్కందవిశాఖనాగున కిచ్చి యుద్వాహ మొనర్చుటయేగాక, అల్లునికి మహా తలవర, మహా సేనాపతి, మహా దండనాయక పదవుల నిచ్చెను. తన కుమారుడగు వీర పురుష దత్తుని వివాహము శక రాజగు రుద్రసేనుని పుత్రిక యగు రుద్రధర భట్టారికతో జేసెను. ఇట్లు రాజకీయ బాంధవ్యముల నెరపి, తన సామ్రాజ్యమున కెట్టి యాపద రాకుండ చూచుకొని తన రాజ నీతిజ్ఞతను ఉపయోగించుకొనెను.

మొదటి శాంతమూలుడు నాగార్జున కొండ శాసవములందు మహారాజుగ వర్ణింపబడినాడు. అశ్వమేధాది క్రతు నిర్వహణము వలన సార్వభౌముడైనాడు. ఇతని పుత్రుడును మహారాజుగ పేర్కొవబడినాడు. నాగార్జున కొండ శాసనములందు ఈ రాజులకు

మహారాజ శబ్దమును, దాన కాలము చెప్పబడునపుడు 'రాఞో' అను శబ్దమును వాడబడినది.

1, "....  మహా చెతియె మహారాజస  "

C 3.

2. "1 సిధం మహారాజస అనమెధ - యాజిస  "

B 2

3 "2  పరిగ హితస మహా చెతియె మహారాజస  "

C 2.

4. "2 – పరిగం హితస మహా చెతియంహి మహారాజస  "

C 4

5 "11  సెల మంటవం పతిఠాపితం రాఞో సిరివిర"

12 పురిసదతస__________"E

E I Vol XX

ఇక్ష్వాకు రాణులకు మహాదేవి యను బిరుద మున్నట్లు తెలియుచున్నది.

రాజులు సత్కార్యములు చేయునపుడు, రాజకీయములకు సంబంధించిన ముఖ్య ప్రకటనములు చేయునపుడు రాణులు వెంట నుండెడివారు. కాని రాణులకు, రాణివాసపు స్త్రీలకు, రాజ వంశమునకు చెందినవారికి మత విషయకముగ సంపూర్ణ స్వాతంత్ర్యముండెను వైదిక మతావలంబియు, వైదిక మతోద్ధారకుడును నగు మొదటి శాంతమూలుని సోదరీమణులును కుమార్తెలును బౌద్ధ మతాను రక్తలు. వీరు బౌద్ధ మతము నాదరించి. పోషించి, విహారములను నిర్మించి రనుటకు నాగార్జున కొండ యందు లభించిన శాసనములే తార్కాణము.

ఇక్ష్వాకుల పరిపాలన సాగిన కాలమున ఆంధ్ర దేశము శాంతి సౌఖ్యముల కాలవాలమై యుండెను.

ఇక్ష్వాకులు సాతవాహనుల కాల మందున్న పరిపాలనా పద్ధతుల నవలంబించిరి. ఇక్ష్వాకులు మహా సామ్రాజ్యాధినేత లనుటకు, వీరి సామంతుల పేర్లు, శాసనములం దగుపడుచున్నవి

సామ్రాజ్యాలన కంతటికి రాజు సర్వాధికారి. ఇతనికి సామంత మాండలికులు, రాజోద్యోగులు సహాయపడుచుండిరి. ఉద్యోగుల యొక్క బిరుదములు వారి స్త్రీలకును వాడబడుచుండెను. మహా తలవర, మహా సేనాపతి, మహా దండనాయక అను బిరుదములు గల వారి స్త్రీల పేర్లకు ముందు మహా తలవరి, మహా సేనాపతిని అను నవి యుండెను.

మొదటి శాంతమూలుని చెల్లెలు శాంతిశ్రీ. ఆమె భర్త వాసిష్టీ పుత్ర స్కందశ్రీ. స్కందశ్రీ పూగియుల శాఖకు చెందిన వాడు. మహా తలవర, మహా సేనాపతి, పదవుల నితడు నిర్వహించెను. శాంతిశ్రీకి 'మహాతలవరి' యను బిరుద ముండెను.

I—6 "——మహాసేనాపతిస

7. మహాతల వరస వాసిరీపుత పూకీయానం ఖంద సిరిస
ఖారియా సమణ

8, ధారపదాయిని సవ సాధువచ్ఛలా మహదీన పతిని
మహాతలవరి ఖంద సాగరమ్మక

9, మాతా చాతిసిరి——"C 3.

II —5. "పతరాపత‹ మహాతలవరిఃచ పూకీయావం చాంతిసిరినికాహి

III—5. "ఖంద సిరిస భారియా ఖందసాగరంమ్నక మతా ఛాతిసిరి
———" E

Prakrit Inscriptions from Nagarjunakonda
E I Vol. XX

మొదటి శాంతమూలుని కుమార్తె అడవిశాంతి(శ్రీ) భర్త మహాతలవర, మహా సేనాపతి మహా దండనాయక స్కంద విశాఖ ణ్ణకుడు, ధనకుల శాఖకు చెందినవాడు.

3. "సిరి ఛాంతమూలస దుహుతా రాఞో సిరి
విరిపురిస దతస భగిని మహా సేనాపతిస మహా

4. తలవరస మహాదండనాయకస ధనకానం ఖంద
విశాఖమ్నకస భయ మహా తలవరి

5. అడవి ఛాతి సిరి————————"

B. 2. E. I. Vol XX

హిరణ్యకుల తెగకు చెందిన వాసిష్ఠీపుత్ర స్కందచిలికి రమ్మ ణకుడు మహాసేనాపతి మహాతలవర పదవులను నిర్వహించినాడు. ఇతని భార్య మహా సేనాపతిని చుల శాంతి(శ్రీ).

4. "—మహా సేనాపతిస మహా తలవరస వాసిఠీపుతస
హిరణ్ణకానం ఖం

5. ద ఛలికి రేణ్ణకస భయ మహా సేనాపతిని చుల
చాతి సిరిణిక"

B. 4, E. I Vol. XX

పూగియుల తెగకు చెందిన వాసిష్ఠీ పుత్ర మహా స్కంద(శ్రీ) మహా తలవరి, మహా సేనాపతిని విష్ణు(శ్రీ) భర్త. ఇతడు మహా సేనాపతి మహా తలవర పదవులను నిర్వహించెను.

2. "మహా సేనాపతిస మహా తలవరస వాసిరీపుతస
   పూకియానాం మహా ఖంద స్విరిస

3. భయ మహాసేనాపతిస మహాతలవరస
   విణ్హు సిరిస మాతా మహాతలవరి అపనో
   — ———————" C. 5. E. 1. Vol. XX

మహాసేనాపతి బిరుదముగలవారు సాతవాహనుల పరిపాలనా కాలమున నున్నట్లు శాసనములవలన తెలియు చున్నది. పులోమావి మ్యాకదోని శాసనమువలన స్కందనాగుడు శాతవాహనీ విహార మునకు మహాసేనాపతిగ నుండెనని తెలియుచున్నది[1].

మహాతలవర బిరుదము ఇక్ష్వాకుల శాసనములందేగాక, జయ వర్మ, అనంతశక్తివర్మ శాసనములందును, అల్లూరు శాసనమందును కన్పించుచున్నది.

మహాతలవరులు 18 మందిగణరాజులలోని వారుగ ప్రాచీన జైన వాఙ్మయమున పేర్కొన బడినారు[2]. ఈ మహా తలవరులు అభిషిక్తులగు సామంతులు. ఒకేవ్యక్తి మహాసేనాపతిగను,

---

1. Epigraphia Indica Vol XIV

2. The Mahatalavaras are mentioned in early Jaina Literature along with eighteen Ganarajas So Mahatalavaras must be taken as a title of nobility. Cf Kalpasutra (ed Jacobi Leipzig 1879) 61, 11 21-25 The Subodhika, a Sanskrit Commentory on it by Vinaya Vijaya (Nirnaya sagara Press, Bombay leaf 60, 11 6-7) explains the term TALAVARA thus - talavarah - Tushta - bhupala - Pradatta - Pattabandha - Vibhushita Rajasthaniyah. In the Punjab there is a sub division of high class Khatris (=Sanskrit Kshatriya) which goes by the name of Talavara) E. I. Vol. XX P. 7.

మహాతలవరిగను ఈకాలమున వ్యవహరించినాడు. అనగా ఇద్దరు చేయు బాధ్యతాయుత మైన పనులనొక్కడే చేయుచుండెనని తెలియుచున్నది. ఇట్లుచేయుటకు తగినవాడు మంచిసమర్థుడు ఐయుండవలెను.

మహాదండనాయకుడనగా రాజ్యమునందుండు అన్నివిధముల సైన్యముల కధ్యక్షుడని తెలియుచున్నది.

మహా దండనాయక, మహాతలవర, మహాసేనాపతి అను పదవులందుండువారేకాక కోష్టాగారికుడను ఒక ఉద్యోగియు ఇక్ష్వాకుల కాలమునం దున్నట్లు తెలియుచున్నది [1].

అమాత్యు డను వాడును ఆ కాలమున ఉన్నట్లు నాగార్జున కొండలలోని శిల్పములను బట్టి తెలియుచున్నది.

ఇక్ష్వాకులు పాలించిన రాజ్యము పెద్దదేయని చెప్పవచ్చును. వీరికి సామంతులు, మాండలికులు ఉండిరనియు, నాడు బలవంతులన బడు రాజులతో సంబంధ బాంధవ్యములు నెరపుటవలనను, మహాతలవర, మహాసేనాపతి,మహాదండనాయక బిరుదములు కలవారు పలువురుండుట వలనను. సామ్రాజ్యము రాష్ట్రములుగా విభజింపబడి మహాతలవరాదులా యారాష్ట్ర పాలకులుగా నియమింపబడి పరిపాలించు చుండిరని చెప్పవచ్చును. రాష్ట్రముల విభజనమే లేకున్న ఒక మహాతలవర, ఒకదండనాయకుడు, ఒకమహాసేనాపతి రాజ్యమునకు సరిపోవుదురు జగ్గయ్యపేట శాసనమువలన కర్మకరరము లేక కర్మ రాష్ట్రమను పేరు తెలియుచున్నది. ఇక్ష్వాకుల రాజ్యమున పూగి రాష్ట్రము,హిరణ్యరాష్ట్రములు చేరియుండెనని, పూగీయుల, హిర

1. Epigraphia Indica Vol XX P. 7.

ణ్వాకుల ప్రశంస శాసనము లందుండుట వలన యూహింప వచ్చును ఇతర శాసనములవలన ఇక్ష్వాకుల రాజ్యమునందు కుడూర హారము అంధపథము అనురాష్ట్రములును తెలియుచున్నవి

ఇక్ష్వాకుల పరిపాలనము సమర్థవంతముగ నుండెను రాజులు మతవిషయములందు సహనభావము కలిగియుండిరి సాతవాహనుల కాలముననున్నట్లే రాజవంశపుస్త్రీలు, రాజులుచేయు సత్కార్యము లందు పాల్గొనుచుండిరి నాగార్జున కొండలోని శిల్పముల నను సరించి స్త్రీలు పురుషులతో సమానముగ ధర్మకార్యములందు పాల్గొనుచుండిరనియు మతవిషయమున వారికి స్వేచ్ఛవుండెననియు తెలియుచున్నది తలవర శబ్దము తెలుగు శబ్దము "నేడు 'తళారి' అను పదము గ్రామపు కాపరి అను అర్థమున వాడబడుచున్నను ఇక్ష్వాకుల కాలమున గొప్ప పదవిని సూచించు శబ్దముగా వాడబడినది. 'ధర్మనిర్ణేత' 'ప్రధాన న్యాయమూర్తి' అను ఉద్దేశమున నాడు వాడబడినదని" శ్రీ ఖండవల్లి వారి అభిప్రాయము [1].

ఇక్ష్వాకుల పరిపాలనము ఆంధ్ర దేశమున 52 సంవత్సరములు వర్ధిల్లినది. అనంతరము ఆంధ్ర దేశము పల్లవుల యధీనములోనికి వచ్చినది

ఆర్థిక వ్యవస్థ -సాతవాహనుల కాలము నందున్న ఆర్థిక వ్యవస్థ ఇక్ష్వాకులకాలము నందుండెను సాతవాహన వంశ మంతరించగనే ఇక్ష్వాకులపరిపాలన మారంభమైనది స్త్రీలు సంఘమున గౌరవము వడయుచుండిరి ఇక్ష్వాకులకాలమున ప్రజలు ధనమును సత్కార్యములకు వినియోగించుచుండిరి. స్త్రీలు నాగార్జునకొండయందు విహారములను, మండపములను నిర్మించిరి. మొదటి శాంతమూల మహారాజు

1. ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి P. 145.

చేసిన యజ్ఞములందు అతడు అనేక కోటి హిరణ్య గోహాల సహస్ర ములను దానము చేసినాడని శాసనములవలన తెలియుచున్నది. ఆ కాలమున సుస్థిర గ్రామ జీవితము ఉండెను. సాతవాహనుల కాలములోవలెనే వివిధ వృత్తులవారు పల్లెలయందుండిరి. నాడు వర్తక వ్యాపారము విశేషముగా జరుగుచుండెను. సుస్థిరమైనపరి పాలనావ్యవస్థ యేర్పడుటవలన ఆంధ్రదేశవర్తకులు సాహసవంతులై యుండుటవలన విదేశవ్యాపారము ఆనాడు విరివిగా సాగినది. నాడు వర్తకులు క్రయ విక్రయములు సాగించుచు వివిధ ప్రాంతములతో వ్యాపారము చేయుచుండిరి. గ్రీసు, రోము, ఈజిప్టు మున్నగు పశ్చిమదేశములతోను, బర్మా, సయాం, చీనా మొదలగు ప్రాగ్దేశముల తోను, ప్రాక్సముద్ర ద్వీప సమూహముతోను నాటుమార్గమునను సముద్రయానము వలనను వర్తకము చేయుచుండిరి వాణిజ్యమువలన భారతీయ సంస్కృతి అందు ముఖ్యముగా ఆంధ్ర సంస్కృతి విదేశము లలో వ్యాపించినది. నాగార్జునకొండ బౌద్ధమత ముఖ్య కేంద్రముగా నుండుటవలన కాశ్మీర, గాంధార, చిన, చిలాత, తోసలి, అపరాంత, యవన, ధమిల, వనవాసి, వంగ, పాలూర, తామ్రపరిణి మొదలగు భారతీయబౌద్ధ కేంద్రములనుండియు సింహళము, మలయా, చైనా ప్రాంతములనుండియు, బౌద్ధభిక్షువులు, బౌద్ధతీర్థములను సేవించుటకు వచ్చిన ప్రజలు ఆంధ్ర దేశమున లభించు దైనందినోపయోగ వస్తు సమూహమును కొనుచుండిరి. హాల సహస్ర ప్రదాత యగు మొదటి శాంతమూల మహారాజు వ్యవసాయమునకు అనుకూలముగా నుండు నట్లు అడవులను కొట్టించి, హాల క్షేత్రములను దానము చేసి వ్యావ సాయాభివృద్ధికి తోడ్పడెను. ప్రజలు వ్యవసాయమును ముఖ్య వృత్తిగా స్వీకరించి పంటలు పండించి సుఖమయ జీవితము గడుపు చుండిరి.

నాణెములు - ఇక్ష్వాకుల కాలమున వాడుకలోనున్న నాణెములు సువర్ణము, సీసము, పోటిన్ అను లోహములతో తయారు చేయబడినవి. వీరి నాణెములపై సింహాపు గుర్తు ఉండును. మొదటి శాంతమూల మహారాజు అశ్వమేధాధి యాగములను నిర్వర్తించి, క్రొత్త నాణెములను ముద్రించినాడని తెలియుచున్నది. ఇక్ష్వాకుల రాజ్య మందలి కృష్ణా, గుంటూరు, గోదావరి మండలములందు సింహాపు ముద్ర గల నాణెములు పెక్కు లభించినవి. వీటిలో కొన్నిటిపైన 'సామిస' అను అక్షరములును, కొన్నిటి పైన మాఢ-స' అను అక్షరములును కన్పించుటవలన మొదటి అక్షరము లున్న నాణెములు మొదటి శాంతమూలుని కాలమున ముద్రించినవనియు, రెండవ అక్షరములు గల నాణెములు మాఢరీపుత్ర శ్రీ వీర పురుషదత్తుని కాలమున ముద్రించినవనియు ఊహింపవచ్చును.

ఇటీవల లభించిన ఇక్ష్వాకు శాసనము ననుసరించి - ఆ కాలపు కొన్ని నాణెముల పేర్లు తెలియుచున్నవి. ఒక శాసనమునగల 'పంక్తిలో "అఖయనివికాదతా" అను భాగమున్నది. (అక్షయనీవికా దత్తా) ఏదో ఒక బౌద్ధ సంస్థకు అక్షయమైన నిధి ఏర్పాటు చేయబడినట్లు తెలియుచున్నది. ఈ శాసనమునందు గల ఆరేడు పంక్తులలో.

"పెచ (అఖయినివి) దీ నారిమాస
(కానం) దివఢం స (తం) సుపయితం"

అను భాగ మున్నది.

ఇందలి-దివడం = దివఢ,
పాలీ భాషలో దియడం = దియడ్డ = దివడ్డ
దివడ = $1\frac{1}{2}$

ఏదో నొక బౌద్ధ సంస్థ కొఱకు అక్షయనిధి నూట యేబది దీనార మాషికములతో ఏర్పరుపబడినట్లు తెలియుచున్నది.

దీనార మాషక పదములు సంస్కృత పదములు. ఇవి నాణెముల పేర్లు.

మహాతలవరి శాంతిశ్రీణిక నాగార్జున కొండలోని మహా చైత్యమున ఒక శిలా స్తంభము నెత్తించి నూట డెబ్బది దినారి మాషికముల నిచ్చెనని నాగార్జున కొండలోని ఒక శాసనము వలన తెలియుచున్నది.

"5——మహాతలవరిహి చ పూకియానం
ఛాంతిసిరిణి కాహి ఇమసమహా విహారస.
6. మహాచెతీయం సముధపి యమానె
మహాతలవరీయ ఉభయిలూ
దీనారి మాసికా సతరి సతం
7. 100 + 70 ఖంభొచ.——"

B5 E, I Vol XX P I9

'దీనారు' అనునది 'దినేరియస్' అను లాటిను పదమునకు సంస్కృతీకరణము,

ఈ కాలమున వాడుకలోనున్న నాణెములలో సువర్ణము, మాషకము, దీనారు అనునవి ముఖ్యమైనవి.

16 మూషకములు = 1 సువర్ణము
16 ఫనములు = 1 దినేరియస్

'ఫనం' అను నాణెము దక్షిణ భారతమునం దానాడు వ్యాప్తిలో నుండెను.

ఈ శాసనము వలన 'కోలిక' అను పద మానాడు వాడుకలో నున్నట్లు తెలియుచున్నది. కులికయన శ్రేణీపతి. శ్రేణుల వశమున ఆనాడు నిధుల నేర్పాటు చేయుచుండిరి. ఈ నిధి కూడ అట్లే పర్పాటు చేయబడిన దనవచ్చును.

**మత పరిస్థితులు** –ఇక్ష్వాకులకాలమున వైదికమతము ఉద్ధరింపబడి, బౌద్ధము పోషింపబడి, జైనము ఆదరింపబడినది.

**వైదిక మతము** – మొదటి శాంతమూల మహారాజు వైదిక మతోద్ధారకుడు ఇతడు విరూపాక్షపతి యగు మహాసేనుని భక్తునిగా శాసనములలో వర్ణింపబడినాడు శివుని కుమారుడు స్కందుడు. స్కందునికి మరొక పేరు మహాసేనుడు.

3, "――――――మహారాజస విరూప
ఖపతి మహాసెన పరిగహితస హిరణకొటిగొ
శతసహస హలస తాసాహస దాయిస
సవధేసు అపతిహత సంకపస వాసిరీపుతస ఇఖాకుస
ఇఖాఒుస సిరి ఛాతమూలస――――――"
C 3 E I Vol XX

ఇతడు అశ్వమేధమును, వాజపేయాగ్ని ష్టోమాగ్ని హోత్ర యజ్ఞములను చేసినట్లును ఆ యజ్ఞ సమయము లందును అనేక కోటి హిరణ్యములను, గోవులను, హల క్షేత్రములను దానము చేసినట్లును శాసనములవలన తెలియుచున్నది.[1]

శాంతమూలుని హిరణ్య కోటి దానమును సూచించు దృశ్యముగల శిల్పము నాగార్జున కొండలో లభించినది. ఇతడు

---

1 E 1. Vol. XX Prakrit Inscriptions from Nagarjunakonda Nos C₂ B₂ C₄ E.

బహు యాగములను చేసినవాడు. అశ్వమేధ వాజపేయాది యాగములు సామాన్య రాజులు చేయలేరు. దేశములోని రాజ్యములను జయించిననేగాని ఆ యాగములు పరిసమాప్తి నొందవు. మొదటి శాంతమూలుడు దక్షిణాపథపతిగా శాసనములందు పేర్కొనబడుట వలన శక, ఆభీర, యవన, గర్దభిల, మురుండ మున్నగు జాతుల వారిని జయించి అస్మక, ముళక, కోసల, కళింగాది రాజ్యములను తనసామ్రాజ్యమున జేర్చుకొనెను. వైదిక మతోద్ధరణకై అశ్వమేధాది క్రతువుల నొనర్చుటయేగాక క్రొత్త గ్రామములను బ్రాహ్మణ నివాసార్థము నిర్మించి ఉత్తరాపథమునుండి నివాసార్థము వచ్చిన బ్రాహ్మణులకు శత సహస్రాధిక హల దానము చేసెనని చెప్ప వచ్చును. ఇతడు మారరీ గోత్ర సంభవ యగు విప్ర కన్యను వివాహమాడుట వలన ఈతడు బ్రాహ్మణు డనవచ్చును. భండార్కర్ ప్రభృతులు ఇక్ష్వాకులు క్షత్రియులని చెప్పినారు. కాని మొదటి శాంతమూలుడు అగ్నిష్టోమ యాగమును చేసినట్లు తెలియుచున్నది. అగ్నిష్టోమ యాగమును బ్రాహ్మణులు మాత్రమే చేయుదురు. ఒక వేళ అట్టిదానిని క్షత్రియు లాచరించిన ఆ యజ్ఞము జ్యోతిష్టోమ మనబడును.

నాగార్జున కొండలోని ఒకశిల్పమున రాజోచిత వస్త్రాలంకార భూషణుని కుడిచేయి పైకి ఎత్తబడి వామహస్తము కటిపైనున్నది. ఎడమవైపున గజము, హయము వస్త్రాలంకార భూషితులగు నిరు వురుద్యోగులు, కుడివైపున ఒకగుఱ్ఱము ఇద్దరుస్త్రీలును, పైభాగమున చక్రము కంఠాభరణమును, దిగువ ఒకకుబ్జుడు చిత్రింపబడి యున్నారు. ఇందలిరాజు మొదటి శాంతమూలుడు. అశ్వమేధ వాజపేయాది యాగములను ఆచరించిన పిదప ఈతడు సముచిత

పరివారముతో తన సార్వభౌమత్వమును ప్రకటించుచున్నట్లున్న దృశ్యమిది

నాగార్జున కొండలోని ఒక స్థూపమున లభించిన స్తంభము పైన గల శిల్పమున ఒక బలిష్ఠమైన వ్యక్తి వామ హస్తమున దండమును ధరించి, కుడిచేతిని మరియొక వ్యక్తి చేతిలోని కలశముపై నుంచినాడు. సేవకు డొకడు ఛత్రము పట్టినాడు ఒక రాజ స్త్రీ ముప్వురు వ్యక్తులు ఒక యువకుడును శిల్పమునందు కలరు ఈ వ్యక్తుల ముందు చిన్న చిన్న ముద్రల రాశి వుండుటవలన ఇది శాంతమూలుని హిరణ్య కోటి దానమును సూచించు దృశ్యము కావచ్చును. మరియొక శిల్పమున రాజు రాణి అసీనులై యుండ సేవకుడు గోవును తోలుకొని వచ్చుచున్నట్లును, ఒక స్త్రీ ఆవు ముఖమున తిలకము దిద్దుచున్నట్లుండుటవలన, అది శాంతమూలుని యొక్క గోదానములను సూచించు శిల్పమై యుండవచ్చుననియు తలంచవచ్చును. యాగములను పరిసమాప్తి కావించిన పిదప శాంతమూలుడు గజము నధిరోహించి ఊరేగినట్లు చిత్రింపబడిన శిల్పములు నాగార్జున కొండలో లభించినవి.

మొదటి శాంతమూలుడు వైదికమతానుయాయియైనను పర మత సహనము కలవాడు. ఇతని అంతఃపుర స్త్రీలు బౌద్ధ మతమును ఆదరించి పోషించుటయేగాక నాగార్జున కొండలోని బౌద్ధ విహారములలో కొన్నింటిని నిర్మించిరి. కొన్నిటికి మండపములను, మరి కొన్నిటికి చైత్యాలయములను నిర్మించుటకు గావలసిన ధనమును వెచ్చించిరి.

వైదిక మతోద్ధరణమునకు బూనుకొని యజ్ఞయాగాదుల నాచరించి, బ్రాహ్మణులకు అనేక కోటి సువర్ణ గోశత సహస్రహల

పదానము గావించిన మొదటి శాంతమూల మహారాజు కాలమున బ్రాహ్మణమతముతో బాటు బౌద్ధము సైతము ప్రాముఖ్యమువహించి నది. మాఢరీ పుత్ర శ్రీవీరపురుషదత్తుడు మొదట వైదిక మతాభి మానియే యైనను తరువాత బౌద్ధ మతమును స్వీకరించి, వైదిక మతమును నిరసించెను. ఇట్లు ఇక్ష్వాకువంశీయులపాల నారంభ కాలమున వైదిక మత మాంధ్రదేశమున వ్యాపించినది. ప్రజలు మత సహనము కలిగి కలిసి మెలిసి జీవించుచుండిరి.

బౌద్ధము – ఇక్ష్వాకుల కాలమున బౌద్ధ మతము మహోన్నత స్థితి యందుండెను. నాగార్జున కొండ ఆనాడు ప్రసిద్ధ బౌద్ధ తీర్థము. ఈ కాలపు శాసనములవలన బౌద్ధమతమునకు సంబంధించిన పెక్కు విషయములు తెలియుచున్నవి. మొదటి శాంతమూల మహారాజు పిమ్మట అతని పుత్రుడు మాఢరీ పుత్ర శ్రీవీరపురుషదత్తుడు రాజ్య మునకు వచ్చెను శాంతమూల మహారాజువలె ఈతడు ప్రతిభావంత ముగ రాజ కార్యములను నిర్వహించినట్లు తోచదు. కాని తండ్రి సంపాదించి యిచ్చిన సామ్రాజ్యమును మాత్రము కాపాడుకో గలి గెను. వీరపురుషదత్తుడు మొదట వైదిక మతాభిమాని. రాజ్యాధి కారమునకు వచ్చిన పిమ్మట మొదటినుండియు బౌద్ధ మతము నాద రించి పోషించిన ఇతని మేనత్త యగు శాంతిశ్రీ ప్రోత్సాహము నను, మరియొక మేనత్త యగు హమ్మశ్రీ, భార్యలగు బాపిశ్రీ, ఛటశ్రీ ఖండసాగరంమ్మనకల ప్రోత్సాహమున వైదిక మతమును నిరసించి, బౌద్ధ మతమును స్వీకరించినట్లు నాగార్జున కొండలోని శిలాశాసనములనుబట్టి తెలియుచున్నది.

వీరపురుషదత్తుని కాలమున నాగార్జున కొండలో బౌద్ధులు, బౌద్ధ మత సంబంధమైన సంస్థలు విశేషముగ నాదరింపబడినవి. ఇచట మహాచైత్యము వీరపురుషదత్తుని ఆరవ రాజ్య సంవత్సరమున

భదంతఆనందునిచే పునరుద్ధరింపబడినది అప్పుడే ఈ మహాచైత్యము సుందర శిల్పములతో శోభాయమానముగ జేయబడినది.

నాగార్జున కొండలోని మహా చైత్యము పునరుద్ధరింపబడుటలో రాణులు, రాజపుత్రికలు, బోధిశ్రీయగు నామెయు తోడ్పడినారు. నాగార్జున కొండలో లభించిన శాసనములవలన అచటి మహాచైత్యము ఉద్ధరింపబడినదని, విహారములు, మండపములు నిర్మింపబడినవని తెలియుచున్నది.

1. నాగార్జున కొండలోని మహా చైత్యము జీర్ణోద్ధారము చేయబడినదని తెలియుచున్నది (శ్రీ) వీరపురుషదత్తుని ఆరవ రాజ్య సంవత్సరమున భదంత ఆనందుడను ఆచార్యుడు ఈ మహా చైత్యమును పునరుద్ధరించినాడు

1 "ఆచరియానం అపర మహానివసెలి యానం
సుపరిగహితం ఇమం మహాఛేతియ

2, నవ కమ్మం పంణగామ షథవానం దిఘ-
మఝిమ - పంచమాతుక బసక

3 వాచకానం ఆచరియానం అయిర హరి ఘానం
అంతెవాసికెన దిఘమఝిమ

4. నికాయి - ధరెన భజంత ఆనదెన నిధపితం
ఇమం నవకమం మహా చెతియం ఖంబా

5 చ ధాపితా తి రాజ్ఞో సిరివిర పురిస
దతస సవ 6వ ప 6 "

దివ 10

Cl. E. I. Vol. XX P. 17,

మరియొక శాసనమువలన భదంత ఆనంద భిక్షువు పర్యవేక్ష ణమున నాగార్జున కొండలోని మహా చైత్య నవకర్మ జరిగెననియు, చైత్యమునందు ఆయక స్తంభములు ఎత్తబడినట్లు తెలియుచున్నది.

8. "——ఇమం మహాచెతియ - నవకమం
పంణగామ

9. వధవానం ధిష - మఝిమ పండమాతుక
దెసక - వా - భకానం అరయానం

10. అయిర - హఘానం అంతె వాసికెన దిఘ మని
గయ ధరెన భదంత ఆనందెన -

11. నిరాపితంఇమం నవకమం మహా చెతియం
ఖమ్భా చ రాపితాతి రాఞ్ఞో సర

12. విరిపురి సదతస - సంవ 6 వా. ప 6 డివ 10"
C. E I Vol. XX P 19 and 20.

నాగార్జున కొండలోని మహా చైత్యము వద్ద, మొదటిశాంత మూలుని సోదరి శాంతి(శ్రీ) చతుశ్శాలాయుక్తమగు శిలా మంటప మును నిర్మించెను.

8. "——మహా చెతియ పాదమూలె పవ జితానం
నానాదెస సమనాగతానం

9. సద సాధూనం మహాభిఖు సంఘస అపనొచ
ఉభయఖకులస అతిచ్ఛితమ నాగత

10. వటమానకె నికపనికె చ పరినామెతో వం
అపరమహానివసె లియానం పరి గహెంవవ

11. నియుతం చాతుసల పరిగహితం సెలమంటవం
పతిరాపితం——"

E. E. I. Vol. XX P. 21.

విజయపురికి ప్రాక్భాగమున శ్రీ పర్వతముపై క్షుద్ర ధర్మగిరి పైన నున్న విహారమునం దొక చైత్య గృహమును బోధిశ్రీ యను బౌద్ధ గృహస్థ భక్తురాలు, నెలకొల్పుటయేగాక, ఆవిహారమందలి నేలభాగమును రాతితో చదునుచేయించి, సమస్త వస్తువులనందుసమ కూర్చెననియు, కులహ విహారమున చైత్యగృహమును సింహాళ విహారమునందున్న బోధివృక్షమున కాలయమును, మహాధర్మగిరిపై నొక కొట్టును మహా విహారమున ఒక మండపమును నిర్మించినట్లు నాగార్జున కొండలోలభించిన ఒక శాసనమువలన తెలియుచున్నది 1.

అట్లే మహాతలవరి శాంతిశ్రీ, ఇతరులును కలసి ఒక విహార మునకు చెందిన మహాచైత్యమును నిర్మించినారని నాగార్జునకొండ శాసనమువలన తెలియుచున్నది.

3. "——మహాచెతియె ఉజనికా
మహారబలికా

4, మహాదెవి రుద్రధర భటారికా ఇమం నెల
ఖం భం ఆపనొహిత సుఖ నివాణధనాయ

5, పతిరాడితం మహాతలవరిహి చ పూకి
యానం చాంతిసిరిని కాహి ఇమస మహా విహారస

6, మహా చెతీయం సముధాపియ మానె మహా
తలవరియ ఉభయి తారి నారి మాసక సతరి సతం"

**B 5 E. I Vol XX P 19**

దేవీ విహారమును బహు శృతీయ భిక్షువుల కొఱకు మహా దేవీ భటి దేవరాణి నిర్మించెను.

---

1. Prakrit inscriptions from Nagarjunakonda
No. F. E. I Vol XX P. 22

వీరపురుషదత్తుని పుత్రి యగు మహాదేవి కొడబలిశ్రీ ఒక విహారమును నిర్మించినట్లు నాగార్జున కొండ శాసనములలోని H నంబరు గల శాసనము వలన తెలియుచున్నది.

ఇక్ష్వాకులు పాలించిన కాలమున నాగార్జునకొండ బౌద్ధ మతమునకు ముఖ్యకేంద్రమగుట వలన ఈ బౌద్ధ క్షేత్రమును సందర్శించుటకు అనేక దేశముల నుండి బౌద్ధ భిక్షువులు, ఉపాసకులు, భిక్షుకీగణము వచ్చుటవలన నాగార్జున కొండలో బుద్ధ ధాతువుపై నిర్మితమైన మహా చైత్యము బౌద్ధులకు ఆరాధ్యమయ్యెను.

ఈ ప్రాంతమున అపరమహావిన శైలీయులు, మహిశాసకులు బహశ్రుతీయులను బౌద్ధ శాఖీయులు నివసించుచుండిరని $C_1$, $C_3$, $M_2$, $M_4$, H, G, $G_2$, $G_3$ నంబర్లుగల శాసనములవలన తెలియుచున్నది.

బోధిసిరి యను బౌద్ధ భక్తురాలు వేయించిన శాసనములవలన కాశ్మీర, గాంధార, అపరాంత, వంగ, వనవాసి, దమిల, చిన, చిలాత, తోసలి, పాలూర, తామ్రపర్ణి మున్నగు ప్రాంతములందు బౌద్ధ మత ప్రచారము గావించు సింహళ భిక్షువులు నాగార్జున కొండలలో నివసించినట్లు తెలియుచున్నది. అన్య ప్రాంతములనుండి వచ్చిన యాత్రికులును ఈ సుప్రసిద్ధ బౌద్ధ క్షేత్రమున నివసించుచుండిరి.

వీర పురుషదత్తుని కాలమున బౌద్ధ మతము బాగుగా వర్ధిల్లినది. ఈ మహారాజు బ్రాహ్మణ మతమును ధిక్కరించి బౌద్ధ ధర్మమవలంభించినట్లు నాగార్జునకొండలో లభించిన శిల్పములనుబట్టి తెలియుచున్నది. ఒక శిల్పము నందొక రాజు ఎడమ చేతిని నత్తు

మున కాన్చి, కుడి మోకాలిపైన పిడికిలి బిగించి కుడి చేతి నుంచి ముందుకు వంగి ఏడు పడగల నాగుబాము మధ్యనగల లింగమును కుడి పాదముతో త్రొక్కుచున్నట్లు చిత్రింపబడినది. కుడి చేతి తర్జని వ్రేలును పై కెత్తి నిషేధించుచున్నట్లు ఒక వ్యక్తి, అతని ప్రక్కగ కట్లలతో నున్న ఇద్దరు వ్యక్తులు, మరిద్దరు చేతులు పైకెత్తి అఱచు చున్నట్లును చెక్కబడినది ఈ శిల్పము వీర పురుషదత్తుని బ్రాహ్మణ మత నిరసనమును తెల్పును.

మరియొక శిల్పమున రాజు, అతని వెనుక ఛత్రవాహకుడు సేవకుడు, చిత్రింపబడినారు. రాజు ఎడమ చేయి నడుము పైనను, బిగబట్టిన కుడి చేయి కుడి మోకాలిపైనను, రాజు దక్షిణ పాదము పిడకిలి నాగ గర్భమందున్న శివలింగముపైనను ఇట్లుచిత్రింపబడినది. ధనుర్ధారులగు ముప్వురువ్యక్తులు రాజుముందర నిలబడినట్లును, అతని వెనుక వస్త్రములను, ఆభరణములను ధరించిన అమాత్యుడును, చెక్కబడినారు.

ఇంకొక శిల్పమున ఎడమ కుడి భాగములందు రెండు సంఘటనలు చూపబడినవి. ఎడమవైపున నున్న శిల్పమున రాజు నడుమునకు రెండు చేతుల నాన్చి, వంగి, కుడిపాదముతో నాగ గర్భస్థ శివ లింగమును త్రొక్కు చున్నట్లును, అతని వెనుక ఇద్దరు స్త్రీలు హస్తములు మోడ్చి నిలిచి యున్నట్లును పై భాగమున అశ్వము, గజము, ధర్మ చక్రయుక్త శూన్య సింహాసనమును, చిత్రింపబడినవి. శిల్పము నందలి దక్షిణ భాగమున బోధిసత్వుడు సింహాసన మధిష్టించ, అతని ఎదుట నిలబడిన రాజు, ఏదియో చెప్పుచున్నట్లును, బోధిసత్వుని పాదముల ముందు కూర్చున్నట్లును, చిత్రింపబడినది ఈ సంఘటనలు ద్వారము ముందు జరిగినట్లు తెలియుచున్నది అది నగరద్వారమో ఆలయ ద్వారమో ఐ ఉండును.

ఇందు మొదట శిల్పమున రాజున కెదురుగా నున్న వ్యక్తులు శైవులు. రాజు బ్రాహ్మణ మతమును నిరసించినట్లీ శిల్పము వలన, తెలియుచున్నది.

రెండవ శిల్పమున రాజు సాధికారముగ మంత్రులు, యోధులు, ఉన్న సమయమున వైదిక మతమును త్యజించినట్లు చిత్రింపబడినది.

మూడవ శిల్పమున ఎడమ భాగమందలి దృశ్యము యొక్క పర్యవసానమే కుడివైపుననున్న శిల్పము నందలి దృశ్యము. ఇందు స్త్రీలు చిత్రింపబడినారు. వీరు బౌద్ధమతానురక్తలు. వీర పురుష దత్తుడు బౌధమును స్వీకరించుటకు ప్రేరేపించిన వారు వీర పురుష దత్తుడు శైవమును త్యజించి, బౌద్ధమును స్వీకరించి బోధిసత్వుని పాదముల నాశ్రయించినాడని చూపుట ఈ శిల్పము యొక్క ముఖ్యోద్దేశము.

వీరపురుషదత్తుని 18వ రాజ్య సంవత్సరమున చాంతిశ్రీ వేయించిన నాలుగు శాసనములలో అతని విజయమును ఆయుర్వృద్ధిని సూచించినట్లు తెలుపబడినది. నాగార్జునకొండలో యుద్ధమును సూచించు ఒక శిల్పము లభించినది. "ఇందు ఎడమ వైపున నొక ఏనుగు కలదు దానిపై నుండి ఒక యోధుడు పడిపోవు చున్నాడు ప్రక్కగనొక గుర్రమును, దానిమీదనొక యోధుడును, వెనుకడాలులుపట్టి నిలిచిన యోధులునున్నారు. ఈరౌతుప్రక్కగ నొకయోధుడు తనముందు మోకాళ్ళపై కూలబడిన మరియొక యోధుని శరీరములోనికి తనఖడ్గమును గ్రుచ్చుచున్నాడు. శిల్పము కుడివైపున గదాహస్తులై అనేకులు యుద్ధము చేయుచున్నారు. వీరందరును హాయగజాది సాధనములులేని సామాన్యప్రజలవలె కనబడుచున్నారు

ఇదియొక ప్రజలతిరుగుబాటు కావచ్చును ఏనుగుపైనుండి పడు చున్నవ్యక్తి పురుషదత్తుడు కావచ్చును ఈతిరుగుబాటు ఈరాజ బహిరంగముగ వైదికమతమును తిరస్కరించినందులకు ఫలితముకా వచ్చును తుదకు పురుషదత్తుడీ ప్రమాదమునుండి వెలుపడి యీతి రుగుబాటు నణచియుండును. ఈఘటనయొక్క ప్రతిధ్వనులే చాంది(శ్రీ)శాసనములో వినవచ్చుచున్నవి అందువలన పురుషదత్తుని బౌద్ధమత స్వీకారమతని 18వ రాజ్య సంవత్సరమున జరిగెనని చెప్ప వచ్చునని"డా॥మా రేమండ రామారావుగారి యభిప్రాయము 1

నాగార్జునకొండ ప్రాంతమున నివసించు బౌద్ధ శాఖలవారు మహాసాంఘిక వాదులు బోధివృక్షము నారాధించు ఆచారము ఈకాలమున నుండెననుటకు బోధి(శ్రీ) సింహాళవిహారమున బోధివృక్ష మునకొక ఆలయము నిర్మించినట్లు, నాగార్జున కొండతో లభించిన F . నెంబరుగల శాసనమువలన తెలియుచున్నది. వృక్షారాధనఅన్ని బౌద్ధతీర్థములందు జరుగుచుండెను హిందువులు విష్ణుపాదముల నారాధించినట్లు, బౌద్ధులు త్రిరత్నము, స్వస్తిక, ధర్మచక్రము, మీ నము లాంఛనములతోనుండు బుద్ధపాదములను ఆరాధించు చుండిరి. చైత్యములకు చతుర్దిశలయందు వేదికలునిర్మించి వానిపైఆయక స్తంభముల నెత్తుచుండిరి. ఆస్తంభములపై బుద్ధుని జీవితఘ ము లను చెక్కుచుండిరి

ఆనాటి శాసనములలో బౌద్ధతీర్థములకు చేయబడిన దానము లయొక్క ముఖ్యోద్దేశము జీవకోటి క్షేమమునకు సంబంధించినది ప్రపంచముయొక్క సుఖమును, క్షేమమును, సర్వప్రాణుల యోగ క్షేమమును, మోక్షలాభమును, ఉభయలోక సుఖమును బౌద్ధసంఘ

---

1. నాగార్జున కొండ సంచిక P 20.

ముయొక్క త్రికాలసుఖములను దానోద్దేశములగా పేర్కొనబడినవి. బుద్ధుడు, ఇక్ష్వాకులు ఒకేవంశీయులు కావున నాగార్జున కొండలో వెలువడిన శాసనములందు బుద్ధునియొక్క ప్రశంస విశేషముగానున్నది వీనిలోబుద్ధుడు

1. _భగవతో దేవరాజ శకతస, సుప
   బుధ బోధినో సవంఙ్ఞనో

2. సవ సతాను కంపకస జితరాగదోస మోహ విప
   ముతస మహాగణి వసభ

3 గంధ హాతిస సమ్మ సంబుధస ధాతు
   వర పరిగహితస____"

**B4 E I Vol XX P 18.**

1. ఇఖాకు రాజపవర రిసి సత పభవ వంస సంభవస

2. దెవ మనుస్వ సవ సత హిత సుఖ మగ దేసికస
   జిత కామ కొధ భయ హరిస తరిస మొహ

3. దొస సదాపితమార బలదపమావ పసమన కరస
   దసబల మహా బలస అరం

4 గ మగ ధమ ఛక పవ తకస ఛక లఖణ సుకు
   మార సుజాత చరణస తరుణ దివస

5. కరపభస సరద ససి సోమ గరిస వస సవలోక
   ఛిత మహితస బుధస___"

**F5. E. I. Vol. XX P. 22.**

అనివర్ణింపబడినాడు.

దిఘనికాయ, మఝిమినకాయ, పంచమాతృక అను గ్రంథ ములప్రశంస నాగార్జున కొండలో లభించిన శాసనమున కలదు.

2 "— —పంవగామ వధవానం దిఘ – మఝిమ
– పంచమాతుక –దెసక

3 వాచకానం ఆభరాూనం ఐర హంఘానం అంతే
వాసికెన దిఘ–మఝిమ –

3 నికాయ ధరేవ———"

Cl E I. VoL XX P 17

బౌద్ధమతము సర్వాతిశాయియై వర్ధిల్లిన ఈకాలమున నాగార్జునకొండ బౌద్ధమతమునకు ముఖ్య కేంద్రముగ నుండుటయేగాక బౌద్ధారామ విహారములును, మండపములును కలిగి ఇతర బౌద్ధతీర్థ ములకాదర్శ ప్రాయముగ నుండెననుటకు భారత దేశమునందలి బౌద్ధ తీర్థములందుండు సన్యాసులు, సన్యాసినులు, ప్రజలు, విదేశీయులు, నాగార్జునకొండను సందర్శించి నారనుట తార్కాణము ఇచటి వింతలు, విశేషములు, చైత్యాలయములు, విహారములు, వాని నిర్వహణా విధానమునుచూచి, తమతమ ప్రాంతములం దాయా విధానముల నమలుపరచుచుండిరి.

బౌద్ధ భిక్షువులు మతప్రచారార్థము ఇచటినుండి బయలుదేరు చుండిరి. నాగార్జునకొండ ప్రాంతమునందలి విజయపురికి రాజధానిగాగల్గి ఆంధ్రదేశమును పాలించిన ఇక్ష్వాకువంశీయులీ బౌద్ధమత తీర్థమును పోషించుటవలన ఈ క్షేత్రమునకు ప్రాముఖ్యము వచ్చినది ఇటు బౌద్ధమతము ఇక్ష్వాకుల పాలనమున ఆదరింపబడి పోషింపబడినది.

జైనము :- ఇక్ష్వాకుల కాలమున జైన మతముకూడ ఆంధ్ర దేశమున వ్యాప్తిలో నున్నట్లు తెలియుచున్నది. బౌద్ధ మతము వ్యాప్తిలో నున్నంతగా జైనము లేకున్నను ఆంధ్రదేశములోని కొన్ని ప్రాంతములు జైనమత కేంద్రములుగ నుండెనని చెప్ప వచ్చును

వైదుష్యము –ఈ కాలమున బౌద్ధ మతము వలన సామాన్య ప్రజలకు విద్యా సౌకర్యము లేర్పడినవి. బౌద్ధ మతమును స్వీకరించు టకు ప్రతివారికి అనగా సర్వ వర్ణముల వారికిని అవకాశమున్నట్లే బౌద్ధ విద్యా పీఠములందు విద్య నార్జించుటకును అట్టి యవకాశ ముండెడిది గొప్ప గొప్ప విద్యా పీఠములందు భారత దేశములోని సర్వ వర్ణముల వారే కాకుండ, విదేశముల నుండి విద్యార్థులు వచ్చి విద్య నభ్యసించుచుండిరి నాగార్జున కొండ, వేంగి, ధాన్యకటకము మున్నగు ప్రాంతములు విద్యా పీఠములుగ ప్రసిద్ధి కెక్కినవి.

ఆర్య నాగార్జునుని కాలము నుండియు, ధాన్య కటక విద్యా పీఠము ప్రసిద్ధి చెందినది. బౌద్ధ విద్యకు, బౌద్ధ కళలకును ఆవాస మైన ధాన్య కటకమున వేలకొలది .విద్యార్థులు విద్య నార్జించు చుండిరి. ధాన్యకటక సంఘారామమును నాదర్శముగ గొని, టిబెట్టులోని 'డాపంగ్' సంఘారామము నిర్వహింపబడుచుండెను. 'డాపంగ్' అను పదమునకు 'ధాన్యరాశి' యని యర్థము. కావున 'ధాన్య కటకము' పేరు టిబెట్టులోని సంఘారామమునకు పెట్టినట్లు తెలియుచున్నది. 'డాపంగ్' సంఘారామమున 7700 బౌద్ధ భిక్షువు లుండెడిరి. ఆ ప్రాంతమున ఆరు కళాశాలలతో కూడుకొనిన విశ్వ విద్యాలయముండెను.

నలంద,విక్రమశీల విహారము లందు గల గ్రంథాలయములందు ధాన్యకటక సంఘారామమునకు సంబంధించిన విషయములను తెలుపు వ్రాతప్రతులు భద్రపరుచబడి యుండెనని తెలియు చున్నది.

ఆంధ్ర దేశమున బౌ విద్యల కావాసమైన మరియొక సంఘారామము వేంగిలో నుండెను ఇది గొప్ప విద్యాపీఠముగ ప్రాముఖ్యము నందినది. వేంగి సంఘారామము ఎదుట వంద అడుగుల ఎత్తుగల స్థూపము లుండినట్లును, సంఘారామమున ఎన్నియో అంతస్తులు గల భవనములును, అందముగా చెక్కిన స్తంభములచే శోభాయమానముగ నుండు గృహములును ఉన్నట్లు తెలియు చున్నది

ఇక్ష్వాకుల కాలపు వాఙ్మయ మేదియు ఇంతవరకు లభింప లేదు. వారి కాలమున వెలువడిన శాసనము లన్నియు ప్రాకృత భాషలో వేయించబడినవి. ఈ రాజులు సాతవాహనుల వలెనే ప్రాకృత భాష నభిమానించి పోషించినట్లు తెలియుచున్నది.

ఆ నాడు తెలుగు భాష వ్యాప్తిలో నుండె ననుటకు ఇక్ష్వాకుల శాసనములందు కన్పించు 'మహాతలవర' శబ్దము తార్కాణము. ఉత్తరాపథమున శకరాజులు వైదికమతోద్ధరణమునకు బూని యజ్ఞయాగాదులు నిర్వర్తించు కాలమున ఇక్ష్వాకులు సైతము వైదిక మతముతోపాటు బౌద్ధ మతమును పోషించిరి ఆ కాలమున తిథి, వార, నక్షత్ర, పక్ష, మాసాదులతో గూడిన పంచాగము, చాంద్రమాన వ్యవహారము వాడుకలో నుండెను గ్రీష్మ, వర్ష, హేమంతములను ఋతువులు వ్యాప్తిలో నుండెను. ఋతువునకు నాల్గు మాసముల చొప్పున లెక్కబెట్టుచుండిరి. ఆనాటి ప్రజలు

బౌద్ధ మతము నభిమానించి, పోషించుటవలన, బౌద సంఘారామములు, బౌద్ధ క్షేత్రములు, విద్యాలయములుగా ప్రసిద్ధి చెందినవి దేవాలయము లందును వైదిక విద్యా దానము జరుగుచుండెను. ఇక్ష్వాకుల కాలపు నాగార్జున కొండ లేక శ్రీ పర్వతమునకు సంబంధించిన విషయములు 'ధర్మామృత' మను కావ్యమున వర్ణింపబడినవి

ధర్మామృత కావ్యము – జైనులకును, జైన వాఙ్మయమునకును సంబంధించిన గ్రంథ మీ ధర్మామృత కావ్యము దీని రచయిత 'నయసేనుడు'. ఇతడు నరేంద్రసేనుడను మునికి శిష్యుడు, ఇతని నివాస స్థానము 'ములుగొండ' గ్రామము ఈ గ్రామము బొంబాయి రాష్ట్రి మందలి ధార్వారు మండలము నందున్నది ఈ గ్రంథము శాలివాహన శకము 1037 చాంద్రమాన నందన సంవత్సర భాద్రపద శుక్ల పాడ్యమీ తిథి నాటి హస్త నక్షత్రము నందు పూర్తి చేయబడినది. ధర్మామృత కావ్య మొక ప్రాచీన ప్రాకృత కావ్యానువాదమని తెలియుచున్నది గ్రంథమున గల యాశ్వాసములుపదునాలుగు ప్రతియాశ్వాసమునందుజైనధర్మమునవలంభించి, జైన దీక్షనుబూని మోక్షమును, సద్గతినిపొందినమహాత్ముల చరిత్రలు కలవు పదునొకండవ యాశ్వాసము సత్యవ్రత చరిత్రము కలది. సంఘశ్రీ మున్నగువారి చరిత్రలు, జైన మత సంబంధిత విషయములు, ఇక్ష్వాకుల కాలము నాటి కట్టడములును ఈ గ్రంథమున వర్ణింపబడినవి.

ఇక్ష్వాకు వంశమునకు జెందిన యశోధరుడను రాజు వాసుపూజ్య తీర్థంకరుని కాలమున అంగదేశమునకు రాజధాని యగు చంపాపురమున సింహాసనమధిష్టించెను. అతనికి అనంతవీర్యుడు, శ్రీధరుడు, ప్రియబలుడను ముగ్గురు కుమారు లుండిరి యశోధర మహారాజు అన్య రాజ్యములను జయించవలెనను కాంక్షతో ది వ్వ

జయములు చేయుచు, వేంగీ దేశమునకు వచ్చెను వేంగీ ప్రాంత ప్రకృతి సౌందర్యమునకు ముగ్ధుడై అతడు అచటనే సిరపడిపోవుటకు నిశ్చయించి, ప్రతీపాల పురమును నిర్మించి చాల కాల మచ్చటి నుండియే రాజ్యమును పాలించెను. వృద్ధుడైన పిదప రాజ్యమును త్యజించి, సద్గతికై వానప్రస్థాశ్రమమును స్వీకరింప దలచెను కాని అతని ముగ్గురు కుమారులును, రాజ్యాధికారమును స్వీకరించుటకు ఇష్టపడకుండుటవలన యశోధర మహారాజు ఎట్లో చివరకు తన మూడవ కుమారుడగు ప్రియబలుని రాజ్యాధికారమును స్వీకరించుటకు ఒప్పించి, తక్కిన ఇద్దరు కుమారులతో అడవి కేగెను. విశ్వసేనాచార్యుని వలన యశోధరుడును, అతని ఇద్దరు పుత్రులును దీక్షను బూని 'జటా శిఖర' మను కొండపైన ఆవాస మేర్పరచు కొనిరి కొలది కాలములో యశోధరుడును, అతని జ్యేష్ట పుత్రుడగు అనంతవీర్యుడును మోక్షము నందిరి. కాని శ్రీధరుడు మాత్రము చాల కాలము వరకు దీక్షను బూని "అకళంకుడను" పేర కీర్తి వడసెను

ప్రతీపాల పురమున ప్రియబలుడు రాజ్యము చేయుచుండెను ఒకనా డతడు వాహ్యాళికై తోట కరిగెను. అచట పాము కరచుట వలన మరణించెను. అతనికి సంతానము లేనందువలన అతని మంత్రి 'ఇంద్రప్రభువు' కొందరు ప్రముఖులతో జటా శిఖరమున కేగి శ్రీధరుని రాజ్యభారము వహింపుమని కోర దలచెను రాజ్యాధికారము వహించుటకు శ్రీధరు డంగీకరింపడని తెలిసికొని, నగరమును సందర్శించు మని ఆహ్వానించి రాజ్యాధికారము జేపట్టి తన కోరికను నెరవేర్చుమని బలవంత పెట్టెను ఎట్లో! శ్రీధరుడు ఇంద్ర ప్రభువు మాట కంగీకరించి, తనకు పుత్ర ప్రాప్తి కలుగునంతవరకు రాజ్యమునందుండుటకు నిశ్చయించికొనెను. కొంత కాలమున కతనికి

కుమారుఁ డుదయించెను. తనయునికి యశోధరుఁడను నామకరణము చేసి శ్రీధరుఁడు రాజ్యమును త్యజించి తపస్సు గావించుటకు అడవుల కేగెను

శ్రీధరుఁడు నివసించి, తపస్సు గావించి సిద్ధిపొందిన పర్వతము శ్రీపర్వతము. ఇచటికి కొలది దూరములో నున్న వటవృక్షము క్రింద కూర్చొని శ్రీధరుఁడు సిద్ధిపొందెను. కావున ఆ వృక్షమునకు సిద్ధవట మని పేరుకల్గినది. శ్రీధరుఁడు ఏ ప్రాంతమున జినదేవుని అర్చించెనో, లేక జ్ఞానపూజగావించెనో, ఎక్కడ చతుర్విధ దేవనికాయములుండెనో, ఆప్రాంతము అమరావతి యనఁబడినది. శ్రీధరుఁ డర్జునవృక్షము క్రింద తపస్సు చేయునపుడు ఖేచరులాతని మల్లికపుష్పములతో బూజిం చుట వలన ఆప్రాంతమునకు మల్లికార్జున నామ మేర్పడినది. ఇంద్ర ప్రభువు ఆదిగాగల వృద్ధులు, శ్రీధరుని మునివర్యునిగా భావించి, పూజించిన ప్రాంతము వృద్ధగిరి యనఁబడుచున్నది రెండవ యశోధ రుఁడు శ్రీధరునిపుత్రుఁడు. శ్రీధరుఁడు "ముండీ యుఁడు" కావున రెండవ యశోధరునికి "ముండీయసుతుడను" పేరేర్పడి అతని వంశము "ముండీయ" వంశమనఁబడినది.

రెండవ యశోధరుని వంశమున, ధనదుఁడను వాఁడు జన్మించి రాజ్యభారము వహించెను. ఆతని రాజ్యమున సంఘశ్రీయను బౌద్ధ సన్యాసి యుండెను. అతనికి కమలశ్రీయను పేరుగల కూతురుండెను. ఆమె మిక్కిలి చక్కనిది. ధనదుడు కమలశ్రీని ప్రేమించి, వివాహ మాడి ఆమెను తానవలంబించు, జైనమతమును స్వీకరింప జేసెను. ధనదుఁడు సంఘశ్రీని జైనమతము స్వీకరించుమని చెప్పెను. ఒక నాఁడు ధనదుడు తన అద్భుతశక్తి (Miracle) వలన మామయగు సంఘశ్రీనిమెప్పించి, ఆతఁడు బౌద్ధ మతము త్యజించి జైనమతా వలంబకుడగునట్లు చేసెను. అటుపిమ్మట, కొంతకాలమునకు సంఘశ్రీ

గురువును, బౌద్ధసన్యాసియు నగు బుద్ధశ్రీవచ్చి, శిష్యుఁడైన సంఘశ్రీ తిరిగి బౌద్ధము స్వీకరించునట్లు ఒప్పించెను సంఘశ్రీ బౌద్ధము స్వీకరించుట వలన ధనదుడాగ్రహించెను.

ధనదుడొక బహిరంగ సమావేశ మేర్పరచి, ఆ సమావేశమున సంఘశ్రీని దోషిగా నిరూపించి, తన అద్భుతశక్తి (Miracle) చూపింతునని చెప్పెను. సంఘశ్రీ ధనదుని అద్భుతశక్తి నంగీకరింపక పోవుట వలన సభాసదులు కినుక వహించి, సంఘశ్రీ నయనములు పెరికివేసిరి. ధనదుడు సంఘశ్రీకి దేశబహిష్కార శిక్ష విధించెను. ఏడుతరముల తరువాత, సంఘశ్రీ వంశీయులంధులుగా జన్మించి అంధకులనఁబడిరి ధనదుని వంశీయుల పాలనములో నున్న దేశము అంధకదేశమనఁ బడెను.

పైన పేర్కొనఁబడిన గాధ పూర్తిగా తీసివేయ దగినదికాదు ఇందుచారిత్ర కాధారములు లేకపోలేదు. వేంగిదేశము తరువాతఆంధ్ర దేశములోని వేంగినాండు వేంగిదేశముగా పేరొందినది. తొలుత ఆంధ్రదేశమునకు వేంగినాడనుపేరుండెను గుంటూరు మండలములోని రేపల్లెకు ఆరుమైళ్ళలోపు దూరములో నున్న భట్టిప్రోలే ప్రతీప్రాల పురము. ఇది అతి ప్రాచీన మైన నగరము. ఇచట లభించిన బౌద్ధమత సంబంధమైన "బరిణ" లపైనున్న శాసనములు కుబీరకుఁడను రాజును గూర్చితెలుపుచున్నవి. ధనదుఁడనఁగా కుబేరకుడు. ధనదుడే కుబేరకుడు కావచ్చును ధనదపురము, ధనదవ్రోలు, ధనదుని పట్టణము, నేటిరేపల్లె తాలూకాలోని చందవోలు కావచ్చును. ఇది భట్టిప్రోలుకు సమీపములోనున్నది. 'అమరావతి' 'విజయపురి' మున్నగు ప్రాచీనాంధ్ర నగరములకన్న ప్రతీపాలనగరమతి ప్రాచీన మైన నగరము కావచ్చును. పూరావస్తు శాస్త్రజ్ఞులు, చారిత్రకులు, కుబేరకుని కాలము, క్రీస్తుపూర్వము మూడవ శతాబ్దిపూర్వార్థమని నిర్ణయించి

నారు. ధనదపురము వెలనాడు మండలమునకు రాజధానియనియు, ఈ మండలమును, త్రిలోచనపల్లవుడు 'మల్లని' కిచ్చెననియు, దుర్జయ వంశీయులగు ఆంధ్ర దేశాధీశ్వరులు, చాళుక్యుల యనంతర మీపల్లవ రాజుకు యుద్ధములందు సైన్యసహాయ మొనరించు చుండిరనియు తెలియు చున్నది. ధనదుఁడు కృష్ణానదికి సముద్రమునకు మధ్య ద్వీపము నేర్పరచెను నేడది 'దివి' తాలూకాగా పిలసిల్లు చున్నది.

ఈ విషయములన్నియు ధనదుడు చారిత్రక పురుషుఁడని తెలుపు చున్నవి. ముందు ముందు, ధనదప్రోలు, భట్టిప్రోలు, తదితర ప్రాచీనాంధ్ర నగరశిథిలములను త్రవ్వించిన, ప్రతీపాల పురాధీశ్వరులగు తొలి ఇక్ష్వాకువంశ క్షితీంద్రులచరిత్ర తెలిసికొనుట కవకాశ మేర్పడును.

**సాంఘిక పరిస్థితులు:—** ఇక్ష్వాకులు పాలించు కాలమున ప్రజలు సుఖజీవనము గడుపు చుండిరి సంఘమున స్త్రీలకు గౌరవ ముండెను. రాజులు మత సహనము గలిగియుండిరి శాంతమూలమ హారాజు యజ్ఞయాగాది క్రతువుల నాచరించి వైదిక - మతవ్యాప్తికి కారకుడయ్యెను శాంతిశ్రీ శాంతమూల మహారాజు సోదరి బౌద్ధమతమునాదరించి పోషించెను రాణులకు మహాదేవి బిరుదముం డెను స్త్రీలు తమతమ భర్తలకు గల బిరుదములను, ధరించుచుండిరి. మహాతలవరి, మహాసేనాపతి అను బిరుదములు శాసనములందు కనిపిం చుచున్నవి. ప్రజలలో బౌద్ధమతము నవలంబించిన వారధిక సంఖ్యా కులుగ నుండిరి. రానురాను వైదికమత ప్రాబల్యము తగ్గి బౌద్ధము వ్యాపించెను బుద్ధుని దేవునిగా భావించి ఆరాంధించు నాచారము వైదిక మతాను యాయులను జూచి బౌద్ధులు పాటించిరి. మను మడికి తాతగారి పేరు పెట్టు ఆచార మానాడును వాడుకలలోనుం డెను. వీరపురుషదత్తుడు,కుమారునకు బహుబల శాంత మూలుడని నామకరణము జేసెను. అట్లే బహుబల శాంత మూలుడు, తన

కుమారునకు రుళుపురుషదత్తుడను పేరుబెట్టెను శాతవాహనులవలె ఇక్ష్వాకు వంశీయులు, వాసిష్టి పుత్ర మాఢరీ పుత్రఅని చెప్పుకొనినారు. బౌద్ధ సంఘారామము లానాడువిద్యాలయములుగా, వైద్యాలయములుగా ప్రసిద్ధికెక్కినవి నాగార్జునకొండ విజ్ఞాన జ్యోతిగా వర్ధిల్లి దక్షిణా పథమందేగాక, దేశ, విదేశములందు, వెలుగు కిరణములను ప్రసరించి, అజ్ఞాన తిమిరములను పారద్రోలి, మానవాభ్యుదయమునకు దోడ్పడినది.

ఇక్ష్వాకు వంశీయుల పాలన మాంధ్రదేశమునందేబది సంవత్సరములే యైనను ఆంధ్రదేశ చరిత్రలో నాకాలము విశిష్టమైన స్థానమాక్రమించినది. సంఘమున మతసంబంధమైన పరిణామములు కలిగినవి. ప్రజలు బౌద్ధమతము నవలంబించి, బోధివృక్షము నారాధించుచుండిరి. బౌద్ధులలో నంధక సంఘము వారు బుద్ధుని దేవునిగ నారాధించుచుండిరి. నాగార్జున కొండవద్దగల సింహావిహారమునందు బోధివృక్షమున కొక ఆలయముండెడిది. బుద్ధుని పాదములను పూజించు ఆచారమానాడుండెను నాగార్జునకొండ శిథిలములందు లభించిన శాసనములందు "యావత్ప్రపంచము యొక్క సుఖ క్షేమములును, ఉభయ లోకసుఖమును, బౌద్ధ సంఘము యొక్క భూతభవిష్యద్వర్తమాన సుఖమును, సర్వజీవరాసుల యొక్క యోగ క్షేమమును, నిర్వాణ లాభమును దానోద్దేశములుగ" తెలుపబడినవి.

ప్రజలు బౌద్ధమత ప్రభావమున ప్రేరితులై శ్రీ పర్వతమును దర్శించు నుత్సాహముతో తీర్థయాత్రలుచేయుచు నాగార్జునకొండకు వచ్చుచుండిరి. యాత్రికుల సౌకర్యార్థము, చైత్యగృహములు, మండపములు, చతుశ్శాలలు, నిర్మింపబడినవి. స్త్రీలు సంఘమున గౌరవము బడయుచుండిరి. బౌద్ధమతముపై నభిమానముగల బోధిసిరి, నాగార్జునకొండ ప్రాంతమున, బౌద్ధారామ విహారముల నిర్మింప

జేసెను శాంతిశ్రీ, అడవిశాంతి శ్రీ, చుల శాంతిసిరినిక, మహాదేవి రుద్రధర భట్టారిక, హమ్మసిరి కుమార్తెయైన మహాదేవి బాపిసిరి,మహాదేవి చాంతిసిరినిక మున్నగు రాజవంశపు స్త్రీలు బౌద్ధ సంఘారామముల కనేక దానము లొసంగిరి.

**విదేశ వ్యాపారము:-** ఇక్ష్వాకు వంశీయుల కాలపు శాసనములలో 'ఉపాసిక బోధి శ్రీ' శాసనము ముఖ్యమైనది. క్రీస్తు శకారంభమున మత, వ్యాపార, వలస రాజ్య వ్యాప్తికి ఆంధ్రులొనర్చిన మహాప్రయత్నమును ఈ శాసనము జ్ఞప్తికి తెచ్చును. కళింగ పట్టణము, లేక పాలూరునుండి పులికాటు సరస్సువరకు విస్తరించిన సముద్రతీరముగల ఆంధ్ర భూభాగము, ఋషికుల్య, వంశధార, నాగావళి, శారద. తాండవ గుండ్లకమ్మ, పినాకిని, సువర్ణముఖి, మొదలగు చిన్నచిన్న నదుల ప్రమాదరహిత ముఖద్వారములతో నాటి, ఓడలు, తీరము చేరుట కనువుగానుండెను. కృష్ణా, గోదావరి నదులు, నౌకాయానమున కనుకూలముగా నుండెను. ఆనాడాంధ్ర దేశము, విదేశ వ్యాపారమునకు, వలస రాజ్య స్థాపనమునకు, అనాగరక దేశములలో, ప్రజలలో నాగరకత, సంస్కృతీ ప్రచారమునకు, వికాసమునకు, ప్రముఖపాత్ర వహించి, ఆంధ్రుల కీర్తిని వ్యాపింపజేసి ప్రపంచమున విశిష్టస్థాన మాక్రమించినది. మహానదులైన గోదావరి కృష్ణలు ఇక్ష్వాకు సామ్రాజ్యమున నౌకాయానమునకు తద్వారా వ్యాపారమునకు దోహద మొసంగుటవలన ఆంధ్రనావికులు, సామ్రాజ్యమందే కాక, విదేశములందు సైతము వ్యాపారముతో పాటు ఆంధ్రుల సంస్కృతీ నాగరకతలను వ్యాపింపజేసిరి. పెరిప్లసు[1], టాలెమీ[2]. అను విదేశ యాత్రికుల వ్రాతలవలన. ఆంధ్ర దేశము నుండి వ్యాపారపు

1. Periplus of the Erythraean sea C 60 A. D.
2 Ptolemy author of the Geogouphy C 140 A D.

టోడలు, గోదావరి, కృష్ణ, గుండ్లకమ్మ పినాకినీ నదుల ముఖద్వార ముల నుండి బయలుదేరి తూర్పువనున్న దేశములకు వెళ్ళుచుండెనని తెలియుచున్నది సాహసికులైన ఆంధ్రులు, ప్రకృతిసిద్ధమయిన పెద్ద పెద్ద నదులుగల దేశమున నుండుటవలన, ధైర్య సాహసములతో విశాలమైన సముద్రముపై దూరతీరముల కేగుచుండిరి ఆంధ్రరాజు లైన ఇక్ష్వాకువంశీయులు, విదేశ వ్యాపారమును ప్రోత్సహించు చుండిరి. విదేశగమనము కేవలము వ్యాపారార్థ మేయైనను, వ్యాపా రముతోపాటు ఆంధ్ర సంస్కృతి. తద్వారా భారతీయ నాగరకత, సంస్కృతి బౌద్ధమత సిద్ధాంతము లాయా దేశములందు వ్యాపించి, భారతజాతి ప్రత్యేకత, భారతీయ సంస్కృతివిశిష్టత ప్రపంచ ప్రజలు గుర్తించునట్లు చేసెను.

భారతీయ సంస్కృతి, బౌద్ధమత సిద్ధాంతము లాంధ్రదేశము నుండి, మలయా, చీనా, సయాం, బర్మా, కాంబోడియా దేశము లందు వ్యాపించెనని తెలియుచున్నది ఆనాడు రెండు రకముల నౌక లుండెననియు, అందు మొదటి రకము నౌకలు విశాలమైన, అగాధ మైన సముద్రములందు ప్రయాణము చేయుటకును, రెండవ రకము నౌకలు, దేశమున ప్రవహించు నదులపైనను, సముద్ర తీరస్థ ప్రాంత ములందును ఉపయోగపడుచుండెనని, పెరిప్లస్ వ్రాతల వలన తెలియు చున్నది.

బోధిశ్రీ శాసనము వలనను, టాలెమీ భూగోళశాస్త్ర గ్రంథము వలనను, భారతావనిలో లభించిన విదేశనాణెముల వలనను వస్తు సముదాయము వలనను, ఆంధ్రులానాడు భారతజాతి గర్వించు నట్లు విదేశములందు నాగరకతా సంస్కృతులను, మత సిద్ధాంతము లను వ్యాపింపజేయుటలో మిక్కిలి తోడ్పడిరని తెలియుచున్నది అరకాన్ దేశపు రాజధాని "త్రిలింగ" సయాం సింధు శాఖలోని 'కాకుల'

నామములు, తమ మాతృభూమిలోని పేళ్ళనే ఆయా దేశములందు వలస నేర్పరచుకొనిన ప్రవాసాంధ్రులు దేశాభిమానముతో పెట్టుకొని యుండిరని తెలియుచున్నది. ఆంధ్రులు విదేశములందు తమ సంస్కృతిని, నాగరికతను, బౌద్ధమతమును వ్యాపింపజేయుటవలన ఆయా దేశములలోని ప్రజలు బౌద్ధమతమును స్వీకరించుటయే గాక, పవిత్రమైన భారతదేశమునందలి బౌద్ధ క్షేత్రములను ముఖ్యముగా, అమరావతి, నాగార్జునకొండ ప్రాంతములను సందర్శించి, జన్మసాఫల్యమొనరించుకొనుటకు, బౌద్ధారామ విహారములను దర్శించి, మహాచైత్యములలోని బుద్ధుని అస్తికలకు శ్రద్ధాంజలి ఘటించి పోవుచుండిరి. విదేశయాత్రికుల కొరకు, బౌద్ధభిక్షువుల కొరకు బౌద్ధసన్యాసినుల కొరకు బోధిశ్రీ మున్నగు బౌద్ధమతాభిమానులగు మగువలు నాగార్జునకొండ ప్రాంతమున, చైత్యములు, విహారములు, మంటపములు క్రతుశాలలు, మున్నగునవి నిర్మించి, అందు సమస్త సదుపాయములు సమకూర్చిరి. ఆనాడు నాగార్జునకొండ ప్రసిద్ధమైన బౌద్ధక్షేత్రము. మహాయాన బౌద్ధ మిచట వర్ధిల్లి విదేశములందును వ్యాపించి, భారతదేశ ప్రతిష్టనినుమడింప జేసెను.

**శిల్పము :** నాగార్జునకొండ శిల్పములను బట్టి ఆనాటి శిల్పులు విశ్వకర్మవంటి వారని తెలియుచున్నది ఇచట బుద్ధ ధాతువుపై నిర్మింపబడిన మహా చైత్యము శిల్పసంపద కలిగియున్నది ఇచటి సంఘారామ కట్టడములకొక ప్రత్యేకత కలదు. బోధి వృక్షమునకొక ప్రత్యేకత కలదు బోధి వృక్షమునకొక ఆలయము నిర్మించినట్లును, చైత్యమునకు, నాలుగు దిక్కులలో వేదికలు నిర్మించి ఆయక స్తంభముల నెత్తించి ఆ స్తంభములపై శాసనములు చెక్కించుటయేగాక, కొన్ని స్తంభములపై పంచమంగళములను[1] చెక్కించుచుండిరి శాంతమూల

1. గౌతమబుద్ధుని జీవిత మందలి ముఖ్యమైన ఐదు ఘట్టములు పంచ మంగళములు. 1 బుద్ధజననము, 2 మహాభి నిష్క్రమణము, 3 సంబుద్ధి, 4. ధర్మచక్ర ప్రవర్తనము, 5. మహాపరి నిర్వాణము.

మహారాజు హిరణ్యకోటి దానమును సూచించు దృశ్యముగల శిల్పమును, చక్రవర్తిత్వము ప్రకటించు 'చక్రవర్తి-అతని ఏడు అలంకారములు' అను పేరుతోఁగల శిల్పమును, వీరపురుషదత్తుడు ఏడు పడగల నాగరాజు గర్భమునగల శివలింగమును ద్రొక్కుచున్నట్లును, అతని ముందు భయభ్రాంతులై కొందరు వ్యక్తులరచుచున్నట్లు చెక్కఁబడిన శిల్పమును, రెండు చేతులు నడుమున నాన్చి ముందునకువంగి, కుడి పాదముతో నా గర్భమునగల శివలింగమును ద్రొక్కుచున్నట్లు ఎడమ వైపును, కుడిభాగమున సింహాసనాసీనుడైన బోధిసత్వుడును, అతని ఎదుట ఏదియో చెప్పుచున్న వీరపురుషదత్తుని శిల్పమును, ఇంకొక శిల్పమున వీరపురుషదత్తుడు బోధిసత్వుని పాదముల వద్ద కూర్చొని యున్నట్లున్న శిల్పమును శిల్పకళాసంపదతో నొప్పారుచున్నవి

మరియొక చోట వీరపురుషదత్తుడు బ్రాహ్మణ మతమును త్యజించి బౌద్ధమును స్వీకరించినట్లు చిత్రింపబడినది. మంత్రి, సేనాపతి మున్నగువారు ఈ చిత్రములో నున్నారు. కొందరు స్త్రీలు ఈ చిత్రమున కనిపించుటవలన వారు వీరపురుషదత్తుని రాణులై యుందురని యూహించుట కవకాశమున్నది.

నాగార్జునకొండ లోయలో లభించిన నొక శిల్పములో యుద్ధ దృశము చిత్రింపబడినది. ఇందు సామాన్యప్రజలు ఆయుధపాణులై యుద్ధము చేయుచున్నట్లును, ఒక యోధుడు ఏనుగుపైనుండి పడిపోవు చున్నట్లును చిత్రింపబడినది. ఈ చిత్రము వీర పురుషదత్తుని వైదిక మత నిరసనము సహింపని ప్రజల తిరుగుబాటుగా భావింపవచ్చునని చారిత్రకుల యభిప్రాయము.

శాంతమూల మహారాజు గావించిన గోదానమును సూచించు శిల్పమున, రాజు, రాణి ఆసీనులై యుండ, సేవకుడొకడావును తోలు

కొని వచ్చుచున్నట్లును, ఒక స్త్రీ ఆవు ముఖమున తిలకము దిద్దు చున్నట్లు సహజశిల్ప సంపదతో నొప్పారుచున్నది.

నాగార్జున కొండలోయలో నున్న ముఖ్యమైన విహారముపారావత విహారము. ఈ విహారమునందాచార్య నాగార్జునుడు నివసించెను. ఇది ఐదంతస్తులు కలది. ఇందు విహారములు, చతుశ్శాలలుండెను. ప్రతివిహారము నందొక బంగారు బుద్ధవిగ్రహ ముండెననియు హ్యూయాన్‌త్సాంగ్ వ్రాతల వలన తెలియుచున్నది.

ఏబది సంవత్సరములు మాత్రమే పాలించినను, ఇక్ష్వాకులు ఆంధ్ర దేశమును శాతవాహన సామ్రాజ్య పతనానంతరము కడు సమర్ధనీయముగా తమ యేలుబడిలోనికి దెచ్చుకొని, ఆంధ్రదేశము చిన్నచిన్న రాజ్యములుగా చీలిపోకుండ కాపాడినారు. వైదికమతము శాంతమూల మహారాజు కాలమున ఆదరింపబడి పోషింపబడినను, బౌద్ధము సర్వాతిశాయియై విలసిల్లినది. ఆంధ్ర సంస్కృతి, నాగరికత ఇక్ష్వాకుల కాలమున విదేశములందు వ్యాపించినది. ఆంధ్రులు విజ్ఞాన చంద్రికలను తూర్పుదేశములందు వ్యాపింపజేసి, బౌద్ధమతము విదేశము లందు మహోన్నతముగా భావింపబడునట్లు చేసి, వ్యాపారము వృద్ధి చేసుకొని సుఖమయ జీవితము గడిపినారు.

# 4 వ ప్రకరణము

# పల్లవ యుగము

దక్షిణాపథమును పాలించిన రాజవంశములలో పల్లవ వంశము ముఖ్యమైనది. పల్లవులు కంచిని రాజధానిగా దక్షిణదేశమును పాలించుచు, ఆంధ్రదేశ భూభాగముల నాక్రమించి కొంతకాలము పాలించిరి. ఆంధ్రుల చరిత్రలో పల్లవులకు సముచితమైన స్థానమీయబడినది. పల్లవుల పరిపాలనా కాలపు ఆంధ్రదేశ సాంఘిక చరిత్ర ఈ ప్రకరణమున వ్రాయబడుచున్నది.

పల్లవులు సుమారు ఏడు శతాబ్దుల కాలము దక్షిణాపథమును పాలించినారు. ఈ రాజన్యులకు సంబంధించిన శాసనములలో 1. ప్రాకృత శాసనములు 2. సంస్కృత శాసనములు. 3. సంస్కృత, తమిళ మిశ్రమములు ముఖ్యమైనవి ఇవియన్నియు తామ్ర శాసనములు. పల్లవులకు సంబంధించిన శిలా శాసనములు ఏడవ శతాబ్ద్యారంభము నుండి వేయింప బడినవి.

తామ్ర శిలాశాసనములు, నిర్మాణములు, సారస్వతము, పల్లవ చరిత్ర నిర్మాణమునకు దోడ్పడిన సాధనములు.

పల్లవ నిర్మాణములలో మహేంద్ర వాడి, పల్లావరము, మామందూరు, మహాబలిపురము, తిరుచునాపల్లి, ప్రాంతములందలి గుహాలయములు ముఖ్యమైనవి

తేవారమనబడు నాయనారుల భక్తిగీతములు, వైష్ణవాళ్వారుల గ్రంథములు, అవంతీసుందరికథ, మత్తవిలాస ప్రహసనము లోకవిభాగ మనబడు దిగంబర జైనకావ్యము, పల్లవుల కాలమున వెలసిన సాహిత్య గ్రంథములు.

పల్లవ రాజులలో ముఖ్యమైన వారి పేర్లు క్రింద నొసంగ బడుచున్నవి.

| | | | |
|---|---|---|---|
| ఒప్పమహారాజు | | — | 285-310 |
| శివస్కందవర్మ | | — | 310-335. |
| విజయస్కందవర్మ | | — | 330-340. |
| సింహావర్మ | | — | 340. |
| విష్ణుగోపుడు | | — | 340-349. |
| త్రిలోచన పల్లవుడు | | — | 350-360. |
| మొదటికుమారవిష్ణువు | | — | 360-385. |
| బుద్ధవర్మ | | — | 385-410 |
| రెండవ కుమార విష్ణువు | | — | 410-436 |
| సింహావర్మ | I | — | 436-460 |
| స్కందవర్మ | | — | 460-485 |
| నందివర్మ | I | — | 485-510 |
| సింహావిష్ణువు | | — | 575-600. |
| మహేంద్రవర్మ | | — | 600-630. |
| నరసింహావర్మ | | — | 630-668. |
| మహేంద్రవర్మ | II | — | 668-670 |
| పరమేశ్వరవర్మ | | — | 670-685. |
| నరసింహావర్మ రాజసింహా | II లేక | \| | 685-700 |
| పరమేశ్వరవర్మ | II | — | 700-710. |
| నందివర్మ (పల్లవమల్ల) | | — | 710-775. |
| దంతివర్మ | | — | 7775-826 |
| నందివర్మ | III | | |
| నృపతుంగవర్మ. | | | |
| అపరాజితుడు. | | | |

పైన పేర్కొనబడిన రాజుల కాలమున వేయింప బడిన శాసనములను, నిర్మింపబడిన దేవాలయములను, గుహాలయములను, రచింపబడిన గ్రంథములను అనుసరించి, పల్లవరాజుల పరిపాలనాకాలపు ఆంధ్ర దేశ సాంఘిక చరిత్ర వ్రాయబడుచున్నది.

**రాజ్యపాలనావిధానము:—** ఇక్ష్వాకు వంశీయులు శాతవాహనుల రాజ్యాంగ పద్ధతుల నమలుపరచి ఆంధ్రదేశమును పాలించినారు. అట్లే పల్లవులు సైతమాంధ్రదేశములోని తమ ఏలుబడిలో నున్న ప్రాంతములందు సాతవాహనుల పరిపాలనా విధానములనే యవలంబించిరి

శివస్కందవర్మ హిరహడగళ్ళి శాసనము[1] వలన పల్లవుల పరిపాలనా విశేషములు మనకు తెలియుచున్నవి.

సామ్రాజ్యమునకు రాజు సర్వాధికారి. రాజుకు రాజకీయ వ్యవహారములందు సలహానొసంగుటకు మంత్రివర్గ ముండెను. రహస్యాధికారు లిచ్చు సలహాలను రాజు పాటించుచుండెను. రాజు ఎట్టి దానములైనను చేయవచ్చును. రాజు నిరంకుశుడైనను, మంత్రి మండలి సలహా ననుసరించి ప్రజోపయోగ నిర్మాణ కార్యములను చేయుచుండెను.

సామ్రాజ్యమున శాసనము గావించు అధికారము రాజుకు మాత్రమే యుండెను.

అష్టాదశ పరిహారములతో యువమహారాజు కాని, మహారాణి కాని, వేదవిదులైన పండితులకు, మతాచార్యులకు భూదాన మొసంగుట కర్హులై యుండిరి.

---

1 Epigraphia Indica Vol. I Page 2.

సామ్రాజ్యమున రాజుకు వివిధములైన పన్నులు విధించు అధికారముండెను గ్రామసీమలనుండి, నేయి, పాలు, మజ్జిగ మొదలగు వస్తుసంచయమును తెప్పించుకొను అధికారము రాజ్యాధినేతకుండెను. ప్రభుత్వోద్యోగుల నిమిత్తము ప్రజలనుండి ఈ వస్తువులను రాజు గ్రహించుచుండెను.

యుద్ధ సమయములందు ఆయుధములను, వస్తుసామగ్రిని, తదితర యుద్ధతంత్ర పరికరములను, ఒకచోటినుండి మరియొకచోటికి గొనిపోవుటకు, గ్రామీణులు, రైతులు, తమతమ వంతుప్రకారము ఎడ్లనీయవలసి వచ్చుచుండెను. గ్రామములలోని గ్రాసము, వంటచెరుకు, కూరగాయలు, ఫలపుష్పాదులపై రాజు సర్వాధికారములు కలిగియుండెను అవసరమని తోచినపుడు, రాజు ఆ యా వస్తుసముదాయమును, రాష్ట్ర వినియోగము నిమిత్తము తీసికొను యధికారము కలిగియుండెను.

గ్రామములోని ప్రతివస్తువుపై రాజునకధికార ముండెను రాజు సర్వాధికారియైనను, నిరంకుశుడు మాత్రము కాడు పల్లవరాజులు ధర్మానువర్తనులై రాజ్యమును పాలించిరి రాజులు క్షేత్రధర్మమెరింగినవారే కాక, రాజ్యమును కాపాడుట తమ విధియని భావించిరి శాసనము లందీ రాజులు, 'ధర్మమహారాజులు' ధర్మ మహారాజాధిరాజు లని వర్ణింపబడినారు యుద్ధ సమయములందు దేశమున శాంతిభద్రతలు కాపాడుట వీరు తమ ధర్మముగా దలంచిరి. దయార్ద్ర హృదయులై ప్రజలను కన్న బిడ్డలవలె వీరు పాలించిరి.

పల్లవ రాజులకు 'సత్యప్రతిజ్ఞాస్య' 'సత్యప్రాణ మహాత్మనః' అను బిరుదము లుండెను పరిపాలనాదక్షులు కావున 'లోక పాలస్య' 'లోక పాలానాం పంచమస్య' 'ప్రజారంజన పరిపాలనోద్యోగ' 'సతత సత్యవ్రత దీక్షస్య' 'రాజర్షి గుణ సర్వ సందోహా' 'విజిగీషోద్ధర్మ

విజిగీషస్య' 'లోకాషచయ ప్రత్యక్ష సర్వారంభఃవిజిగీషః' అని శాసనము లందు చెప్పుకొనినారు ఇట్టి బిరుదములవలన, పల్లవ రాజుల రాజ ధర్మము, ప్రజానురంజకము, కీర్తికాంతు తెలియుచున్నవి.

పల్లవరాజులు దక్షిణాపథమున సువిశాల సామ్రాజ్యమును స్థాపించినను, ఆంధ్రదేశమును జయింపవలె నను కోరికతో, దండ యాత్రలుచేసి, ఆంధ్ర భూభాగములను జయించి, ఆంధ్రదేశమున తమ పరిపాలనము సాగించినారు ఆంధ్రవీరులతో జరుగు యుద్ధములందు పల్లవులకు జయము, ఒక్కొక్కమా రపజయము కలుగుచుండెను.

**పరిపాలనావ్యవస్థ:—** పల్లవులు తమ సామ్రాజ్యమును భిన్న భిన్న రాష్ట్రములుగా విభజించిరి రాష్ట్రమును పాలించుట కొక అధి కారి నియమింపబడుచుండెను రాష్ట్రాధికారిని విషయికుడు లేక వ్యాపృతుడు అని పిలిచెడివారు. రాష్ట్రాధికారులు సర్వసాధారణ ముగా రాజబంధువులుగాని, రాజవంశీయులుగాని నియమింపబడు చుండిరి. రాష్ట్రమున కొక రాజధాని ప్రత్యేకముగా నుండెను. పల్లవుల శాసనములందు, కర్మరాష్ట్రము, వేంగోరాష్ట్రము, ముండ రాష్ట్రములును, శాతవాహని హారము, అడేయార్, ఆదులు పేర్కొనబడినవి. రాష్ట్రములు పరిపాలనా సౌలభ్యము కొరకు, విష యములుగను, కోష్ఠములుగను, విభజింపఁబడినవి. తొండ మండలము లేక తొండ రాష్ట్రమును, 24 కోష్ఠములుగ విభజించినట్లు తెలియు చున్నది. నృపతుంగవర్మ 15వ విజయ రాజ్య సంవత్సరమున కాంచీ నగరముచుట్టు భూమండలము విభజింపబడిన దని శాసనములవలన తెలియుచున్నది. అట్టి విభజనలలో పేర్కొనబడిన దామళ్ 'ఉరు కోడ్' ఆదులు నేటికిని కనిపించుచున్నవి. వీని పాలకులను దేశాధి కృతులని పిలుచు చుండెడివారు.

**గ్రామపాలనము**—— కోష్ఠములు, విషయములు, గ్రామములుగా విభజింపబడి పాలింపబడినవి ప్రతి గ్రామమున కధికారులుండిరి. వారిని గ్రామణులు లేక 'పపిట్టు'లని పిలిచెడివారు పల్లవ సామ్రాజ్యమున గల రాష్ట్రములు కోష్టములుగ, గ్రామములుగ విభజింపబడినట్లు మూడవ కుమారవిష్ణువు వేయించిన చెందలూరు శాసనము[1] వలన తెలియుచున్నది. గ్రామమే రాజు ఆదాయమునకు కేంద్రము. అనేక గ్రామటికలు కలిసి ఒక గ్రామమేర్పడును[2]. రాజు గ్రామము నుండి అధికారుల ద్వారా పన్నులు వసూలు చేయుచుండెను.

పల్లవ సామ్రాజ్యమున దేవభోగ్యములు, అగ్రహారములుండెను. ఈఅగ్రహారముల నుండియు, దేవభోగములనుండియు రాజోద్యోగులు పన్నులు వసూలు చేయనవసరము లేకుండెను కావున నట్టి, అగ్రహారములు, దేవభోగములు గ్రామములుగా లెక్కింప బడలేదు.

రాష్ట్రాధికారి తన రాష్ట్రములో నున్న గ్రామములను, దేవభోగములను, అగ్రహారములను, గ్రామముల సరిహద్దులను, ఆదాయ వ్యయములను, రాజు వసూలుచేయు పన్నులను, తెలుపునట్టి పట్టికలను సిద్ధపరచి, ఆ యా పట్టికలపై రాజునకుండు అధికారములను సైతము తెలియునట్లు వ్రాయించుచుండెను ప్రజలు రాజున కిచ్చు పన్ను వివరములు సులభముగా తెలిసికొనుటకీ పట్టికలెంతేని యుపకరించుచుండెను సామ్రాజ్యమున ప్రజల నుండి ఎంత పన్ను వసూలగునో ముందుగా తెలిసికొనుట కీ పట్టికలు సహాయపడుచుండెను

గ్రామ సరిహద్దులను స్థానికాధికారులు రక్షించుచుండిరి అధికృతులు, ఆయుక్తకులు, నైయోగికులు, రాజవల్లభులు, సంచారకులు అని స్థానికాధికారులు పిలువబడుచుండిరి.

---

1. Epigraphia Indica Vol VIII P 233
2 ఇచట గ్రామము Revenue Unit గా భావించబడినది.

ప్రతి గ్రామమున, దేవ, బ్రాహ్మదేయములకు, రాజభూము లకు, వేర్వేరు లెక్కలుండెడివి. దేవభూములనగా రాజులుగాని, భూస్వాములుగాని, ధనాఢ్యులుగాని, దేవాలయముల కొసంగిన భూములు. బ్రాహ్మదేయములనగా అష్టాదశ పరిహారములతో రాజులుగాని, యువ మహారాజులుగాని, రాణులుగాని, బ్రాహ్మణుల కొసంగిన భూములు లేక అగ్రహారములు.

పల్లవ శివస్కంద వర్మమహారాజు, 'అంధపథ' మండలి 'విరి పర' అను గ్రామమును దానముచేసినట్లాతడు వేయించిన మైదవోలు శాసనము[1] వలన తెలియుచున్నది మూఁడవ కుమార విష్ణువు చెందలూరు శాసనము[2] వలనను, విష్ణుగోపవర్మ ఉరువుపల్లి శాసనము[3] వలనను బ్రాహ్మదేయ దాన విషయము తెలియుచున్నది. ఇట్టి బ్రాహ్మదేయములపైన రాజునకెట్టి అధికారము లేకుండెను. అష్టాదశ అధికారములు దాన ప్రతిగ్రహీత పరమైయుండెను. ప్రతిగ్రహీత రాజునకెట్టి పన్నులును చెల్లింప నవసరము లేకుండెను.

రాజులు భూమిపై పన్ను విధించుచుండిరి. అట్టి పన్ను భూవిస్తీర్ణము, భూసారము, భూమిని కొలుచు స్థితినిబట్టి వసూలు చేయబడుచుండెను. ఇట్టి పన్నులకు సంబంధించిన, కార్యకలాపము లను నిర్వహించుటకు అధికారులుండిరి. శివస్కందవర్మ హిరహడ గళ్ళి శాసనమున[4] భట్టిశర్మ, 'రోహిణీగుప్త' 'అచ్యుతుఁడు' 'భోజ కుడు' మున్నగు రహస్యాధికారుల పేళ్ళు పేర్కొనఁబడినవి. రాజ శాసనములను వ్రాయువారీ రహస్యాధికారులే. హిరహడగళ్ళి శాసన ములో, రాజ్యపరిపాలనకు ముఖ్యులైన అధికారులపేళ్ళు పేర్కొనఁ బడినవి. రాజకుమారులు రాజప్రతినిధులుగా వ్యవహరించుచుండిరి.

---

1. Epigraphia Indica Vol VI P 84
2. Epigraphia Indica Vol VIII P 233.
3. I. A Vol V P 50.
4 Spigraphig Indica Vol I P 2.

పల్లవ శాసనములందు పేర్కొనబడిన ఆనాటి రాజకీయోద్యోగులలో సేనాపతులు, రాష్ట్రికులు, మదంబికులు మున్నగు వారు ముఖ్యులు

సేనాపతి = సైన్యాధికారి.

రాష్ట్రికులు } విషయములను లేక
రరికులు } కోష్ఠములను పాలించువారు

మదంబికులు = వస్తువులపై పన్ను వసూలు చేయువారు.

దేశాధికులు = స్థానిక పాలకులు.

వల్లభులు = రాజవల్లభులు = రాజుకు రావలసిన పన్నులను ప్రజల నుండి వసూలు చేయువారు.

అమాత్యులు = మంత్రులు = ప్రాడ్వివాకులు

గోవల్లభులు = పశువులను రక్షించువారు.

గ్రామభోజకులు = గ్రామాధి కారులు = గ్రామాదాయము ననుభవించువారు. బ్రాహ్మణాగ్రహారము లందును గ్రామ భోజకులుండిరి.

అరణ్యాధికులు = వనరక్షకులు.

నాయకులు = సైన్యాధికారులు.

గుమికులు = గ్రామాధికారులు.

సంచారాంతకులు = గూఢచారులు.

భద్రమనుష్యులు = రక్షకభటులు.

రాజునకు 18 రకములైన పన్నులు విధించు అధికారముండెను. అష్టాదశ పరిహారములతో రాజు బ్రాహ్మదేయముల నేర్పరచుట వలన ఇట్టిపన్నులు విధించు చుండెనని తెలియుచున్నది.

రాజు వసూలుచేయు పన్నులు ద్రవ్యరూపమునను, వస్తురూపమునను, ఉండెను. ఈవిధమైన పన్నుల ప్రశంస "కాసై కుక్కుడి" "బాహూర్" శాసనములందు కనిపించుచున్నది.

వృత్తిపన్ను, వస్తువులపై పన్ను రాజు వసూలు చేయుచుండెను. కుమ్మరి, కంసాలి, గౌండ్ల, గానుగవారు పన్నులు చెల్లింపవలసి వచ్చుచుండెను. ధాన్యము, వక్కలు, అమ్మటకు, వ్యాపారులు వర్తక సుంకము తీయవలసి యుండెను బట్టలపై పన్ను, వివాహ సమయము లందిచ్చు బహుమతులపై పన్ను ఉప్పు తయారు చేయుటకు ధనము నీయవలసి యుండెను.

పన్నులు వసూలుచేయు అధికారులను 'మండపి' లని పిలుచుచుండిరి. పన్నులు మండపము వద్ద వసూలు చేయుచుండుటను బట్టి వారికా పేరు వచ్చి యుండవచ్చును.[1]

ఉపారికర, వాత భూత హిరణ్య ఆదేయాదులు పన్నుల పేళ్ళు. రాజాజ్ఞ లేనిదే ఇటుకలతో పెద్ద పెద్ద భవనములు గాని, నూతుల నిర్మాణము గాని, కొబ్బరితోటల పెంపకము గాని, నూనె గానుగల ఏర్పాటుగాని, వీలు లేకుండెను.

**గ్రామ పరిపాలన - గ్రామ సభలు—** పల్లవ రాజులలో రెండవ నందివర్మ, మూఁడవ నందివర్మ, అపరాజితుల కాలమున గ్రామ సభలు నిర్వహింపబడుచుండెడివి. బ్రహ్మదేయము లందును ఇట్టి సభలుండెడివి. బ్రహ్మ దేయములలో నిట్టి సభలు అగ్రహారికులచే నిర్వ

1 నేడు సైతము గ్రామాధికారులు, చావడివద్ద కాని, రచ్చపై గాని కూర్చొని పన్నులు వసూలుచేయుచుందురు. పన్నులు వసూలుచేయు గ్రామాధికారిని 'మాలి పటేల్' అని వ్యవహరింతురు. 'మాల్' అనగా వస్తువు- (Revenue)

హింపబడు చుండెను. ఇందు విద్యావంతులు, సభ్యులుగా నుండెడి వారు. ఇట్టి సభలలో సభ్యులుగా నుండుటకు మంచి నడవడి కల్గి యుండి, మంత్ర బ్రాహ్మణములు. ధర్మశాస్త్రములు, అధ్యయనము చేసి, విమర్శాత్మకముగ వేదములను పరిశిష్టముతో పఠించినవారే అర్హులుగా నుండిరి. ఈ గ్రామ సభలందలి సభ్యుఁడు గ్రామ సంబంధ మైన ఎన్నికలకు అభ్యర్థిగా నుండవచ్చును. ఈ నియమముల నను సరించువాడు సభా కార్యక్రమములను కారణము లేకుండ తిరస్కరింప రాదు సభా తీర్మాన ధిక్కారికి-అతని అనుచరులకు దండము విధింప బడుచుండెను. సభా తీర్మాన తిరస్కారి తీర్మానములోని ప్రతి విషయ మున కొక 5 కాసులు ప్రతిఫలము చెల్లింపవలెనను నియమముండెను. అతడు సభా నియమములను పాటింతునని ప్రతిజ్ఞాబద్ధుడు కావలెను.

**సభలు-కార్యక్రమము :**—ఈ గ్రామ సభల పర్యవేక్షణమున దేవాలయములుండెను దేవాలయ పరిపాలనము, దేవాలయాదుల దానధర్మముల స్వీకారము, చెఱువుల రక్షణము, వాని మరమ్మతులు ఈ సభలు చూచుచుండెను. పల్లవుల కాలమున త్రవ్వించిన తటాక ములు, కాలువలు, నేటికిని నిలిచియున్నవి అందు కంచిలోని పర మేశ్వర తటాకము, మహేంద్ర తటాకము, మామందూరు చెఱువు చిత్రమేఘ తటాకము, ముఖ్యమైనవి.

దేవాలయములు- పూజా విధానము, దేవాలయ నిత్యకృత్య ములు జరుగుటకు, బియ్యము, నేయి, పూవులు ఇచ్చువారితో సంబంధ మేర్పరచుకొనుట- దేవాలయ ధనము దుర్వినియోగము కాకుండ చూచుట, అట్లు దుర్వినియోగ పరచువారిని శిక్షించుట, ముందు ముందట్టి దుశ్చర్యలు జరుగకుండునట్లు చూచుట, ఈ సభలు నిర్వహించు కార్యములలో ముఖ్యమైనవి

దేవాలయ రక్షకులు, దేవభూమిని, తనఖా పెట్టుటవలన దేవ తార్చన కంతరాయము కలుగ ఒక ధర్మాత్ముఁడా భూమిని దేవాల

యమునకు సంక్రమించునట్లు జేసెనని దంతివర్మ ట్రిప్లికేన్ శాసనము వలన తెలియుచున్నది.

పల్లవరాజులు పరిపాలనాదక్షులు-వైదిక మతానుయాయులు. పల్లవ వంశస్థాపకుడగు వీరకూర్చవర్మ మహారాజు నాగరాజ కుమార్తెను పరిణయమాడుటవలన రాజ్య లాభము బొందెనని తెలియుచున్నది. నాగరాజు లాంధ్రదేశీయులు. వీరకూర్చవర్మ నాగరాజ కన్యను వివాహమాడి కాంచీ ప్రాంతమును పొంది రాజైనట్లు వేలూర్పాళెయ శాసనమున నున్నది.

"యఃఫణీన్ద్ర సుతయా సహాగ్రహీ
ద్రాజ చిహ్నమఖిలం యశోధనః"

వీరకూర్చవర్మ మహారాజు కంచిని రాజధానిగా జేసికొని పల్లవ రాజ్యమును వ్యాపింపజేసెను. ఇతని పదియవ రాజ్య సంవత్సరమున ఇతని కుమారుడగు విజయస్కందవర్మ యువరాజుగా నుండి మైదవోలు శాసనము[1] వేయించెను.

శివస్కందవర్మ హిరహడగళ్ళి శాసనము[2] వలన నాతడు అగ్నిష్టోమ, వాజపేయ, అశ్వమేధ యాగముల గావించినట్లు తెలియుచున్నది శివస్కందవర్మ కాలమునాటికి పల్లవులు పరాక్రమోపేతులై సామ్రాజ్యమును విస్తరించినట్లూహింపవచ్చును. హిరహడగళ్ళి శాసనము శివస్కందవర్మ 8 వ రాజ్య సంవత్సరమున వేయింపబడినది.

---

1. "యువమహారాజో భారదాయసగోత్తో
పలవానాం శివఖందవమ్మో"—E.I Vol VI P. 84–89.

2. "అగ్గిథోమ, వాజపేయాస్సమేధయాజీ ధమ్మమహారాజాధిరాజో భారద్దాయో పల్లవాణ సివఖందవమో"—E. I Vol I P. 2

శివస్కందవర్మ సత్యసేనుడను రాజును జయించి, బ్రాహ్మణ ఘటికను గ్రహించినట్లు వేలూర్పాళెయపు శాసనము నందున్నది. అనగా ఆనాటి రాజులు బ్రాహ్మణ మతాభిమానము కలిగియుండి ఘటికా స్థానములను పోషించుచుండిరనియు, బ్రాహ్మణుల కగ్రహారము లొసంగుచుండిరనియు తెలియుచున్నది.

"అన్వవాయ నభశ్చన్ద్రః
స్కాన్ద శిష్య స్తతోభవ
ద్విజానాం ఘటికానాంరాజ్ఞ
స్సత్య సేనాజ్జ హారయః"

హిరహడగల్లి శాసనమున కొలివాల గ్రామభోజకుడు 'భట్టిసమ్మ'[1] రాజుయొక్క మంత్రాంగ సభలో సభ్యుడుగా వర్ణింపబడినాడు. ఆనాడు బ్రాహ్మణులు రాజకీయ వ్యవహారములందు ప్రముఖ పాత్ర వహించుచుండిరని తెలియుచున్నది. ఆనాడు కాంచీపురము విద్యలకు నిలయము. శివస్కందవర్మ మైదవోలు శాసనము కాంచీపురము నుండి యొసంగినట్లు తెలియుచున్నది[2]

వైదుష్యము:— పల్లవరాజన్యులు భాషాభిమానులు. పండితులు, కవులు, వాఙ్మయ పోషకులు - సంస్కృత భాష నాదరించి పోషించిన వారు. కాంచీ నగరము సమస్త విద్యలకు ప్రశస్తమైన విద్యాపీఠము నాగరకతా సంస్కృతులకు నిలయము.

---

1. "కొలభోజక సరహసాధీకత భట్టిసమ్మస" — E I Vol I P 2

2. కాంచీపురతో యువమహారాజో భారదాయస
గోత్తో పలవానం సివఖందవమ్మో
దంఞకడే వాప్తం ఆణపయతి.
E I. vol VI P 84-89

పల్లవ రాజులు వేయించిన శాసనము లందు తెలుఁగు దేశము నకు సంబంధించిన గ్రామ నామము లున్నవి.

కొన్నైకుక్కుఁడి శాసనములోని ప్రశస్తిభాగము సంస్కృత భాషలో నిర్దుష్టమైన శైలిలో వ్రాయఁబడినది. ఇట్టి ప్రశస్తి భాగములు మహా కవుల రచనలవలె గన్పట్టును. పల్లవ రాజుల యాస్థానమలంకరించిన కవు లెవరో తెలియదు కాని కాంచీ నగరము సమస్త విద్యలకు నిలయ మని పతంజలి వర్ణనల వలన తెలియుచున్నది. బౌద్ధ గ్రంథమగు సంఘ వాఙ్మయమును బట్టి ఆచార్య దిఙ్నాగుడు 'అరావణ అడిగళ' నగర మున నుండెనని తెలియుచున్నది.

కదంబవంశ స్థాపకుఁడు మయూరశర్మ. ఈతఁడు వేదవిద్యా భ్యాస మొనరించుటకు కాంచీ నగరము వెళ్ళెను.

కదంబవంశ స్థాపకుఁడగు మయూరశర్మ విషయము తాళగుండ శాసనమున వర్ణింపఁబడినది.

'హారీతి పుత్రులును, మానవ్యస గోత్రులును, వేదాధ్యయన సంపన్నులును, సద్గుణములుకల వారును గల బ్రాహ్మణ కుటుంబ మొకటి యుండెను వివిధ యజ్ఞావబృథ, పుణ్యజలములందు పలు మారు తడిసిన సిగలుగలవారు, ప్రవచనావగాహన నిష్ణాతులును విధి ప్రకారము సమిధలనగ్ని యందు హోమము చేసిన వారును, సోమపాన ముగావించిన వారును, ప్రణవ పూర్వకముగా నారు విధముల వేద మును పఠించు వారి కంఠస్వరములచే మారుమ్రోగు గృహాంత రాళము గల వారును, చాతుర్మాస్యము, హోమము, ఇష్టి, పశు బంధము పౌర్ణమాస్యశ్రాద్ధ పౌష్టిక క్రియలను చేయువారును, అతి థులచే నిరతమాశ్రయింపబడినదియు, సవనత్రయములు సేయని దినము లేనిదియునగు వసతిగలవారునునగు నీ బ్రాహ్మణుల గృహాసమీపమున వికసించిన పుష్పములచే నిండిన కదంబపాదప ముండెను. వారి వృత్త

మును పెంచుట వలన వారికా వృతుముతోడి సానామ్యసాధర్మ్యములు కలిగి యచ్చటి వారిచే కదంబులని పిలువబడినారు"

ఈ వంశమున శ్రుతశీలి, శ్రీమంతుడు, శౌచాద్యలం కృతుడును మయూరశర్మ అను ద్విజోత్తముఁడుద్భవించెను. అతఁడు ప్రవచనమును సర్వమును చదువదలచి తన ఉపాధ్యాయుఁడగు వీరవమ్మర్గతో కంచికిపోయి తార్కికుడై ఘటికను ప్రవేశించెను అచట ఏర్పడిన కలహాముచే రోషితుడై క్షత్రియులకన్న విప్రులెంత సత్వహీనులై యున్నారు? గురుకులము నారాధించుచు స్వశాఖను ప్రయత్నముతో బఠించినవానికి సైతము బ్రహ్మసిద్ధియగుట నృపాధీనమైననంతకు మించిన దుఃఖమేమియున్నది," అని చింతించి ఖడ్గము నొరనుండి పెరికి పల్లవేంద్రుని యంతపాలుర నోడించి శ్రీపర్వతద్వారము వరకుగల నరణ్యప్రదేశమును స్వాధీనము గావించుకొని పాలించెను.

అవంతీ సుందరి అను గ్రంథము వలన సింహావిష్ణువు పశ్చిమ గాంగరాజగు దుర్వినీతుని యాస్థానమున నున్న భారవి కవిని కంచికి తెచ్చుకొనినట్లు తెలియుచున్నది. సింహావిష్ణువు సంస్కృత భాషాభిమాని. దామోదరుఁడను కవి ఈతని యాస్థానము నలంకరించి యుండెను.

మొదటి మహేంద్రవర్మ పల్లవరాజులలో శ్రేష్ఠుఁడే కాక కళాకుశలుఁడు. శిల్పసంగీత విద్యావిశారదుడు. వాస్తు శాస్త్రజ్ఞుడు. కవి, పండితుడు. పండితాభిమాని. కవిపండిత పోషకుఁడు. భగవదజ్జుకము, మత్తవిలాస ప్రహసనములాది ప్రహసనములను రచించెను. ఈ ప్రహసనముల వలన మహేంద్రవర్మకు జైన, కాపాలి కాదులయెడగల నిరసన భావము తెలియుచున్నది.

కాపాలికుఁడొకఁడు మదిరాపానమున ప్రమత్తుఁడై ఒక స్త్రీతో సంచరించుట, శునకము తీసుకపోయిన కపాలము నొకశాక్యభిక్షు

వపహరించెనను మిషతో నతనితో పోరాడుట, వివాద పరిష్కారార్థము నీచుడైన పాశుపతునియొద్దకేగుట, ఆ కపాలమొక ఉన్మాదుని వద్ద లభించుట ఆదిగాగల అంశములు వ్యంగ్యముగా రచింపబడినవి. ఇందు జైన బౌద్ధ కాపాలికాది మతములను మహేంద్రవర్మ కించ పరచెను.

ప్రహసనాంతమున తాను శాస్త్రమల్లుడననియు, మంగళశ్లోకమున "అవనిభాజుడ"ననియు చెప్పుకొనినాడు. ఈ విషయము "గుణాభరమత్తవిలాస" ప్రశంస నాంది ప్రస్తావనలలోనున్నది.

'కుడిమియామలై' పర్వతముపై నీరాజు ఒకసంగీత గ్రంథము రచించి చెక్కించినాడు. మహేంద్రవర్మ రుద్రాచార్యుని శిష్యుడు. ఈరాజన్యుడు రచించిన సంగీతగ్రంథమున రాగస్వర వర్ణనా విశేషములున్నవి. ఈ గ్రంథ రచనమున ఈతనికి "సంకీర్ణజాతి" బిరుద మేర్పడినది. మహేంద్రవర్మ అనేక దేవాలయములను నిర్మించెను.

అరువదిముగ్గురు నయనారులలో అప్పార్ లేక తిరునావుక్కరసు, తిరుజ్ఞాన సంబంధార్, సుందరార్లు, ఈతని సమకాలికులు. వీరు భక్తిరసావేశమున పెక్కు శైవ సంబంధమైన గ్రంథములను రచించిరి. 'తేవారం' అను పదములను వీరు, తమిళభాషలో రచించిరి. ఇందు నాలుగు వేల పదములున్నవి. ఈకాలమున జైన దిగంబరాచార్యుడు లోకవిభాగము రచించెను.

"దండి" మహాకవి రెండవ నరసింహావర్మ ఆస్థానకవి. అవంతీ సుందరి కథవలన, దండి బాల్యమున కంచిని విడిచి పారిపోయి, తరువాత, నరసింహావర్మ ఆస్థానమును జేరెనని తెలియుచున్నది. మామల్లపుర శిల్పసంపద గాంచుటకు దండిమహాకవి అచటికి వెళ్లినట్లు తెలియుచున్నది.

రెండవ నరసింహావర్మ అలంకారశాస్త్రమును దండిమహా కవివద్ద నభ్యసించెను. రెండవ నందివర్మ జ్యేష్ఠపాద సోమయాజికి "ఏకాదిర మంగళం" అను గ్రామమును దానమిచ్చెను. ప్రతిగ్రహీత బృహస్పతి వంటి వాఁడు. నాలుగు వేదములు వేదాంగముల నధ్య యన మొనర్చినవాఁడు. శ్రవణపేయముగా సామవేదమును గానము చేయఁగల సమర్థుఁడు భాషా చరిత్రజ్ఞుఁడు "శ్రుతిస్మృతి" పురా ణేతి హాసాదుల నెరింగినవాఁడు. మీమాంస తెలిసిన వాఁడు. పురా ణోపాఖ్యాన నాటక కవిత్వములందు నిష్ణాతుఁడు. ఛాందోగ్య సూత్రా వలంబకుడు. వాజపేయి.

నందివర్మ కవితా ప్రతిభయందు వాల్మీకివంటి వాడని విద్వ జ్జనులీతని గౌరవించు చుండిరనియు, పరమేశ్వర ఉత్తరకర్ణిక, త్రివి క్రమ సంస్కృత పండితులీతని యాస్థానము నలంకరించి యుండిరని తెలియుచున్నది. చతుర్విధ కావ్యరచనా సామర్థ్యముగల తిరుమంగ యాళ్వారను వైష్ణవాచార్యుఁడీతని సమకాలికుఁడు. "చతుష్కవి" నాలుకవి పెరుమాళ్ అని ఈకవినందురు. ఈతని గ్రంథము నాలా యిర ప్రబంధమే. ఈగ్రంథము నందీతఁడు తన సమకాలీన రాజుల యెడ తనకుఁగల భక్తి విశ్వాసములను తెలుపుకొనెను.

మూఁడవ నందివర్మ తమిళవాఙ్మయ పోషకుఁడు. నృపతుంగ వర్మకాలమున "బాహూర్" గ్రామమున వేదవిద్యాలయ ముండెను. దానికాతఁడు మూఁడు గ్రామములను దానమొసంగెను. ఈ విద్యా లయమున 14 గుణములుండెను. గుణములనగా శాఖలు.

4 వేదములు.
6 వేదాంగములు.
1 న్యాయము.
1 మీమాంస.
1 పురాణము.
1 ధర్మశాస్త్రము.

---

14 గుణములు లేక శాఖలు.

ఈ కాలమున రచింపఁబడిన నాటకములు రంగస్థల ప్రయోగాను కూలముగ నున్నవి. ఇట్టివానిలో భాసనాటకములు శూద్రకుని రచనలు చేరును.

పల్లవరాజుల కాలమున వెలసిన శాసనములందీ క్రింద నుదహరింపఁ బడిన గ్రామ నామములున్నవి. ఇవి ఆంధ్రదేశమునకు సంబంధించినవి.

విరిపర:— శివస్కందవర్మ మైదవోలు శాసనము
E.1 vol VI P 84–89

దాలూరే:— చారుదేవి బ్రిటిషు మ్యూజియము శాసనము.
E 1 vol VIII P 143.

చెన్దలూర:— రెండవ కుమార విష్ణువు చెందలూరు తామ్ర శాసనము.
E. 1. vol VIII P 233–236

ఉరువపల్లియె.
1 A vol V P 51.

| | |
|---|---|
| కణ్డుకూరు.<br>కొణ్డ ముురువుదు<br>క (కు) రుపూర.<br>నడిప్పి (నడిపి). | నెడుంగరాయ<br>శాసనము<br>భారతి<br>vol XVIII P. 699. |

| | |
|---|---|
| ఓమ్ గోడు<br>కోడికిమ్ (కోడంకి),<br>నఆాచడు.<br>నడాకుదురు.<br>కుణ్డూరు. (కున్దూరు)<br>పికిరే. | రెండవ సింహా వర్మ<br>పికిరె దానశాసనము.<br>E. 1 Vol. VIII. P.<br>159 - 163 |

| | | |
|---|---|---|
| మాఞ్జయా (దూ)గ్రామే | — | రెండవ సింహావర్మ మంగదూరుదాన శాసనము. 1 A vol V P. 155. |
| విళవట్టి | — | రెండవసింహావర్మ విళవట్టి దానశాసనము. E i vol XXIV P.29. |
| (ళ) ఋగుబమ్‌లు. పాగుహూరు. కుణ్డూర్. నాగోళమి. కర్మరాష్ట్రే. చూరనామగ్రామే. ముయురురకుటువ మేఱతాపః. | | విష్ణుగోపవర్మ చూరదాన శాసనము[1]. |

**మతపరిస్థితులు :** — పల్లవుల కాలమున వైదికమతము దక్షిణాపథమందు వ్యాపించినది ఈరాజన్యులు వైదికమతానుయాయులు. ఈకాలమున జైన, బౌద్ధములు క్రమముగా క్షీణించినవి. మొదటి మహేంద్రవర్మ జైనమతస్థుడై అన్యమతముల వారిని హింసించుచు 'అప్పార్' అను శివాచార్యునివలన శైవమత దీక్షబూని శైవమతాభివృద్ధికి పాటుపడినట్లు పెరియపురాణము వలన తెలియుచున్నది.

అప్పార్, మతసిద్ధాంత వాదములందు జైనులను గెలిచెను.

---

1. కర్మరాష్ట్రేచూర నామగ్రామే-- తస్య గ్రామస్య పశ్చిమతః (ళ) ఋగుబంఱునామగ్రామః -- దక్షిణతః పాగుహూరు గ్రామసీమః స్వరితముయురురకుటువ మేఱతాపః పశ్చిమత (తో) నాగోళమి — గ్రామసీమః —కుణ్డూర్ వాస్తవ్యాయ —

E. 1. vol XXIV P. 18.

మహేంద్రవర్మ జైనమతావలంబిగా నున్నకాలమున అప్పార్‌ను హింసించెను. అప్పార్ తన మహిమలచే ఆ హింసలను తప్పించుకొనెను. అప్పార్‌యొక్క మహిమను తెలిసికొని మహేంద్రవర్మ జైనమతము త్యజించి శైవమతము నవలంబించెను. ఈరాజు, వళ్ళమ్ - మహేంద్రవడి, దాళవానూర్, సియ్యమంగళమ్— పల్లావరమ్ మున్నగుచోట్ల అనేక శివాలయములను కట్టించెను.

రెండవ నరసింహవర్మ శైవమతావలంబియై అనేకశివాలయములను గట్టించెను. ఈరాజులు, శైవులైనను, అన్య మతస్థులను హింసింప లేదు. మహేంద్రవాడిలో, మహేంద్రవర్మ విష్ణ్వాలయమును కట్టించెను. ఈతడు బ్రహ్మాలయమును నిర్మించినట్లు మాడుగ పట్టు శాసనము వలన తెలియుచున్నది.

మూఁడవ నందివర్మ వైష్ణవ మతావలంబి, 'కాసైకుక్కుడి' శాసనమువలన ఈరాజు ముకుందుని పాదార విందములకే తప్ప ఇంకొకరికి నమస్కరింప లేదని తెలియుచున్నది. ఈరాజు అశ్వమేధ యాగ మొనరించినాఁడు. కంచి వైకుంఠ పెరుమాళ్ ఆలయము, కూరమీనందు కేశవ పెరుమాళ్, కంచిలోని ముక్తేశ్వరమ్, పరమేశ్వర విణ్ణగరమ్ ఆలయములు నిర్మింప జేసెను.

చీనాయాత్రికుఁడగు యువాన్‌చాంగ్, కంచిలో 100 సంఘారామము లుండెననియు, అందు 10,0000 భిక్షువు లుండిరనియు, స్థవిర సిద్ధాంతావలంబకులనియు తన గ్రంథమున వ్రాసుకొనెను. కంచిలో హిందూ, జైన దేవాలయములు, సుమారు 80 యుండెను. జైనులలో దిగంబర జైనులసంఖ్య యధికముగా నుండెను.

**సాంఘిక పరిస్థితులు** — ఆనాటి సాంఘిక పరిస్థితులు ప్రజా జీవనము, పల్లవుల శాసనముల వలనను, మత్తవిలాస ప్రహసనము, తేవారమ్, నాలాయిరు గ్రంథములవలనను, చీనా యాత్రికుఁడగు యువాన్‌చాంగ్ వ్రాతలవలనను, తెలియుచున్నది. మత్తవిలాస ప్రహసనము వలన శైవ మత ప్రాబల్యాము అన్యమతముల దుస్థితి తెలియుచున్నది. రాజు శైవమతానుయాయి. ప్రజలలో 3/4 వంతు శైవులు. అన్యమతస్థు లల్పసంఖ్యాకులు.

బౌద్ధులు, కాపాలిక సిద్ధులు, శాక్యభిక్షులు, పాశుపతులు, తమ మతములపేర, దూషితకృత్యము లొనర్చుచుండిరి. బౌద్ధ సన్యాసినులు, స్త్రీకాపాలిక సిద్ధులు, భ్రష్టులగుచుండిరి పవిత్ర బౌద్ధసంఘారామ, ఆరామ విహారములు, వ్యభిచార కేంద్రములుగా ప్రసిద్ధి బడిసినవి.

శైవ మతావలంబకులు, భక్తి సంపన్నులై యుండిరి. క్రీ. శ. 642 లో యువాన్‌చాంగు కంచికివచ్చి చాలకాలము నివసించెను. అతఁడీదేశమును ద్రవిడదేశమనెను. ఇది 600 లీల వైశాల్యమున్నదని తెల్పెను. భూమి సారవంతమైనదనియు, విస్తారమైనపంట లిచట నుండెననియు, వాతావరణ ముష్ణమనియు, నిష్టాపరులు, సత్యవాక్కుగల ప్రజలిచట నుండిరనియు, విజ్ఞానదురంధరులు, పండితులీప్రాంతీయులని "తేవారమ్" అను గ్రంథము వలన తెలియుచున్నది.

ప్రజలు దైవభక్తులు - రాజులు - ప్రజలు, బ్రాహ్మణులను గౌరవించు చుండిరి. చాతుర్వర్ణవ్యవస్థ అమలులో నుండెను, ప్రజలు రాజాజ్ఞను శిరసావహించు చుండిరి. వినయవిధేయులై ప్రజలు సత్క్రమపన్నులు చెల్లించు చుండిరి. రాజ్యమున అల్లరులు లేకుండెను,

రాజు ప్రజలను కన్నబిడ్డలవలె పాలించుచుండెను. యుద్ధ సమయము లందు ఆహారకొరత ఏర్పడకుండ తగిన సదుపాయములను రాజులు కల్గించు చుండిరి. ప్రజా సౌకర్యమునకై రాజులు పాఠశాలలు, వైద్యశాలలు ఏర్పరచిరి. తటాకములు బావులు, త్రవ్వించిరి. ప్రజలు సుఖముగా జీవించు చుండిరి.

**శిల్పము:-** క్రీస్తుశకము 7వ శతాబ్ది నుండి 9వ శతాబ్ది వరకు దక్షిణా పథమున పల్లవ శిల్పము వృద్ధి జెందినది. దేవాలయముల నిర్మించి, వాటిని శిల్పకళామయములుగ నొనర్చి, శిల్పులను పోషించి అనల్పమైన శిల్ప సంపదను వృద్ధి గావించి పల్లవరాజన్యులు కళాపోష కులుగా ప్రసిద్ధి చెందినవారు. పల్లవ సామ్రాజ్యమున ప్రజలు శైవ మతావలంబకులు. రాజులు శైవ మతస్థులు. శివాలయములను నిర్మిం చిరి పరమత సహనము కలిగి, విష్ణ్వాలయములను కట్టించి శివ కేశవు లకు భేదముకల్పించి, దేవాలయములకు పరిపూర్ణ స్వరూప మొసంగిన కీర్తినార్జించినారు. శిల్పకళల కావాసమైన దేవాలయముల నత్యంత రామణీయకముగ నిర్మించి, ఆలయ కుడ్యముల పైనను, రాతి స్తంభ ముల పైనను, ద్వారబంధముల పైనను, మండప స్తంభముల పైనను పురాణ గాథలు చెక్కించి, అనన్య సామాన్య శిల్పసంపదతో విరాజిల్లు నట్లా దేవాలయముల రూపురేఖలను తీర్చిదిద్దుటయే గాక, దేవాలయ శిల్పసంపదను పోషించుటతోబాటు తమ వైదికమత నిరతిని వెల్లడించి మత ప్రచారము గావించినారు.

పల్లవరాజులలో మొదటి మహేంద్రవర్మ కళాభిమాని. దక్షిణ భారతమున శిల్ప చిత్ర లేఖనముల నీతఁడభివృద్ధి గావించెను. శిల్పకళా సంశోభితమైన దేవాలయములను, గుహాలయములను, కొండలను తొలచి నిర్మింపజేసి తన కళాభిమానమును ప్రకటించెను. మహేంద్ర వర్మ కాలమున నిర్మింపబడిన గుహాలయములు కోణాకారముగనున్నవి.

ఇవి మధ్య రెండు భాగములుగ కనిపించును. ఈ రెండు భాగములకు నడుమ 'ప్రిసమ్' వంటి నిర్మాణము కనిపించును గర్భగుడులందు శివలింగములున్నవి. గర్భగుడి కిరువైపుల ద్వారపాలకుల విగ్రహము లున్నవి. ప్రభాతోరణములు సైతమున్నవి. ఈ గుహాలయములలోని స్తంభములు ప్రత్యేక శిల్పసంపదతో నొప్పారుచున్నవి. స్తంభములు చదరముగ నుండి రెండడుగుల వెడల్పు నాలుగడుగుల ఎత్తు కల్గి మధ్యభాగ మష్టకోణాకారమును కల్గియున్నవి. స్తంభములపై కమల ములు చెక్కబడినవి. స్తంభములకు చతురస్రమైన నిర్మాణము కలిగి అమరావతిలోని స్తంభములను తలపించుచుండును.

మహేంద్రవర్మ కాలమున దక్షిణాంధ్రమున వెలసిన చిత్ర లేఖ నము, పుదుకోట్టయందలి సిత్తనవాసిల్ మామందూర్గయందు కని పించును అజంతా అమరావతి మున్నగు ప్రాంతములందు వెలసిన చిత్రలేఖనములవలె నీ చిత్రలేఖనములున్నవి. కొన్ని చిత్రముల రంగులు చెదరిపోయినవి. దేవాలయములందు కుడ్యములపై వర్ణచిత్రములు కని పించును. దేవాలయోపరి భాగములందును, స్తంభోపరి భాగములం దును చిత్రములు నిర్మింపబడినవి. దేవాలయముల కప్పులపై వివిధ వర్ణ చిత్రములున్నవి. పద్మ సరస్సు—పద్మముల మధ్య మీనములు, ఖాతులు, మహిషములు, గజములు, పద్మ హస్తులగు ముగ్గురు మను ష్యుల చిత్రములు కన్నుల కింపుగా నుండును. ఇందు చిత్రింపబడిన వ్యక్తులు ముప్వురు జైన మతానుయాయులు. ఈ చిత్రముల ఠీవి, రంగు, ముఖసౌందర్య మతిమనోహరముగ నుండి చూపరుల కాశ్చ ర్యము గొలుపును. స్తంభోపరిభాగ పద్మలత లల్లిబిల్లిగ నల్లుకొని యున్నవి. ఆలయమార్గ ప్రాంత స్తంభద్వయమున నర్తకులు చిత్రింప బడినారు.

ఈ కాలపు శిల్పమున స్తంభములాధారముగ కల్గిన మండప ములు కనిపించుచున్నవి. ఈ మండప స్తంభముల ఉపరి భాగమున

తోరణములు కనిపించును. మహేంద్రవర్మ ఒకే రాతితో కట్టబడిన దేవాలయములను పళ్ళమ్, పల్లావరమ్, తిరుచినాపల్లి, మాడగపట్టు, ప్రాంతములందు నిర్మించెను. పల్లావరములోని స్తంభములకు కుంభము లున్నవి తిరుచినాపల్లిలోని పర్వతముపై మహేంద్రవర్మ శివాలయ మును నిర్మించెను. ఈ శివాలయమున శివలింగముతోపాటు మహేంద్ర వర్మ మూర్తియున్నది. ఇది పురాతన వాస్తు నిర్మాణము. దీని వెనుక భాగమున నున్న కుడ్యముపై శాసనములు చెక్కబడినవి. ఎడమచేతి వైపున నున్న రెండు స్తంభములపై సంస్కృత శ్లోకములు చెక్క బడినవి. "పురుషోత్తమ, శాత్రుమల్ల, సత్యసంధ, బిరుదములుగల గుణా భరుడను రాజు ఈశివాలయమును నిర్మించినట్లు శాసనము లందున్నది. కావేరీ నదికి ఎడమవైపున నున్న స్తంభముమీద 'పల్లవులకు ప్రియ మైనదని' చెక్కబడినది.

మొదటి నరసింహావర్మ భైరవుని కొండలో గుహాలయ నిర్మా ణము గావించెను. ఇందు మండప నిర్మాణము ప్రాచీనమైనది. మండ పము ఉపరి భాగమందుగల చిత్రములందు వైలక్షణ్యము కనిపించును. స్తంభములందెన్నియో చిత్రములున్నవి. గుహాలయములందు క్రింద సింహములను చెక్కించి, వానిపై స్తంభములను లేపు పద్ధతి నీతఁడు ప్రవేశపెట్టెను. తరువాత పల్లవులీ పద్ధతి ననుకరించిరి. పక్షితీర్థములోని బరుకల్ మండప నిర్మాణము నీతడిట్లే గావించెను. ఇచట వేదగిరీశ్వ రాలయమున్నది. ఈ ఆలయమునకు ఏబది యడుగుల క్రింద ఏక శిల గుహాలయమున్నది. దీనినే బరాకల్ మండప మందురు. మండపము నకు రెండు భాగములందును సోపానములున్నవి. ఈ సోపానములు ఆలయ ముఖద్వారమువద్ద కలియును. ఆలయమున రెండు వసారాలు క్రింద ఒకటి, పైన ఒకటి కలవు. ఇవి నాలుగు స్తంభములపై లేపబడి నవి. మధ్య నున్న రెండు స్తంభములు చతురస్రముగ నున్నవి. స్తంభ మధ్య భాగ మష్టకోణాకారయుతముగా నున్నది. క్రింది వసారాలో

రెండు విగ్రహాములు మనుష్య ప్రమాణమున నున్నవి. ఈ విగ్రహాముల మెడలయందు, భుజములందు, చేతులందు భూషణములున్నవి. నడుమున యొడ్డాణ మున్నది. పై భాగమున వసారాలో శివలింగ మున్నది. ఇది లింగమున్నట్టి గర్భగుడి వసారాకన్న కొంచెది ఎత్తుగా నున్నది. దీనిని చేరుటకు రెండు మెట్లున్నవి. గర్భగుడికి రెండువైపుల ద్వార పాలకుల విగ్రహాము లున్నవి. లింగమునకు ముందు బ్రహ్మ విష్ణు విగ్రహాములున్నవి ఇచట త్రిమూర్తుల పూజ జరుగుచుండెనని చెప్పవచ్చును

రెండవ నరసింహావర్మకు రాజసింహుడని నామాంతరముకలదు ఈతని కాలమునుండి శిల్పమున రాజసింహా శైలి యారంభమగు చున్నది. వాస్తు శిల్ప లక్షణములతో గూడి యున్న కైలాసనాథాల యము నీతడు కంచిలో నిర్మించెను. ఇందు శివుని అర్థనారీశ్వర రూప మున్నది. వీణాపాణి పార్వతి, నందివాహానుడుగా శివుడు ఉన్నాడు. నిలువెత్తు నంది విగ్రహాము, ఆలయము ముందున్నది ఇచటి దేవుని షోడశ మహాలింగమని పిలుతురు. దక్షిణాంధ్రమున వెలసిన రాతి దేవాలయములలోనిది మొదటిది. ఆలయమున గోపురములు, స్తంభ ములుగల మండపముగలదు. ప్రాకారము చతురస్రముగనుండి గూళ్ళు కలిగి యున్నది. ప్రాకారము శివలీలాగాథలతో నద్భుత శిల్పసంపదతో నొప్పారుచున్నది యోగనిష్టాపరుడగు గంగాధరుఁడు, ప్రళయ కాల రుద్రుడు వీణాపాణియైన శశిధరుఁడు, మహిషాసురమర్దని మున్నగు చిత్రము లత్యంత రమణీయముగ నున్నవి

రెండవ నందివర్మ వైకుంఠ పెరుమాళ్ కోవెలను, కంచిలో నిర్మించెను. విష్ణువనేక రూపములలో నిందు చెక్కబడినాఁడు. తిరు మంగళయాళ్వార్ విష్ణువునుగూర్చి స్తుతిపూర్వకముగా శ్లోకములు వ్రాసెను. ఈ ఆలయము గర్భగుడిచుట్టు వసారా ఉన్నది. వసారా కుడ్యములపై రెండువరుసల చిత్రములున్నవి. చిత్రముల క్రింద స్థల

మున్నది. శిల్పవివరణమున కీశిల్పములు భాగములుగ విభజింప బడి నవి సమకాలీన చరిత్రను సూచించు ఘట్టములు, శిల్పవివరణ మసంపూర్ణము. ఈ కుడ్య చిత్రములందు పరమేశ్వర వర్మ మృత్యువు, దాయాదుల సాయమున నందివర్మ రాజగుట, నందివర్మ పట్టాభిషేక మహోత్సవము, మున్నగు ఘట్టములు, కనిపించు చున్నవి. ఈ ఆలయమునకు పరమేశ్వరవిణ్ణగరమని పేరు. "డోమ్" ఆకారపు కప్పు గల ముక్తేశ్వరాలయ నిర్మాత రెండవ నందివర్మయని చరిత్రకారుల యభిప్రాయము.

**మహాబలిపురము:—** పల్లవుల కాలమున వెలసిన మహాబలి పుర శిల్పములు ప్రపంచప్రసిద్ధి గన్నట్టివి. మహాబలిపురమునకే మామల్ల పురమని పేరు. మొదటి నరసింహావర్మకు మామల్లుడను బిరుద ముండెను. మహాబలిపురమందలి ఆలయములను నిర్మించిన వాడు మొదటి నరసింహావర్మయేయని భావింపబడుచున్నది.

మహాబలిపురమున పది మండపములున్నవి మహిషాసుర, వరహా, ధర్మారాజ, కోటికల్- కృష్ణ- పంచపాండవ, రామానుజ, శైవ (౫ గుహాలు) మండపములందున్నవి. రెండు మండపము లసంపూర్ణముగ నున్నవి. వాటి నిర్మాణ మితర మండపముల నిర్మాణమువలె నున్నది. స్తంభములు మనోహారముగ నుండి స్తంభముల క్రింద సింహాములున్నవి. సింహాముల చెక్కడ మత్యద్భుతముగానుండి పల్లవుల కాలపు శిల్పకళావైభవమును చాటుచున్నది.

సాగరతీరమున నున్న ఏడు రాతిరథము లతి ప్రసిద్ధములు. ఇందు పంచపాండవుల రథములున్నవి. ద్రౌపదిరథమున కొక ప్రత్యేకత కలదు ఈరథము తక్కిన రథములన్నిటికన్న చిన్నగా నుండి చూచుటకు పర్ణకుటీరమువలె నుండును. ఉన్న రథములలో చిన్న రథము కావున ఊరేగించుటకీరథము నుపయోగించు చుండి రేమో

యని తోచునట్లీరథమున్నది. ఈ రథమునకు క్రింద సింహాములు, మదగజములు, రాతితో మలచబడిన సింహాములు రథమును మోయు చున్నట్లుండును

ధర్మరాజు రథము బౌద్ధ విహారానుగుణ్యముగ నిర్మింప బడి నది. ఈ రథముయొక్క క్రిందిభాగము చదరముగను పైభాగము శిఖరాకారముగను, కప్పు 'డోమ్' ఆకారముగను కలిగి చూపరుల దృష్టి నాకర్షించును. ఇంకను విలక్షణమైనవి భీమ, సహాదేవ, గణేశ్వర రథములు. బౌద్ధ ఆలయములను, చైత్యములను, అనుసరించి ఇవి నిర్మింప బడినవి. ఈ రథములకు దగ్గరలో రాతిసింహాములు, మత్త గజములు, నందీశ్వర విగ్రహాము కలవు. ఈమూఁడు విధముల విగ్ర హాములు, దుర్గాదేవిని, శివుని, ఇంద్రునిగూర్చి తెలుపును.

## ధర్మరాజు రథముపై చెక్కబడిన శాసనములు

1. శ్రీ నరసింహః
2 పృథివీసారః శ్రీభరః
3. భువన భాజనః
4. శ్రీమేఘః త్రైలోక్య వర్థనః విధిః
5. అత్యన్తకామః అనేకోపాయ
6. స్థిరభక్తిః మదనాభి రామః విధిః
7. నరసింహః భువనభాజనః శ్రీ మేఘః అప్రతిహత శాసనః
8 కామలాలితః అమేయమాయః సకల కళ్యాణః
9 నయన మనోహరః వామః అతిమానః
10. వామః పరాపరః
11 అనుపమః నయాఙ్కురః
12. లలితః
13 నయన మనోసారః సర్వతోభద్రః
14. శ్రీనిధిః నిరుత ర.

15. విధిః విభాగ్రిన్తః
16. సత్యపరాక్రమః పరావరః
17. శ్రీ అత్యన్తకామ పల్లవేశ్వరగృహమ్ రణజయః
18. అత్యన్తకామ పల్లవేశ్వరగృహమ్.

ఇచట తీరస్థదేవాలయము లున్నవి స్థలశయన దేవాలయము ప్రవాహాముున కొట్టుకపోయినది. తక్కినవి రాతితో నిర్మించినట్టివి. ఇందలి శిల్పకళ, అత్యద్భుతము నిర్మాణ మత్యంత రమణీయము శోభావంతము. ఆకర్షణీయము. దేవాలయ అంతర్భాగము లందు నీటి తొట్లెలున్నవి. అవసరమని తోచినపుడు వీటిని నీటితో నింపుచుండెడి వారు. నీటితో తొట్లెలు నింపినపుడు దేవాలయము నీటిలో నున్న ట్లుండును. నీరు పోవుటకు, వచ్చుటకు గొట్టము లున్నవి ఒక పెద్ద కాలువ ద్వారా నీరులోపలికి వచ్చు ఏర్పాటుచేయబడినది

ఆదిశేషునిపై వరాహాము కుడిపాదముంచినట్లున్న వరాహాదేవా లయమిచట నున్నది. వరాహామూర్తి కుడితొడపై భూదేవి ఆసీనురాలై యున్నది. రాక్షసులు భూమిని హారించి సముద్రములో వైచుచుండ శ్రీ మహావిష్ణు వామెను రక్షించుట ఇందుగల దృశ్యము. భూమిని మోయు ఆదిశేషుడు సముద్రము నుండి వచ్చుచున్నట్లున్నది. వీని యెదుట వామన త్రివిక్రముల మూర్తులున్నవి

గుహాల యందు పర్వతో పరిభాగమున పౌరాణిక గాధలు చెక్కబడినవి. మహిషాసుర మర్దని రాక్షస సంహారఘట్టము, మరి యొకచోట లక్ష్మిదేవికి రెండు గజములు నీటితో అభిషేకము చేయు చున్నట్లున్న దృశ్యము, 100′ పొడవు 50′ వెడల్పుగల శిలపై నరుడు తపము చేయుట, శివుడు పాశుపతాస్త్ర మొసంగుట మున్నగు విష యములు మనోరంజకముగ శెక్కబడినవి. ఇంకొకచోట బలి, రాజ సేన మృగ పరివృతుడై పాతాళమున కొలువుండు విధము, ఇంకొక

స్థలమున వాసుకి, వాసుకిపుత్రి ఉలూపి చిత్రము లున్నవి. మరియొక చోట శ్రీకృష్ణుడు గోవర్ధనగిరి నెత్తుట మొదలుగా గల కృష్ణలీలలు చెక్కబడినవి.

**వాణిజ్యము- నౌకా జీవనము:—** పల్లవ రాజుల కాలమున సముద్రయానము వలన విదేశ వ్యాపారము విశేషముగ సాగినది. రాజులు, ప్రజలలో నధిక సంఖ్యాకులు వైదిక మతావలంబులు. కావున, జైన బౌద్ధ కాపాలికాది మతములకు, వైదిక మతమునకు, సంఘర్షణ కలిగి నది. బౌద్ధులు మతరక్షణార్థము విదేశములకు వెళ్ళుట తటస్థించినది. రాజకీయ స్థితి వీరినిట్లు నౌకాజీవనమునకు పురికొల్పినది. వర్తకులా నాడు విదేశములం దధినివేశ రాజ్యములను స్థాపించుటలో కృతకృత్యు లైనారు. విదేశము లందు భారతీయ నాగరకత సంస్కృతి వృద్ధి జెందెను. బర్మా, కాంబోడియా, దేశములతోను, మలయా, సుమిత్రా జావా ద్వీపములతోను ఆనాడు వర్తక వ్యాపారములు సాగు చుండెను

శివస్కందవర్మ కాలమున దేశవిదేశ వాణిజ్యము విశేషముగా సాగినట్లు సంస్కృత గ్రంథములవలన తెలియుచున్నది. కామర, ఖోడుక, సోపట్మ, మెలాంగ్, కోడూరాదులానాటి ముఖ్యమైన రేవు పట్టణములు.

ఎనిమిదవ శతాబ్దిలో మహాబలిపురమొక పెద్ద ఓడరేవు పట్టణ మని తిరుమంగయాళ్వారు చెప్పెను. ఇచటినుండి పోవు నావలు, వెండి, బంగారు నగలతోడను, నవరత్నములతోను, మత్త గజముల తోను నిండియున్నట్లీతడు తెలిపెను

మద్రాసు కడలూరుల మధ్యనున్న ప్రదేశమున వివిధ దేశ ముల నాణెములు లభించినవి విదేశవర్తక మీకాలమున బాగుగా సాగుచుండె ననుట కీనాణెములు తార్కాణము

ఐదవ శతాబ్దమున చీనా యాత్రికుడగు ఫాహియాన్ మన దేశమునకు వచ్చెను. అతఁడు "వర్తకపుటోడలు తామ్రలిప్తినుండి బయలుదేరి, తూర్పుగా వెళ్ళి సింహళద్వీపములోని రేవు పట్టణములను చూచుకొని జావా ద్వీపము చేరుచుండెనని తెల్పినాడు

క్రీస్తుశకము నాలుగవ శతాబ్దిలో వేంగీరాజులు జావా, సుమత్రాదులను జయించినట్లు అచటి దీవులలోనున్న శాసనములవలన తెలియుచున్నది. దీవులలోని ఒక కొండపై సంస్కృత శ్లోకములు, హైందవరాజు పాదములు చెక్కబడియున్నవి. ద్వీపమును జయించిన సందర్భమున నివి చెక్కబడినవి. ద్వీపమును జయించిన రాజు పూర్ణవర్మయని శాసనము నందున్నది. ఈ శాసనమందు పేర్కొనబడిన పూర్ణవర్మ కాంచీ పాలకులలో నొకడని చరిత్రజ్ఞుల యభిప్రాయము.

మొదటి నరసింహవర్మ కాలమున తూర్పు దేశములతో వర్తక వ్యాపారము విశేషముగా నుండెను. అనేకములైన నావలు కంచి నుండి లంకాద్వీపమునకు బోవుచుండెనని చీనా యాత్రికుఁడగు యువాన్ చాంగ్ వ్రాతలవలన తెలియుచున్నది. లంకాద్వీప రాజకుమారుడు "మాణవర్మ" అచటి వారిచేత తరుమబడి కంచికివచ్చి నరసింహవర్మ శరణుపొంది సైన్య సహాయము వడసెను సింహళమునకు కంచినుండి ఓడలపై సైనికులు వెడలుట చీనా యాత్రికుడగు యువాన్‌చాంగ్ గాంచెను. నరసింహవర్మ కాలమున ఆంధ్ర దేశమునకు చీనా దేశముతో సంబంధముండుటయే గాక నరసింహవర్మ చీనా దేశమునకు రాయబారుల నంపినట్లు తెలియుచున్నది బౌద్ధ మతము చీనా దేశములో విశేష ప్రచారము బొందినది. బౌద్ధ భిక్షువులొక దేశమునుండి మరియొక దేశమునకు రాకపోకలు సాగించుచుండిరి.

ఈ కాలమున ఆంధ్రదేశము, సుమత్రా, సింహళము, జావా ద్వీపములతోను, చీనా. సయాం దేశములతోను వర్తక వ్యాపారము

చేయుచుండెను. ఆంధ్ర ద్రావిడ బ్రాహ్మణులు మత, సాంఘికాచార నిరోధములేక సముద్రయాన, విదేశ గమనమును చేయుచుండిరి. పల్లవ రాజులు సముద్రయానమును. వర్తక వ్యాపారములను ప్రోత్సహించుచుండిరి. ఇట్లు పల్లవులు పాలించిన కాలము నందాంధ్రదేశము సర్వతోముఖాభివృద్ధి జెందినదని చెప్పవచ్చును.

## ఈ ప్రకరణము వ్రాయుటలో దోడ్పడిన గ్రంథములు


1 E I. vol I, VI, VIII, and XXIV.

2: Indian Anti. vol V.

3. భారతి. vol. XVIII.

4. చరిత్ర రచన—డా. నేలటూరి వెంకటరమణయ్యగారు.

5. ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి- ఖండవల్లి సోదరులు.

6. Copper plate Inscriptions of Hyd Arc Museum By N Ramesan.

7. Early Dynasties of Andhra Desa By B v. Krishna Rao

# 5 వ. ప్రకరణము

# బృహత్ఫలాయన, ఆనందగోత్రిక శాలంకాయనుల కాలము

## A బృహత్ఫలాయనులకాలము

ఇక్ష్వాకుల యనంతరమాంధ్ర దేశములోని కొన్ని భాగములను పాలించినవారు బృహత్ఫలాయన వంశీయులు, మూడవ శతాబ్ది ఉత్తరార్థమున కృష్ణానదికి ఉత్తరమున నున్న ఆంధ్రదేశ ప్రాంతమును ఈ వంశీయులు పాలించిరి. ఈ వంశీయుల చరిత్రకు జయవర్మ మహారాజు వేయించిన కొండముది ప్రాకృత శాసనము[1] ముఖ్యాధారము. ఈ వంశీయులకు సంబంధించిన శాసనమిది యొక్కటియే ఇది ప్రాకృత శాసనము. ప్రాచీన పల్లవ లిపిలో వ్రాయబడినది జయవర్మ మహారాజు కాలము క్రీ.శ 270-285 గా చారిత్రకులు నిర్ణయించినారు.

ఈ శాసనము ఇక్ష్వాకు వంశీయుల శాసనముల ఛాయలో నున్నది. శాసనము వ్రాయించిన వాఁడు బాపహినవర్మ. 'మహాదండ నాయక' 'మహాతగవర' బిరుదాంచితుఁడు ఇక్ష్వాకుల శాసనములందు 'మహాతలవర' బిరుదము కనిపించుచున్నది. 'మహాతగవర' అనగా ప్రాడ్వివాకుఁడు. ఇక్ష్వాకుల సామంతులు పూగివారు హిరణ్యాకులు వీరికి మహాతలవర బిరుదములున్నట్లు నాగార్జునకొండ శాసనములవలన తెలియుచున్నది. జయవర్మ మహారాజు ఇక్ష్వాకుల సామంతుడుగ నుండి యుండును. ఇక్ష్వాకుల యనంతర మాంధ్రదేశము నాక్రమించిన పల్లవ రాజులను యుద్ధమున ఓడించి, ఆంధ్ర దేశమునుండి వారిని

---

1 E I vol VI P. 315

తటిమి జయవర్మ మహారాజు బృహత్ఫలాయన వంశమును స్థాపించి సుమారు 15 సంవత్సరములు ఆంధ్రదేశమును పాలించిరి.

**పరిపాలనా విధానము:** — బృహత్ఫలాయనులు పరిపాలనా విధానమున శాతవాహనులను అనుసరించిరి. శాతవాహనుల తరువాత ఆంధ్రదేశమును పాలించిన ఇక్ష్వాకులు శాతవాహనుల పరిపాలనా విధానమును ప్రవేశపెట్టిరి. జయవర్మ మహారాజు పల్లవులతో యుద్ధము లొనర్చి రాజ్యమున శాంతిభద్రతల నెలకొల్పి చక్కని పరి పాలన మొనర్చెను. రాజు నిరంకుశుడు. ఐనను ప్రజాభీష్టము ననుస రించి, మంత్రుల సలహాలను పాటించి పరిపాలన మొనర్చుచుండెను. వేదవిదులైన విప్రుల గౌరవాదరములు పొందుచుండిరి. జయవర్మ మహారాజు కూడూరు ప్రాంతమున జరిగిన యుద్ధములో జయమొందిన పిదప (కొండముది) శాసనము వేయించెను. ఆనాఁడు దేశము పరి పాలనా సౌకర్యముకొరకు నాడు, ఆహారము, విషయము అను భాగము లుగ నుండెను.

**కొండముది శాసనము:**—కూడూరు సమీప ప్రాంతమున జరి గిన యుద్ధానంతరము, విజయస్కంధావారమునుండి జయవర్మ మహారాజు కూడూరులో నున్న తన వ్యాపృతునకు ఆజ్ఞనొసంగుచు "కూడూరు హారములోని 'పాంటూరను' గ్రామమును సర్వపరిహార ములతో బ్రాహ్మదేయముగ ఎనమిదిమంది బ్రాహ్మణులకు దాన మొసంగిన" దానశాసనము. అగ్రహారమును ఇరువది నాలుగు భాగ ములుగజేసి ప్రతి గ్రహీతల కొసంగెను. జయవర్మ మహారాజు పది యవ విజయ రాజ్యసంవత్సరమున హేమంతము మొదటి దినమున ఈ దాన మీయఁబడినది.

జయవర్మ మహారాజు "దానమిచ్చిన గ్రామములో రాజ భటులు ప్రవేశించుటకు వీలులేదనియు పన్నులు వసూలుచేయుటకు

రాజకీయోద్యోగు లీ బ్రాహ్మదేయములందు ప్రవేశింపరాదనియు, ఉప్పును త్రవ్వుహక్కు అగ్రహారికులకే ఉండవలెననియు" కట్టడి ఏర్పఱచెను.

కొండముది శాసనమువలన జయవర్మ మహారాజు మహేశ్వర పాదపరిగ్రహీతుఁడని తెలియుచున్నది. కూడూరు హారములోని 'పాంటూరను' గ్రామమును బ్రాహ్మదేయముగ నొనర్చి ఎనిమిదిమంది విప్రుల కగ్రహారముగ నొసంగెను. అందు సర్వగుప్తార్యుఁడు ముఖ్యుఁడు.

| | | | |
|---|---|---|---|
| 1. సర్వగుప్తార్య | గౌతమగోత్రము | 8 | భాగములు. |
| 2. సావిగినార్య. | తానవ్య గోత్రము | 8 | ,, |
| 3 గోగినార్య. | , | 8 | ,, |
| 4. భావనార్య. | కౌండిన్య గోత్రము | 2 | ,, |
| 5. రుద్రవిష్ణ్వార్య | భారద్వాజ గోత్రము | $1\frac{1}{2}$ | ,, |
| 6. ఈశ్వరదత్తార్య | కార్షాణాయణ గోత్రము | $1\frac{1}{2}$ | ,, |
| 7. రుద్రవిష్ణ్వార్య | ఔపమన్యవ గోత్రము | 1 | ,, |
| 8. స్కందరుద్రార్య | కౌశిక గోత్రము | $\frac{1}{2}$ | |

E I. Vol VI P. 315

**రాజధాని - ప్రధాన నగరములు :-** టాలెమీ వ్రాతలవలన "కొడ్డూరు" నగరము పేరు తెలియుచున్నది. బృహత్ఫలాయన జయ వర్మ మహారాజు రాజధాని కోడూరు ఈ కోడూరును, కృష్ణానది తీరముననను, సముద్ర సమీపముననుఁ ఘంటసాలకు నిరువది మైళ్ళ దూరముననను ఉన్న కోడూరును ఒక్కటే. ఇచట ప్రాచీన శిధిలములు కనిపించుచున్నవి. జయవర్మ మహారాజు కాలమున వర్తక వ్యాపార ములు విశేషముగ సాగుచుండెనని యూహింప వీలగుచున్నది. కోడూరు, కంటకొస్సల, అల్లోసైని నగరములు బృహత్ఫలాయనుల రాజ్యమందును, సముద్రతీర సామీప్యముననను, ఉండుటవలన, ఈ నగ

రములు రేవు పట్టణములగుటవలన, వర్తకులకు, మత ప్రచారకులకు, రక్షణ కల్పించుట కీరాజులు కృషిచేసి యుండవచ్చునని భావించ వచ్చును. కాల క్రమమున కోడూరు, ఘంటసాల నగరములు కృష్ణా నది వరదలలో కొట్టుకపోయి యుండవచ్చును.

టాలెమీతన భూగోళ శాస్త్ర గ్రంథమున "కొడ్డూరు"ను ప్రధాన నగరముగను వ్యాపార కేంద్రముగను వర్ణించెను. 'అరోనా ర్నాయ్' లేక 'ఆర్వార్నాయ్' అను రాజవంశము మైసోలియా దక్షిణ ప్రాంతమునేలినట్లు తెలియుచున్నది. మైసోలియాయే కృష్ణా నది కావున కొడ్డూరు కృష్ణానదికి దిగువనున్న నగరము కావున ఈ నగరమును రాజధానిగా ఆంధ్రదేశమును పాలించిన వంశము బృహత్ఫ లాయన వంశమని యూహింపవచ్చును

జయవర్మ మహారాజు స్వతంత్రుఁడగుటకుఁ బూర్వమీ వంశీ యులు సాతవాహనులకు, ఆపిమ్మట ఇక్ష్వాకులకు సామంతులుగా నుండి రాజ్యమును పాలించియుందురు ఈ వంశీయులు బ్రాహ్మణులు.

కూడూరు హారమనగా కూడూరు కేంద్రముగా గల ప్రాంతము. కూడూరు హారము తరువాతి శాసనములందు—

కూదూరు హారము
కూడూరు హారము
కూదాౄ హారము
గుదాౄ హారము
గుద్ర హారము

అని పేర్కొనబడినది. కొండముది శాసనమున పేర్కొనబడిన గ్రామము పాంటూర.

ఫాంటూర = పాథూర

కొండముదికి తూర్పున తెనాలి తాలూకాలోని 'పాతూరు' గ్రామముగా గుర్తింపబడినది.

కృష్ణానదీ తీరము నుండి సముద్రము వరకు 'కూడూరు హారము' వ్యాపించియుండెను. ఈ కూడూరు హారములో పశ్చిమమున కొండముది నగరము పాతూరు గ్రామము లున్నవి.

పల్లవ శివస్కందవర్మ అనంతరము రాజ్యమునకు వచ్చిన రాజులు బలహీనులగుటవలన బృహత్ఫలాయన జయవర్మ పల్లవుల నాంధ్రదేశమునుండి తఱిమి తానాంధ్రదేశ చక్రవర్తినని చాటుకొనినాఁడు. ఒక దశాబ్దమువఱకు పల్లవు లాంధ్రదేశమువైపు కన్నెత్తి జూడకుండ జేసినాడు. పల్లవులతో జరిగిన యొకయుద్ధములో జయవర్మ మరణించెను. ఆ యుద్ధమున వీరవర్మయను ఏకైక శూరుని పల్లవులు సంహరించి ఆంధ్రదేశము నాక్రమించిరి.

బృహత్ఫలాయనులు కృష్ణానదీ ముఖద్వారము వఱకు తమ రాజ్యమును విస్తరింపజేసి, కూడూరును రాజధానిగా ఆంధ్రదేశమును పాలించిరి. శాతవాహనుల కాలమున వ్యాపార కేంద్రములుగా వర్థిల్లిన, కంటక శైలము, కోడూరు, అల్లోసెని మున్నగు రేవు పట్టణములు బృహత్ఫలాయనుల రాజ్యముననుండెను. వీరు తీరసముద్ర రక్షణార్థమునకును, రేవు పట్టణముల యభివృద్ధికిని, కూడూరును రాజధానిగా జేసికొనిరి. వీరి రాజ్యము కోడూర-లేక నేటికోడూరు. కోడూరు ఘంటసాల, మైసోలియా రేవు పట్టణము లతిముఖ్యమైన వ్యాపార కేంద్రములు.

**ఘంటసాల:—** కృష్ణాజిల్లా, దివి తాలూకా లోని ప్రసిద్ధమైన గ్రామము ఘంటసాల. ఇది బందరుకు 15 మైళ్ళ దూరమున నున్నది. పూర్వము ప్రసిద్ధనగరముగా పేరు పొందిన శ్రీ కాకుళము కృష్ణానది వరదలలో కొట్టుకొనిపోవుట వలన, తరువాత కాలమున అభివృద్ధి

జెందిన శ్రీ కాకుళము ఆంధ్ర మహావిష్ణు వున్నది ఈ గ్రామమున కారు మైళ్ళ దూరమున నున్నది. ఘంటసాల గ్రామమున రెండు మైళ్ళ పొడవునను ఒక మైలు వెడల్పునను శిథిలచిహ్నములు పునాదులు కనిపించుచున్నవి. ఇచట రోమను నాణెములు లభించినవి. పూర్వము ఓడరేవుగా ప్రసిద్ధికెక్కిన కంటకొస్సల లేక 'కంటకశైల' మిదియేయని చారిత్రకులు నిర్ణయించినారు. ఇచట నొక శిథిల బౌద్ధ స్తూపము, శివాలయములున్నవి. ఇచటి జలధీశ్వరాలయము ప్రసిద్ధమైనది. పూర్వమీ ప్రాంతము వ్యాపార కేంద్రము. వణిక్ప్రముఖుల కాటపట్టు. నావికులకునికిపట్టు. ఘంటసాల ఓడరేవు అగుటవలన, వణిజులు నావికులు, విదేశీయులు, యాత్రికులు, తమతమ జీవితములు జలధిపై ఆధారపడియుండుట వలన శుభములు కలుగుటకు జలధీశ్వరు నర్చించి వర్తక వ్యాపారముల నిమిత్తము నౌకలపై విదేశములకు వెళ్లుచుండిరి. సాధారణముగ కొండలు, నదులు, సముద్రతీరము, మున్నగు ప్రాంతములందు బౌద్ధులు, స్తూపములను, ఆరామ విహారములను నిర్మించుచుండిరి. ఘంటసాల జీవనదియైన కృష్ణానది ఒడ్డునున్న పట్టణము కావున బౌద్ధులిచట స్తూపనిర్మాణము, ఆరామ విహార నిర్మాణము గావించియుండురు. అందుల కిచటనున్న స్తూప శిథిలములే తార్కాణము.

టాలెమీ క్రీ. శ. 140 వ సంవత్సరము ప్రాంతమున నున్నవాఁడు. కృష్ణానదీ సమీపమున 'మైసోలియా', నదీ ముఃఖద్వారమున 'కొంటకొశైలము' 'కొడ్డూరు' లున్నట్లు పేర్కొనెను.

మైసోలియా = కృష్ణా గోదావరి మధ్యనున్న స్థలము లేక పాలేరు సమీప స్థలము లేక పాలేరు పరిసర ప్రాంతము; పెరిప్లస్ గ్రంథమున చెప్పబడిన సముద్ర తీరముననున్న ఓడరేవు ఇదియే. ఇచటినుండి సన్ననూలు బట్టలు విదేశములకు ఎగుమతియగుచుండెను,

గ్రీకు నావికుడు హిప్పాలస్ క్రీ. శ. ఒకటవ శతాబ్దమువాఁడు. 'మసోలియా' ఓడరేవు తూర్పుతీరమున నున్నట్లు చెప్పెను. 'మసోలియా' నేటాలెమీ మైసోలియా అనెను. కృష్ణానదిని గ్రీకులు 'మైసలెస్' అని పిలిచిరి.

మైసోలియా, మసోలియా, మోసలపురము లేక మోటుపల్లిగా మారి యుండవచ్చును.

మోసలపురమునకు మోటుపల్లి, ముకుళీపురమనునవి నామాంతరములు.

క్రీ. శ. 1269 లో మార్కొపోలో ఆంధ్రదేశమును దర్శించెను. ఇందు మోసలపుర మున్నదనియు, 'ముటఫిలి' రేవు పట్టణము కలదనియు, ఆ నగరము సన్నని వస్త్రములకు, వజ్రములకు ప్రసిద్ధి జెందినదని తెలిపెను. పెరిప్లసు మైసోలియాను పై విధముగనే వర్ణించెను.

కూడూరు బందరుకు నాలుగుమైళ్ళ దూరముననున్నది. ఇది పూర్వము బృహత్ఫలాయనుల రాజధాని టాలెమీ పేర్కొనిన నగరములలో నిదియున్నది. ఘంటసాలలో క్రీ. శ. 1944 వ సంవత్సరమున ఐదు ప్రాకృత శాసనములు కనుగొన బడినవి అప్పటి భారత ప్రభుత్వ శాసన పరిశోధకులు డా॥ బి. సి. హెచ్. ఛాబ్రాగారు 1945 లో ఆ శాసనముల ప్రతిబింబములను తీసినారు. ఆ శాసనముల పాఠములీ క్రిందనీయబడుచున్నవి. ఇందు A B శిలా శాసనములొకే మాదిరివి. విషయమును ఒక్కటే. శిలలపొడవు 5 అడుగులు వెడల్పు ఒక అడుగు.

A మూలము

1. సిద్ధం ఉఖాసిరివధ (మానె) కంటక సోల-వధ (లేనా)
2. ధమ్మానివానియ-పుతేనబుధసిరి-గహపటినా ఇమామ్.
3. సేల-మండపో సగంధకుడి-వేటికా-తోరణోకారిటోటి,

(కంటక సోలనివాడియు, ధమ్మాృవానియ పుత్రుఁడును, గృహస్తుడును అగు బుద్ధిసిరి ఉఖాసిరి వర్ధమానమున ఈ శిలామండపము గంధకుటి, వేదిక తోరణములతో నిర్మింపబడినది. ఆచంద్రార్కముగ వర్ధిల్లుగాక)

C మూలము

1. ఉఖాసిరివాధ (మాగె) బుధిసిరి గహపాటి-మాందవాస
(ఉఖాసిరి వధమానమందు బుధిసిరి మండప సంబంధము)

*D* మూలము

1. సిధంపట నేపు—(అపా)
2. రసేలియానంమా—
3. నామ్ భదంతా—నందాచా—
4. బుధి ఉపార్థు యోస—
5. వంధాయ పవజటి (కా)
6. కయాం యయాంచా—

E మూలము

1. గవాప (టి) నోసవరసపుటస మహానావికాస సివకాస
2. (భా) రియయ ఘరనీయ ఉటర దటయ (సి) దధి (మి) టయస—పటికాయ.
3 స—దుహుటకాయస-మి (ట) మచాయ ఆయక (ధ) భ (ధే) యధమ.

" (ఈ ఆయక స్తంభమును గృహస్తుడగు సవరుని కుమారుడైన మహానావికుఁడైన శివకుని భార్యయగు తరదాత్త సిద్ధమి ఆమె భర్తయగు శివకుడు, ఆమె కుమార్తెలు, ఆమె ఇతర స్నేహితులు సహచరులు దానముగావించిరి)"

## F. మూలము

1. ఉవాసికాయ ధమానమటుయ సివలయ దాన
(ధమానతల్లియు, ఉపాడికయు నగు సివలయ దాన శాసనము)

పైన పేర్కొనబడిన శాసనములలో E నంబరు గల శాసనము వలన "శివక" అను మహా నావికుని పేరు తెలియుచున్నది. అట్లే నాగార్జునాచార్యుని శిష్యుడును నాగార్జున కొండలోని బౌద్ధమత సంబంధమైన మహాచైత్య నిర్మాణమున ఆధిపత్యము వహించి ఆయక స్తంభము లెత్తించినవాడును, వాస్తు శాస్త్రజ్ఞుడును, మహా సాంఘికుడును అగు భదంతానందాచార్యుల ప్రశంసయున్నది. ఈశాసనముల వలన ఘంటసాల బౌద్ధులకు పవిత్ర క్షేత్రమనియు తరువాత కాలమున నది శైవక్షేత్రముగా రూపొందినదనియు బృహత్ఫలాయనుల కాలమున ఘంటసాల వర్తక వ్యాపారములకు కూడలి స్థానముగ నుండెననియు. ఇచటి నుండి విదేశ వ్యాపారము విశేషముగ సాగుచుండెనని తెలియుచున్నది.

**మత సాంఘిక పరిస్థితులు :-** బృహత్ఫలాయనుల కాలమున వైదిక మతము పోషింప బడినది. జయవర్మ మహారాజు కొండముది శాసనమున "మహేశ్వర పాద పరిగ్రహీతుడని" వర్ణింపబడినాడు. వైదిక మతముతో పాటు, వైదిక ధర్మముద్ధరింపబడినది. బ్రాహ్మణులకు సర్వ పరిహారములతో నగ్రహారము లొసంగబడినవి. బౌద్ధమతము క్షీణింపమొదలిడినది. జైనము బౌద్ధమతమార్గము ననుసరించినది. జైన బౌద్ధ మతస్థులు విదేశములకు వలస వెళ్ళి వర్తక వ్యాపారములతోపాటు మత ప్రచారము చేయుచుండిరి. ఆంధ్రదేశము పరిపాలనా సౌలభ్యమునకు, హారమని, ఆహారమని, విషయమని నాడని విభజింపబడెను ప్రధాన రాజోద్యోగులకు మహాతగవర మహా

దండ నాయక' ఇత్యాదిబిరుదములుండెను. 'మహాతగవర' శబ్దములో 'తగవర' తెలుఁగు పదము. తగవర అనగా తీర్పరి. ఈ కాలము నాటికి తెలుగు జనవ్యవహారమున నుండెను. భారతీయ నాగరికత, ఆంధ్ర సంస్కృతి ఘంటసాల కూడూరు రేవు పట్టణముల నుండి ప్రారంభమై బర్మా,మలయా,కాంబోడియా జావా, సుమత్రాలలోవ్యాపించెనని డూబ్రియల్ పండితుని అభిప్రాయము. బృహత్ఫలాయన వంశీయులు, కూడూరు నుండి తమ రాజధానిని వేంగీనగరమునకు మార్చుటవలన కూడూరు నగర ప్రాముఖ్యము క్రమముగా సన్నగిల్లినది

తీరాంధ్రముననున్న రేవు పట్టణము లానాడు ముఖ్యమైనవిగా పరిగణింప బడినవి. ఇక్ష్వాకులు బౌద్ధమతము నాదరించి పోషించిరి. ఇక్ష్వాకుల యనంతరము కృష్ణానదికి దక్షిణతటముననున్న ప్రాగాంధ్రమునను బౌద్ధము రాజాదరణము లేక క్షీణింప మొదలిడినది. పల్లవ రాజన్యులు శైవ మతాభిమానులు. బృహత్ఫలాయనులు మహేశ్వర పాదభక్తులు. ప్రజలు వైదిక మతము వైపు మొగ్గుటకు బౌద్ధ మత సన్యాసుల ప్రవర్తనమే ముఖ్యకారణము. బౌద్ధమున నానాటికి పెరుగుచున్న కర్మకాండ, వజ్రయాన బౌద్ధమత సన్యాసినీ సన్యాసుల ప్రవర్తన, ప్రజలను బౌద్ధము నుండి విముఖులను గావించి వైదిక మతము వైపు మరల్చినది ప్రజలు బౌద్ధము నాదరించి పోషింపకుండుట వలన సుప్రసిద్ధమైన నాగార్జునకొండ శ్రీ పార్వతేయులైన బౌద్ధులు, అమరావతి జగ్గయ్యపేట ఇత్యాది ప్రాంతముల నివసించు బౌద్ధులు ఘంటసాల, కూడూరు, అల్లోసైని, మైసోలియా రేవులనుండి బయలుదేరి సముద్ర మార్గమున పయనించి, బర్మా సయాం, కాంబోడియా, సిలోన్ మున్నగు ప్రాంతములకు చేరి అచట బౌద్ధమత ప్రచారము గావించిరి. ఆంధ్రుల వలస రాజ్య విధానము బృహత్ఫలాయనుల కాలము నుండియే ప్రారంభమైనదని చెప్పవచ్చును. బౌద్ధ మతముతో పాటు ఆంధ్ర సంస్కృతి నాగరికత ఆయా దేశములందు వ్యాపించెను.

**కళలు - శిల్పము:-** బృహత్ఫలాయనుల కాలమున కూడూరు ఘంటసాల మున్నగు పట్టణములు బౌద్ధారామ విహారములకు, దేవాలయములకు నిలయములు. ఇచట లలిత కళలు వృద్ధి చెందినవి వివిధ వృత్తులు కలవారానాడు నగరములందును, గ్రామములందును నివసించు చుండిరి స్వర్ణకారులు వెండి, బంగారు ఆభరణములు చేయు చుండిరి. వారు బంగారుపై అత్యంత రమణీయమైన నగిషీ చెక్కుటలో ప్రసిద్ధిగాంచి యుండిరి ఘంటసాలలో పురాతనమైన ఆభరణములు లభించినవి. అందొకటి నగిషీపని కలిగి మధ్యన ఎఱ్ఱరాయి పొదగబడినది ఇది స్త్రీలు గాని, బాలికలుగాని ముఖమునకు కట్టుకొనునదగ్గయై యుండును. ఒక ఆభరణము పాదములు కలది అద్భుతమైన నగిషీ పని కలిగి యున్నది. పలుచని రేకుపై నిట్టి నగిషీ చెక్కుట పనివాని నైపుణ్యమును తెలుపును

ఘంటసాల ప్రాంతమున లభించిన పెంకులు, కుండ ముక్కలు చక్కని చెక్కడములతో వింత శోభతో నునుపు కలిగి చూపరుల కాశ్చర్యము గొలుపును. ఆ కాలపు కుమ్మరి పనితనము, కుండ పెంకులను బట్టి ఎట్టి అద్భుతమైనదో యూహింపవచ్చును. కొన్ని కుండల మూతులు మూడు నాలుగడుగుల నడిమికొలత కలిగి ధాన్యమునిలువ చేయుట కుపయోగపడు చుండెనని లభించిన కుండల మూతులను బట్టియు, విరిగిన ముక్కలను బట్టియు యూహింప వచ్చును. కొన్ని బానల అంచులు వెడల్పుగాను, మందముగాను ఉన్నవి. బానల మందము అర అంగుళముండి, బానల అంచులు మధ్యన నలుపుగాను పై భాగము నునుపుగానుండి ఎఱుపు రంగు కలిగి చూచుట కందముగా నున్నవి కుండలకుగాని, బానలకుగాని లోపలివైపు దట్టముగా సున్నము పూయబడినది. ఇట్లు పూయుట కుండలుకాని, బానలుకాని గట్టిగా నుండుటకొరకై యుండవచ్చును. ఘంటసాలలో ఎరుపురంగు పెంకులు, నగిషీపని కలవి మహాద్భుతమైనవి లభించినవి. ఎట్టి అంచు

పెంకులు పగడపు వర్ణము కలిగి నునుపుగా నున్నవి. ఒక మూకుడు పెంకు మధ్య మందముగా నుండి అంచులు సన్నముగా నున్నది లభించినది. ఇది పైన ఎరుపు రంగు, లోపలివైపు నలుపురంగు కలిగి నునుపుగా నుండి పింగాణీ పాత్రవలె నీడ కన్పించునంత బాగుగా ఉన్నది. దీనినిబట్టి ఆనాటి కుమ్మరుల హస్తనైపుణ్యము, బుద్ధికుశలత పని నేర్పు, ఓర్పు మనకు తెలియును

**వాణిజ్యము :** ఆంధ్ర రాజుల నాణెములు ఆంధ్రదేశ తూర్పు తీర ప్రాంతమున లభించినవి. ఘంటసాలలో కొన్ని లభించినవి. బృహత్ఫలాయనుల కాలమున, ఇక్ష్వాకుల కాలమున ఆంధ్ర రాజుల నాణెములు వాడుకలోనున్నను, లేకున్నను ఇక్ష్వాకుల రాజ్యారంభ కాలమున తప్పక ఉండి యుండును. ఘంటసాలలో లభించిన ఆంధ్రరాజుల నాణెములపై ఓడముద్రలున్నవి

బృహత్ఫలాయనుల కాలమునం దాంధ్రదేశమున బౌద్ధమతము రాజాదరణములేక విదేశములందు వ్యాపించినది బౌద్ధమతాచార్యులు మత ప్రచారమునకు నావలలో బయలుదేరి వందలకొలది మైళ్ళు ప్రయాణముచేసి బర్మా, సయాం, కాంబోడియా, చైనా, సింహళము మున్నగు దేశములలో బౌద్ధమత ప్రచారము గావించి ఆయాదేశముల లోని అనాగరిక జాతులలో నాగరికతను వ్యాపింపజేసిరి. బౌద్ధమత ప్రచారముతోపాటు వర్తక వ్యాపారము విశేషముగా సాగినది. విదేశ వ్యాపారమువలన బౌద్ధమత ప్రచారము వృద్ధిచెందినది. ఆకాలపు వ్యాపారులలో కొందరు బౌద్ధులుండిరి. విదేశ వ్యాపారము వణిక్ప్రముఖులకేగాక రాజులకును లాభదాయకముగ నుండెను. ఆంధ్రదేశమున తూర్పు సముద్రతీర ప్రాంతమున కృష్ణానదీతీరమున వెలసిన బౌద్ధస్తూపములు ఆరామ విహారములు క్రీ.శ. రెండు, మూడు శతాబ్దములలోను అంతకు పూర్వమును నిర్మింపబడినవి. కృష్ణా, గుంటూరు మండలములలో వెలసిన బౌద్ధస్తూపములు, సంఘారామములు, విహా

రములు, ఆరామములు, బౌద్ధ వర్తకుల సంపదకు, ధర్మనిష్ఠకు తార్కాణము. బృహత్ఫలాయనుల కాలమున లంక, యవ, సుమిత్ర, భరణి మున్నగు ద్వీపములతోను, బర్మా, చీనా, కాంబోడియా, రోము, గ్రీసు మున్నగు దేశములతోను వర్తకము సాగుచుండెను. 'ప్లిని' అను చరిత్రకారుని వ్రాతలవలన ఆనాడు భారతదేశము విదేశములతో చేయు వ్యాపార విషయము తెలియుచున్నది ప్లిని కాలము క్రీ. శ. 77.

ఆంధ్రదేశ తూర్పుతీరమున మంచి రేవుపట్టములుండెను. కృష్ణా పట్టణము, ఘంటసాల, గూడూరు పట్టణములు ముఖ్యమైనవి. ఈ పట్టణములు వ్యాపార కేంద్రములుగా ప్రసిద్ధిచెందినవి. ఇచటినుండి ఎగుమతి, దిగుమతి వ్యాపారము విశేషముగ జరుగుచుండెను.

| ఎగుమతులు | దిగుమతులు |
|---|---|
| 1. వస్త్రములు | 1. సుగంధ ద్రవ్యములు |
| 2. సన్నినూలు-సన్నినూలు బట్టలు | 2. బంగారము |
| 3. దూది | 3. కర్పూరము |
| 4. బియ్యము | |
| 5. వజ్రములు | |

ఎగుమతులు, చీనా, బర్మా, సయాం, కాంబోడియా, సింహళము, రోము, గ్రీసు, ఈజిప్టు మున్నగు దేశములకు చేయబడు చుండెను. దిగుమతులలో సుగంధ ద్రవ్యములు సింహళమునుండియు, సుమత్రాద్వీపమునుండి బంగారము, చీనా దేశమునుండి కర్పూరము వచ్చుచుండెను.

భారతదేశమునకు వ్యాపారార్థమువచ్చిన వ్యక్తి హిప్పాలస్. ఇతడు క్రీ.శ. 47 లో వచ్చి హిందూమహాసముద్రము, బంగాళా ఖాతములందు ప్రయాణము చేసి భారతదేశ తీరప్రాంతములను సందర్శించి 'పెరిప్లస్ ఆఫ్ ది ఇరిత్రియన్ సీ' అను గ్రంథమును రచించెను. ఇట్లు

క్రీ శ మొదటి శతాబ్దిలో ప్రారంభమైన విదేశవ్యాపారము బృహత్ఫలాయనులకాలమున వృద్ధిచెందినది. రోము, ఈజిప్టుదేశములతో ఆనాడు విశేషముగా వ్యాపారము జరుగుచుండెను. రోమునగర వర్తకులెందరో ఆంధ్రదేశమునకు వ్యాపారార్థము వచ్చి స్థిరపడిరి.

ప్రాగ్ద్వీపములందు వ్యాపారముతోపాటు మతప్రచారముకూడ సాగినది. బ్రాహ్మణ ప్రచారకులు, బౌద్ధ భిక్షువులు, మతాచార్యులు సుమత్రా, జావా మొదలగు ద్వీపములకేగి యచట అనాగరిక జాతులలో నాగరకత వ్యాపింపజేసిరి. జావా, సుమిత్ర, బోర్నియోలలో ఆంధ్రదేశమునందుగల పట్టణముల పేళ్ళుగల పట్టణములున్నవి. బర్మానుండి మలాకాద్వీపకల్పమువర కాంధ్రుల అధినివేశ రాజ్యములున్నవి. సయాం, కాంబోడియా దేశములలో శాలివాహనశకము వాడుకలోనున్నది.

"బర్మా, కాంబోడియా, మలాకా, సయాంలలోగల నాగరకత దక్షిణ భారత నాగరకతయే. ఆంధ్రదేశమునుండి భారతీయ నాగరకత, ఆంధ్ర సంస్కృతి బర్మాదేశము మొదలు చైనావరకుగల విశాలభూభాగమున వ్యాపించినవి. భారతీయ సంస్కృతి భారతదేశమునగల మతములు చిత్రకళ, నాగరకత, ఆంధ్రదేశమున తూర్పు తీరమునగల రేవు పట్టణములనుండి బయలుదేరి విదేశములందు వ్యాపించినవి. డూబ్రియలు పండితుడు "టాలెమీకాలమున బర్మా, మలాక, కాంబోడియా, యానాం, జావా దేశములకు హిందూ నాగరికత, ఘంటసాల, కూడూరు రేవులనుండి బయలుదేరి వ్యాపించినట్లు నిస్సంశయముగ సిద్ధాంతీకరింపవచ్చునని[1]" చెప్పినట్లు తెలియుచున్నది.

కంటకసేల, లేక ఘంటసాల, సింహళ బౌద్ధులకు, ఆంధ్రదేశముననున్న బౌద్ధులకు కూడలిగా నుండెను. ఘంటసాల శాసనములందు

---

1. Ancient History of Deccan. Page 66, 88.

మహా నావికుఁడగు శివకుని పేరు పేర్కొనబడినది. బౌద్ధులు బౌద్ధ మతాభిమానులు వేయించిన శాసనముల వలన ఈ పట్టణము బౌద్ధులకు పవిత్రమైన స్థలముగా భావింపవచ్చును. తూర్పున చైనా వఱకు, పశ్చిమమున రోము నగరము వఱకును, ఘంటసాల, కూడూరు నగరములు వ్యాపార కేంద్రములుగాను, బౌద్ధులకు పవిత్ర స్థలములుగాను పేరు పొందినవి

వేంగి, లేక పెద్ద వేగి బృహత్ఫలాయనులకు రాజధానిగ వర్ధిల్లినది. ఎనమిదిమైళ్ళు విస్తీర్ణముగల నగరమిది. నేఁడే నగరము చినవేగి, పెదవేగి గ్రామములుగ పిలువబడుచున్నది. ఇచట ప్రాచీన కాలపు శిథిలములున్నవి. శిథిలదేవాలయములు, దిబ్బలు ఇచటకనిపించును. ఇప్పటి ఏలూరుకు ఆరు మైళ్ళ దూరమున, వేగికలదు.

క్రీ. శ. 1927 లో కనుగొనబడి 219 నంబరు శాసనముగా గుర్తింపబడిన శాసనమొకటి పెదవేగిలో లభించినది

"జెకంటకశాలి
అపరశేల
దవేంగవళితి
నఘంచా అ."

ఇందు కంటకశేలి, అపరశేల పెదవేగి పేళ్ళు ఉదహరింపబడినవి.

అమరావతిలో లభించిన శాసనములమబట్టి ఆకాలమునందాంధ్ర దేశమునగల కొన్ని ప్రసిద్ధమైన పట్టణముల పేళ్ళు తెలియుచున్నవి

1. రాజగిరి.
2. కేవూరు.
3. మందర.
4 విజయపురము (బెజవాడ)
5. ధాన్యకటకము (ధరణికోట)

6 కుట్టుపరవేస
7. మహావనశాల
8 కూడూరు. (బందరు సమీపమున గల గూడూరు)
9. వడిపరి.
10. వేవన. (బద్దిపట్రు)
11. సాధుగ.
12. రాజశైలము.
13. కటకశాల (ఘంటసాల)
14. నడతూరు.
15. మహాకాండూరు
16. వేలగిరి.

ఇంకను ప్రసిద్ధ జెందిన నగరములెన్నిమో ఆ నాడు ఉండెను కంటక శేలని వాడి మొసంగిన శాసన మొకటి అమరావతిలో లభించినది. ఇది బ్రాహ్మలిపిలో ప్రాకృతభాషలో వ్రాయబడినది.

"సిద్ధంకటక సోలకాస, ఉపాసకాస
ఉతరాస, సమతుక, సభగినికాస, సపుతుకాస
నధుతుకాస. (దానమ్)" 1.

(కంటక శైలనివాసియు. ఉత్తరుడను బౌద్ధగృహపతి తల్లి, సోదరీమణులు, పుత్రులు పుత్రికలతోను కలిసి చేసిన దానము స్థిరముగా నుండుగాక).

బృహత్ఫలాయన జయవర్మ పాలించిన కాలము పదునైదు సంవత్సరములేయైనను, ఆకాలమున ప్రజలు ప్రశాంతమైన జీవనమును గడిపినారు. శైవమతమాదరింపబడి పోషింప బడినది. బౌద్ధ జైనములు క్షీణించి విదేశములందు వ్యాపించినవి.

1. Burges - Archaeological Survey of South India vol 1 Page 106. Plate No. 54

ఆంధ్రదేశమున తాము పాలించిన భాగమును పరిపాలనా సౌల భ్యమునకు బృహత్ఫలాయన వంశీయులు, హారము, ఆహారము, విష యము, నాడులుగా విభజించిరి రాజకీయోద్యోగులలో మహా తగ వర బిరుదాంచితులుండిరి గ్రామనామములు, వ్యక్తుల పేళ్ళు, బిరుద ములు, తెలుగుభాష ఆనాడు జనవ్యవహారమున నుండెననుటకు నిద ర్శనము. హిందూ నాగరకత విదేశములందు వ్యాపించెను. శాలంకా యనులు విజృంభించుట వలననో, మయవర్మ మహారాజు తర్వాత వచ్చిన బృహత్ఫలాయన వంశీయులు బలహీనులగుట వలననో, జయ వర్మ మహారాజు తరువాత బృహత్ఫలాయన వంశీయులు రాజ్యము చేసినట్లు తోచదు. ఇట్లీవంశముల ఇక్ష్వాకుల పతనానంతరము ఆంధ్ర దేశము పల్లవులబారి పడకుండ, ఆంధ్రప్రజలను ఆపదలో ఆదుకొనినది.

## B ఆనందగోత్రికుల కాలము

బృహత్ఫలాయన జయవర్మ యనంతరము పల్లవు లాంధ్ర దేశము నాక్రమించిరి ఆసమయమునందాంధ్ర దేశములోని కొన్ని ప్రాంతములను వశపరచుకొని పాలించిన వారానంద గోత్రికులు. గుంటూరు మండలములోని చేజెర్ల లేక కపోతకందరపురము వీరి రాజ ధాని. కృష్ణా గుంటూరు మండలములు తీరాంధ్రము ఆనందగోత్రికుల పాలనములో నుండెను. వీరు గోత్రనామమునే [1]వంశనామముగ ధరిం చిరి. వీరిది గోలాంగూల ధ్వజమని శ్రీ భావరాజు వేంకటకృష్ణా రావుగారును [1] 'గ్రుధ్రాధాసిత కేతనమని' మల్లంపల్లి సోమశేఖర శర్మగారును అభిప్రాయపడిరి.

ఈవంశీయులకు సంబంధించిన రెండు తామ్రశాసనములు ఒక శిలాశాసనమును ప్రకటింప బడినవి.

---

1. A History of the Early Dynasties of Andhra Desa P. 326-345.

1. మట్టెపాడు శాసనము
2. గోరంట్ల శాసనము
3 చేజెర్లకపోతేశ్వరాలయ శిలాశాసనము.

ఈవంశీయులకు మూలపురుషుడు ఆనందమహార్షి. మొదటి రాజు కందరరాజు. కందరరాజు పూర్వీకులు ఇక్ష్వాకు వంశీయులకు సామంతులుగనో, వారికడ దండనాయకులుగనో నుండి యుందురు. అత్తివర్మ గోరంట్ల శాసనమును బట్టి అతడు కందరరాజ వంశములో ఆనందగోత్రములో జన్మించినట్లు తెలియుచున్నది. ఆనందగోత్రికుల రాజధాని కందరపురము. ఈవంశములోని దామోదరవర్మ అను రాజు కందరపురము నుండి మట్టెపాడు తామ్ర శాసనము[2]ను వేయించెను.

కందరరాజు పుత్రిక 'అవనితలాంతవతి'ఆమె కుమారుడు సత్స భామల్లుడు. చేజెర్లకపోతేశ్వరాలయంలోని శిలాశాసనము సంస్కృత భాషలో వేయించెను. ఇది క్రీ.శ. 5వ శతాబ్దమునాటిది దామోదర వర్మ మట్టెపాడు తామ్ర శాసనము ప్రాకృతము, సంస్కృతము కలిసి యున్న శాసనము. చేజెర్ల శాసనము సంస్కృత భాషలో నున్నది. మట్టెపాడు తామ్ర శాసనమును దామోదరవర్మ కందరపురము నుండి వేయించెను. కందరరాజు పేర కందరపురము వెలసియుండును.

ఆనంద మహార్షి వంశమునకు చంద్రునివంటి వాడగు కందర రాజు స్వశక్తి వలన రాజ్యమును స్థాపించి పల్లవులకు సామంతుడుగా నుండెనని చేజెర్ల శాసనమువలన తెలియుచున్నది. "స్వశక్తి శాసిత శాత్రవ కరివరఘట సంకట ధాన్యకటారన్య సప్తకోటి" అను బిరు దము వలన ఇతడు అరివీరుల గజసమూహాముచే సంకులమైన ధాన్య కటక యుద్ధమున శత్రువులను జయించి, 'కృష్ణవెణ్ణా' నాధుడని 'త్రికూటపతియని' పేరు పొందెను. పల్లవ విజయస్కంధ వర్మ నుండి

---

2. Epigraphia Indica Vol. XVII P 327

కుందరరాజు ధాన్యకటక ప్రాంతమును గ్రహించెను. ధాన్యకటకము ధరణికోట లేక అమరావతి. కందరరాజు రాజ్యము త్రికూటపర్వతము నుండి కృష్ణా నది వరకు వ్యాపించెను. "విష్ణుకుండిన రాజన్యులు" "త్రికూట మలయాధిపులు"గా శాసనములందు వర్ణింపబడినారు. త్రికూట పర్వతము నేటి కోటప్పకొండ. గొప్ప శైవ క్షేత్రము. గుంటూరు జిల్లాలో నున్నది. చేజెర్ల కపోతేశ్వరాలయ శాసనమందు కందరరాజు 'జనపద ద్వితీయాధిపతి' యని వర్ణింపబడినాడు. కావున ఈతని రాజధాని ధాన్యకటకమనియు, అటుపిమ్మట ఈ మహారాజు కందరపురమును తన పేర నిర్మించెననియు, తరువాత ఈ వంశీయులకు కందరపురము రాజధానిగా నుండెనని భావింపవచ్చును. కందరపురము, తూర్పు చాళుక్యుల శాసనములందు కనిపించు ఉత్తర కండేరువాడి గుడ్లకండేరువాడి కావచ్చును.

**పరిపాలనా విధానము :** కందరరాజు పల్లవుల సామంతుడు కావున పరిపాలనావిధానమున పల్లవుల ననుసరించెను. రాజ్యము భిన్న భిన్న రాష్ట్రములుగ విభజింపబడి రాష్ట్రమునకొక అధికారి నియమింపబడుచుండెను. రాష్ట్రములు విషయములుగనో, నాడులుగనో, హారములుగనో విభజింపబడి యుండెను. రాజులు ప్రజానురంజకులై యుండిరి. నాడు జనపదములు వస్తు సమృద్ధి కలిగియుండెను. రాజులు అష్టాదశ పరిహారములతో వేద విదులైన బ్రాహ్మణులకు అగ్రహారము లొసంగు చుండిరి. రాజునకు అష్టాదశ విధములైన పన్నులు విధించు అధికారముండెను. ప్రజలకు ఉప్పు త్రవ్వనధికారము లేకుండెను. బ్రాహ్మదేయములందట్టి అధికారము అగ్రహారీకులకుండెను. ఆనంద గోత్రికులు పల్లవుల పరిపాలనా పద్ధతినే తమ రాజ్యమున ప్రవేశ పెట్టిరి.

**మతము :** ఆనంద గోత్రికులకు వంశనామము, గోత్రనామము ఆనందమహర్షి వలన వచ్చియుండవచ్చును. నాగార్జునకొండ లోయలో

లభించిన శాసనములు భదంతానందాచార్యుని పేర్కొనుచున్నవి ఇతడు అపర మహావినశైలీయశాఖకు జెందిన ఆచార్యుడు. నాగార్జున కొండలో లభించిన ఆయక స్తంభ శాసనము[1] వలన "మహాచైత్య నిర్మాణము గావింపబడి ఆయక స్తంభములు శ్రీ భదంతా నందాచార్యులచే నెత్తింపబడినవని" తెలియుచున్నది. ఈ ఆనందాచార్యుడు 'దీఘ' మజ్జిమ నికాయములు, పంచమాతుకలు తెలిసినవాడు పంనగామ నివాసి.

నాగార్జున కొండలోని మహాచైత్యము, విహారాదులు ఆచార్య ఆనందుని ఆధిపత్యమున. నిర్మింపబడినవి ఆయక స్తంభము లెత్తింప బడినవి. భదంతానందాచార్యుడు అంధక శాఖకుఁ జెందిన మహాసాంఘికుల కాచార్యుడు. ఇక్ష్వాకువంశమునకు జెందిన శ్రీ వీరపురుష దత్తుని కాలముననను, ఆతని పుత్రుఁడు వాసిష్ఠి పుత్ర శ్రీ బహుబల శాంతమూలుని కాలముఁనను ఉన్నవాడు.

బృహత్ఫలాయన జయవర్మ యనంతరము కందరరాజు రాజయ్యెను. ఇతఁడు మొదటి బౌద్ధుడు. చేజెర్ల శాసనము నందీతఁడు "సమ్యక్సంబుద్ధస్య" అని చెప్పబడుటవలన బౌద్ధమతాభిమానము వలన మొదట బౌద్ధ స్థూపమున్న చేజెర్ల ప్రాంతమును రాజధానిగా జేసుకొని ఆంధ్రదేశము నేలెను.

పల్లవ రాజును ఓడించి ధాన్యకటకమును వశపరచుకొని, అమరావతీ స్థూప సంరక్షణ భారము వహించి తన బౌద్ధమతాభిమానమును ప్రకటించుకొనెను. కాని ఇతడు బౌద్ధమతమును వీడి శైవ మతమవలంబింపవలసి వచ్చినట్లు తెలియుచున్నది. పల్లవ శివస్కందవర్మ చేత ఓడింపబడి, బౌద్ధమతమును వీడి శైవమతమవలంబించి, కందరపురములోని బౌద్ధాలయమును శివాలయముగ మార్పించెను. అప్పుడే

---

1. Epigraphia Indica Vol. XX P. 17, 20, C1; C2.

ఆనగరమునకు కందరపురమని పేరిడియుండవచ్చును చేజెర్ల కపోతేశ్వరాలయము మొదట బౌద్ధాలయము ఈ ఆలయ శిఖరము అర్ధవర్తులాకారముగ నున్నది. తక్కిన శివాలయములవలె గోపురాకారముగలేదు. ఇది అజంతా, నాసికలలోగల బౌద్ధ శిలా చైత్యములవలె నున్నది గుంటుపల్లిలో గల శిథిల బౌద్ధ చైత్య నిర్మాణమువలె ఈ ఆలయ నిర్మాణము కనిపించును. గుంటుపల్లి పశ్చిమ గోదావరి జిల్లాలోని కామవరపు కోట తాలూకాలోనున్న గ్రామము.

దామోదర వర్మ మట్టెపాడు తామ్ర శాసనమున 'మహారాజుగా, హిరణ్యా గర్భ, అవంధ్య గోసహస్రదానకర్తగను, సమ్యక్సంబుద్ధ స్వపదానుధ్యాతస్య' అని చెప్పబడినాడు. ఇతఁడు వైదిక ధర్మ పరాయణుడు. బౌద్ధ మతాభిమాని. దామోదర వర్మ తన రెండవ విజయ రాజ్య సంవత్సరమున కార్తీకశుద్ధ త్రయోదశి నాడు నానాగోత్ర చరణ తపస్స్వాధ్యాయ నిరతులగు విప్రులకు సర్వపరిహారముగ 'కంగూర' గ్రామ దానమొసంగెను. కంగూరు నేటి నరసరావు పేట తాలూకాలోని కావూరు కావచ్చును. భావజ్జ, నందజ్జ, కొండిజ్జ ఆదిగాగల (14) పదునాలుగురు బ్రాహ్మణులీ దానమునకు ప్రతిగ్రహీతలు. దామోదర వర్మ కాలమునాటికి శాలంకాయనులు వేంగిలో రాజ్యమును స్థాపించినట్లు తెలియుచున్నది.

అత్తివర్మ గోరంట్ల శాసనమున "సురగురు సదృశ బుద్ధి నః సమ్యక్ప్రజాపాల నోపార్జిత కీర్తినః" అని వర్ణింపబడినాడు. 'సమ్యక్ప్రజాపాలనా'ది వర్ణనములు విష్ణుకుండినుల శాసనములందును కనిపించుచున్నవి. గోరంట్ల శాసనము యమనియమవంతుడు, ఆపస్తంబ సూత్రుడు, ఋగ్యజుస్సామ వేదవిదుడు, కాశ్యపగోత్రుడును నగు కోటి శర్మ లేక కొట్టి శర్మకు కృష్ణానదీ దక్షిణ తీరమునగల తాడికొండలో కొంత భూమియు, అన్తుక్కుర అను గ్రామదానమును

తెలుపును. అత్తివర్మ శైవుడు వైదిక మతోద్ధారకుడు బ్రాహ్మణుల కనేకదానము లొసంగినవాడు. ఈతని కాలమున బౌద్ధము క్షీణించినది.

అత్తివర్మ కుంతల రాజగు కకుత్స్వవర్మకు సమకాలికుడు. అత్తివర్మ పల్లవుల నెదిరించుటకు ప్రయత్నించెను. కాని సఫలీకృతుడు కాలేదు. అత్తివర్మ మహారాజుగ వర్ణింపబడినాడు. ఇతడనేక రాజుల స్వాతంత్ర్యము హరించినట్లు తెలయుచున్నది. అత్తివర్మ అనంతరము రాజ్యమునకు వచ్చిన ఆనంద గోత్రికులు బలహీనులగుట వలన కొంత కాలము విష్ణుకుండినులకు మరికొంతకాలము పల్లవులకు సామంతులుగ నుండిరి. క్రీ. శ. 611 లో పశ్చిమ చాళుక్య చక్రవర్తియైన రెండవ పులకేశితో జరిగిన యుద్ధమున రెండవ కందరరాజు మరణించెను ఈ కందరరాజు మనుమడు క్రీ.శ. 620 లో కుబ్జవిష్ణువర్ధనునితో జరిగిన యుద్ధమునం దసువులు గోల్పోయెను. ఇతనితో ఆనంద గోత్రికుల వంశ మంతరించిన దనవచ్చును.

**వాఙ్మయము:—** ఆనంద గోత్రికుల శాసనములు ప్రాకృత సంస్కృత మిశ్రములు, సంస్కృతములు. బౌద్ధవాఙ్మయ మీకాలమున వర్ధిల్లినది. ప్రాకృతము ఆదరింపబడి పోషింపబడినది. ఈ కాలమున భూమి కొలత పుట్లలో నుండెను. అత్తివర్మ గోరంట్ల శాసనమున 'తాన్తికొన్త' గ్రామమున కృష్ణకు దక్షిణ తటమున అన్తుకూర గ్రామ దానముతోపాటు 800 పట్టిల. (పుట్లు) భూమి దానమిచ్చినట్లున్నది. వీరి కాలమున చేజెర్లలోనున్న బౌద్ధక్షేత్రము శైవక్షేత్రముగ మార్చబడినది. చేజెర్ల కపోతేశ్వరాలయమట్టిది. మహాభారతము. బుద్ధ జాతక కథలలో శిబి చక్రవర్తికి సంబంధించిన కపోత చరిత్ర కలదు. శిబిచక్రవర్తి పావురమును రక్షించుటకు, తనను పరీక్షించుటకు డేగ రూపమున వచ్చిన ఇంద్రునికి తన శరీరములోని మాంసమును కోసి యిచ్చిన ప్రాంతమగుట వలన ఈ ప్రదేశమునకు కపోత పురమనియు

ఆ పిమ్మట నిచట వెలసిన దేవాలయమునకు కపోతేశ్వరాలయమనియు పేరువచ్చి యుండును. కపోతపురము లేకున్నను కపోతేశ్వరాలయము చేజెర్లలో నున్నది. చేజెర్ల = చెంజెర్ల లేక చెంజెఱువు అనగా అంద మైన చెరువు లేక పద్మములతో నిండిన చెరువు.

అత్తివర్మ గోరంట్ల శాసనములో పేర్కొనబడిన 'తాన్టికొన్ట' కాలక్రమమున తాడికొండగా మారినది. తాడికొండ గుంటూరుకు పది మైళ్ళ దూరముననున్నది. ఈ కాలమున తెలుగు, జనసామాన్య మున వాడుకలో నుండెను. ప్రాకృత భాషా ప్రభావ మాంధ్రభాషపై సంపూర్ణముగ నుండెను. సంస్కృతభాష, ప్రాకృతమునకు బదులు రాజభాషగా వర్ధిల్లినది. ఐనను ప్రాకృత ప్రభావము మాత్రముపోలేదు. ఈ రాజులకు సంబంధించిన రెండు శాసనములు ప్రాకృత సంస్కృత మిశ్రములు. ఆనాడు వేదవేదాంగ నిరతులైన బ్రాహ్మణు లుండిరి. దామోదరవర్మ మట్టెపాడుతామ్ర శాసనమున పేర్కొనబడిన పేళ్ళు తెలుగు పేళ్ళవలెనున్నవి. సంస్కృతము లోని ఆర్య ప్రాకృతమున అజ్జగాను తెలుఁగున అయ్యగాను వాడబడుచున్నది. మట్టె పాడు తామ్ర శాసనమున గల ప్రతి గ్రహీతల పేళ్ళు తెలుఁగు దేశమునకు సంబంధించినవి. ప్రతి గ్రహీతలలో, కౌండిన్య, కాస్యప, వత్స, అగస్త్య గోత్రీకులున్నారు.

## ప్రతి గ్రహీతల పేళ్ళు

| | | |
|---|---|---|
| రుద్దజ్జ | (రుద్రార్య) | |
| నందిజ్జ | (నంద్యార్య) | |
| ఖందజ్జ | (స్కందార్య) | |
| భావజ్జ | (భావార్య) | |
| అగ్గిజ్జ | (అగ్న్యార్య) | కౌండిన్య లేక |
| సిరిజ్జ | (శ్రీయార్య) | కౌండిన్యగోత్రము |
| భావజ్జ | (భావార్య) | |
| ఖందజ్జ | (స్కందార్య) | |
| సవరజ్జ | (శబరార్య) | |
| పీరజ | (పీఠార్య) | |

| | | |
|---|---|---|
| దామజ్జ | (దామార్య) | కస్సవ లేక కాస్యప గోత్రము |
| కుమారజ్జ | (కుమారార్య) | |
| వెనుజ్జ | (విష్ణ్వార్య) | |
| దేవజ్జ | (దేవార్య) | |
| నందిజ్జ | (నందార్య) | కాస్యప గోత్రము |
| దోణజ్జ | (దోణార్య) | వత్సగోత్రము |
| భద్దజ్జ | (భద్రార్య) | అగస్తి లేక అగస్త్య గోత్రము |

ఈ రాజన్యులు మొదట బౌద్ధులు. ప్రాకృతము నాదరించి పోషించిరి. జనసామాన్యమున తెలుగు వాడుకలో నుండెను. అటు పిమ్మట సంస్కృతము వ్యాప్తిలోనికి వచ్చినది. వీరి శాసనము లందు సంస్కృత ప్రాకృత ప్రభావము కనిపించును. శాసనమున పేర్కొన బడిన కంగూర్ గ్రామ మేవిషయము లోనిదో తెలుపబడలేదు. సరిహద్దులైనను చెప్పబడలేదు.

అత్తివర్మ గోరంట్ల శాసనము[1] వలన తాన్తికొన్త, (తాడి కొండ) పేరు తెలియుచున్నది.

**దానధర్మములు:-** ఆనంద గోత్రికుల కాలము నందాంధ్ర దేశము సుభిక్షముగ నుండెను. ఈ వంశీయులు హిరణ్యగర్భదాన మొసంగి నట్లు శాసనము లందున్నది. షోడశ మహాదానములలో హిరణ్య గర్భ దానమొకటి. హిరణ్యగర్భము చేయించి దాత హిరణ్యగర్భము లోనికిపోయి ప్రార్థనలు, మంత్రములు చదివి, వెలికివచ్చి, జాతకర్మాది సమస్త క్రియలు జరిపిన తరువాత హిరణ్య గర్భమును పురోహితునకు దానమిచ్చును. ఇట్టి దానములు మహైశ్వర్య సంపన్నులు మాత్రమే చేయగలుగుదురు. ఆనంద గోత్రికులు సంపదకలవారనియు, దేశ మున ధనికవర్గ ముండెనని యూహింపవచ్చును.

1. Indian Antiqury Vol. IX P. 102.

ఈ వంశీయులు వేయించిన శాసనముల మధ్య కాలము సుమారు 300 సంవత్సరములు. క్రమముగా ఈ వంశము లోని రాజులకు రాజ్యాధికారము కలిగినట్లుతోచదు బృహత్ఫలాయనుల యనంతరము ఆనందగోత్రికు లాంధ్ర దేశమును పాలించినారు. వీరి రాజ్యము క్రీ. శ. 290 ప్రాంతమున ప్రారంభమై క్రీ. శ 620 లో అంతమై యుండవచ్చును.

మట్టెపాడుతామ్ర శాసనమున దామోదర వర్మ "అవంధ్య-గోసహస్రానేక హిరణ్య గర్భోద్భవస్య" అని వర్ణింపఁబడినాడు. అత్తివర్మ గోరంట్ల శాసనమున "అపరమేవహిరణ్య గర్భప్రసవేన" అని చెప్పబడినాడు.

హిరణ్య గర్భుఁడు = బ్రహ్మ

హిరణ్యగర్భ మహాదానము షోడశ మహాదానములలో నొకటి.

**షోడశ మహాదానములు:-** షోడశ మహాదానములు మహా రాజులు కాని ధనవంతులు గాని, గొప్ప వ్యాపారులు గాని చేయు చుండిరి. హిరణ్యగర్భదాన ప్రశంస మత్స్య పురాణము లోని వ్రత ఖండమున నున్నది.

1. తులాపురుష 2. హిరణ్య గర్భ 3. బ్రహ్మాండ 4. కల్ప పాదప 5 గోసహస్ర 6. హిరణ్య కామధేను 7. హిరణ్యాశ్వ 8. పంచలాంగల 9 ధారా 10 హిరణ్యాశ్వరథ 11 హేమహ స్తిరథ 12. విష్ణుచక్ర 13. కల్పలతా 14 సప్త సాగర 15. రత్నధేను 16. మహా భూత ఘట.

దామోదరవర్మ మట్టెపాడు శాసనమున[1] "భగవతః సమ్యక్సంబుద్ధస్య పాదాను ధ్యాతస్య" అని వర్ణింపబడినాడు. ఐనను

1. Epigraphia Indica Vol XVII P. 327.

ఈతడు కంగూర గ్రామమును 18 భాగములుగా విభజించి బ్రాహ్మ దేయముగా జేసి 14గురు బ్రాహ్మణులకు వివిధ గోత్రీకులకు, వేద వేదాంగ నిరతులకు దానమొసంగినాడు.

అత్తి వర్మ గోరంట్ల శాసనమున తాన్టికొన్ట (తాడికొండ) గ్రామము పేర్కొనబడినది. కృష్ణానది దక్షిణ తటమున 800 పట్టిల భూమిని అన్తుక్కుర గ్రామమును బ్రాహ్మదేయముగా నిచ్చినట్లు తెలియుచున్నది. ప్రతిగ్రహీత కొట్టిశర్మ. కొట్టిశర్మ త్రివేది. అనగా ఋగ్యజుస్సామ వేదములు క్షుణ్ణముగ జదివినవాడు. తాన్టికొన్ట-నేటి గుంటూరునకు పదిమైళ్ళ దూరమున కృష్ణానది దక్షిణ తటముననున్న తాడికొండ. అంత్తుకూర నేటి అన్తుకూరు, కృష్ణానది ఉత్తర తట మునయున్న గ్రామము.

చేజెర్ల గుంటూరు మండలముననున్నది. ఇచటగల కపోతేశ్వ రాలయ శాసనము[1]వలన కందర రాజు విషయము తెలియుచున్నది.

ఆనంద గోత్రికులు మొదట బౌద్ధులుగా నుండి తరువాత ఒంకేశ్వరభక్తులైనారు. 'దుర్గి' గ్రామమున ఒంకేశ్వరాలయ మున్నది. ఇది అతి పురాతనమైన దేవాలయము. త్రికూటమలయము లేక కోటప్ప కొండ క్షేత్రమునకు దుర్గి 12 మైళ్ళ దూరముననను, గురజాల తాలూకాలోని మాచెర్లకు 8 మైళ్ళ దూరముననను కలదు. ఆంధ్రదేశమున నిది ఒక్కటి మాత్రమే ఒంకేశ్వరాలయముగ బ్రసిద్ధి చెందినది. 'దుర్గి' దుర్గాదేవి వలన వచ్చియుండ వచ్చును. బౌద్ధుల దేవతయగు తారాదేవి శైవము వర్ధిల్లుచుండు కాలమున దుర్గాదేవిగా మార్పుచెంది యుండవచ్చును. బెజవాడ కనకదుర్గాదేవియు నట్లు మార్పు జెంది యుండెననవచ్చును.

**విదేశ వ్యాపారము:—** బృహత్ఫలాయనులకాలములో వలె ఆనందగోత్రికుల కాలమున ఆంధ్రదేశము తూర్పుసముద్ర దీవులతోను,

1. Indian Ant Vol. IX P. I02

దేశములతోను, రోము, ఈజిప్టు మున్నగు దేశములతోను వర్తక వ్యాపారము విశేషముగ జేయుచుండెను. బౌద్ధము ఆంధ్ర దేశమున క్షీణింప మొదలిడిన తరువాత బౌద్ధ బిక్షుణీ భిక్షువులు నావలలో పయనించి బర్మా, కంబోడియా, చైనా మున్నగు దేశములకు వెళ్ళి బౌద్ధమత ప్రచారము చేయుచుండిరి మత ప్రచారముతో పాటు వ్యాపారము సైతము వృద్ధి చెందెను. విదేశ వ్యాపారము విశేషముగ సాగుచుండుటవలన ఆనంద గోత్రికులు ధనాఢ్యులై హిరణ్యగర్భ మహాదానము లొనర్చిరని భావింపవచ్చును.

**శిల్పము;—** పల్లవుల కాలమునందు దక్షిణ భారతమున శిల్ప కళ అభివృద్ధి జెందినది. పల్లవరాజుల శిల్పమునకొక ప్రత్యేకత కలదు. కందరరాజు కపోతపురమునగల బౌద్ధాలయమును శివాలయ ముగ మార్చుటయు, కపోతపురమును తనపేర కందరపురముగా నిర్మించుటయు, ఆనంద గోత్రికుల దైవభక్తికి, శిల్పకళా పోషణము నకు నిదర్శనము. వీరి కాలమున 'దుర్గి'లోని ఒంకేశ్వరాలయ నిర్మా ణము జరిగి యుండును దక్షిణ భారతమునగల శివాలయములలో ప్రత్యేక శిల్పముతో నలరారు దేవాలయము చేజెర్లలోని కపోతేశ్వ రాలయము. ఈ ఆలయము మొదట బౌద్ధాలయముగ నున్నట్లు స్పష్టముగ తెలియుచున్నది. ఆలయ శిఖరము బౌద్ధ చైత్యమువలె అర్ధవర్తులాకారముగ నున్నది దేవాలయ గోపురమువలెనిది లేదు. అజంతా, నాసిక మున్నగు ప్రాంతములందుగల బౌద్ధశిలా చైత్యముల వలె ఈ ఆలయ శిఖరమున్నది. ఈ రాజులు శిల్పకళను పోషించి, బౌద్ధము నాదరించి వైదికమతానుయాయులై ప్రజానురంజకముగ దేశమును పాలించిరి

## శాలంకాయనుల కాలము

శాలంకాయనులు గోత్రనామమునే వంశనామముగ గ్రహించి నారు శాలంకాయనుఁ డొక వేదర్షి. మత్స్యపురాణము, ప్రవరమంజరి

మొదలగు గ్రంథముల వలన శాలం కాయనుని విషయము తెలియు చున్నది. శాలంకాయన మహర్షి విశ్వామిత్ర సంతతి లోని వాడగు శాలంకు లేక శాలంక వంశీయుడు. ఆంధ్రదేశమున.

1. ఆంగీరస, బార్హస్పత్య, భారధ్వాజ, శాలం కాయన.

2. విశ్వామిత్ర, శాలంకాయన, కౌశిక ప్రవరలున్న వారు న్నారు

'శాలం కాయన' పదము పాణిని గణపారమున రెండు పర్యాయము లుచ్చరింపబడినది.[1]

టాలెమీ భూగోళశాస్త్ర గ్రంధమున 'సలకేనాయ్' అను ప్రజలు గోదావరినది పశ్చిమ ప్రాంతమున నివసించుచున్నట్లును, వారికి నగరములు, దుర్గములు, ఉన్నట్లును పేర్కొనినాడు. శాలంకాయన రాజులు తమ నామములు చివర 'పద్మ' పదమును చేర్చు కొనుట వలన, పల్లవులు, ఆనంద గోత్రికులు, బృహత్ఫలాయనులవలె వీరును బ్రాహ్మణులని యూహించుట కవకాశమున్నది. ఆంధ్రదేశ తూర్పు తీర ప్రాంతమును తొలుత వీరు ఆక్రమించుకొని వేంగిని రాజధానిగా పాలించిరి. వీరి పరిపాలనా కాలమున ఆంధ్ర దేశము సకలసంపదల కాలవాలమై యుండెను.

శాలం కాయన వంశీయులు శాతవాహనులకు సామంతులై వారిచే భూసముద్ర వ్యాపారమార్గ రక్షణార్థము కృష్ణానదీ ప్రాంతము నేలుటకు నియమింపబడిరి. శాతవాహనుల పరిపాలనా నంతరము ఇక్ష్వాకు వంశక్షితీంద్రులకు భృత్యులై, ఇక్ష్వాకు రాజ్యపతనానంతరము స్వతంత్రులై, బృహత్ఫలాయన జయవర్మ మహారాజు మరణానంతరము రాజ్యమును విస్తరింపజేసిరి. వీరి రాజధాని వేంగీపురము. ఇది నేడు చినవేగి; పెదవేగి గ్రామములుగా శిథిల చిహ్నములతో నున్నది.

1. Panini. Bk IV Chapt. I No. 99. and Capt. II No. 53.

శాలంకాయనుల పరిపాలనా కాలపు సాంఘిక చరిత్రకు శాసనము లాధారము. ఈ రాజన్యులు వేయించిన శాసనము లిప్పటివరకు ఎనిమిది లభించినవి అవి ప్రకటింపబడినవి. వీరి శాసనములలో 3 ప్రాకృత భాషలోను, 5 సంస్కృత భాషలోను వేయింపబడినవి. శాలంకాయన రాజ్యస్థాపకుడు విజయ దేవవర్మ. ఇతఁడాంధ్ర దేశమును క్రి. శ. 300 నుండి 335 వరకు పాలించెను.

ఈ వంశీయులలో ఆర్గురు రాజులు ముఖ్యులు. వారి పేళ్ళు పరిపాలనా కాలము క్రింద నీయబడుచున్నది.

శాలంకాయన వంశము
|
విజయదేవవర్మ (క్రి. శ. 300-335)
|
హస్తివర్మ (335-350)
|
నందివర్మ (350-380)
|
చండవర్మ (380-395)
|
విజయనందివర్మ (నందివర్మ II) (395-410)
|
విజయస్కందవర్మ (410-440)

**పరిపాలనా విధానము:-** శాలంకాయనులు పరిపాలనా విధానమున ఆంధ్రరాజుల ననుకరించిరి. ఇక్ష్వాకుల యనంతరము వీరాంధ్ర దేశమును పాలించినవారు కావున ఇక్ష్వాకులెట్లు శాతవాహనుల పరిపాలనా విధానము నములులోపెట్టిరో శాలంకాయనులును ఆ విధమునే యనుసరించిరి. వేదవిదులైన బ్రాహ్మణుల నాదరించిరి. రథకార కులజులయెడ భక్తి ప్రపత్తులు కలిగియుండిరి. ధర్మము, యశస్సు,

ఆయువు, సత్యము వృద్ధి పొందుటకు బ్రాహ్మణులకు, రథకారకులకు లకు, భూమిని అగ్రహారములను వసతి గృహములను దానమొసంగిరి. శాలంకాయన వంశమునకు జెందిన రాజులందరు వితరణ బుద్ధికలవారు. తాము గావించిన దానములు శాశ్వత బ్రహ్మకల్పముగ నుండవలెనను ఉద్దేశమున రాగిరేకులపై శాసనములు వేయించుచుండిరి. వీరికి సంబంధించిన శాసనము లన్నియు తామ్ర శాసనములే.

ఈ వంశీయుల శాసనముల ననుసరించి ఆకాలమున,

సంవత్సరమునకు—3 ఋతువులు

ఋతువునకు—4 మాసములు

లేక ఋతువునకు—8 పక్షములుండెనని తెలియుచున్నది.

శాసనములందీ విధముగా ఋతువు, మాసము, పక్షములను తెలుపుట ప్రాచీన సంప్రదాయము. స్మృతులందును ఈ విషయము ప్రస్తావింప బడినది. శాసనములందు మాసము, పక్షము, తిథులను పేర్కొనుట అర్వాచీనము. శాలంకాయనుల ప్రాకృత శాసనములందు శాసనాంతముననున్న వ్యాస గీతా శ్లోకములు సంస్కృత భాషలో నున్నవి.

శాలంకాయనుల రాజచిహ్నము 'నంది'. వీరి శాసనములకుగల కడియములకుండు రాజముద్రికపై 'నంది' చిహ్నము కనిపించును. ఇట్టి రాజముద్రిక 'కానుకొల్లు' శాసనమున కున్నది.

శాలంకాయనులు పాలించిన కాలమునం ధాంధ్ర దేశమున భూమిని నివర్తనములలో కొలిచెడివారు. నివర్తనము = 2.975 ఎకరములని కౌటిల్యుని అర్థశాస్త్రము సూచించుచున్నది.

మున్యద పదము కొల్లేరు శాసనమందున్నది. మున్యద అనగా రాజకీయోద్యోగి. ముఖ్యముగా భూమిశిస్తు వసూలుచేయు అధికారి.

మున్యాద పదమునకు, ముత్యాద, మున్యాదప, ముళుద పదములు రూపాంతరములు.

రాష్ట్రిక పదము పల్లవుల శాసనము లందున్నది. రాష్ట్రిక— అనగా రాష్ట్రమున కధికారియనియు, రాష్ట్రమున పన్నులు ముఖ్యముగా భూమి పన్ను వసూలు చేయు రాజకీయోద్యోగి కావచ్చును. తూర్పు చాళుక్యుల శాసనమునందు రాష్ట్రకూట, లేకరట్టడి పదము లున్నవి. సాధారణముగా ఆంధ్రదేశమున వెలసిన శాసనములందు 'రాజు శాసనమిచ్చు సమయమున రాష్ట్రకూట ప్రముఖులను వారి కుటుంబముల వారిని ఆహ్వానించి వారి సమక్షమున' బ్రాహ్మదేయములను వేదవిదులైన విప్రులకు దానమిచ్చుచుండిరి.

ముళుద
ముత్యాద
మున్యాత
పదములు నేడు మోతాదు పదముగా వ్యవహారము లోనికి వచ్చిన వనవచ్చును.

ఆనాఁడు జనవ్యవహారమున పోతి, పోతడు, పోటి, పోఱడు పదములు గౌరవ సూచకముగ వాడబడుచుండెను. నేడా పదములు అగౌరవ సూచకములు శాలంకాయన మొదటి నందివర్మ కుమారుడు 'ఖందపోత' యని శాసనమున పేర్కొనబడినాడు.

**మతము:—** శాలంకాయనుల పరిపాలనా కాలమాంధ్ర దేశమున స్వర్ణయుగముగా పేరొందినది. భారతోత్తర భాగమున గుప్త వంశీయులు, దక్షిణా పథమున కదంబులు, దక్షిణ భారతమున పల్లవులు పాలించు కాలమున శాలంకాయనులాంధ్ర దేశమును పాలించినారు. ఆంధ్రదేశము వీరి పరిపాలనా కాలమున ప్రశాంతముగనుండెను. ప్రజలు సుఖమయ జీవితము గడిపినారు. వీరి రాజధాని వేంగీపురము. ఆంధ్ర దేశమున జీవనదులగు గోదావరి కృష్ణలు ఉపనదులతో ప్రవహించుచు,

దేశమును సుభిక్ష మొనరించుటయేగాక, నౌకా వ్యాపారమునకు తోడ్పడి ఆంధ్రుల కీర్తి విదేశములందు వ్యాపించునట్లు చేసినవి. ఆంధ్రదేశమునకు సువిశాలమైన సముద్ర తీరముండుటవలన ఆకాలము నందాంధ్ర నావికులు విదేశములతో విశేషముగ వర్తకవ్యాపారము చేయుచుండిరి.

శాలంకాయనులు వైదికమతానుయాయులు. వైదికమతోద్ధరణకు, వేద విద్యల అభివృద్ధికి పాటుపడి వేదవిదులైన బ్రాహ్మణుల కగ్రహారములొసంగి తమ దాననిరతిని, వైదిక మతాభిమానమును ప్రకటించుకొనిరి. ఆ కాలమునందాంధ్ర దేశమునందేకాక, దక్షిణాపథమున పల్లవులు, ఆనందగోత్రికులు, కదంబులు, ఉత్తరాపథమున గుప్తరాజులు, దక్కనులో వాకాటకులు, విష్ణుకుండినులు వైదిక మతోద్ధరణమునకు దీక్షాకంకణులైరి ఇట్టి పరిస్థితిలో బౌద్ధము క్షీణింప మొదలిడినది. రాజాదరణము సన్నగిల్లినది. బౌద్ధ సంఘారామములకు, విహారములకు దానధర్మములు చేయువారు కరువైనారు. బౌద్ధ మతము, పోషించువారులేక నిరాశ్రయమైనది. కావున బౌద్ధము మాతృదేశమున స్థానము కోల్పోయినను విదేశములందు వ్యాపించుట కవకాశము కల్గినది. శాలంకాయనులే బర్మాదేశమున బౌద్ధమతము వ్యాపించుటకు గారణభూతులని తెలియుచున్నది.[1] 'సాన్‌లన్‌క్రోమ్' అను శాలంకాయనరాజు బర్మాలోని ఐరావతపరీవాహ ప్రాంతమును పాలించినట్లును, బుద్ధఘోషుడు, బుద్ధదత్తుడు మున్నగువారు ఆ ప్రాంతమున బౌద్ధమతమును వ్యాపింపజేసినట్లును,శశవాలంకారమను బౌద్ధమత గ్రంథమువలన తెలియుచున్నది.

బుద్ధదత్తుడు సింహళదేశమున గొప్ప విద్యావేత్తగా పరిగణింప బడినవాడు. అతఁడనేకరాజాస్థానముల దర్శించి గౌరవ సత్కారముల

1. Journal of Oriental Research Vol. II P 111-112.

నందినవాఁడు. బుద్ధదత్తుని వేంగీశుడాహ్వానించి కాంచీపురమున బౌద్ధ మత ప్రచారమునకు నియోగించెను. అంతియేగాక, బర్మాదేశమున బౌద్ధమతము వ్యాపింపజేయుటకు ఉపదేశికునిగా బుద్ధదత్తుని శాలంకాయనమహారాజు పంపించెను. శాలంకాయనులు బర్మాదేశమున రాజ్యము స్థాపించుటవలన బర్మాలో బౌద్ధమత వ్యాప్తికిట్లు పాటు పడి యుండవచ్చును. పరమభాగవతులై వైదికమతానుయాయులై, వైదికమతోద్ధరణకు పాటుపడిన శాలంకాయనరాజులు బౌద్ధమతము నభిమానించుటయేగాక, బౌద్ధమతాచార్యులను గౌరవించి మత వ్యాప్తికి పాటుపడిరి. దీని వలన శాలంకాయనులకు గల పరమత సహనము విశదమగు చున్నది. శాలంకాయనులలో మొదటి నందివర్మ వివిధ ధర్మప్రధాన్య అని అతని మనుమడగు విజయనందివర్మ వేయించిన పెదవేగిశాసనమున వర్ణింపబడుట వలన మొదటి నందివర్మ బర్మా దేశమున బౌద్ధమతము వ్యాపించుటకు కారకుడని చెప్పవచ్చును.

మూడు, నాలుగు శతాబ్దులం దాంధ్ర దేశమున బౌద్ధమత గురువులు, మహామేధావులు, పండితులు, తత్త్వపారంగతులు, శాస్త్ర ప్రవీణులు వెలసినారు. వారు రచయితలు, మేధావులు, శాస్త్రజ్ఞులు, తత్త్వజ్ఞులు, అందు ముఖ్యముగా బుద్ధపాలితుడు, ఆర్యదేవుడు, భావవివేకుడు, ఆచార్య దిఙ్నాగుడు పేరొ్కన దగినవారు. ఆర్యదేవుడు, భావవివేకు డాంధ్రులు. తక్కిన వారాంధ్రదేశముతో సన్నిహిత సంబంధము కలవారు ఈ బోధిసత్త్వులు బౌద్ధమతవ్యాప్తికి అందును విదేశములందు బౌద్ధ నాగరికత స్థిరపడునట్లు ప్రచారము చేయుటకు తోడ్పడినారు. ఈ మహామహులను గూర్చి తెలిసికొనుటకు చైనా, టిబెట్టు దేశములందున్న బౌద్ధవాఙ్మయ గ్రంథములు మిక్కిలి తోడ్పడు చున్నవి. విదేశయాత్రికుల వ్రాతలవలన ఈ బౌద్ధాచార్యుల జీవిత విశేషములు తెలియుచున్నవి.

చైనా యాత్రికుఁడగు యువాన్‌చాంగ్ వ్రాతలవలన ఆచార్య దిఙ్నాగుని గూర్చియు, భావవివేకుని గూర్చియు తెలియుచున్నది. యువాన్‌చాంగ్ భారతదేశమున బౌద్ధక్షేత్రములను సందర్శించుచు తాను చూచిన విషయములను, విన్నవిషయములను ఒక గ్రంథముగా రచించెను. యువాన్‌చాంగ్ వ్రాతలవలన మన కాచార్యదేవులగు దిఙ్నాగ, భావవివేకుల గూర్చి తెలిసికొనుట కవకాశమున్నది.[1]

**దిఙ్నాగాచార్యుడు** — కాంచీమండలములోని బ్రాహ్మణ కుటుంబమునకు జెందినవాడు. సింహవక్త్రపురమున జన్మించెను. జన్మతః వైదికబ్రాహ్మణుడు. ప్రాచీనబ్రాహ్మణమత విద్యయగు వేదములను, వేదాంగములను క్షుణ్ణముగ నభ్యసించెను.[2] ఈతడు బౌద్ధమత ప్రచారకుడుగ పేరుపొందెను. బౌద్ధమత గ్రంథములను పఠించి అపారమైన బౌద్ధమత విజ్ఞానము నార్జించెను బౌద్ధతత్త్వ బోధకునిగా దిఙ్నాగాచార్యునికి మంచిపేరు ప్రతిష్ఠలు గౌరవాదరము లానాడుండెను మొదట ఈ మహాజ్ఞాని హీనయాన బౌద్ధమతాను యాయిగా నుండి తరువాత వసుబంధువను బౌద్ధగురువు ప్రోత్సాహమున మహాయాన బౌద్ధము నవలంబించి ఆ మతప్రచారమునకు పాటుపడెను. తన జీవితమున చాల భాగము నాసిక లేక అజంతా ప్రాంతమున గడిపి, అంత్యకాలము నంధ్రాంధ్ర దేశము నావాసముగా జేసికొని వేంగిపుర ప్రాంతమున నివసించి, శేష జీవితమును గడిపెను.

దిఙ్నాగాచార్యుడు గొప్ప రచయిత. వందలకొలది బౌద్ధజాతక కథల నీతఁడు రచించెను వైదిక మతసంబంధమైన న్యాయశాస్త్రము నభ్యసించి వేదపండితులను, వైదిక న్యాయశాస్త్రమును విమర్శించెను. దిఙ్నాగాచార్యుడు ప్రజ్ఞాపారమిత శాస్త్ర పారంగతుడు. ఈ ప్రజ్ఞా

1. Beal Buddhist Records of the western world Vol II P 217-227.
2. Walters : Onyua chwangs Travels Vol. II P. 209-224

పారమిత శాస్త్రజ్ఞానమున నాతఁడు యోగమునభ్యసించి నిర్వాణ ప్రాప్తికి సోపానముల నిర్మించెను. హేతువిద్యా శాస్త్రమను తర్క శాస్త్ర గ్రంథము నీతడు రచించెను. ఈ గ్రంధము ప్రజ్ఞాపారమిత శాస్త్రములోని భాగము. దిఙ్నాగాచార్యుడు సమ్యక్సంబుద్ధికై (నిర్వాణమునకై) వజ్రసమాధిలో నుండు సమయమున గొప్ప భూకంపము సంభవించెననియు, కులపర్వతములు కదిలెననియు, ఆదేశమును పాలించు రాజు (శాలంకాయన ప్రభువు) దిఙ్నాగాచార్యుని ప్రోత్సహించెననియు సమాధి నిష్ఠుఁడగుటకు తోడ్పడెననియు యువాన్‌చాంగ్ వ్రాతల వలన తెలియుచున్నది. కాని బోధిసత్త్వ మంజుశ్రీ వలన దిఙ్నాగాచార్యుడీ ఉద్యమమును, విరమించెననియు తెలియుచున్నది. దిఙ్నాగాచార్యుడు, మహాకవి కాళిదాసుకు ప్రతిస్పర్థియనియు, కాళిదాస మహాకవి మేఘసందేశమున పేర్కొనబడిన దిఙ్నాగు డీతడేయనియు, ఇతఁడు గొప్ప కవియేగాక విమర్శకాగ్రేసరుఁడనియు, మల్లినాథ సూరి వ్యాఖ్యవలన తెలియుచున్నది. లభించిన ఆధారములనుబట్టి, ఈ యిరువురు మేధావులు సమకాలికులనియు, నాల్గవ శతాబ్ద్యంతముననో ఐదవ శతాబ్ద్యారంభముననో నుండియుందురని తెలియుచున్నది.

**భావ వివేకుడు:—** మలయగిరిని ఆవాసస్థానముగా జేసికొని భావ వివేకుఁడాంధ్ర దేశమున నివసించెను. తూర్పుకనుమలకు మలయ పర్వతమని పేరు. ఈ మలయపర్వత శ్రేణి, గుంటూరు మండలమున శ్రీపర్వతమును, కర్నూలు మండలమున శ్రీశైలమును కలిగి యున్నది. భావ వివేకుడు ప్రజ్ఞాలంప శాస్త్రమును వ్యాఖ్యానించెను. ప్రజ్ఞాప్రదీపమాల, మాధ్యమిక వృత్తి, అర్కజ్వాల అను గ్రంథములను కూడ రచించెను.

శాలంకాయనుల కులదైవము సూర్యుడు. ఆనాడు సూర్యారాధనము విశేషముగ నుండెను. ఈ రాజన్యులు చిత్రరధ స్వామి భక్తులు. వేంగి వీరి రాజధాని. వేంగీపురమునందానాఁడు చిత్రరధస్వామి

ఆలయముండెను. సూర్యారాధన మానాడు విశేషముగ నుండెననుటకు వేంగిలోని చిత్రరథ స్వామి ఆలయము, శ్రీకాకుళము జిల్లాలోని అరసవిల్లిలోగల సూర్యక్షేత్రము నిదర్శనము. ఈ వంశీయులు సప్త సంతానములలోని ఆరామ తటాక దేవాలయాది నిర్మాణములు గావించినట్లు తోచుచున్నది

వేంగీ ప్రాంతముననున్న దెందులూరు సమీపమున మంచాలమ్మ చెఱువు, తోట, నారికేళ్ళవారి చెఱువు, లెక్కకు మిక్కిలిగా నున్న శైవ సంబంధమైన విగ్రహములు చిత్రరథ స్వామివారి ఆలయము శాలంకాయనుల ధర్మనిరతికి నిదర్శనము. వీరి రాజధాని వేంగీ నగరము. నేడది చినవేగి, పెదవేగి గ్రామములుగా కనిపించుచున్నది.

శాలంకాయనులు దిగ్విజయ సూచకముగను. రాజ్య స్థాపనమును సూచించుటకు చక్రవర్తిత్వ ప్రకటనమునకును అశ్వమేధ యాగములు చేయుచుండిరి. శాలంకాయనులలో మొదటి రాజగు విజయదేవవర్మ అశ్వమేధయాగము గావించినట్లు శాసనమువలన తెలియుచున్నది.

**ప్రజల వృత్తులు :** శాలంకాయనులు పరిపాలించిన ఆంధ్ర దేశము సుఖితముగా నుండెను. ప్రజలలో నధిక సంఖ్యాకులు వ్యవసాయము జీవనాధారముగ గలవారు. ఆ కాలమున విదేశీ వ్యాపారము విరివిగా జరుగుచుండెను. ఆంధ్రదేశమునుండి సన్ననూలుబట్టలు, వజ్రములు, ధాన్యము, శిల్ప, చిత్రకళకు సంబంధించిన వస్తుజాలము ఎగుమతి యగుచుండెను. కళలయందును. వాస్తు శిల్పమందును నేర్పరితనము కలిగి అద్భుతమైన వస్తు నిర్మాణము గావించు ప్రత్యేక కులము వారుండిరి.

**రథకార కులము ;** రథకార కులము వైశ్య వృత్తిగా, తైత్తిరీయ బ్రాహ్మణమున పేర్కొనబడినది. ఈ కులమువారు

వ్యాపార నిపుణులు పారిశ్రామిక కుశలులు గౌరవనీయులు ధర్మ శాస్త్రపరులు.

యాజ్ఞవల్క్య, గౌతమ, భోధాయన, కౌటిల్య, ఆపస్తంబాది మహామహుల, స్మృతి, సూత్ర, ధర్మశాస్త్ర గ్రంథములందు ప్రమాణముల గ్రహించి,

రథకారుడనగా మాహిష్య జనకునికి, కరణీ జననికి జన్మించిన వాడనియు,

మాహిష్యుడు. క్షత్రియ పురుషునికి, వైశ్య స్త్రీకి జన్మించిన వాడనియు,

కరణి, వైశ్య జనకునికి, శూద్ర స్త్రీకి జన్మించిన స్త్రీయనియు, పరిశోధకులు నిర్ణయించినారు.

ఈరథకార కులజులు కళలయం దారితేరిన వారు. శిల్పము, వాస్తు శిల్పము, రథములు, బండ్లు, దేవాలయ గోపురములు, గోపురముల పైనను, కుడ్యములపైనను చిత్రములు వేయుట, రాజ భవనములు నిర్మించుట సువర్ణ రత్నాభరణములు చేయుట రథకార కులజుల ముఖ్యమైన వృత్తులు.

కృష్ణ, గోదావరి నదుల పరీవాహ ప్రాంతమున రథకార కులజులమని చెప్పుకొను విశ్వబ్రాహ్మణులు నేడును ఉన్నారు. ఇందు పంచాణమువారును కలరు. పంచాణము వారనగా 1 కంసాలి, 2. కమ్మరి, 3. కంచరి, 4 కాసె, 5. వడ్రంగి వృత్తుల నవలంబించు వారు.

రథకార కులజులలో నున్న పంచాణము వారిలో ఒక వృత్తి నవలంబించు వారికి మరొకవృత్తి నవలంబించు వారితో వివాహ సంబంధములు కాని, భోజన ప్రతిభోజనములుగాని లేవు. వీరిలో కొందరు

ఆచార వ్యవహారమున శిష్టులు కానందున శూద్రులుగా పరిగణింప బడుచున్నారు.

రథకార విధానమున రాజులు వీరికి అగ్రహారములను, భూమిని దానమిచ్చినట్లు శాసనముల వలన తెలియుచున్నది. రథకార విధాన మున దానమిచ్చుట యనగా, ఒక గ్రామమున గాని గ్రామముల కూటమిలో గాని, రథకారకులజులాయా పంచాణ వృత్తుల నవలం బించి గ్రామీణులకు గావలసిన వస్తుసముదాయమును సిద్ధముచేసి యొసంగవలెను. అందులకు ప్రతిఫలముగ రాజు వారికి అగ్రహారమునో లేక మాన్యముగా కొంత భూమినో దానమొసంగును. ఇప్పటికిని గ్రామములందు వడ్రంగి, కమ్మరి, కంచరి, చర్మకార మున్నగు వృత్తుల వారు గ్రామములోని రైతులకు వ్యవసాయపు పనిముట్లు ప్రతిదినము వాడుకొను వస్తువులను చేసి ఇత్తురు. అందుకు ప్రజల నుండియు, ప్రభుత్వము వారొసంగిన ఇనాము భూముల నుండియు, ప్రతిఫలమును పొందుదురు. ఇది గ్రామసీమలందుగల కట్టడి.

**ఆచార వ్యవహారములు :** ప్రజలు సంఘజీవనమునకు నెక్కువ ప్రాధాన్యము నిచ్చుచుండిరి. ప్రజలలో కొందరు బౌద్ధులు, మరి కొందరు జైనులు, తక్కినవారు వైదిక మతానుయాయులు. వైదిక మతానుయాయులలో కొందరు శైవులు, తక్కినవారు భాగవతులు. శాలంకాయన రాజులలో విజయదేవవర్మ మహారాజు తప్ప తక్కిన వారందరును భాగవతులు, బప్పభట్టారక పాదభక్తులు. ఈ రాజన్యులు శాసనములందు బప్పభట్టారక పాదభక్తులమని చెప్పుకొనినారు. ఈ బిరు దము చరిత్రలో మార్పు కలిగించినట్లూహింపవచ్చును.

శాతవాహనులు, ఇక్ష్వాకులు మున్నగు వంశీయులు తమ నామ ములకు మాతృభక్తి సూచకములగు ఉపపదములను చేర్చుకొనినట్లు శాసనముల వలన తెలియుచున్నది. గౌతమీపుత్ర శాతకర్ణి, వాసిష్ఠీ

పుత్ర శ్రీ పులమావి, మాఢరీపుత్ర శ్రీ వీరపురుషదత్తుడు, ఇత్యాదులు శాసనములందు కనిపించుచున్నవి.

రెండు, మూడు శతాబ్దుల కాలములో మాతృభక్తి సూచకములగు పదములను తమ నామములకు చేర్చుకొను ఆచార మవలంబింపక పోవుటయేగాక, ఈకాలపు రాజులు "బప్పభట్టారక పాదభక్త" అను పితృభక్తి సూచకమగు పదమును బిరుదముగ తమ నామములకు చేర్చుకొనుట వలన సంఘము మాతృవ్యవస్థ నుండి, పితృ వ్యవస్థకు మారినదని చెప్పవచ్చును. ప్రజలలో మతాభిమానము, దైవారాధన, భక్తి, దయా, దాన, క్షమ, శౌచము పాటించు గుణములుండెను. ధనాఢ్యులయిన ప్రజలు పరమత సహనము కలిగి ఆరామ విహారములను సంఘారామములను, దేవాలయములను పోషించుచుండిరి. ప్రజలలో బౌద్ధులు, వైదిక మత ప్రభావమున ప్రేరితులై బౌద్ధము వీడివైదిక మతమవలంబించిరి. బౌద్ధ మతము ఆంధ్రదేశమున అనాదరణీయమై, బర్మా, కాంబోడియా, చీనా, సయామ్, సుమిత్రా, జావా, బోర్నియో, సింహళము, మున్నగు దేశములకు వలస పోయెను. బౌద్ధాచార్యులు బౌద్ధ సన్యాసులు విదేశములందు బౌద్ధ మత ప్రచారము గావించుచుండ, సముద్రయానమును చేయరాదను నిబంధనముునుల్లంఘించి వైదిక బ్రాహ్మణులు, విదేశములందు వైదికధర్మ ప్రబోధమునకు నడుముబిగించి ఆయాదేశములందు వైదిక ధర్మ సంస్థాపనము గావించిరి.

**వాణిజ్యము:—** శాలంకాయనులు పాలించిన కాలము నంధాంధ్ర దేశము శాంతిసౌఖ్యములతో వర్ధిల్లినది ప్రజలత్యంతో త్సాహశీలురై సాహసిక జీవనమునకు, నౌకాయానమునకు, విదేశ గమనమునకు, విదేశ వ్యాపారమునకు ముందంజవేసినారు. సుదీర్ఘమైన తూర్పు సముద్రతీరము, కృష్ణా గోదావరి నదులు, వాటి ముఖద్వారములు. ఉపనదులు, ఓడరేవులు, కలవారగుటచే ఆంధ్రులు ప్రాక్, పశ్చిమ

సముద్రములపై నౌకాయానముచేసి బర్మా, కాంబోడియా, సయామ్, జావా, సుమిత్రా, బోర్నియో, సింహళము, చీనా మున్నగు ప్రాగ్దేశములతోను, గ్రీస్, రోమ్, ఈజిప్టు మొదలగు పశ్చిమ దేశముల తోను, విశేషముగా వ్యాపారము చేయుచుండిరి.

శాలంకాయనుల కాలమున విదేశములందు ఆంధ్ర సంస్కృతి, నాగరికత వ్యాపించెను. మత వ్యాప్తితో పాటు వ్యాపారము వృద్ధి చెందెను. అటుపిమ్మట వలసరాజ్య స్థాపనము జరిగెను. "శాన్‌లాల్ క్రోమ్" అను రాజు బర్మాలో రాజ్యపరిపాలనము గావించిన ట్లాధార ములుండుటవలన శాలంకాయనుల యుగము ఆంధ్రుల వలసరాజ్య నిర్మాణ యుగమని ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము గారభిప్రాయ పడిరి[1]. శాలంకాయనుల కాలమునుండి దేశవిభాగమునకు "విషయ మను" నామము స్థిరపడినది ఆనాటి పరిపాలనా పద్ధతినిబట్టి రాక పోకల సౌకర్యార్థము చక్కని రాజమార్గము లుండెవనియు, పదేసి మైళ్ళ కొక దుర్గముండెననియు తెలియు చున్నది.

శాలంకాయన ప్రభువులు విదేశ వ్యాపారమునకు చక్కని సౌకర్యము లేర్పరచిరి. ఆనాటి ప్రసిద్ధ నగరములలో వేంగీ, ధాన్య కటకను, ప్రతిపాలవురము, కూడూరు, కంటకొస్సల, మైసోలియా ముఖ్యమైనవి. ఇవి వ్యాపార కేంద్రములుగా ప్రసిద్ధి బడసినవి. మూసీ నది యొడ్డున మూషిక నగరముండెను. అది నేటి నల్లగొండ మండ లములో నుండియుండవచ్చును. భూమార్గమున జరుగు వ్యాపారము చేయు వర్తకులు ప్రాగాంధ్రమున గల రేవుపట్టణముల నుండి బయలుదేరి విజయవాడ, మూషిక నగరములమీదుగ, పశ్చిమ సముద్ర తీరముననున్న భరుకచ్ఛము (బ్రోచ్) రేవుపట్టణమునకు చేరుచుండిరి. అచ్చటినుండి రోమ్, గ్రీస్, ఈజిప్టు మున్నగు దేశములకు సన్నసూలు

---

1 ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి.

బట్టలు, పట్టు వస్త్రములు వజ్రములు ఎగుమతి చేయుచుండిరి.

ఆంధ్ర నావికులతిసాహసులు సముద్రముపై వేలకొలది మైళ్ళ ప్రయాణముచేసి ఆంధ్ర సంస్కృతిని నాగరికతను విదేశములందు వ్యాపింప జేయుటయేగాక, కొన్ని ప్రాంతములందు వలసరాజ్యములను స్థాపించి బౌద్ధమత వ్యాప్తికి బౌద్ధమత సంబంధమైన స్తూప, ఆరామ విహార చైత్యములు నిర్మాణమునకును, వైదిక మత వ్యాప్తికి, వైదిక ధర్మ ప్రచారమునకు దేవాలయ నిర్మాణమునకు కారణభూతులైనారు. ఆంధ్రుల నౌకా జీవనమునకును, విదేశ వ్యాపారమునకును. వలసరాజ్య స్థాపనమునకును, శాలంకాయనుల యుగము స్వర్ణయుగమని భావింపవచ్చును.

**వైదుష్యము:** — శాలంకాయనుల పరిపాలనా కాలమునాటికి ఆంధ్రదేశమున రాజభాష ప్రాకృతము. ఈ రాజన్యుల శాసనములలో మూడు ప్రాకృత శాసనములు. అయిదు సంస్కృత శాసనములున్నవి. ప్రాకృత శాసనములలోను, సంస్కృత శాసనములలోను గ్రామ నామములు, వ్యక్తుల పేళ్లు, బిరుదములు, నాడులు, సీమలు, విషయములు ఆంధ్ర దేశమునకు, తెలుగు భాషకు సంబంధించినవి. వీరు వేయించిన ఎనమిది శాసనములలోగల గ్రామ నామములు, సీమలు. నేడు మనకు శిథిలరూపమున కనిపించు చున్నది. వీరికి సంబంధించిన ప్రాకృత శాసనములందు. శాసనాంతమునగల వ్యాసగీత శ్లోకములు సంస్కృత భాషలోనున్నవి. బౌద్ధ మతాచార్యులు, వివిధశాస్త్ర పారంగతులు, బౌద్ధ విజ్ఞాన సంపన్నులైన వారును వేదవిద్యలను క్షుణ్ణముగా చదివి యజ్ఞయాగాది క్రతువులను నిర్విఘ్నముగా నిర్వహించునట్టి మంత్ర శాస్త్రవేత్తలు. ఋగ్యజుస్సామాథర్వణ వేదములు, శృతి,స్మృతి పురాణేతిహాసములను, శ్రౌత, కల్ప గృహ్య సూత్రములను ధర్మ సూత్రములను తెలిసిన ఉద్దండ పండితులకు శాలంకాయన ప్రభువులు అగ్రహారములను బ్రాహ్మదేయములుగా జేసి దానమొసంగినారు.

బౌద్ధమతావలంబియైన దిఙ్నాగాచార్యునివంటి పండితుడు, విమర్శకుడు, న్యాయ, వైశేషిక, తర్క, మీమాంస శాస్త్రముల నభ్యసించినట్లు తెలియుచుండుటను బట్టి ఆకాలపు వైదికమతావలంబులైన వేద బ్రాహ్మణుల పాండితీ ప్రభావము, విద్యా వైదుష్యములు ఎట్టివో ఊహింపవచ్చును.

ఆనాఁడు జనవ్యవహారమున తెలుఁగు వాడుకలో నుండెను. శాలంకాయనులకు సంబంధించిన శాసనములలో తెలుఁగు దేశమునకు సంబంధించిన గ్రామనామములు, హారములు పేర్కొనబడినవి.

ఏలూర—విజయ దేవవర్మ ఏలూర తామ్రశాసనము.

| | |
|---|---|
| ప్రొలూర<br>అలుతొాతె<br>మణ్ణూర<br>చెఞ్చెరువ<br>కమ్బురాఞ్చెరువే | నందివర్మ పెదవేగిశాసనము .[1] |
| విదేమారపల్లికా<br>కురువక | విజయ నందివర్మ కొల్లేరు దానశాసనము.[2] |

కురువాడ—నందివర్మకంతేరు దానశాసనము.[3]

పిడిహ —కానుకొల్లు ప్రాకృత శాసనము.[4]

కొంపెర—స్కందవర్మ కానుకొల్లు తామ్రశాసనము.

| | |
|---|---|
| చిన్తపురి (చిన్నపురి)<br>లేకుమారి | విజయస్కందవర్మ కన్తేరు తామ్రశాసనము.[5] |

1. భారతి—1924 Page 120
2 Indian Antigquary Vol V P 175
3. J. A. H. R. S. Vol V P. 31.
4. భారతి—1950 ఏప్రిలు.
5. Epigraphia Indica Vol XXV Page 42-47.

కుడూహార
కుద్రాహార విషయే
కుద్రహారే
వేంగిపురా | ఆం.సా ప ప సం. 11 సంచిక 2.

ముత్యదప్ప (A village Official) శాలంకాయిన నందివర్మ కాను
కొల్లు తామ్రశాసనము భారతి 1950

**వేంగీ నగరము :** శాలంకాయనుల రాజధాని వేంగీ నగరము. నేటి పశ్చిమ గోదావరి జిల్లా కేంద్రముగ నున్న ఏలూరు సమీపమున నున్న పెదవేగి, చినవేగి గ్రామములు వేంగీనగరముగ గుర్తింపబడినవి. ఆంధ్రదేశమున 'వేగి' పేరుగల గ్రామములు నాలుగున్నవి. ఏలూరు సమీపమున నున్న పెదవేగి, చినవేగి గ్రామములు, కొవ్వూరు తాలూకాలోనున్న వేగేశ్వరము. పోలవరము తాలూకాలోని వేగిపాడు శాలంకాయనుల కాలమున వేంగీ నగరము నుండి భారతదేశములోని అన్ని ప్రాంతములకు, వెళ్లుటకు ఐదు ప్రధాన రాజమార్గము లుండెను. కళింగ, ద్రావిడ, కర్ణాటక, మహారాష్ట్ర, దక్షిణ కోసల దేశముల కీ మార్గములు వేయబడినవి వేంగీనగరము శాలంకాయనులకు, తూర్పు చాళుక్యులకును రాజధానిగా వర్ధిల్లినది. ఇచట బౌద్ధారామ విహారములు, చైత్యములు, సంఘారామము లుండుట వలన దేశము నలుమూలల నుండి బౌద్ధ భిక్షువులు, సన్యాసినీ సన్యాసులీ బౌద్ధక్షేత్రమును దర్శించుటకు వచ్చుచుండిరి. చైనా యాత్రికుడగు హ్యూయాన్‌సాంగ్ వ్రాతల వలన, "వేంగీనగరమున ఆనాడు, ఇరువది సంఘారామము లుండెననియు, అందు మూడువేలమంది బౌద్ధ సన్యాసులుండిరనియు, ముప్పది దేవాలయములుండెననియు, అందు వేదాధ్యయన సంపన్నులైన వైదికమతాచార్యులుండిరనియు"[1] తెలియు చున్నది. శాలంకాయనులు వైదికమతాను యాయులు. వైదికమతో

1. Beal-Buddhist records Vol. II P. 218.

ద్ధారకులు దేవాలయములకును, వేదవిదులైన విప్రులకు గ్రామము లను, దేవభోగములుగను, బ్రాహ్మదేయములుగను దానమిచ్చినవారు విజయనంది వర్మ విష్ణ్వాలయమునకు గ్రామదానమొసంగి వటాతడు వేయించిన పెదవేగి తామ్ర శాసనము వలన తెలియుచున్నది.

శాలంకాయనులు కృష్ణా గోదావరి నదులమధ్య ప్రాంతమును పాలించుటయే గాక, ఆంధ్ర సంస్కృతి, నాగరకత విదేశములందు వ్యాపించుటకు దోడ్పడినారు. వైదిక ధర్మ రక్షణ, వైదిక మత వ్యాప్తి, ప్రజానురంజకమగు పరిపాలన, ఆదర్శముగ బెట్టుకొని ఆంధ్ర దేశమును పాలించి ఆంధ్రదేశ చరిత్రలో తమ పరిపాలనా కాలము సుస్థిరముగ నిలుచునట్లు చేసినారు.

ఈ ప్రకరణము వ్రాయుటలో దోడ్పడిన గ్రంథములు :

1 Epigraphia Indica Vols. VI, XVII, XX, IX, XXV.
2. Ancient History of Deccan.
3. Archeological Survey of South India Vol I
4 A History of the Early Dynasties of Andhra Desa
5 Indian Anti Vol. V.
6. Journal of Oriental Research Vol. II
7. Beal. Buddhist Records of Western World Vol. II.
8 Walters· on yuanch wang's Travels Vol. II
9. ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి.
10 భారతి సంపుటములు 1924 1950 ఏప్రిలు.
11. J A. H. R. S. Vol V.

# 6వ ప్రకరణము

# విష్ణుకుండిన యుగము

ఆంధ్రదేశ చరిత్రలో మహోజ్జ్వలముగ రాణించిన రాజవంశములలో విష్ణుకుండిన వంశమొకటి. ఇక్ష్వాకుల యనంతర మీ వంశీయులు రాజ్యము నెలకొల్పి క్రీ. శ. నాలుగవ శతాబ్ది ఉత్తరార్థము నుండి ఏడవ శతాబ్ది పూర్వార్థము వఱకు అవిచ్ఛిన్నముగా ఆంధ్ర దేశమును పాలించిరి. ఆ కాలమున దక్షిణా పథ పశ్చిమోత్తరములందు వాకాటక వంశీయులు రాజ్యము విస్తరింపజేసి శక్తిసమన్వితులై యుండిరి. విష్ణుకుండిన రెండవ మాధవవర్మ వాకాటక రాజకుమార్తె యగు మహాదేవిని వివాహమాడెను. విష్ణు కుండినులు బలవంతులైన రాజులతో సంబంధ బాంధవ్యముల నెఱపి తమ రాజ్యమును సురక్షిత మొనర్చుకొని ఆంధ్రదేశమును పాలించిరి. ఈ నరవరేణ్యుల శాసనము లన్నియు సంస్కృత భాషలో వేయింపబడినవి. వీరి పరి పాలనా కాలము నాటికి ఆంధ్రదేశమున ప్రాకృత భాషసన్నగిల్ల దాని స్థానము సంస్కృత మాక్రమించినది. విష్ణుకుండినుల రాజధానులుగా వర్ధిల్లిన నగర రాజము లాంధ్రదేమున నాలుగైదున్నవి. అవి ఇంద్రపాల నగరము, వేంగీపురము, ధాన్యకటకము లేక ధరణికోట (అమరావతి) బెజవాడ, దెందులూరు నగరములు. వీరి కాలమున సంస్కృతము రాజ భాషగానున్నను, తెలుఁగుభాష జనసామాన్యమున వాడుకలో నుండెను. మొదటి మాధవవర్మ, విష్ణుకుండిన వంశస్థాపకుఁడగు మహారాజేంద్రవర్మ పాలించిన కాలమున ప్రాకృతము రాజభాషగా వర్ధిల్లినది. విక్రమేన్ద్రి భట్టారకవర్మ "చిక్కుళ్ళ శాసనము"న "విజయ రాజ్య సంవత్సరంబుళ్" అను పదమున్నది. 'ళ్' లు పూర్వపు

రూపము. 'దెందులూరు' లేక 'డెందులూరు' పూర్వరూపము "శెందులూరు".

విష్ణుకుండిన వంశీయులలో మొదటి ముగ్గురు రాజులు బౌద్ధులు. తరువాతవారు వైదిక మతావలంబకులు. వైదిక మతోద్ధారకులు. విక్రమేంద్రవర్మ, విక్రమేన్ద్ర భట్టారకవర్మ బౌద్ధమతాభిమానులు. ఈ వంశీయులు బౌద్ధమునాదరించి, వైదిక మతానుయాయులై, యజ్ఞయాగాది క్రతువులు నిర్వర్తించిరి

విష్ణుకుండినులు సింహలాంఛనులు. వీరి నాణెములపై పంజా పైకెత్తి లంఘింపబోవు సింహపు బొమ్మ, పూలకుండి, సౌధము కని పించును వెండి, బంగారు, రాగి, మిశ్రమలోహ, లోహపు నాణె ములు వీరికి సంబంధించినవి. వీరి కాలపు శిల్పమునకొక ప్రత్యేకత కలదు.

విష్ణుకుండినుల కాలపు ఆంధ్రుల సాంఘిక చరిత్ర నిర్మాణము నకు సాధనములదగిన ఎనిమిది తామ్రశాసనములు[1] ఒక శిలాశాసనము[2] ప్రకటింపబడినవి. ఇంకను, సమకాలీన చరిత సమకాలీన ప్రభువులశాస నములు, "జనాశ్రయ ఛందోవిచ్ఛిత్తి" అను గ్రంధము ముఖ్యమైనవిగా

---

1. A. గోవిందవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము–భారతి–జూన్ 1965
   B. ఈపూరు శాసనము—E.I Vol XVII P. 337.
   C. రామతీర్థశాసనము—E I Vol XII P. 133
   D. చిక్కుళ్ళ శాసనము—E I. Vol. IV P 163
   E. విక్రమేన్ద్రభట్టారకవర్మ ఇంద్రపాల నగర తామ్రశాసనము —భారతి జూలై 1965
   F. తుండి శాసనము—ఆం.ప్ర. ప్రభుత్వ పురాతత్వశాఖ సీరీస్ నం. 8
   G. నాల్గవ మాధవవర్మ ఈపూరు శాసనము— E.I. Vol XVII P. 334
   H. పొలమూరు శాసనము—J.A.H.R.S. Vol VI P 17
2 వేల్పూరు శిలాశాసనము—S.I I. Vol. X No 1

పరిగణింపబడుచున్నవి. శాసనముల వలన విష్ణుకుండినులు 'దక్షిణాపథ పతి' త్రికూటమలయాధిప '(శ్రీ) పర్వత స్వామి పాదానుధ్యాత' అను బిరుదములు కలవారనియు, వారు తమ రాజ్యమును కృష్ణా గోదావరి నదుల మధ్య ప్రాంతమందేకాక, దక్షిణమునను విస్తరింపజేసిరనియు తెలియుచున్నది.

ఇక్ష్వాకువంశ పతనానంతరము విష్ణుకుండిన వంశీయుఁడగు మహారాజేంద్రవర్మ కృష్ణానదికి ఉత్తరమున నున్న నేటి తెలంగాణము లోని నల్లగొండ, మహబూబునగరం, ఖమ్మం మున్నగు ప్రాంతములను తన అధికారము క్రిందికి తెచ్చుకొని రాజ్యమును స్థాపించెను. ఇతనికి మూసీనది యొడున నున్న ఇంద్రపురి లేక ఇంద్రపాల నగరము రాజధాని. ఇతఁడు క్రీ.శ. 358 లో రాజ్యమును స్థాపించెను.

విష్ణుకుండిన వంశీయులు పండ్రెండుమంది రాజులు సుమారు రెండువందల అరువదియారు సంవత్సరము లాంధ్రదేశము నేలిరి. విష్ణుకుండిన రాజ్యస్థాపకుఁడగు మహారాజేంద్ర వర్మ క్రీ.శ 358-370; మొదటి మాధవవర్మ 370-398, మొదటి గోవిందవర్మ 398-435; రెండవ మాధవవర్మ 435-470; దేవవర్మ 470-478; మూఁడవ మాధవ వర్మ 478-522; విక్రమేన్ద్ర వర్మ 522-538; ఇంద్రభట్టారక వర్మ 528-556; విక్రమేన్ద్ర భట్టారక వర్మ 556-570, రెండవ గోవిందవర్మ 570-576; నాలుగవ మాధవవర్మ 576-623; మంచన భట్టారకుడు 623-624 వరకు రాజ్యపాలన మొనర్చిరి.

ఈ వంశీయులకు మూల పురుషుడు మహారాజేంద్రవర్మ యనియు, అతని కుమారుడు మొదటి మాధవవర్మ యనియు, మహారాజేంద్రవర్మ మనుమడగు మొదటి గోవిందవర్మ తన 37 వ రాజ్య సంవత్సరమున వేయించిన ఇంద్రపాల నగర తామ్రశాసనము[1] వలన తెలియుచున్నది.

---

1. భారతి-జూన్ 1965

విష్ణుకుండినుల కాలనిర్ణయము విక్రమేన్ద్ర భట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము[1] వలనను, విష్ణుకుండినులు బౌద్ధమతాభిమానులనియు, మహారాజేంద్రవర్మ, మొదటి మాధవవర్మ, మొదటి గోవిందవర్మ, బౌద్ధులనియు, విక్రమేన్ద్రవర్మ, విక్రమేన్ద్ర భట్టారక వర్మ బౌద్ధమతాభిమానులనియు, ఇంద్రపాలనగర తామ్రశాసనముల వలన తెలియుచున్నది.

విష్ణుకుండినుల మొదటి రాజధాని ఇంద్రపాలనగరము విష్ణుకుండినులనాటి ఆంధ్రుల యౌన్నత్యమునకు బతాకయై నిలిచిన ప్రాచీనాంధ్ర మహానగరములలో నింద్రపాలనగర మొకటి ఈనగరము తరతరములనుండి శిథిలమై నేటికి నామమాత్రావ శిష్టమైయున్నది శిథిల నగర మిప్పటికిని కనిపించుచున్నది.

నల్లగొండ మండలములోని రామన్నపేట తాలూకాకు ఐదు మైళ్ళదూరమున భువనగిరి-నల్లగొండరోడ్డు నానుకొని తుమ్మలగూడె మను గ్రామమున్నది. ఆ గ్రామమునంటి ఒక చెఱువున్నది. ఆసఫ్ నహార్ (కాలువ)ద్వారా ఆ చెఱువులోనికి నీరు ప్రవేశించును. చెఱువు కట్ట పొడవు సుమారు రెండున్నర మైళ్లుండును. ఆ చెఱువుకట్ట నానుకొని రెండుమైళ్ళ పొడవునను చెఱువుకట్టకు మూసీనదిని ఆనుకొని యున్న ఇంద్రపాల గుట్టకును మధ్యగల సువిశాల ప్రదేశములో ఈ ప్రాచీనాంధ్ర మహానగర శిథిలములున్నవి. ఇదియొక ప్రత్యేక స్థలముగ గన్పించుచున్నది. చుట్టు వరిపొలములు, మధ్యన ఎత్తుగనున్న విశాల ప్రదేశములో పెద్దపెద్ద చింతచెట్లు, తుమ్మలు, జీర్ణ దేవాలయములు, శిథిలాలయములు, రాయిరప్పలు, చిన్నచిన్న గుళ్లు, ఇండ్ల అడుగులు, ఇటుకలు కనుపించును. దూరమునుండి చూచినను శిథిల నగర చిహ్నములను గుర్తింపవచ్చును. శిథిల చిహ్నములను, జీర్ణదేవా

---

1. భారతి - జూలై 1965.

లయములను చూచిన ఆనాటి వైభవము కన్నులకు గట్టినట్లుండును.

మూసీనదికి అరమైలు దూరములో నాగవరమను గ్రామమున్నది. నాగవరమునకు, తుమ్మలగూడెమునకు మధ్యగల దూరము రెండుమైళ్లు. ఇంద్రపాలగుట్ట శిథిలనగరము ఇంచుమించు నాగవరము గ్రామముతో కలిసియే యున్నవి. సుమారు మూఁడు మైళ్ళవరకు వ్యాపించిన ఈ నగరపు శిథిలచిహ్నములు నాగవరములోను, తుమ్మలగూడెము చెఱువులోను, చెఱువుకట్టకును, ఇంద్రపాల గుట్టకునుమధ్య గల విశాల ప్రదేశములోను, గుట్టపైనను, మూసీనదికి ఉత్తరమున నున్న వలిగొండ గ్రామములోను కనిపించును.

**ఇంద్రపాలగుట్ట** : నాగవరమున కీశాన్యముననను, తుమ్మలగూడెమున కుత్తరముననను, మూసీనదిని ఆనుకొనియున్న ఒక ఎత్తైన గుట్ట, సుమారు మైలుపొడవునను, అరమైలు వెడల్పునను వ్యాపించి యున్నది. ఇది తూర్పు వైపు విశాలముగను, మధ్యభాగము ఎత్తుగను, గోపు రాకారముగను ఉన్నది. గుట్టపైన కోట కట్టబడినది. ఇట్టి దానిని గిరి దుర్గమందురు. ఈ దుర్గమతి పురాతనమైనది. విష్ణు కుండినుల నాటిది. గుట్ట నెక్కుటకు బడమటి దిక్కునుండి మెట్లున్నవి. గుట్టపైకి ఎక్కతిమేని కోట విశాలముగ కనిపించును. కోటకు పంద్రెండు బురుజులున్నవి. గుట్టపైన కోటకు రెండు వందల గజముల దూరములో లోతైన లంద (కోనేరు) ఉన్నది. ఈ లందనే ఏనుగుల బావియందురు. ఇచట పెద్ద పెద్ద ఇటుకలు, రాళ్ళు, ఇండ్ల పునాదులు. రెండు గజముల ఎత్తు, గజము ఎత్తువరకు లేపిన గోడలు, శిథిలమైన గదులు ఉన్నవి. గోపురాకారముననున్న శిఖరము నెక్కుటకు మెట్లున్నవి. దానిచుట్టు మరియొక రాతిగోడయున్నది.కోటకు ద్వారములు, బురుజులు ఉన్నవి. ఒక పెద్ద రాతిగుండుపై పూజారి శివార్చనకు, అర్చన ద్రవ్యములు తీసుకొని బయలుదేరుచున్నట్లు చెక్కబడియున్నది. గుట్టపైన ఎల్లమ్మ గుడి యున్నది. అచటనే

పరశురాముని పాదములున్నవి. గుట్టపైపునకు వెళ్లు మార్గములో పండ్రెండు స్తంభముల మంటపమున్నది. మంటపములో రెండువైపుల కూర్చొనుటకు వీలుగా నుండునట్లు పెద్ద పెద్ద బంకులు (అరుగులు) ఉన్నవి. మంటప ద్వారము సింహ ద్వారమువలె నున్నది.

తూర్పు దిశగానున్న పర్వత భాగము చాల పొడవుగను, పల్లముగను, విశాలముగను ఉన్నది. గుట్టపైన శివాలయమున్నది. అది కొండపైగల రెండు పెద్ద రాతి గుండ్లచే, దాని యంతట అదే ప్రకృతి సిద్ధముగా వెలిసినట్లున్నది. శివలింగము నల్లరాతితో మలచ బడినది. లింగము ఎత్తు రెండు అడుగులు. ఒక రాతి గుండుపై మరి యొక రాతి గుండునిలిచి దేవాలయముగా రూపుదిద్దుకొని అతి సహజ ముగానున్నది. శివాలయములోనున్న పెద్ద రాతిగుండు వెనుక భాగమునందొక తెలుఁగు శాసనము చెక్కబడి యున్నది.

శివాలయమున కెదురుగా పురాతన మంటపమొకటియున్నది. మంటపమున కెగువ భాగమునందొక కోనేరు, దిగువభాగమునందొక కోనేరును ఉన్నవి. శివాలయమున కెదురుగానొక శాసనశిల ఉన్నది. ఈ శాసనము రెండు ముక్కలుగా విఱిగి క్రిందబడియున్నది.

శివాలయమునకు దూర్పుదిశలో శిథిలములైన కట్టడము లున్నవి. ఆ కట్టడములకు దూర్పున మరియొక దేవాలయమున్నది. అదియును శివాలయమే. ముందు మంటపము, గర్భగుడి, చుట్టు ప్రాకారముగల, ఈ దేవాలయమున గల శివలింగము భిన్నమై పోయి నది. అచటనే మరి కొన్ని శిథిలాలయములున్నవి.

శివాలయమునకుత్తరముగానున్న కోనేరు ప్రక్కనుండి మూసీ నదిలోనికి దిగుటకు దారియున్నది. నదిలో స్నానము చేయుటకు వీలైన ఘట్టములున్నవి. ఇంద్రపాలగుట్టకు ఫర్లాంగు దూరములో మూసీనదిలో గుట్టకు ఎగువ భాగమున ఒక పరుపుబండ మీద నూట ఒక్క శివలింగములు చెక్కబడియున్నవి.

**శిథిలనగరము :-** ఇంద్రపాలగుట్టకు దక్షిణ భాగమున గుట్ట నానుకొనియున్న విశాలమైన ప్రదేశములో శిథిల రూపములోనున్న ఇంద్రపాలనగరమున్నది శిథిలమైనట్టివియు, జీర్ణావస్థలోనున్నట్టివియు నగు, దేవాలయములా ప్రదేశమునందడుగడుగున నున్నవి.

**పంచలింగేశ్వరాలయము :-** ఈ ఆలయము రాతితో నిర్మింపబడినది. ఆలయ గోపురములు మాత్రము, ఇటిక సున్నము కలిపి నిర్మించినట్టివి. ఆలయ మతి విశాలమైనది. ఐదు ఆలయములు కలిసియే యున్నవి నలుబది స్తంభములుగల గర్భగుడి విశాలమై సాధారణ శిల్పసంపదతో నొప్పారుచున్నది గర్భగుడి ముందుగల నంది విగ్రహము నల్లసరపు రాతితో మలచబడినది. అది మహమ్మదీయుల దురంతములకు గురియైనది. తల నఱికి వేయబడినది. ఆలయమంతయు జీర్ణించిపోయినది ఐనను ఆలయత్వమును కోల్పోలేదు. దూరము నుండి చూచిన గంభీరముగ నుండి, పూర్వపు వైభవము చాటుటకు, నిలిచియున్నట్లు కనిపించును. ముఖ్యమైన ఆలయమునగల శివలింగము మానవనిర్మితమైనట్టిదిగాలేదు స్వతస్సిద్ధముగానేర్పడినట్లున్నది. తక్కిన ఆలయములలోని శివలింగములు భిన్నించినవి. ముఖ్యమైన ఆలయములోని శివలింగము చెక్కుచెదరక నిలిచియున్నది.

ఆలయమున కెదురుగా రెండంతస్తుల మంటపమున్నది. ఇది గాలి గోపురమువలెనున్నది. పై మంటపమునకు నాలుగు స్తంభములు క్రింది మంటపమున కారు స్తంభములు ఉన్నవి. ఆలయమునకు చేరువ ఉత్తర భాగమున నాలుగు స్తంభములతో నిర్మింపబడిన విశాలమైన మంటపమున్నది అది వివాహమంటపము. ఆలయమునకుముందు ఉత్తరభాగమున కోనేరున్నది. దాని ప్రక్కన శిలాశాసనమున్నది. శాసనము తెల్లరాతిపై చెక్కబడియున్నది. శాసనాక్షరములు చెదిరిపోయినవి.

దేవాలయమునకు ఈ శాన్యభాగములో మరియొక శిలాశాసన మున్నది. దాని యెత్తు ఎనిమిది అడుగులు. శాసనాక్షరములు చెదిరి పోయినవి. ఈ శాసన శిలకు నాలుగు గజముల దూరమున శిలా శాసన మొకటి రెండు తునకలుగా విరిగి పడియున్నది.

ఈ శాసన స్తంభములకు తూర్పు దిశలో ఒక మసీదున్నది. అది నూతనముగ నిర్మించినట్టిది. ఈ మసీదుకు వందగజముల దూర ములో గుట్టకు దగ్గరగానున్న పొలము ప్రక్కన ఒరముపైన ఒక శిలాశాసనమున్నది. ఇది తెలుగు శాసనము. ఇంద్ర పాలగుట్టకు తూర్పు దిక్కున లోతుకుంట గ్రామమునకు వెళ్ళుదారిలో మరి యొక శిలాశాసనమున్నది.

**వేంకటేశ్వరాలయము :** పంచలింగేశ్వరాలయమునకు పశ్చిమ మున ఫర్లాంగు దూరములో ఉత్తర దిశాభిముఖముగా వేంకటేశ్వరా లయమున్నది. ఇదియును జీర్ణావస్థలో నున్నది. ఇటుక, సున్నముతో కట్టబడిన గోపురముగల ఈ దేవాలయము రాతితో నిర్మింపబడినది. ఆలయము యొక్క ముందరి భాగము పదునారు స్తంభములతోనిర్మిం పబడినది. ఆలయ సింహద్వార మారు స్తంభములచే కట్టబడినది. సింహ ద్వారమునకు తూర్పు వైపుగా నున్న మూడు స్తంభములలో మధ్య నున్న స్తంభమునకు నాలుగు వైపుల శాసనము చెక్కబడినది. శాస నముగల స్తంభమునకు మొదటివైపు గల శాసన భాగము మరియొక స్తంభము దానినానుకొనియుండుటవలన చదువుటకుగాని ప్రతిబింబము తీయుటకుగాని వీలులేకుండ నున్నది. ఈ శాసనము విష్ణుకుండినులది. వేంకటేశ్వరాలయమునగల రెండు స్తంభములపై శాసనములు చెక్క బడినవి ఇవి తెలుఁగు శాసనములు.

**ఇంద్రపాల ముత్యాలమ్మగుడి :** పంచలింగేశ్వరాలయమునకు దక్షిణమున శిథిలమైయున్న ఇంద్రపాల ముత్యాలమ్మ గుడి ఉన్నది.

దానికి ఏబది గజముల దూరమున పశ్చిమ దిశలో నూతనముగ నిర్మింప బడిన ముత్యాలమ్మ గుడి ఉన్నది. ప్రతి సంవత్సరము శ్రావణ మాస మున అచట ఉత్సవములు జరుగును ప్రత్యేకించి, హైదరాబాదు, సికిందరాబాదు నగరముల నుండి వందలకొలది యాత్రికులు, భక్తులీ యుత్సవములను తిలకించుటకు వచ్చుచుందురు. ఈ ఆలయములేకాక మనకు అడుగడుగున శిథిలాలయముల ఛాయలు గోచరించును. హను మదాలయములు, భైరవస్వామి ఆలయములు, రాతి విగ్రహములు లెక్కకు మిక్కిలిగనున్నవి. తుమ్మలగూడెము, చెఱువులో ఈ శిథిల నగరమునకు దగ్గరలో ఒక శివలింగమున్నది. ఆసవ్‌నహార్‌కట్ట ప్రక్కన నాగవరమున కుత్తరమున ఒక శివలింగమును, శిథిలాలయ చిహ్నము లును ఉన్నవి. ఇట్టి శిథిలాలయముల జాడలు అచ్చటచ్చట కనిపించుట వలన పూర్వమచట శివాలయము లుండెనని చెప్పవచ్చును.

తుమ్మలగూడెమునకు దూర్పున మల్లన్నగుట్ట యున్నది. ఆ గుట్టపైనున్న శివాలయము ఇంద్రపాల గుట్టపైనఉన్న శివాలయము వలెనే యున్నది. అదియును విష్ణుకుండినుల నాటి శివాలయమేయని భావింపవచ్చును. అచట రెండు శిలా శాసనములున్నవి,

అసఫ్‌నహార్ ప్రక్కగా తుమ్మలగూడెము గ్రామమునకు తూర్పున మైలు దూరములో రామేశ్వరము తోటలో ఒక శివాలయ మున్నది. దానిని రామేశ్వరాలయమందురు అదియును ఇంద్రపాల గుట్టపైనున్న శివాలయమువలె రాతిగుండ్లతో సహజముగా నేర్పడి యున్నది. శివలింగము పాలరాతితో నిర్మింపబడినది. తుమ్మలగూడెము గ్రామములో వేంకటేశ్వరాలయమున్నది. ఆంజనేయస్వామి ఆలయ మున్నది కాని శివాలయములేదు. గ్రామప్రజలు శివార్చనకై గ్రామ మునకు మైలు దూరముననున్న రామేశ్వరాలయమునకు వెళ్లుచుందురు.

నాగవరమునకు మైలు దూరమున మూసీనదికి అవతలిగట్టున వలిగొండ గ్రామమున్నది. ఈగ్రామ మతిపురాతనమైనది. గ్రామమునందు

శిథిల చిహ్నములు విశేషముగనున్నవి. గ్రామము నానుకొని ఆరు ఎకరముల విస్తీర్ణముగల కోటయున్నది. కోట త్రిభుజాకారముగ నుండి, ఐదు బురుజులతో నిర్మింపబడి శిథిలావస్థలోనున్నది. కోటలో లోతైన రెండు బావులున్నవి. కోటకు దక్షిణమువైపు జగ్గమ్మతోట యున్నది. ఆ తోటలో నాలుగు పురాతనమైన బావులు శిథిలములైన ఇండ్ల అడుగులు ఉన్నవి. గ్రామమున రెండు శివాలయములు, ఒక రామాలయము, గ్రామమునకు రెండుమైళ్ళ విస్తీర్ణములోపల ఎనిమిది దిక్కులందు ఆలయములున్నవి. శివాలయముల కెదురుగ కోనేరు లున్నవి. వలిగొండపై వలిబాషా వెలిసినాడు. మహమ్మదీయులు మొహర్రం మున్నగు పండుగలలో 'వలిబాషా' నర్చింతురు. వలిగొండ నానుకొని మూసీనది ప్రవహించుచున్నది. గుట్ట నెక్కుటకు మెట్లు న్నవి. గుట్టపైన ఒక శివాలయ మున్నది. అది విష్ణుకుండినుల నాటిది.

వలిగొండ, ఇంద్రపాల నగరము, నాగవరము, తుమ్మలగూడెం ఇవి పూర్వము ఇంద్రపాల నగరముగ నుండెడివి. మూసీనది కిరు వైపుల ఈ నగరము వ్యాపించియుండినట్లూహింపవచ్చును.

ఇంద్రపాలగుట్ట, ఇంద్రపాల నగరము విష్ణుకుండినుల కావాసమై ఆంధ్రదేశమునందానాటి మహానగరములలో నొక్కటిగా కీర్తింపబడి యుండవచ్చును. విష్ణుకుండినుల మొట్ట మొదటి రాజధాని ఇంద్రపాల నగరము.

ఇచట మహాదేవి విహారమున్నట్లు గోవిందవర్మ ఇంద్రపాల నగరతామ్ర శాసనము వలన తెలియుచున్నది. పురావస్తుశాఖ వారి భావి పరిశోధనలవలన 'మహాదేవి విహారము' కనుగొనబడిన యెడల విష్ణుకుండినుల చరిత్ర, బౌద్ధమతమునకు సంబంధించిన సమాచారము తెలియుననుటలో సందియము లేదు.

**పరిపాలనా విధానము :** విష్ణుకుండినులు పరిపాలించిన యుగ మాంధ్రదేశ చరిత్రలో మహోజ్జ్వలముగ రాణించినది. వీరి పరిపాలనా

విషయములు తెలిసికొనుటకిక్రింద నుదహరించిన శాసనములుపయోగ పడుచున్నవి.

మొదటి గోవిందవర్మ—ఇంద్రపాలనగర తామ్రశాసనము
మూడవ మాధవవర్మ—ఈపూరు తామ్ర శాసనము.
ఇంద్రవర్మ—రామతీర్థ శాసనము.
విక్రమేన్ద్ర భట్టారకవర్మ—చిక్కుళ్ళ శాసనము.
విక్రమేన్ద్ర భట్టాకరవర్మ—ఇంద్రపాలనగరతామ్రశాసనము.
విక్రమేన్ద్ర భట్టారకవర్మ—తుండి తామ్రశాసనము.
నాల్గవ మాధవవర్మ—ఈపూరు శాసనము.
నాల్గవ మాధవవర్మ—పొలమూరు శాసనము.
మాధవ వర్మ—వేల్పూరు శిలా శాసనము.

పైన పేర్కొనబడిన శాసనముల ననుసరించి, విష్ణుకుండినులు, రాజ్యపరిపాలనా విధానమున శాతవాహనుల ననుసరించినట్లు తెలియుచున్నది. ఈ రాజన్యులు "సత్వము, సత్యము, త్యాగము, ఉన్నత వంశ సంజాతత్వము, (అభిజాత్యము) కలవారు. నయవినయోత్సాహాది సద్గుణ సంపత్తిచే, స్వపరాక్రమంబున రాజ్యమునుపొంది, సక్రమ ప్రజాపాలనమువలన కీర్తిగాంచినవారు. అనేక దానముల వలన విస్తారమైన కీర్తిని పొందినవారు" అని గోవిందవర్మ ఇంద్రపాల నగర తామ్ర శాసనము వలన తెలియుచున్నది.

విష్ణుకుండినులు బ్రహ్మక్షత్రియ తేజస్సును ధరించిన వారు.[1] "శ్రీపర్వతస్వామి పాదకమలములను ధ్యానించుటవలన సకల ప్రజా పరిపాలనాధికారమును పొందినవారు. భుజబలోత్సాహములచేత ప్రభా

---

1. "—సత్వసత్య త్యాగాభిజన నయవినయోత్సాహాది గుణగణ సంపదా స్వయ మధిగత రాజ్యాణాం సమ్యక్ప్రజాపాలనా ప్రథితావదాతపృథు యశసాంరాజ్ఞాం—" భారతి - జూన్, 1965.

1. విక్రమేన్ద్ర భట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము —భారతి, జూలై 1965

వాను రాగములచేత స్వరాజ్యమందు కీర్తి వహించి, శౌర్య ధైర్య ప్రతాపానుభావములచేత ఇతర రాజ్యములను జయించి దానమానాదులచే అనురక్తమగు వర్ణాశ్రమ స్వజన పరిజనులై గ్రామక్షేత్ర హిరణ్య ద్విరద తురగ గోబలీ వర్ద శయనాసనయాన పానభోజనభవన వసనాభరణ కన్యాదానములను చేయుచు అనేక దేవాయతన విహార సభాప్రపా, తటాకోదపానారామ ప్రతి సంస్కార పూర్వకములగు నుపకార కార్యముల జేయుచు వేలకొలది దాసుల దానము చేయుచు విభూషిత దిగంతరులై, భిక్షుద్విజానాథయాచక వ్యాధిత దీన కృపణ జనులచే ననుభవింపబడు న్యాయార్జిత ధనసమృద్ధి కలిగి అందరకు అన్నిటిని దానము చేయుచు, సకలశాస్త్రార్థ శ్రవణ పరిజ్ఞానము వలన నిహపరములందు సాటిలేని దూరదృష్టికలవారై శూరులకు కులీనులకు నాశ్రయభూతులై విష్ణుకుండిన ప్రభువులు ఆంధ్రదేశమును పాలించిరి. వీరి కాలమున ప్రజలు సుఖమయ జీవనము గడుపుచుండిరి. రాజు నిరంకుశుడైనను ప్రజాభిప్రాయము ననుసరించి రాజ్యపరిపాలనము చేయుచుండెను. ఆ కాలమున పరిపాలనా సౌకర్యార్థము దేశము రాష్ట్రములుగను, విషయములుగను, విభజింపబడియుండెను. ఆనాడు భూమిని నివర్తనములలో కొలిచెడివారు. నాలుగవ మాధవవర్మ 'దలియవావి' నది యొడ్డుననున్న 'పొలుంబూరు' గ్రామమును గుద్దవాడి విషయములోని మైందవాటిక గ్రామములో నాలుగు నివర్తనముల భూమిని శివశర్మకు దానమిచ్చెను.[1] పొలమూరు శాసనమున పేర్కొనబడిన దలియవావి నేటి తుల్యభాగానది. తూర్పుగోదావరి జిల్లాలోని రామచంద్రపురము తాలూకాలో నున్నది.

విష్ణుకుండినుల శాసనములలో నీ క్రింద పేర్కొనబడిన రాష్ట్రములు, విషయములు, గ్రామములున్నవి.

---

1. J. A. H. R. S. Vol VI P. 47.

| రాష్ట్రము | విషయము | గ్రామము | శాసనము |
|---|---|---|---|
| — | గుద్దాడి విషయము | వెలింబలి | నాల్గవ మాధవవర్మ ఈపూరు శాసనము. |
| పలకి రాష్ట్రము | — | పెరువాడక | ఇంద్రవర్మ రామతీర్థ శాసనము. |
| — | నత్రపాటి విషయము లేక న్రేతపాటి విషయము | రేగోన్లమ్ రావిరేవ దెందుళూరు | విక్రమేన్ద్ర భట్టారక వర్మ చిక్కుళ్ళ శాసనము. |
| కర్మరాష్ట్రము లేక కమ్మ రాష్ట్రము | గుద్దవాడి విషయము | పొలొంబూరు మైందవాటిక కున్దూరు | నాల్గవ మాధవవర్మ పోలమూరు శాసనము. |
| — | — | పేణ్కపల | గోవిందవర్మ ఇంద్రపాల నగర శాసనము. |
| — | — | ఇరుణ్డెతో | విక్రమేంద్ర భట్టారకవర్మ, ఇంద్రపాల నగర శాసనము. |

రాష్ట్రమున కధికారి రాష్ట్రికుడు. విషయమున కధిపతి విషయాధిపతి. రాష్ట్రికుడు, విషయాధిపతి, రాజు ఆజ్ఞలకు లోబడి పరిపాలనా వ్యవహారములను నిర్వర్తించుచుండిరి. రాజు ఇచ్చు దానముల కాజ్ఞప్తి (ఆజ్ఞాపకుడుగా) యువరాజుగాని, మహామాత్య, అమాత్య, రాష్ట్రికులు వ్యవహరించుచుండిరి. రాజుయొక్క రహస్యాధికారి లేక అంతరంగికుడు రాజాజ్ఞలనములు పరచుచుండెను. నాల్గవ మాధవవర్మ

ఈపూరు శాసనమున కాతని తనయుడు, యువరాజును అగు మంచన భట్టారకుడాజ్ఞప్తిగా నుండెను. ఈపూరు శాసనమును మాధవవర్మ విజయ స్కంధావారము నుండి తన వంశాభివృద్ధి నిమిత్తము గుద్దాడి విషయములోని వెలింబలి గ్రామమును, బ్రాహ్మణ అగ్రహారముగ జేసి తన ముప్పదియేడవ రాజ్య సంవత్సరము గ్రీష్మర్తులో, వత్సగోత్రికుడైన బ్రాహ్మణ అగ్నిశర్మకు దానమిచ్చెను.

విష్ణుకుండిన ప్రభువులు వంశాభివృద్ధికి దానము లొసంగు చుండిరి. దేవాలయములకు, బ్రాహ్మణులకు, వేదపండితులకు గ్రామముల నగ్రహారములుగ జేసి దానమిచ్చుట ఆ కాలపు రాజుల కాచారముగ నుండెను. రాజులు విజయయాత్రకు బయలుదేరునప్పుడు బ్రాహ్మణులకు గో, హిరణ్య, భూదానము లిచ్చుచుండిరి. నాల్గవ మాధవవర్మ పొలమూరు గ్రామమును, గుద్దవాడి విషయములోని 'మయిందవాటిక'లో నాలుగు నివర్తనముల భూమిని చంద్రగ్రహణ నిమిత్తమున గోదావరి నదినిదాటి తూర్పుతీర ప్రాంతమును జయించు సందర్భమున, వేదపండితుడును, కర్మరాష్ట్రములోని 'కున్దూరు' గ్రామ వాస్తవ్యుడును అగు శివశర్మకు దానమిచ్చెను.[1]

విష్ణుకుండినులు ఆంధ్రదేశమును పాలించుచున్న సమయమున ప్రజలు సుఖముగా జీవించియుండిరి. రాజ్యమున మతకలహములు గాని, శత్రుభయముగాని యున్నట్లు తోచదు. విష్ణుకుండిన ప్రభువులలో మొదటి గోవిందవర్మ బౌద్ధమతానుయాయి యైనను, దేవాలయముల నిర్మించెను. వైదిక మతానుయాయియైన విక్రమేన్ద్ర భట్టారక వర్మ ఇంద్రపురిలోని మహాదేవీ విహారమునకు 'ఇరుణ్డెఱో' గ్రామమును భిక్షుసంఘముల అనుభవముకొరకు దానమిచ్చి తనపరమత సహనమును ప్రకటించుకొనెను.

---

1. J.A H.R.S Vol- VI P. 17.

విష్ణుకుండిన ప్రభువులు ధర్మమార్గాచరణులు, న్యాయశాస్త్ర విశారదులు. ఆ కాలమున న్యాయము. ధర్మము. బీద, ధనిక, కుల, మత, వర్గవిచక్షణ లేకుండ అన్ని జాతులవారికిని సమానమై యుండెను. విష్ణుకుండిన నాల్గవ మాధవవర్మ కాలమున జరిగిన న్యాయసమ్మతమైన తీర్పుకు సంబంధించిన ఐతిహ్య మొకటి కలదు.

"మాధవవర్మ విజయవాడను రాజధానిగా చేసికొని ఆంధ్ర దేశమును పాలించుచుండెను అతని కుమారుడు యువరాజై యుండెను యువరాజు రథముక్రింద ఒక యువకుడుపడి మరణించెను. యువకుని తల్లి మహారాజున కీ యుదంతము తన దీనావస్థను, పుత్రశోకమును విన్నవించి న్యాయ విచారణ జరిపించుమని కోరెను. మహారాజు విచారణ జరిపించి ప్రాడ్వివాకుల యభిప్రాయము విని యువకుని మరణమునకు కారణభూతుడైన తన కుమారునికి మరణ దండన విధించెను రాజధర్మము, పుత్రవాత్సల్యముకన్న గొప్పదని భావించి నాడు. రాజులు న్యాయమైన తీర్పు నిచ్చుచుండిరి. మాధవవర్మ న్యాయమైన తీర్పునకు ఇంద్రకీలాద్రిపై వేంచేసియున్న మల్లీశ్వర స్వామి అనుగ్రహించి, బెజవాడలో కనకవర్షము కురిపించి, యువ రాజును, మరణించిన యువకుని బ్రతికించెను.

ఈ ఐతిహ్యమెట్లున్నను విష్ణుకుండిన ప్రభువులు ధర్మమార్గా చరణులు. ఇక్ష్వాకుల యనంతర మాంధ్రదేశములోని కొన్ని భాగ ములు వీరి పరిపాలనము క్రిందికి వచ్చినవి. క్రమముగా ఈ రాజన్యు లాంధ్రదేశములోని తక్కిన భాగములను తమ సామ్రాజ్యమున చేర్చు కొని పాలించినారు ఈ రాజన్యులు శాసనములలో వర్ణింపబడినట్లు "సత్వ సత్య త్యాగాభిజన నయవినయోత్సాహాది గుణగణ సంపదా స్వయమధి గత రాజ్యానాం సమ్యక్ప్రజాపాలనాత్ప్రథితావదాత

పృథుయశసాంరాజ్ఞాం విష్ణుకుణ్డీనాం" 1 "సత్వము, సత్యము, త్యాగము, ఉన్నతవంశ సంజాతత్వము నయవినయోత్సాహాది సద్గుణ సంపత్తిచే స్వపరాక్రమంబున రాజ్యమునుపొంది సక్రమ ప్రజా పాలనమువలన కీర్తిగాంచి అనేక దానములవలన విస్తారమైన కీర్తిని పొందిన వార"ని తెలియుచున్నది.

## మత పరిస్థితులు

**బౌద్ధ మతము:—**శాతవాహనాంధ్రులు బౌద్ధమతము నాదరించి పోషించినారు. ఆ కాలమున కళలు, శిల్పము, వాఙ్మయము, బౌద్ధ మత సంబంధమైన గ్రంథములు, స్తూపములు, ఆరామ విహారములు వెలిసినవి. ఇక్ష్వాకులలో మొదటి చాంతమూల మహారాజు వైదిక మతాభివృద్ధికి పాటుపడినవాడు. అతని పుత్రుడు వీరపురుషదత్తుడు బౌద్ధమతావలంబి.

ఆచార్య నాగార్జునుని భక్తిమార్గము కారణముగా బౌద్ధమతము నందలి, శీలసంపద భూతదయ, ప్రజాసేవ, అహింసాదులు ప్రజలలో వ్యాపించెను. బుద్ధుని ప్రతిమనిలిపి ప్రజలు విగ్రహారాధనము గావించు చుండిరి బుద్ధునికెందరో పరివార దైవతములుండిరి వీరికి భార్యలుగా స్త్రీదైవతములుండిరి బోధిసత్త్వులు వైదిక పురాణములలోవలె మునులుగా, మహర్షులుగా మార్పుచెందిరి ప్రజలు శాక్యమునికి, బోధిసత్త్వులకు విగ్రహము లేర్పరచి ఆరాధించుట మొదలుపెట్టిరి. ఈ మతములో వచ్చిన మార్పులవలన హిందూ, బౌద్ధమతములకు భేదము లేకుండెను. సాధారణ ప్రజానీకమునకు ఈ రెండు మతముల లోని భేదము తెలియక బౌద్ధమతమునకుగల ప్రత్యేకతను విస్మరించిరి. ప్రజలు బుద్ధభగవానుని హిందూ దేవతల అవతారములలో నొక అవతారముగ గ్రహించిరి.

---

1. గోవిందవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము భారతి—జూన్ 1965

ఆ సమయమందే బౌద్ధమతమున వజ్రయాన శాఖ ఆవిర్భవించెను. ఈ వజ్రయానమత ప్రచారము వలన బౌద్ధమతమునకుగల కీర్తి ప్రతిష్టలు ప్రజాభిమానము అడుగంటినవి. వజ్రయాన బౌద్ధమత ప్రచారకుల వలన అహింసయే పరమ ధర్మముగా ఆదర్శము పెట్టుకొనిన బౌద్ధమతమువ తాంత్రికపూజలు, రహస్య కలాపములు, విహారములు మధుమాంస వినియోగము, శక్తి పూజలు అమలులోనకి వచ్చినవి. బౌద్ధ సంఘారామములు, విహారములు నీతి బాహ్యమై దుర్నీతులకు నిలయమైనవి. ప్రజలకు బౌద్ధమతముపైగల ఆదరము సన్నగిల్లినది.

ఇట్టి సమయమున విష్ణుకుండిన ప్రభువరేణ్యులు బౌద్ధము నాదరించి పోషించినారు. ఇక్ష్వాకువంశ మంతరించిన పిదప పల్లవు లాంధ్ర దేశము నాక్రమించి వైదికమత విజృంభణకు గారకులైనారు. బృహత్ఫలాయన, ఆనందగోత్రిక, శాలంకాయన వంశీయులు వైదిక మతమును స్వీకరించి పోషించుటవలన ఆంధ్రదేశమున బౌద్ధమతము రాజాశ్రయమును కోల్పోయినది. వైదికమతము నాదరించు ప్రజలదృష్టిని తమ మతమువైపు మరల్చుటకు బౌద్ధ సన్యాసులు, సన్యాసినులు పూజాదికములు బౌద్ధమతమున ప్రవేశపెట్టినను బౌద్ధారామ విహారములు విలాస గృహములుగా పరివర్తనము చెందినవి. కాని బౌద్ధ మతము వ్యాపించుటకు తోడ్పడలేదు. కృష్ణానదికి దక్షిణమునగల బౌద్ధుల పతనము, బౌద్ధమత పతనమునకు గారణమైనది. పవిత్రమైన బౌదమతము ఉజ్జ్వలదశ ననుభవించి, స్వదేశమున గౌరవాదరములు లేక ఖండాంతరముల వ్యాపించినది.

విష్ణుకుండిన వంశజులలో మహారాజేంద్రవర్మ, మొదటిమాధవ వర్మ, మొదటి గోవింద వర్మ బౌద్ధమతానుయాయులు విక్రమేన్ద్రి వర్మ బౌద్ధ మతానుయాయి విక్రమేంద్ర భట్టారకవర్మ బౌద్ధమతాభిమాని. ఇంద్రపాలనగర తామ్రశాసనముల వలన విషుకుండినులు బౌద్ధ మతానుయాయులనియు, అందు గోవింధవర్మ మహారాజు బౌద్ధము

నాదరించి, పోషించుటయేగాక బౌద్ధ సంఘములకు గ్రామములను దానమిచ్చినట్లును, మహాదేవి విహారమును పోషించినట్లును తెలియు చున్నది.

విష్ణుకుండిన గోవిందవర్మ ఇంద్రపాలనగర తామ్ర శాసనారంభ మున "జితం భగవతా తేన సంబుద్ధేన కృపాత్మనా నిర్వాణప్రాప్తయే యేన సద్యోమార్గః ప్రదర్శితః" అను శ్లోకమున్నది.

గోవిందవర్మ "మహారాజ శ్రీ మాధవ వర్మణః సుపుత్రేణ స్వతయ భుజబలోత్సాహ ప్రభావానురాగావాప్త స్వరాజ్యేన శౌర్య ధైర్య ప్రతాపానుభావాదన్య సామన్తాక్రాంత రాజ్యాన్త రేణ దానమానాది భిరనురక్త వర్ణాశ్రమ స్వజన పరిజనేన గ్రామ క్షేత్ర హిరణ్య ద్విరదతురగ గోబలీ వర్దశయనాసనయానపాన భోజన భాజన భవన వసనాభరణ కన్యాదాసీ దాస సహస్రాణాం దాతా అనేక దేవాయతన విహార సభాప్రపాతటాకోద పానారామ ప్రతి సంస్కార పూర్వ కరణేనాలంకృత సకల దిగంతరేణ భిక్షుద్విజానాథ యాచక వ్యాధిత దీన కృపణ జనోపభుజ్యమాన న్యాయాధిగత విభవ ధన సముదయేనా సకల సకుత్సర్వ స్వత్యాగినా సకల శాస్త్రా ర్థ శ్రవణ పరిజ్ఞానాదిహ పరత్ర చానన్య చక్షుషా విద్వచ్చూర మహా కులీన జనసమాశ్రయేణ సకల సత్వధాతూత్రాణాయోత్పాదిత మహా బోధి విత్తేన మహారాజశ్రీ గోవింద వర్మణా"[1] అని వర్ణింపబడి నాడు.

గోవిందవర్మ తన ముప్పదియేడవ విజయరాజ్య సంవత్సరమున వైశాఖ పూర్ణిమనాడు చతుర్వైశారద్య విశారదుడును, అష్టాదశవేణి కాత్మకమగు బుద్ధధర్మముచే సమలంకృత మూర్తియును, ద్వాత్రింశ న్మహా పురుష లక్షణోపలక్షితుడును, జరామరణ శోకాది బహువిధ

1. భారతి – జూలై 1965.

సంసార దుఃఖములందు పూర్తిగా మునిగిన ప్రాణికోటి నుద్ధరించుటకు, అనేక కల్పముల నుండి అసంఖ్యేయముగా చేరిన పుణ్య జ్ఞాన సంభారమను భారము గలవాడును, రాగద్వేష మోహముల నుండి జనన మరణాది దుఃఖముల నుండియు తప్పించుకొన్నవాడును, అప్రతిహతము ననావరణమునగు బుద్ధిచే తెలియదగు జ్ఞానము నంతయు తెలిసికొనుటవలన నతి విజ్ఞానియగు దశబలబలియను పూజ్యునికి నభిప్రపన్నమగు బౌద్ధ మార్గము, నిర్వ్యారాగశీల శిక్షా ధృతములు మొదలగు గుణముల నధ్యయన శ్రవణచిన్తనకీర్తన భావనా ధ్యాన సమాధి సమాపత్తి మొదలగు గుణగణములతో కూడినదై పుణ్యక్షేత్ర త్రియానముల ననుసరించు పదునాల్గవ ఆర్య సంఘము నుద్దేశించి పుణ్యకార్యము లందధికముగా వాడబడు పుణ్యవస్తు విశేషము కలదియగుటచే దానము వలన ననుభవించుటకు దగినదానినిగా తలిదండ్రులయొక్క ఋణమును తీర్చునట్టియు, సర్వప్రాణులను రక్షించునదియు, సర్వవిధములగు దరిద్రములను దుఃఖములను నుపశమింపజేయు నిమిత్తమై తనపట్ట మహిషియైన పరమ మహాదేవిచేత, విహారమునకు దీప, ధూప, గన్ధ, పుష్ప, ధ్వజ, పాన, భోజన, శయనాసన గ్రాస-భైషజ్య-చేణ్ణస్ఫుటిత- శీర్ణ సంస్కారములు మొదలగు క్షేమములు కలుగుట కొరకు ద్వావేమ్బుదల పేణ్కపఱ అను పేరు గల గ్రామము నిధులు, ఉపనిధులు, దండకర వృష్టులు, ఉచ్ఛిష్ట భాగము లన్నిటితో గూడ ధారాపూర్వకముగా దానముచేసినట్లు ఇంద్రపాలనగర శాసనమువలన తెలియుచున్నది.

గోవిందవర్మ మహారాజు, విష్ణుకుండిన సామ్రాజ్యము నవిచ్ఛిన్నముగ నలుబది సంవత్సరములు పాలించినవాడు. విక్రమేన్ద్ర భట్టారక వర్మ శక సంవత్సరములు 488 గడిచిన పిదప వేయించిన ఇంద్రపాలనగర తామ్రశాసనమున[1] గోవిందవర్మ "షడభిజ్ఞ ప్రతి పాద్య దర్శ

1. భారతి — జులై 1965

నానుగ్రహా జనిత సుగత శాసనాభి ప్రసాదస్య విబుధ భవన ప్రతిస్పర్ధి శోభాసముదయానేక మహావిహార ప్రతిష్ఠాపనాధి గతాన న్తబ్రాహ్మణ పుణ్యసంభారస్య మహారాజశ్రీ గోవిన్దవర్మణః" అని వర్ణింప బడినాడు

అట్లే రెండవ మాధవ వర్మకు వాకాటక మహాదేవికి జన్మించిన విక్రమేన్ద్ర వర్మ, విక్రమేన్ద్ర భట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్ర శాసనమున "మహారాజశ్రీ మాధవ వర్మణః ప్రియపుత్రస్య వాకాటక మహాదేవీ సుతస్య మహాకవేః పరమసౌగతస్య మహారాజశ్రీ విక్రమేన్ద్ర......" అని వర్ణింపబడినాడు విష్ణుకుండినులలో బౌద్ధ మతానుయాయులైన రాజులలో విక్రమేన్ద్ర వర్మ నాలుగవవాడు. బౌద్ధమతాభిమానము కలరాజు విక్రమేన్ద్రబట్టారకవర్మ. ఈమహారాజు పల్లవసింహావర్మ నోడించి "మూర్తిమంతమగు గోవిన్దరాజుయొక్క కీర్తిని పెంపొందింపజేయు కోరికచేత, పరమ భట్టారికా మహాదేవిచేత ఇంద్రపురము నలంకరింప జేయగోరునట్లుగా ప్రతిష్ఠాపింపబడిన శ్రీమంతంబగు పరమభట్టారికా మహా విహారమునందు తన పదునొకండవ విజయరాజ్య సంవత్సరమున, కార్తీకమాస కృష్ణపక్షమందు అష్టమి నాడు నలుదిక్కులందున్న పూజ్యములగు భిక్షుసంఘములయొక్క అనుభవముకొఱకు సర్వదానసహితముగా సమస్త విఘ్నములను తొలగించి 'ఇరుణ్డెరో' అను గ్రామమును దానముచేసెను. [1]విష్ణుకుండిన వంశస్థాపకుఁడగు మహారాజేంద్రవర్మ స్వశక్తివలన రాజైనవాడు.

---

1. .. శ్రీ గోవిన్దరాజస్యమూర్తిః మతీం శ్రియం ప్రత్యవిషయాకృత మనోరథయా పరమ భట్టారికా మహాదేవ్యా శ్రీమదిన్ద్రపురముచ్చై రలంకర్తుః కామయేవప్రతిష్ఠాపితే శ్రీమతి పరమభట్టారికా మహావిహారేస్మాభి ప్రవర్ధమాన విజయ రాజ్య సంవత్సరైకాదశే కార్తీకమాస కృష్ణపక్షాష్టమ్యా చాతుర్దిశార్య వరభిక్షు సంఘ పరిభోగాయ సర్వదాన సహితస్సర్వ బాధ పరిహారేణ "ఇరుణ్డెరో నామగ్రామోదత్తః" — భారతి—జులై 1965.

ఇక్ష్వాకు వంశ పతనానంతర మితఁడు కృష్ణానదికి ఉత్తరమున గల తెలంగాణా ప్రాంతమును, నేటి కృష్ణామండలమును, ఇంద్రపాల నగరము రాజధానిగా పాలించెను. ఇతఁడు మొదట ఇక్ష్వాకుల సామంతుడుగా నుండియుండవచ్చును ఇతని కుమారుడు మొదటి మాధవవర్మ. మాధవవర్మ కుమారుడు మొదటి గోవిందవర్మ. ఇంద్ర పాల నగరమును రాజధానిగా ఆంధ్రదేశమును పాలించుటయేగాక, బౌద్ధారామ విహారము లనేకముల నిర్మించెను. ఇంద్రపాల నగరశాస నమున పేర్కొనబడిన మహాదేవి విహారము, ఫణిగిరి, గాజులబండ, జగ్గయ్యపేట, నేలకొండపల్లి, కొండాపురము మున్నగు ప్రాంతము లందుగల బౌద్ధారామ విహారము లీప్రభువు పోషణలోనుండెను. కృష్ణానదీ దక్షిణప్రాంతమున నున్న అమరావతి, నాగార్జునకొండ మున్నగు బౌద్ధ క్షేత్రములు, రాజాదరణము లేక పతన మందుచున్న కాలమున విష్ణుకుండిన ప్రభువులు వేలకొలది, బౌద్ధభిక్షువులకు, ఆచార్యులకు బౌద్ధమతానుయాయుల కాశ్రయ మొసంగిరి. ఆ నాడు తెలంగాణమున వెలసిన బౌద్ధారామ విహారములు విష్ణుకుండినుల చలువవలన మరికొంత కాలము నిలువ గలిగినవి. దక్షిణాంధ్ర దేశమున పల్లవులు, శాలంకాయనులు, ఆనంద గోత్రికులు వైదిక మతము నుద్ధరించు కాలమున విష్ణుకుండినులు బౌద్ధమునాదరించి పోషించినారు.

విష్ణుకుండిన ప్రభువులలో నాలుగవ రాజైన రెండవ మాధవ వర్మ బలపరాక్రమ సంపన్నుడు. ఈ మహారాజు మొదటబౌద్ధమతాను యాయిగానుండి, వాకాటక మహాదేవిని వివాహమాడిన పిదప బౌద్ధ మును త్యజించి, వైదిక మతావలంబియై వైదిక మతోద్ధరణమునకు బాటుపడెను.

ప్రాకృత ప్రభావము సన్నగిల్లి సంస్కృత భాషా ప్రచారము విరివిగా సాగుచున్న కాలమున విష్ణుకుండినులు రాజ్యము స్థాపించ నారు, ప్రాకృతభాషా ప్రభావముతోపాటు బౌద్ధమత ప్రభావమును

క్షీణించినది. క్షీణదశలోనున్న బౌద్ధమతమును, విష్ణుకుండిన ప్రభువు లుద్ధరించి ఒక శతాబ్దికాల మాంధ్ర దేశమున బౌద్ధమతమునకు నిలువ నీడ కల్పించినారు.

విష్ణుకుండినుల కాలమున మహామహులైన బౌద్ధ పండితు లున్నట్లు గోవిందవర్మ వేయించిన ఇంద్రపాల నగర తామ్రశాసనము వలన తెలియుచున్నది. దశబలబలియను బౌద్ధవిజ్ఞాని ప్రస్తావన ఈ శాసనమున నున్నది. బౌద్ధారామ విహారములకు రాజులు గ్రామము లను దానము చేయుచుండుట వలన బౌద్ధమతానుయాయులు, నిర్వ హించు కార్యకలాపములు కుంటుబడకుండ సాగుచుండెను. కృష్ణా నదికి దక్షిణమున వజ్రయాన బౌద్ధమతమీకాలమున వ్యాప్తిలోనికివచ్చి నది. విష్ణుకుండిన రెండవ మాధవవర్మ కాలము నాటికి వజ్రయాన బౌద్ధమత ప్రభావము, తెలంగాణముననున్న బౌద్ధారామ విహారము లకు సంఘారామములకు ప్రాకినది. వజ్రయాన బౌద్ధమతప్రచారకుల దుర్నీతివలనను బౌద్ధసంఘముల కార్యకలాపములవలనను, వైదికమత విజృంభణము వలనను బౌద్ధము ప్రజాదరణ కోల్పోయి క్షీణించినది.

**జైనమతము:—** విష్ణుకుండినుల కాలమున జైనమతము క్షీణదశలో నున్నట్లు తెలియుచున్నది. జైనులలో దిగంబరులు, శ్వేతాంబరులని రెండుతెగల వారానాడుండిరి. కాపాలికులను తెగ వారు జైనమత మాంధ్రదేశమున క్షీణించుటకు దోడ్పడినారు. బౌద్ధమున వజ్రయాన ముద్భవిల్లినట్లు, జైనమున కాపాలిక మత మావిర్భవించినది. పల్లవరాజులు జైనమతమునకు నిలువనీడలేకుండ జేయుటయేగాక, వైదికమతోద్ధరణమునకు మిక్కిలి పాటుపడి నారు. ఈకాలమునందాంధ్ర దేశమునగల జైనాలయములు, బౌద్ధా లయములు, శివాలయములుగా రూపుదిద్దుకొనినవి.

ఆంధ్రోత్కల మధ్య దేశమున, మహానది యొడ్డున గల "జయమంగళ" యను గ్రామమున కుమారిలభట్టు జన్మించెను.

ఇతడాంధ్రుఁడు. మేధాశక్తి యుక్తి సంపద కలవాడు జైనమత గ్రంథములను జైనపండితులవద్ద నభ్యసించిఁ జైనపండితులతో వాదించి జైనమత సిద్ధాంతములను ఖండించెను ఇతడు యజ్ఞయాగాదులందు ప్రజలకు నమ్మకము కలిగించి, వేదము లపౌరుషేయములనియు, పరమప్రమాణ గ్రంథము లనియు సిద్ధాంతీకరించెను. జైనమహర్షి వ్రాసిన పూర్వమీమాంస సూత్రములపై కుమారిలభట్టు తంత్ర వార్తికమహాభాష్యము వ్రాసెను. ఇతని శిష్యులు వేదప్రతిపాదితమైన ప్రచారము గావించుటవలన వేద విద్య బాగుగా వ్యాపించెను. ఈ మహామేధావి జైనమత మవలంబించు వారి నాకర్షించి వారు వైదికమత మవలంబించునట్లు చేసెను.

**వైదిక మతము :** విష్ణుకుండినుల కాలమున వైదిక మత విజృంభణము జరిగినది ఏకాదశాశ్వమేధములు, రాజసూయ పౌండరీక వాజపేయ, నరమేధములు ప్రబలినవి ఈ వంశీయులు వైదిక మతము నాదరించి యాగములొనర్చి కీర్తి బడసినారు ప్రజలలో వైదిక మత వ్యాప్తికి ప్రచారము సాగినది. రాజులు వేద విద్యలను పోషించి, అభ్య సించి ఘటికాస్థానముల నేర్పఱచినట్లు శాసనముల వలన తెలియు చున్నది. విష్ణుకుండిన ప్రభువులు గుహాలయముల నతి రమణీయముగ దొలిపించి, దేవాలయముల నిర్మించినారు వీరు వేయించిన శాసనము లందు వేదాధ్యయన సంపన్నులైన విప్రుల ప్రశంస వచ్చినది.

విష్ణుకుండిన భూపతులు '(శ్రీ) పర్వతస్వామి పాదాను ధ్యాతల మని' శాసనములందు చెప్పుకొనినారు. విష్ణుకుండిన రెండవ మాధవ వర్మ ఏకాదశాశ్వమేధ అవభృథ అవధౌత జగత్కల్మష క్రతు సహస్ర బహు సువర్ణ పురుషమేధ వాజపేయ, రాజసూయ ప్రజాపత్యానేక క్రతువరానుష్ఠితయశుడని వర్ణింపబడినాఁడు

దేవవర్మ కుమారుడు, మూఁడవ మాధవవర్మ. ఈ రాజు వేయించిన ఈపూరు శాసనమున [1] రెండవ మాధవవర్మ "ఏకాదశాశ్వ

1. Epigraphia Indica Vol XVII P. 337.

మేధావభృధావధౌత జగత్కల్మషస్యాగ్ని ష్టోమ సహస్రయాజినో నేక సామన్త మకుటమణి ఖచిత చరణయుగళ కమలస్య మహారాజస్య శ్రీ మాధవవర్మణః" అనియు, మూఁడవ మాధవ వర్మ "త్రికూట మలయాధిపతిర్నయ వినయ సత్వసంపన్నో భగవచ్ఛ్రీ పర్వతస్వామి పాదానుధ్యాతో విష్ణు ......... శ్రీ మాధవ వర్మణః" అని వర్ణింపబడినాఁడు.

ఇంద్రవర్మ రామతీర్థ శాసనమున[1] రెండవ మాధవ వర్మ "ఏకాదశాశ్వమేధావభృధావధౌత జగత్కల్మష క్రతుసహస్రయాజినః స్నాన పుణ్యోదక పవిత్రీకృత శీర్షః" అనియు, ఇంద్రవర్మ "పరమ మాహేశ్వరః" అనియు వర్ణింపబడినారు.

విక్రమేన్ద్ర భట్టారకవర్మ చిక్కుళ్ళ శాసనమున[2] రెండవ మాధవవర్మ "...... శ్రీ పర్వతస్వామి పాదానుధ్యాతో విష్ణుకుణ్డీ నామేకాద శాశ్వమేధావ భృథావ ధౌత జగత్కల్మషస్య క్రతుసహస్ర యాజినః సర్వమేధావా ప్త సర్వభూతస్వరాజ్యస్య బహుసువర్ణ పౌణ్డరీక పురుషమేధ వాజపేయ యూధ్య ... షోడశ రాజసూయ ప్రాధిరాజ్య ప్రాజాపత్యాద్యనేక వివిధ పృధుగురువర శతసహస్ర యాజినః క్రతువరానుష్ఠితాధిష్ఠా ప్రతిష్ఠిత పరమేష్ఠితస్య మహారాజస్య" యని ఇంద్రభట్టారక వర్మ ... యధావిధి వినిర్వ్యాపిత ఘటికా వాప్త పుణ్య సంచయస్య పరమ మాహేశ్వరస్య మహారాజస్య" అనియు విక్రమేన్ద్ర భట్టారకవర్మ "పరమ మాహేశ్వరో మహారాజ ..." అనియు వర్ణింపబడినారు.

విక్రమేంద్ర భట్టారక వర్మ ఇంద్రపాలనగర తామ్ర శాసనమున[3] విష్ణుకుండినులు "భగవచ్ఛ్రీ పర్వత స్వామి పాదానుద్ధ్యానావాప్త

---

1 Epigraphia Indica Vol XII P. 133

2 Epigraphia Indica Vol IV P. 193.

3 భారతి—జూలై 1965.

ప్రజాపాలనాధికారాణాం" అనియు, రెండవ మాధవ వర్మ "ఏకాదశాశ్వమేధ బహుసువర్ణ పౌణ్డరీక వాజపేయ క్రతూసహస్ర సర్వమేధ రాజసూయ పురుషమేధాద్యాహరహస్సమ్యగనుష్ఠిత శ్రుతి విహితాశేష దుష్కర కర్మణా నుష్ఠానస్య ప్రాగ్దక్షిణా పరామ్భోనిధి రేవా పరిత్సలిలవలయ విభూషణాయా భువో భర్తుర్మహా రాజశ్రీ మాధవవర్మణః॥ అనియు వర్ణింపబడినారు

నాల్గవ మాధవ వర్మ వేయించిన ఈపూరు శాసనమున[1] రెండవ గోవిందవర్మ "భగవత్ శ్రీ పర్వతస్వామి పాదానుధ్యాతస్య విష్ణుకుణ్డీనాం అపరిమిత బలపరాక్రమస్య ప్రణత సకల సామన్తస్య అనేక గోహిరణ్య, భూమి ప్రదానస్య మహారాజస్య శ్రీ గోవిందవర్మణః" అని చెప్పబడినాడు.

నాల్గవ మాధవవర్మ, పొలమూరు శాసనమున[2] "—క్రతు సహస్రయాజి హిరణ్యగర్భ ప్రసూతః ఏకాదశాశ్వమేధావభృథ స్నాన విధుట జగదేనస్కః సర్వభూత పరిరక్షణ—" అని వర్ణింపబడినాడు.

విక్రమేన్ద్ర భట్టారక వర్మ తుండిశాసనమున[3] రెండవ మాధవ వర్మ "—ఏకాదశాశ్వమేధావ భృదావ ధౌత జగత్కల్మషస్య క్రతు పహస్రయాజినః సర్వమేధావాప్త స్సర్వభూతస్వారాజ్యస్య బహు సువర్ణ కాదశకయాజినః ఏకాదశ పౌణ్డరీక ప్రాప్త సర్వార్థయ ద్వైవిధ్యనుష్ఠిత రాజస్యయోప పాదితాధిరాజ్యస్య తదనుపురుషమేధా ద్యశేష క్రత్వనుష్ఠానజనిత పరమేష్ఠ్యస్య దేవాధిదేవస్య మహారాజ శ్రీ మాధవవర్మణః" అనియు, ఇంద్రభట్టారకవర్మ "—పరమ మాహేశ్వరస్య పరమబ్రాహ్మణ్యస్య యథావిధి వినిర్వాపిత ఘటికావాప్తపుణ్య సంచయస్య ధర్మవిజయినో మహారాజేన్ద్ర భట్టారక వర్మణః" అనియు వర్ణింపబడినారు.

---

1 Epigraphia Indica Vol XVII P 334.
2 J. A H R S Vol VI P. 17.
3. A P Govt Archaeological Series No. 8.

విష్ణుకుండిన ప్రభువులు పరమమాహేశ్వరులై శివపూజాధురంధరులై యుండుటవలన ఆంధ్రదేశమున శివాలయములు వెలసినవి. ఈ రాజన్యులు త్రికూట మలయాధిపులని శాసనములందు వర్ణింపబడినారు. రెండవ మాధవవర్మ వైదికమతావలంబియై అనేక యజ్ఞములాచరించినాడు. వైదికమత విజృంభణము, బౌద్ధ, జైన మతముల పతనమునకు గారణభూతమైనది.

విష్ణుకుండినవంశ ప్రతిష్ఠ చిరస్థాయిగా నుండునట్లు రెండవ మాధవవర్మ ఏకాదశాశ్వమేధ, బహుసువర్ణ పౌండరీక, వాజపేయ, క్రతూ సహస్ర సర్వమేధ రాజసూయ పురుషమేధాధ్వరముల నాచరించి, వైదిక మతము సర్వాతిశాయియై వర్ధిల్లునట్లు గావించినాడు. ఈ వంశీయులలో నాల్గవ మాధవవర్మ సైతము యజ్ఞ యాగాదులు నిర్వర్తించినవాడు. షోడశమహాదానము లొసంగినవాడు. హిరణ్యాగర్భదాన మిచ్చినవాడు

విష్ణుకుండిన ప్రభువు లాచరించిన యజ్ఞయాగాదులను, క్రతువులను, చేసిన దానములను ఊహించిన యెడల ఈ రాజన్యు లెంతటి వదాన్యులో, సంపన్నులో, వీరు పాలించుదేశమెంత సంపన్నమైనదో ప్రజలెట్టి జీవనము గడుపుచుండిరో తెలిసికొనుట కవకాశమున్నది. రాజులు యజ్ఞయాగాదులొనరించు, వాతావరణముగల దేశము నేలుచుండిరనిన దేశము సుభిక్షమై, శత్రురాజుల దండయాత్రలవలని బాధ లేకుండ, సుఖమయ జీవనము గడుపు ప్రజానీకముతో నలరారుచుండియుండవచ్చును.

పవిత్రమైన కృష్ణాపగ దక్షిణమున, కర్నూలు గుంటూరు మండలములలో వ్యాపించిన నల్లమల కొండలు దక్షిణాపథమున పవిత్రమైనవిగా పరిగణింపబడు చున్నవి. కృష్ణానదికి దక్షిణమునగల ఈ కొండ వరుసలలో పవిత్రమైన క్షేత్రములున్నవి. అందు శ్రీపర్వతము, శ్రీగిరి శ్రీశైలము అనబడు శ్రీశైల మల్లికార్జున క్షేత్ర మతిపవిత్రమైనది.

ఈ క్షేత్రము వలన నల్లమల పర్వతశ్రేణి పవిత్రమైనది ఈ నల్లమల పర్వతములలో శ్రీపర్వతము, త్రిపురాంతకము అహోబలము, శ్రీశైలము, మహానంది వంటి క్షేత్రములున్నవి.

తూర్పుకనుమల కతిప్రాచీనమైన పేరు మలయ పర్వతము వేర్వేరు ప్రాంతములందీ పర్వతభాగమునకు వేర్వేరు పేళ్ళుకలవు. గంజాము మండలమున మలయ పర్వతమని, విశాఖమండలమున గోలు కొండలని. గోదావరి మండలమున పాపికొండలని లేక మన్యం కొండలని, కర్నూలు మండలమున నల్లమలలేక ఎర్రమల కొండలని చిత్తూరు మండలమున తిరుమల లేక శేషాద్రియని పిలువబడుచున్నవి. ఈ తూర్పు కనుమలలో పవిత్రమైన క్షేత్రములున్నవి. అందు విష్ణు కుండినుల ఆరాధ్య దైవమగు శ్రీశైల మల్లికార్జునస్వామి కర్నూలు మండలములోని నల్లమల కొండలలో వెలిసినాడు విష్ణు కుండినులు శ్రీ పర్వతస్వామి పాదాను ధ్యాతలమని శాసనములందు చెప్పుకొనుట వలన శ్రీ పర్వతము, శ్రీగిరి శైలము శ్రీశైల మల్లికార్జున స్వామి వెలసిన శైలమునకు నామాంతరములని చెప్పవచ్చును విష్ణు కుండినులు అనేక దేవాలయములను నిర్మించి వైదిక మతోద్ధరణమునకు కృషి గావించినారు. విక్రమేంద్ర భట్టారక వర్మ శాసనములందు పరమ మాహేశ్వరుడని వర్ణింపబడినాడు. చిక్కుళ్ళ దాన శాసనమున ఈతడు దానమిచ్చిన గ్రామము రేగోన్ట అనియు; రేగోన్ట గ్రామము నేత్రపాటి విషయములోనిదని తెలియుచున్నది. గ్రామము దేవభోగ ముగా నీయబడినది. దానము సోమగిరీశ్వర నాధునికి లేక త్రియంబక నాథ దేవాలయమున కివ్వబడినది. సోమగిరీశ్వరాలయము నేడు కని పించుటలేదు. అది గోదావరి వరదలలో కలిసిపోయి యుండవచ్చును.

**వైదుష్యము:**—విష్ణుకుండినులు మొదట ప్రాకృతభాషనాదరించి పోషించినను, తరువాత సంస్కృతము నాదరించినారు. మొదటి గోవిందవర్మ కాలమునాటికి సంస్కృతము రాజభాషగా వర్ధిల్లినది

విష్ణుకుండిన ప్రభువులు యజ్ఞయాగాది క్రతువులాచరించి ఘటికా స్థానముల నెలకొలిపి వేద విదులైన విప్రుల కగ్రహారములొసంగినారు. వీరి కాలమున నాలుగు వేదములను, వేదాంగములను క్షుణ్ణముగా చదివిన బ్రాహ్మణులుండిరని శాసనములవలన తెలియుచున్నది. వైదిక విద్యలందు నిష్ణాతులైన పండితులేకాక, బౌద్ధమత సాహిత్యమునందు పరిపూర్ణ పాండిత్యముగల బౌద్ధమతాచార్యులున్నట్లు తెలియుచున్నది.

బౌద్ధపండితులలో దశబలబలియను పండితుడు సర్వశాస్త్ర పారంగతుడని గోవిందవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము[1] వలన విశదమగుచున్నది. ఈ దశబలబలియను నతఁడు భగవతో దశబలబలినః చతుర్వైశారద్య విశారదస్యాష్టా దశవేణిక బుద్ధధర్మైః సమలంకృత మత్తేః ద్వాః త్రింశన్మహా పురుషలక్షణవరోపలక్షితస్య జాతి జరా మరణ శోకాదిషుబహు సంసార దుఃఖ నిమగ్న సర్వః సత్వోత్తారణా యానేక కల్పా సంఖ్యేయోపవీత పుణ్యజ్ఞాన సంభారభారస్యాప గత రాగ ద్వేష మోహా జనన మరణ దుఃఖస్యాప్రతి హతాష్టావరణ సకల జ్ఞేయజ్ఞానా స్సమ్యక్సం బుద్ధస్య బుద్ధస్య" అని వర్ణింపబడినాడు

విక్రమేన్ద్రి భట్టారకవర్మ వేయించిన ఇంద్రపాలనగర తామ్ర శాసనమున[2] రెండవ మాధవవర్మకును వాకాటక మహాదేవికిని జన్మించిన వాఁడును అగు విక్రమేంద్రవర్మ "మహాకవేః పరమసౌగతస్య" అని చెప్పబడినాడు. భౌద్ధ మతానుయాయియైన విక్రమేంద్రవర్మ మహాకవి యనియు, కవిపండిత పోషకుఁడనియు తెలియుచున్నది. విష్ణుకుండిన ప్రభువులలో జనాశ్రయ బిరుదాంచితుఁడైన నాల్గవ మాధవవర్మ చ్ఛర, జనాశ్రయ ఛందోవిచ్ఛిత్తి వెలసియుండవచ్చును. అంతియేకాక ఈ వంశీయులందరు, సంస్కృతాంధ్రముల పోషించినారు.

---

1. భారతి - జూన్ 1965.
2. భారతి - జులై 1965

కవి పండితుల నాదరించి అగ్రహారము లొసంగినారు. శాసనము లందు పేర్కొనబడిన అగ్నిశర్మ, ఈశ్వరశర్మ అనువారు 'యమ నియమస్వా ధ్యాయ సంపన్నాభ్యాం, అని చెప్పబడినారు. వీరు సనాతన కర్మానుష్ఠాన పరులు. నాలుగవ మాధవవర్మ విద్వ ద్విజగురు విప్రా వృద్ధ తపస్విజనాశ్రయః' అని వర్ణింపబడుట వలన విష్ణు కుండినులు వినయ నయ సంపదగలవారనియు, వేద వేదాంగ పండిత పక్షపాతు లని తెలియుచున్నది

నాలుగవ మాధవవర్మ పొలమూరు శాసనమున[1] ప్రతిగ్రహీత 'వేద వేదాంగ విదోరుద్ర శర్మణోన ప్త్రే స్వపితురధిక గుణాఢ్యా సితతనోః దామశర్మణః పుత్రాయ శివశర్మణే గౌతమసగోత్రాయ కమ్మ రాష్ట్ర కున్దూర వాస్తవ్యాయ తైత్తిరీక సబ్రహ్మచారిణే వేద చతుష్టయా సమామ్నా త్వాదాతా నానాయస్వకర్మానుష్ఠాన పరాయ ఫాల్గుణ్యా పౌర్ణమాస్యాం సోమరాహుగ్రహ నిమిత్తే జనా శ్రయ దత్తః'' అని వర్ణింపబడినాడు

విష్ణు కుండినుల శాసనములలో గ్రామనామములు తెలుగు దేశమునకు సంబంధించినవి. విక్రమేన్ద్ర భట్టారక వర్మ వేయించిన చిక్కుళ్ళ శాసనమున "విజయ రాజ్య సంవత్సరంబుళ్'' అను పద మున్నది. ఇది తెలుగు పదము అళ్, ళ్, ళు, లు 'తెలుగు బహు వచన రూపమగు 'లు' కు పూర్వ రూపములు. ంబు, బు, ముకు బదులుగా శాసనములందు వాడబడినవి. విష్ణు కుండినుల శాసనము లందు క్రింద నుదహరింపబడిన గ్రామ నామములు పేర్కొనబడినవి.

| | | |
|---|---|---|
| 1. | పులిమ్బూరు | పొలమూరు శాసనము. |
| 2. | మయన్దవాటిక | J A. H. R. S. Vol VI P. 17. |
| 3. | కున్దూరు | |
| 4. | కుడవాడ | మాధవవర్మ ఈపూరు శాసనము. |
| 5. | వెలిమ్బలి | E I Vol. XVII P. 334-337. |

1 J A H. R S Vol P. 17.

| | | |
|---|---|---|
| 6. | మరొకకి | మాధవవర్మ ఈపూరు శాసనము. |
| 7 | కళిక | |
| 8 | పురణి సంగమ | E. I Vol XVII P. 337-339 |
| 9. | పెరువాటిక | రామతీర్థ శాసనము |
| 10. | పల్లికి విషయే | E. I. Vol XII P 133 |
| 11. | లెందులూర | |
| 12. | రావిరేవ | చిక్కుళ్ళ శాసనము |
| 13. | రేగోన్షమ్ | E. I Vol IV P 193 |
| 14. | నేత్రపాటి విషయే | |

15. పేణ్కపఱ—గోవిందవర్మ ఇంద్రపాల నగర శాసనము భారతి—జూన్ 1965.

16. ఇరుణ్డెఱో—విక్రమేంద్ర భట్టారకవర్మ ఇంద్రపాల నగర శాసనము. భారతి జూలై 1965.

17. తుండి—Hyd Archaeological Series No 8

విష్ణుకుండిను లాంధ్ర దేశము నేలిన కాలమున సంస్కృతాంధ్ర భాషలు ప్రోత్సహింపబడినవి. తెలుగు ఛందస్సుకు సంబంధించిన గ్రంథము 'జనాశ్రయచ్ఛందో విచ్ఛిత్తి' వెలువడినది.

**జనాశ్రయ ఛందోవిచ్ఛిత్తి:—** నాల్గవ మాధవవర్మకు జనాశ్రయుఁడను బిరుదమున్నది. నాల్గవ మాధవవర్మ తండ్రి రెండవ గోవిందవర్మకు విక్రమాశ్రయుడని, గోవిందవర్మ తండ్రి విక్రమేంద్ర భట్టారకవర్మకు ఉత్తమాశ్రయుడనియు, విక్రమేంద్ర భట్టారకవర్మ తండ్రి ఇంద్ర భట్టారకవర్మకు సత్యాశ్రయుడను బిరుదమును ఉన్నట్లు శాసనముల వలన తెలియుచున్నది. జనాశ్రయ బిరుదము గల నాలుగవ మాధవవర్మ పేర జనాశ్రయ ఛందోవిచ్ఛిత్తి అను గ్రంథము వెలసినది.

'జనాశ్రయ ఛందోవిచ్ఛిత్తి' ఛందశ్శాస్త్ర గ్రంథము అసంపూర్తిగా నున్నది. ఇందలి అవతారికకు సంబంధించిన పద్యములు లేవు.

నాల్గవ మాధవవర్మ మహారాజే ఈ గ్రంథము రచించి తనపేర ప్రకటించెనో లేక గణస్వామి రచించెనో నిర్ణయింప వీలులేకుండ నున్నది. జనాశ్రయుని కాలమున నున్న కవితలకు, పద్యములకు వివరణ గ్రంథమీఛందశ్శాస్త్రము ఈ గ్రంథము రాజుపేర ప్రకటింపబడుట వలన, ఇందు తెలుగు కవితకు సంబంధించిన గణయతి ప్రాసలను వివరించు అధ్యాయము లున్నవి నాలుగవ మాధవ వర్మకు తప్ప ఆ కాలమున నున్న రాజు లెవ్వరికిని జనాశ్రయ బిరుదము లేదు. జనాశ్రయ ఛందోవిచ్ఛిత్తియను గ్రంథమున గల ఐదవ అధ్యాయమున గణస్వామి తన కాలమున వాడుకలో నున్న వివిధములైన, పద్యగద్యములను, గణయతి ప్రాసాదుల, నియమమును తెలిపెను ఇతడు అప్పటికి వ్యవహారములో నున్న ఛందశ్శాస్త్ర గ్రంథములను ప్రశంసించెను. కాళిదాసు, వరరుచి, సుందరపాండ్య, శూద్రకాదుల పద్యముల నుదాహరించెను. ఈ గ్రంథమున పేర్కొనబడిన కవులందరును ఆరవశతాబ్దికి పూర్వమున నున్నవారు. ఐదవ అధ్యాయమున పేర్కొనబడిన పద్యములు వివిధ జాతులకు సంబంధించినవి ఇందు శీర్షిక ఒకటి. ఇది ఏడు విధములు ప్రతి సీసపద్యము చివర గీతపద్య ముండును ఆంధ్రమున సీసపద్యమున్నట్లు జనాశ్రయ ఛందోవిచ్ఛిత్తి గ్రంథమున పేర్కొనబడిన శీర్షిక యున్నది. శీర్షిక- సీసము- లేక సీసము- గీత పద్యముతో గాని, ఆట వెలదితో గాని అంతమగును.

శీర్షిక- సీసక- సీసపద్యముగా మారియుండవచ్చును జనాశ్రయ ఛందోవిచ్ఛిత్తి గ్రంథమున గల తక్కిన జాతులు, ఉపజాతులు, ఆంధ్ర కవితకు, ఛందస్సున కనుగుణముగా నున్నవి. జనాశ్రయ ఛందోవిచ్ఛిత్తిలో ద్విపద త్రిపద లున్నవి. తెలుగు భాషలో నేడును ద్విపద రచనలు వాడుకలో నున్నవి. ద్విపదలో పెక్కు గ్రంథములు రచింపబడినవి క్రీ శ ఐదారు శతాబ్దములలో ఆంధ్ర దేశమున తెలుగు కవిత వర్ధిల్లినదని చెప్పవచ్చును.

**స్థల మాహాత్మ్యము:-** విష్ణుకుండిన మూఁడవ మాధవవర్మ ఈపూరు శాసనమున 'త్రికూటమలయాధిపతి' అని వర్ణింపబడినాడు. త్రికూట పర్వతమును గూర్చియు, త్రికూటేశ్వరస్వామిని గూర్చియు, స్థలమాహాత్మ్యమున తెలుపబడినది, దక్షాధ్వరధ్వంసము గావించిన పిదప పరమశివుడు త్రికూట పర్వతమున గల బిల్వవనమున తపము గావించుచు, దక్షిణామూర్తి యనబరగినాఁడు ఇచట శివుడు జ్యోతి ర్లింగరూపము ధరించినాడు. త్రికూట మలయమున మధ్యనగల శిఖరము రుద్రశిఖరము. త్రికూటేశ్వరాలయము రుద్రశిఖరముపై నున్నది. అలయము దగ్గరికి వెళ్ళుటకు సరియైన సోపానములు లేవు. ప్రజలు సాధారణముగ శివార్చనమున కచటికి వెళ్ళరు. ఇచటి శివాలయము శ్రీశైల మల్లికార్జున ఆలయమంతటి పవిత్రమైనది రుద్రశిఖరమున కీశాన్యమున విష్ణుశిఖరమున్నది. ఇచట విష్ణువు, దక్షయజ్ఞమున హవి స్సుల నంగీకరించి నందున అంటిన పాపమును ప్రక్షాళన మొనర్చుకొని నాఁడు శివుడు, విష్ణుమూర్తిని పవిత్రుని గావించుటకు, త్రిశూల మును భూమిలోనికి గ్రుచ్చి పవిత్రజలములు తెప్పించి విష్ణువు పాప పంకిలమును కడిగివైచెను. విష్ణుశిఖరమున గల ఈశ్వరుని, పాపవినాశ దేవరయనియు, స్వయం భూలింగమనియు పిలుతురు భక్తులు, యాత్రి కులు మొదట తీర్థమున స్నానముచేసి, పాపవినాశ దేవరను దర్శించి, త్రికూటస్వామి ఆలయమునకు వెళ్ళుదురు. రుద్రశిఖరముపై బ్రహ్మయు శివునర్చించెను బ్రహ్మ శిఖరముపై శివుడు వెలసినాడు. బ్రహ్మశిఖ రము, రుద్రవిష్ణు శిఖరములకన్న చిన్నది. ఇచట త్రికూటేశ్వరాలయ మున్నది. దీనినే క్రొత్తకోటప్ప యందురు. ఈ ఆలయనిర్మాణము రుద్రశిఖరముపై గల ఆలయ నిర్మాణానంతరము ఎన్నియో సంవత్స రములకు జరిగినది. గుంటూరు, కర్నూలు, మండలములలోని ప్రజలు, దేశము లోని పలుచోట్ల నుండి యాత్రికులు, త్రికూటేశ్వర స్వామిని కోటేశ్వర, లేక కూటేశ్వర లేక కోటప్పయని పిలుతురు. కావున

ఈ కొండకు కోటప్ప కొండయని పేరు వచ్చినది. శివరాత్రి మహో త్సవములకు వేలకొలది భక్తులు, వచ్చి ఉత్సవములలో పాల్గొని శివు నర్చించి, భక్తిని ప్రకటించుకొందురు.

స్థల మాహాత్మ్యమువలన బ్రహ్మ శిఖరముపై వెలసిన త్రికూ టేశ్వరస్వామిని గూర్చి కొంత సమాచారము తెలియుచున్నది ఇది నేడు క్రొత్త కోటప్ప యనబడుచున్నది. కోటప్ప కొండకు ఈశాన్య మున కొండ కావూరను గ్రామమున్నది. ఆ గ్రామమున నందుడను గోపాలుడు, కుందరీ అను పేరుగల భార్యతోను, ఆనందవల్లి యను కూతురితోను నివసించుచుండెను. చాలా కాలమువరకు సంతాన హీను డైన ఆనందునికి ఆనందవల్లి జన్మించిన పిదప అదృష్టము కలిసివచ్చినది. బాల్యమునుండియు, ఆనందవల్లి త్రికూటేశ్వర స్వామిని ధ్యానించు చుండెను. ఆమె ఆలయము ముందు నిలిచి శివుని ధ్యానించుచు కాలము గడుపుచుండెను. శివధ్యానమున నున్న ఆనందవల్లి శివుని అనుగ్రహమున, అవివాహితయై యుండియే బాలుని కనెను. బాలుడు జన్మించిన పిదప శివుని మాహాత్మ్యమున అంతర్ధానమయ్యెను. ఆనంద వల్లియు శివ సాయుజ్యము నొందెను. ఆనందవల్లి ప్రసవించిన స్థల మున భక్తులు పూజలు గావింతురు. అటు పిమ్మట త్రికూటేశ్వర స్వామి ఆలయము చేరుదురు. ఆనందవల్లి శివసాయుజ్య మొందినపుడు శలంకయ్య అనునాత డుండెను. అతడు త్రికూట పర్వతమున ఆనంద వల్లికి ఆలయము కట్టించెను. ఇతడే బ్రహ్మ శిఖరముపై త్రికూటేశ్వ రాలయ నిర్మాణము గావించెను. అది నేడు క్రొత్త కోటప్ప కొండగా వ్యవహరింపబడుచున్నది. కొంతకాలము తరువాత శలంకయ్య పార్వతికి ఆలయము కట్టింపదలచి, శివ పార్వతుల కల్యాణము జరుప నిశ్చయించెను. కాని పరమశివుడు, దాక్షాయణి దక్షయజ్ఞమున ఆత్మాహుతి యగుటవలన బ్రహ్మచర్య వ్రతమవలంబించుచు త్రికూట పర్వతముగల రుద్ర శిఖరమున నివసించుచుండెను. ఇచట నతడు దక్షిణా

మూర్తిపేర ప్రసిద్ధి బడసెను. బ్రహ్మచర్య వ్రతమవలంబించి తపో నిష్ఠా గరిష్ఠుఁడై రుద్ర శిఖరమున నున్నవాడు కావున ఈశ్వరుడు, ఆకాశవాణి ద్వారా పార్వతికి ఆలయ నిర్మాణము, వివాహ మహో త్సవముల నిర్వహించు ఆలోచనలను విరమించుమని ఆదేశమిచ్చెను కోటప్ప కొండలో, శివరాత్రి నాడైనను, శివరాత్రి మహోత్సవ సమ యములందైనను, పార్వతీశివుల కల్యాణ మహోత్సవములు జరుగవు.

పదునైదవ శతాబ్దిలో రచింపబడిన కావ్యములందు మాధవ వర్మ ప్రశంసయున్నది. వాసిష్ట గోత్రోద్భవుఁడైన పూసపాటి తిమ్మరాజు పుత్రుడు బసవరాజు ఈతడు సూర్యవంశీయుడు. ఇతఁడు గజపతి రాజుల సామంతుఁడుగా తూర్పు తీర ప్రాంతమును పాలించు చుండెను ఇతడు మాధవ వర్మ వంశీయుఁడని తెలియుచున్నది [1] దూబ గుంట నారాయణకవి పంచతంత్రమను గ్రంథావతారికలో బసవ రాజు మాధవ వర్మ వంశీయుడని వర్ణించెను మాధవవర్మ మహారాజు దుర్గాదేవి కటాక్షమున రథగజతురగ పదాతి బలమును వడసి కళింగ విభుని ఓడించి, ప్రజలను పాలించుచు, వేదములను రక్షించి, వేద ధర్మమును పోషించెను.

"మును బెజవాడ దుర్గమను ముగ్ధ తనంబున మెచ్చజేసిబెం
పున రథదంతి వాజిభట భూరి బలంబులచే గలింగ భూ
జనపతిదుంచి వేద సతిసంతతికై మహింబాడి నిల్పిగ
మ్మన జిరకీర్తులంగనిన మాధవవర్మనిజాన్వయంబునన్"

అల్లే దగ్గుపల్లి దుగ్గన రచించిన నాసికే తోపాఖ్యానమున మాధవవర్మ ప్రశంసకలదు. నాసికే తోపాఖ్యానము చందులూరి గంగన కంకితమీయబడినది నాసికే తోపాఖ్యానమున మాధవవర్మకు

1. S. I I. Vol IV 789, 1071,

సంబంధించిన ఈ క్రింది పద్యమున్నది.

"చతురంగ బలములు విజయవాడ దుర్గాంబ
వరమున బడసి దుర్వారలీల
జగతి స్థలంబెల్ల సాధించి జయశాస
నములు దిగ్దంతి దంతముల సలిపి
పెదబాలునకు గా ప్రియసుత మోహంబు
పట్టక బెజవాడ బాడి నిలిపి
కలయంగ బురమున గాంచన వర్షంబు
గురియించి దేవతా కోటి పొగడ

వసుధ నెగడిన మాధవ వర్మవంశ
వర్ధనుడగుచు తిమ్మ భూవరుని బసవ
పార్థివుని కాపుదై కృపపాత్రుడగుచు
ఘనత మెరసెన నంత గంగయ విభుడు".

ఆంధ్రదేశమును విష్ణుకుండినులు పాలించిన కాలమున దేశమున వైదికమతముతోపాటు, సంస్కృతభాష, దాని వెనువెంట తెలుగుభాష వృద్ధి జెందినవి తెలుగు వ్యవహార భాషగా వాడబడుచుండెను రాజభాష సంస్కృతము, కవిపండితులు వేదపండితులు, ఆదరింపబడి, గౌరవింపబడి పోషింపబడుచుండిరి. తెలుఁగు కవిత ఆరంభ దశలో నుండెను. విష్ణుకుండినులాంధ్రదేశమును పాలించుకాలమున కడపమండలమున రేనాటి చోళులు తెలుగులో శాసనములు వ్రాయించినారు. అప్పటికే తెలుఁగు శాసనములు వేయించునంతటి దశకు వచ్చి శాసన రూపమున కనిపించినది.

**వాణిజ్యము :—** విష్ణుకుండినుల కాలమున వర్తక వ్యాపారము విశేషముగ సాగినది. దేశము సుభిక్షమై యుండుటవలనను, వివిధ వృత్తులకు సంబంధించిన ప్రజలుండుటవలనను దేశమున పరిశ్రమలు నెలకొనియుండుటవలనను, విదేశ వ్యాపారము చేయుట

కవకాశముండుటవలనను, ఆంధ్రనావికులు ధైర్యసాహసములతో అగాధ సముద్రములపై ఓడలు నడుపుచు, ఆంధ్రదేశము సిరిసంపదలతో తుల తూగునట్లు వ్యాపారము చేసిరి. విష్ణుకుండినుల నాణెములు, ఆంధ్ర దేశమున, నల్లగొండ, గుంటూరు, కోస్తా మండలములలో లభించినవి. విష్ణు కుండినుల నాణెములను సర్ వాల్టర్ ఇలియట్ పల్లవులవని భావించినారు [1] ప్రొఫెసర్ రాప్సన్ ఈనాణెములు పల్లవులవనే తెలిపి నారు. వీటి నాతడు పల్లవకురుంబులవని నిర్ణయించెను ఈ నాణెముల నాతడు రెండు మూడు శతాబ్దముల నాటివని తలచెను.[2] నాణెముల పై ఓడ గుర్తు ననుసరించి, విష్ణు కుండినుల కాలమున నౌకా వ్యాపా రము విశేషముగ జరుగుచుండెనని ఊహింపవచ్చును పల్లవులాంధ్ర దేశమున మూఁడవ శతాబ్ద్యర్థమున బలపడిరి. ఉపాసిక బోధిసిరి నాగార్జునకొండ శాసనము వలన ఇక్ష్వాకులు ఆంధ్రదేశమున మతాభి వృద్ధికి వ్యాపారభివృద్ధికి పాటుపడిరనియు తూర్పు సముద్రముననున్న దేశములతో వర్తక వ్యాపారము సాగించుచుండిరనియు తెలియు చున్నది. యజ్ఞశ్రీ శాతకర్ణి నాణెములపై ఓడగుర్తులున్నవి ఆ కాలమున తూర్పు దేశములతో ఆంధ్రదేశము విశేషము వర్తక వ్యాపారము చేయుచుండెను ఆంధ్ర రాజుల నాణెములు ఇక్ష్వాకుల కాలమున చలామణిలో నుండెను. నాణెముపై గల లంఘించు సింహపుగుర్తు ప్రాచీన బ్రాహ్మీలిపిలో వ్రాయబడిన శాసనాక్షరములు ఇక్ష్వాకు, విష్ణు కుండిన, చోళవంశీయులకు సంబంధించిన నాణెములని తెలుపుచున్నవి ఈ నాణెములు పల్లవులవి మాత్రముకావు. పల్లవ రాజుల చిహ్నము నంది. ఇక్ష్వాకు, విష్ణు కుండిన వంశీయుల చిహ్నము సింహము. రామతీర్థము, చిక్కుళ్ళు, పొలమూరు శాసన ముల కమర్చబడిన కడియములకు గల రాజ చిహ్నములు పంజాఎత్తి

---

1. Elliots, Coins of South India Plate II No 55-58 and No 131-138.
2. Coinages of Southern India P 37. No 128.

లంఘించు సింహపు బొమ్మ, పూలకుండి. విష్ణు కుండినుల నాణెము లపై గల చిహ్నము సింహము. ఈ వంశీయులకు సంబంధించిన వే మొగ (?) రాజపురము, వుండవల్లి. బెజవాడ గుహాలయములు. కృష్ణానది ఉత్తరమున నున్న ఆంధ్రదేశమును పల్లవు లెన్నడైనను ఆక్రమింపలేదు. బొజ్జన్నకొండ ప్రాంతమున 68 రాగినాణెములు, ఒక బంగారు నాణెము లభించినవి. విషమసిద్ధి పేరు గల ఈ నాణెములు విష్ణుకుండినులవి. విష్ణుకుండిన వంశపతనానంతరము విషమసిద్ధి బిరుదము గల తూర్పుచాళుక్య వంశస్థాపకుఁడగు కుబ్జవిష్ణువర్ధనుడు, తాను విష్ణు కుండినుల జయించినట్లు సూచించు విధముగా నాణెములపై తన పేరు చెక్కించినాడు. అట్లే ఎలమంచిలి[4] వద్ద లభించిన నాణెములు, నల్లగొండ మండలములోని దండపాడు[2]లో లభించిన నాణెములు విష్ణుకుండినులవి. లభించిన నాణెములను బట్టి విష్ణుకుండినులు సంపన్నులనియు, ఆ కాలమున వర్తకము విశేషముగా సాగుచుండెనని తెలియుచున్నది.

విష్ణుకుండినుల కాలమున ఆంధ్రదేశము విదేశములతో వ్యాపారము చేయుచుండెను. రెండవ మాధవవర్మ కాలమునాటికి విష్ణుకుండినుల రాజధాని ఇంద్రపాలనగరము నుండి అమరావతికి మారినది. అమరావతి బౌద్ధ స్తూపము అమరేశ్వరాలయముగా మారినది. సుప్రసిద్ధమైన బౌద్ధక్షేత్రము శైవక్షేత్రముగ మారుట సంభవించినది. కృష్ణానదిపై, వాడపల్లి, అమరావతి, మోటుపల్లి, ఘంటసాల, కోడూరు వరకు వర్తకము, స్వదేశముననను, మోటుపల్లి కోడూర ప్రాంతముల నుండి, విదేశములకును సాగుచుండెను. శాలంకాయన ప్రభువుల కాలమున ప్రసిద్ధిగాంచిన ఓడరేవులు, విష్ణుకుండినుల యధీనమైనపిమ్మట, కళింగదేశమును ఆంధ్రులైన విష్ణుకుండిన ప్రభువులు

1 Ind Ant. Vol XXV P 322.

2 Rep. Areh - Dept H E H. Nizams Dominion 1925-26

జయించిన పిదప, విదేశములతో వర్తకము విరివిగాసాగెను. ఆంధ్ర దేశము నుండి. బర్మా, సయాం, కంబోడియా, చీనా, జపాన్, సిలోన్, సుమిత్రా, జావా, బోర్నియో, మలయ, అరకాను మున్నగు తూర్పుదేశములకును, ఈజిప్టు, రోము, గ్రీసు మున్నగు పాశ్చాత్య దేశములకును ఓడలపై నావికులు, వర్తకులు ప్రయాణము చేసి, ఆయాదేశములందు వ్యాపారము చేయుచుండిరి రెండవమాధవ వర్మ త్రిసముద్రాధిపతియనియు, అతని రాజ్యమున కుత్తరమున రేవానది సరిహద్దుగా నుండెననియు, దక్షిణ సముద్రము, ప్రాక్పశ్చిమ సముద్రములా మహారాజు యధీనమున నుండెననియు శాసనముల వలన తెలియుచున్నది.[1] విష్ణుకుండినుల కాలమున వర్తకవ్యాపారము మూడుపూవు లారుకాయలుగా వర్థిల్లినది.

**శిల్పము :—** విష్ణుకుండినుల కాలమున ప్రత్యేకమైన శిల్పకళ వృద్ధిచెందినది. విష్ణుకుండిన ప్రభువరేణ్యులు శిల్పకళను పోషించినారు. శిల్పుల నాదరించి, సన్మానించినారు. శాతవాహన, ఇక్ష్వాకువంశీయుల కాలమున బౌద్ధమత ప్రాధాన్యము శిల్పకళలందు కనిపించును, విష్ణు కుండినులలో మొదటి ముగ్గురు రాజులు బౌద్ధమతానుయాయులు కావున,వారు బౌద్ధారామ విహార, సంఘారామములను, స్తూపములను నిర్మించినారు. అందు గోవిందవర్మ మహాద్భుత శిల్పసంపదతో నొప్పారు విహారముల నిర్మించెను.

విక్రమేంద్ర భట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము వలన గోవిందవర్మ "షడభిజ్ఞ ప్రతిపాద్య దర్శనానుగ్రహ జనితసుగత శాసనాభి ప్రసాదస్య విబుధభవన ప్రతిస్పర్థి శోభాసముదయానేక మహావిహార ప్రతిష్ఠాపనాధిగతానన్త బ్రాహ్మేణ పుణ్యసంభారస్య

1 విక్రమేంద్రభట్టారకవర్మ ఇంద్రపాలనగర శాసనము
భారతి—జూలై 1965

మహారాజశ్రీ గోవిందవర్మణః"[1] అని వర్ణింపబడినాడు. ఈ మహా రాజు, తన శిల్పకళాభిరుచిని, విహార, ఆరామ, చైత్యాలయ నిర్మాణమువలన వెల్లడించినాడు

అశోక చక్రవర్తి బౌద్ధమత వ్యాప్తికి గారకుఁడై అనేకము లైన బౌద్ధస్తూపముల నిర్మించినట్లు విష్ణుకుండిన ప్రభువులు, వైదిక మతవ్యాప్తికిని, తమ వైదిక మత నిరతిని ప్రకటించుటకు అనేక దేవాలయముల నిర్మించుటయేగాక, గుహాలయములను సైతము తొలిపించిరి

విష్ణుకుండినుల నాటి వేంగిలోని చిత్రరథస్వామి ఆలయము. పాలూరులోని విష్ణు విగ్రహస్వామి ఆలయము ప్రసిద్ధిజెందినవి వేంగి లోని చిత్రరధస్వామి ఆలయము శాలంకాయనుల కాలమున వెలసినను విష్ణుకుండినుల కాలమువ, శిల్పకళాశోభితమైనది విష్ణుకుండినుల నాటి గుహాలయములు, ఇంద్రకీల పర్వతము, ఉండవల్లి, మొగల్రాజ పురము, నెల్లూరు మండలములోని భైరవుని కొండ, ఇంద్రపాల నగర మునన్నున్న ఆలయములు, శిల్పకళా విలసితములు. ఆ రాజన్యుల శిల్ప కళాభిమానమునకు నిదర్శనములు.

విష్ణుకుండినుల పరిపాలన మాంధ్రదేశమున 4, 7 శతాబ్దుల మధ్యకాలమున సాగినది 'డూబ్రియల్' పండితుడును, ఈ రాజులు లలిత కళలను పోషించి వైదిక మతము నాదరించినారని చెప్పినాడు. వీరు నిర్మించిన దేవాలయములు, గుహాలయములు, శిల్పకళా మతల్లి కాటపట్టువులు, ఈ ఆలయములలోని మంటపములు చతురస్రాకార స్తంభములపై ఆధారపడియుండును మందిర ద్వారములన్నింటిలో ఇరుప్రక్కలగల గూళ్ళలో ద్వారపాలకుల విగ్రహములు చెక్కబడి నవి ఈ ద్వారపాలకుల విగ్రహములు జుట్టుముడితోను, తలమీద

1. భారతి—జూన్ 1965

రెండు కొమ్ములతోను, విచిత్రాలంకరణములతోను కనిపించును. స్తంభములు చెక్కబడిన తీరు, పనితనము, స్తంభములపై గల లతలు, పద్మములు, శిల్పుల చాతుర్యమును, శిల్పకళాభిజ్ఞతను వేనోళ్ళ చాటుచున్నవి ఆంధ్రశిల్పుల అద్భుత శిల్పకళా పరిజ్ఞానమునకు దేవాలయ, గుహాలయ స్తంభములపై గల శిల్పము తార్కాణము.

దేవాలయ స్తంభములందడుగు భాగమున పూలకుండి, దాని నుండి పుష్పములు బయటికి వచ్చుచున్నట్లు మహాద్భుతముగ చెక్కబడినవి దేవాలయ మంటపములందడుగు భాగమున గోడలపై పంజా ఎత్తిన సింహపు బొమ్మలున్నవి. విష్ణుకుండినుల నాణెములపైనను, సింహపు గుర్తులు, పూలకుండి చిహ్నములు కనిపించును. ఇట్టి శిల్ప కళాశోభితములైన స్తంభములచే నిర్మింపబడిన దేవాలముల శిల్పసంపద అనన్యసామాన్యము.

ఈ రాజన్యుల దానశాసనములందును కేసరి ముద్ర యున్నది. వీరికి సంబంధించిన నాణెములు, ఉత్తర సర్కారులందు లభించినవి. వీటిని సర్ వాల్టర్ ఇలియట్ సంపాదించెను. ఇలియట్, రాప్సను పండిత వర్యులీ నాణెములు పల్లవులవని భావించినారు. కాని నాణెములపై గల ముద్రలు, పూవులకుండి, గుహాలయములందు గల స్తంభములపై యుండుటవలనను, శాసనముల కడియములకు గుదిగ్రుచ్చబడిన రాజ ముద్రికలపై నీ చిహ్నము లుండుటవలన నివి విష్ణుకుండినులవని యూహింపవచ్చును.

ఇలియట్, రాప్సను పండితులు లభించిన నాణెములను పరిశీలించి, పరిశోధించి ఆ నాణెములు పల్లవరాజులవని తెలుపునాటికి విష్ణుకుండిన వంశమొకటి ఉండెననియు, ఆవంశీయులాంధ్రదేశమును పాలించినారనియు చారిత్రక లోకమునకు దెలియదు విష్ణుకుండినుల నాణెములపై 'శ్రీ పర్వత' అను అక్షరములుండుటవలనను, ఉండవల్లి

గుహాలయములలో, ఒక కుడ్యముపైనను ఇంద్రకీలాద్రిపై నున్న ద్వితీయశ్రేణి స్తంభములపైనను, 'శ్రీ ఉత్పత్తి పిడుగు' అని ఉండుట వలనను నాణెములపై గల చిహ్నములు, గుహాలయములలోగల స్తంభ ములపై నచ్చటచ్చట చెక్కిన చిహ్నములొకటే యగుటవలనను, ఈ గుహాలయములు విష్ణుకుండిన ప్రభువుల కాలమున నిర్మించబడినవని చెప్పవచ్చును

**ఉండవల్లి:—** బెజవాడకు **మూడుమైళ్ళ** దూరమున ఉండవల్లి అను గ్రామమున్నది గ్రామమునకు సమీపముననున్న కొండలలో విష్ణ్వర్పితమైన నాల్గు అంతస్తులుగల గుహాలయములున్నవి. ఈ గుహా లయములు, బౌద్ధమతము ఆంధ్రదేశమున వ్యాపించియున్న కాలమున, అనగా క్రీ శ 2,3 శతాబ్దులలో నిర్మింపబడి యుండనచ్చునని చారిత్రకుల యభిప్రాయము. ఈ గుహాలయములలోని శిల్పము, ఆలయ నిర్మాణ పద్ధతి, చెక్కడములు, వాస్తుశాస్త్ర ప్రకారము నిర్మించినరీతి ననుసరించి చూడ, ఆంధ్రదేశమున బౌద్ధము క్షీణించు సమయమున వైదికమతము విజృంభించు కాలమున అనగా ఇక్ష్వాకువంశ పతనానంతరము, పల్లవులు, ఆనందగోత్రికులు, శాలంకాయనులు ఆంధ్రభూభాగములను పాలించు సమయమున, విష్ణుకుండిన ప్రభువులచే బౌద్ధమత భిక్షుసంఘములకొఱకు నిర్మింపబడియుండవచ్చును. ముఖ్యముగా విష్ణుకుండిన వంశజులలో బౌద్ధారామ విహారములనేకములు నిర్మించిన గోవిందవర్మ మహారాజే ఈ మహాలయముల నిర్మాణము గావించియుండును. రెండవ మాధవ వర్మ రాజ్యాభిషిక్తుడైన పిమ్మట, యజ్ఞయాగాదులాచరించుచు, వైదికమతోద్ధరణమునకు బూని, బౌద్ధశిల్ప కళాశోభితములైన ఈ గుహాలయములను వైదికమతానుసారము దేవాలయములుగా మార్పించియుండవచ్చును. దేవాలయములను, గుహాలయములను పరిశీలించి చూచిన ఈ మార్పు స్పష్టముగ కాన్పించును. శిల్పకళ, ప్రథమ దశలో నున్నపుడీ గుహాలయములు తొలిపింప బడినవి.

ఈ గుహాలయములందలి అనంతశయన విగ్రహము తూర్పు చాళుక్యుల కాలమున పూర్తిగావింపబడి యుండవచ్చును

క్రీ.శ. 1920 వ సంవత్సరమున పురావస్తుశాఖవారీ గుహాలయమును తమ స్వాధీనము చేసికొని రక్షించుచున్నారు ఈ గుహాలయములు కృష్ణానది దక్షిణ తటమున, మనోహర ప్రకృతి శోభతో నొప్పారు రమణీయమైన ప్రదేశముననున్నవి ఉండవల్లి కొండలలో తొలచబడినవి. ఆంధ్రుల ప్రాచీన శిల్పకళా నిలయములుగా నేటికిని నిలిచియున్నవి నాలుగంతస్తులుగల గుహాలయము చూచుటకు అందముగానుండి, శిల్పకళాభిజ్ఞుల కాశ్చర్యము గొల్పును. ఈ గుహాలయము ఐదవ అంతస్తు అసంపూర్తిగా నున్నది.

గుహాలయమున క్రింది భాగమున గల గుహ చదరముగా తొంబది అడుగులు కలది. రెండు వరుసలుగల స్తంభములు, ఒక మంటపము, దాని వెనుక గర్భాలయము, దాని మధ్య వేదికయు నున్నవి. మంటపము చూరుపై చైత్యాలంకారములును, పరుగిడుచున్న కుందేళ్ళ సమూహముల చిత్రములును ఉన్నవి. ఈ మంటపము ముందుకు చొచ్చుకొని, మరియొక మందిర మున్నది దాని వెడల్పు 30'లు రాతిలో 30'ల లోతున తొలుచబడినది నాలుగు వరుసలు నాల్గేసి చొప్పున పదునారు స్తంభములు గలిగిన ఈ మండపమునకు మధ్యరాతిలో తొలిచిన గర్భాలయమును వేదికయునుకలవు అందొకదానియందు నృసింహస్వామి విగ్రహమున్నది. స్తంభములన్నియు శిల్ప సంపదతో నొప్పారుచున్నవి. మూఁడవ అంతస్తునకు వెళ్లుటకు మెట్లు అమర్చబడియున్నవి మూఁడవ అంతస్తులో నున్న మంటపమును విశాలమైనది ముప్పది రెండు అడుగుల పొడవు, ముప్పది అడుగుల వెడల్పు, ఎనిమిది అడుగుల ఎత్తు ఉన్న ఈ మండపమున 12 స్తంభములున్నవి దీనికి గర్భాలయములేదు. స్తంభములు నునుపుదేలి వానిపై శ్రీ మహావిష్ణువు అవతారములు,

చిత్రములు, గజములు, సింహములు, మున్నగు బొమ్మలు చెక్కబడి యున్నవి ఈ మూడవ అంతస్తులోని మండపము యొక్క దక్షిణపు చివర 17'ల పొడవుగల శేషశాయియైన శ్రీ మహావిష్ణువు విగ్రహ మున్నది. ఆదిశేషువు పడగలు, నాభికమలమునందాసీనుడై యున్న బ్రహ్మ, పాద పద్మముల సన్నిధి లక్ష్మీదేవి, తుంబుర, నారద, సనక సనందనాది మహామునులు శ్రీ మహావిష్ణువును కొలుచుచున్నట్లు చెక్కబడినది. సహజ పరిమాణములో నిర్మింపబడిన ఈ విగ్రహము వింతగొలుపుచుండును ఈ గుహాలయ నిర్మాణము విష్ణుకుండిన ప్రభువుల శిల్పకళాభిమానమునకును, శిల్ప కళాపోషణకును తార్కాణము

**భైరవ కొండ:** నెల్లూరు మండలము ఉదయగిరి గ్రామమునకు ఇరువదినాలుగు మైళ్ళ దూరమునగల నల్లమలకొండలలోని ఒక కొండ చరియను భైరవకొండయని పిలుతురు ఈ కొండలో ఎనిమిది గుహాలయములున్నవి ఈ గుహాలయములలో రెండు గుహాలయములు శిల్ప సంపదకు గడుప్రసిద్ధమైనవి సింహాధిష్ఠితము వలె నున్న శిలా స్తంభములు ఆలయముఖద్వారమునకు రెండువైపుల, ఆజానుబాహులు, భయంకర ముఖులు, విపులస్కందులు, జటాధారులైన ద్వారపాలకుల విగ్రహములు ఆ కాలపు శిల్పమును చాటుచున్నవి ఆంధ్రదేశమున 5, 6 శతాబ్దుల కాలమున వెలసిన శిల్పసంపద కీ గుహాలయ శిల్పము మచ్చుతునకవంటిది. పల్లవశిల్పము వలె ఈ శిల్పము గోచరించును. ఈ గుహాలయములలోని శిల్పకళ శిల్పసౌందర్యముతో నలరారుచు ఆనాటి శిల్పుల శిల్పరచనా నైపుణ్యమును జ్ఞప్తికి తెచ్చును

**బెజవాడ-ఇంద్రకీల పర్వతము :** ఇంద్రకీలాద్రిపై అక్కన్న మాదన్న పేరుగల రెండునరుసల గుహాలయములున్నవి వానిముందరి భాగము మూడు భాగములుగ నున్నది. ఒక్కొక్క భాగమునందొక్కొక్క గర్భగృహమును, గర్భ గృహమునకు ముందొక అర్ధమంట

మును త్రిమూర్తుల కర్పితము గావింపబడినది. క్రింది భాగమున నున్న గృహాప్రాంగణమున మలిచిన ముఖమండపము శిథిలమైపోవ, మండప మునకు సంబంధించిన స్తంభములు మాత్రము కనిపించుచున్నవి పై భాగమున నున్న గుహాలయము మాత్రము చెక్కుచెదరక నిలిచి యున్నది. ఇది విష్ణుకుండిన, పల్లవ రాజవంశీయులు శిల్పకళాభి మానమున నిర్మించినట్టిది. ఐనను అబ్దుల్లాకుతుబ్షా కాలమున నాతనిచే నిర్మింపబడినదను వాడుక ప్రజలలో ప్రబలినది.

**మొగల్రాజపురము :-** విజయవాడకు రెండు మైళ్ళ దూర మున ఈ గుహాలయములున్నవి. ఇవియును మూఁడు భాగములుగ విభజింపబడియున్నవి. ఇవి త్రిమూర్త్యంకితములు. శివతాండవము నకు సంబంధించిన గుహాలయ మిందు ముఖ్యమైనది. విశాలమైనది. దీని పొడవు 31½ లు వెడల్పు. 15. 8 లు. ఈ గుహాలయ ముఖ మండపమందలి స్తంభములు శిల్పకళాశోభితములై, అపూర్వ శిల్ప కళాసంపదతో నొప్పారుచున్నవి. ఈ గుహాలయమందలి శిల్పము కడు ప్రశస్తమైనది. గృహా ప్రాంగణమున జెక్కబడిన నటరాజస్వామి విగ్రహము శిథిలమైనది. కాని శైవగణమునకు చెందిన, భృంగి, శృంగి, విగ్రహములు, ఆ విగ్రహములకు చేరువలోనున్న గణపతి విగ్రహము, గణపతి విగ్రహమునకు దగ్గరలోనున్న ఆదిశక్తి మున్నగు గణముల విగ్రహములు చెక్కబడినవి చక్కని శిల్పముతో నలరారుచు జీవ కళతో నుట్టిపడుచున్నవి. గృహానిర్మాణమున కనువైన రాతికొరకీ కొండలను పగులగొట్టుట వలన ఈ గుహాలయ శిల్పసంపద పగిలి బీటలు వారినది. ఆంధ్రదేశమున విష్ణుకుండినుల మొదటి రాజధాని యగు ఇంద్రపాలనగరమున గల శివాలయములు సాధారణ శిల్పముతో ప్పానారు చున్నవి. విష్ణుకుండినులు శిల్పకళను పోషించి, ఆదరించి, శిల్పులను గౌరవించి తరతరములవరకు తాము మలిపించిన శిల్పము

చెక్కు-చెదరకుండ నుండునట్లు చేసి విష్ణుకుండిన వంశ ప్రతిష్ఠ చిరకాల ముండునట్లు చేసినారు.

ఈ ప్రకరణము వ్రాయుటలో దోడ్పడిన గ్రంథములు.

1. E I Vols No. IV, XII, XVII,
2 S I I Vol X
3 J A H R S Vols VI
4 Hyd Arch Series No 8.
5 భారతి సంపుటములు జూన్, జూలై 1965.

7వ ప్రకరణము

# కళింగాంధ్ర యుగము

ఇప్పటి ఆంధ్ర దేశములోని శ్రీకాకుళము, విశాఖపట్టణము, ఒరిస్సా రాష్ట్రములో నున్న బరంపురం, గంజాము జిల్లాలు పూర్వము కళింగ దేశముగ వ్యవహరింపబడినవి. అతి ప్రాచీన కాలము నుండియు కళింగము ప్రసిద్ధికెక్కినది. పూరాణేతిహాసములందు కళింగదేశ ప్రశంస కలదు. ద్రౌపదీ స్వయంవర ఘట్టమున, సహదేవుని దక్షిణ దిగ్విజయమున, భారత యుద్ధమున కళింగ ప్రభువు ప్రశంస యున్నది. భరతుడు కేకయ రాజును వీడి బయలుదేరి అయోధ్యానగరము జేరునపుడు కళింగ పట్టణము మీదుగా పయనించెనని రామాయణము నందున్నది

ఏక సాలే స్థాణుమ తీం వివతే గోమతీంనదీమ్
కళింగ నగరే చాపి ప్రాప్యసాలవనంతదా !
—రామాయణము-అయోధ్య 71-16

అల్లే సుగ్రీవుఁడు సీతాన్వేషణమునకు తన యనుచరులను పంపునపుడు, దేశములను వర్ణించు సందర్భమున, కాశీ, వంగ దేశములతోపాటు కళింగదేశమును పేర్కొనినాడు.

విదర్భా వృషికాంశ్చైవ రమ్యాన్మాహిష కానపి
తథావంగాన్కళింగాశ్చ కౌశికాంశ్చ సమంతతః
—రామాయణము-కిష్కింధ-41-11

మార్కండేయ పురాణమున ఉత్తర, దక్షిణ, మధ్య కళింగముల ప్రశంస కలదు. బలిచక్రవర్తికి తీర్ఘతమసుడను ఋషి ప్రభావమున,

అంగ, వంగ, కళింగ,సుహ్మ, పౌండ్రులను పుత్రులుదయించిరనియు, వారి దేశములకు వారియనంతరము వారి పేరు వచ్చెననియు పురాణ ముల వలన తెలియుచున్నది.

మౌర్య చక్రవర్తియగు అశోకుడు కళింగ దేశముపై దండెత్తి జయించెను కళింగ యుద్ధమున రక్త పాతము చూచి, మరణించిన వారి బంధువుల రోదనమును విని, వికలాంగులైన సైనికుల గాంచి, మనో వేదనము ననుభవించి, యుద్ధము గావింపనని ప్రతినబూని అహింసయే పరమ ధర్మమని చెప్పునట్టి బౌద్ధమత మవలంబించి, బౌద్ధ మత ప్రచారమునకు అశోక చక్రవర్తి తన శేష జీవితమును ధార బోసెను. అప్పటి నుండి కళింగదేశము వాసికెక్కినది. భారత దేశ చరిత్రలో కళింగ దేశమున కొక స్థాన మేర్పడినది. కళింగ దేశము చాల కాలము గాంగ రాజులచే పాలింపబడినది. వీరిని తూర్పు గాంగు లనియు, మధ్య యుగపు గాంగులనియు, తరువాతి గాంగు లనియు చారిత్రకులు విభజించినారు. ఈ వంశీయులు ఐదవ శతాబ్ది నుండి పదిహేనవ శతాబ్ది వరకు, ఎడతెగకుండ, కళింగమును పాలించినారు. ఆంధ్రదేశములోని కొన్ని భాగములను కళింగ రాజులు పాలించిరి. ప్రాచీన తూర్పు గాంగులకును, ఆంధ్ర దేశాధీశులకును సంబంధము లుండుట వలనను, ఆంధ్రదేశమున బలవంతులైన రాజ వంశీయులు కళింగ భూ భాగములను జయించి పాలించుట వలనను. కళింగాంధ్ర మునకు సంబంధించిన సాంఘిక చరిత్ర ఆంధ్రుల సాంఘిక చరిత్రలో నొక భాగ మని భావింపవచ్చును. ప్రాచీన తూర్పుగాంగులు తాము వేయించిన శాసనములందు గాంగశకమును పేర్కొనినారు. మధ్య యుగపు గాంగులు, తరువాతి గాంగులు, సుప్రసిద్ధమైన శాలివాహన శకమును వాడినారు.

భారతావనిలో కళింగ మతి ప్రాచీనమైనది. పురాణములందు, సూత్రములందు పేర్కొనబడినది. టాలెమీ, ప్లినీ, యువాన్‌చాంగ్,

మున్నగు విదేశీయుల వ్రాతలందును, కళింగ దేశము పేర్కొన బడినది. కురుక్షేత్రమున జరిగిన కౌరవపాండవ యుద్ధమున పాండవు లకు వ్యతిరేకముగా కౌరవ పక్షమున జేరి కళింగులు పోరాడినారు. తూర్పు సముద్రతీరమున కళింగు లనువా రున్నట్లు న్యాచురల్ హిస్టరి అను గ్రంథమువలన తెలియుచున్నది. ఈ గ్రంథమును ప్లినీ అను చరిత్రకారుఁడు రచించినాఁడు. ఇందు భారతదేశమున నున్న జాతుల చరిత్ర కలదు.

గంగానదీ తీరస్థ ప్రాంతములందు తూర్పు మాగధులు కళింగ గాంగులు, అలెగ్జాండరు కాలమున నున్నట్లు Mecrindle మరియు Plutrach ల వ్రాతలవలన తెలియుచున్నది. జైన గ్రంథములగు పరిశిష్టపర్వము, మహాబోధివంశములవలన కళింగుల గురించి తెలియు చున్నది. గాంగ వంశాను చరితమను సంస్కృత కావ్యమువలన గాంగ రాజుల వంశక్రమము, రాజ్యపాలనా కాలము తెలిసికొనవీలగుచున్నది. జగన్నాథాలయమున భద్రపరుపబడిన 'మండల పాంజి' వలన గాంగ వంశీయుల చరిత్ర తెలియుచున్నది ఈ గ్రంథము ఒరియా భాషలో 16వ శతాబ్ద్యంతమున వ్రాయబడినది

కుళోత్తుంగ చోళుని దండ నాయకుఁడగు కరుణాకరుని, ఉత్తర కళింగ లేక సప్త కళింగ విజయము 12వ శతాబ్ధిలో నున్న జయన్గొండార్ రచించిన కళింగట్టుప్పరణి గ్రంథము వలన తెలియు చున్నది. ఈ గ్రంథము కరుణాకరుని సమగ్ర దండయాత్రా విజయములను తెలుపుటయేగాక, కళింగదేశ ప్రజల ఆచార వ్యవహారములను, సంస్కృతీ సభ్యతలను తెలిసికొనుటకు దోడ్పడు చున్నది. 13వ శతాబ్దిలోని గాంగ రాజులకాలపు సాంస్కృతిక, మత, రాజకీయస్థితిగతులను, తెలిసికొనుటకు సంస్కృత గ్రంథములగు విద్యాధర ఏకావళీ, నరహరి యతి స్తోత్రములు దోడ్పడు చున్నవి.

భారతావనిలో గల కళింగదేశమున తూర్పు గాంగరాజుల పాలనము సుమారు వేయి సంవత్సరములు సాగినది. గాంగ శకారంభమునుండి సుమారు క్రీ.శ. 1450 వరకీ వంశీయుల విచ్ఛిన్న ముగా కళింగాంధ్రమును పాలించినారు. వీరి పరిపాలనా కాలమున ఒక్కొక్క మారు కళింగ రాజ్యము వృద్ధియైనది, మరియొకమారు క్షీణించినది.

**రాజధాని** - కళింగ రాజులకు రాజధానులుగా వర్ధిల్లిన పట్టణములలో పేర్కొనదగినవి కళింగ నగరము, దంతపురము, సింహపురము మొదలగునవి. గాంగవంశపు రాజులు కళింగ నగరము నుండి ఎన్నియో దాన శాసనము లిచ్చినారు. శాసనములందు కళింగ నగరము, సర్వర్తుసుఖ రమణీయమైనదనియు, విజయ కళింగనగర మనియు వర్ణింపబడినది. కళింగరాజులు శాసనములందు కళింగాధి పతుల మని చెప్పుకొనినారు. కళింగనగర స్థల నిర్దేశము గుఱించి పండితులలోను చారిత్రకులలోను భేదాభిప్రాయము లున్నవి.

మహాభారతమున భీష్మ, ఉద్యోగ పర్వములందు రెండు కళింగములు పేర్కొనబడినవి. వీటిలో నొకదానికి రాజపురము, రెండవదానికి దంతపురము రాజధానులుగా నుండెడివి. రాజపురము నేటి జయపురము.ఒరిస్సాలో నున్నది. దంతపురము నేటి శ్రీకాకుళము జిల్లాలోని దంతపురము. వాల్మీకి రామాయణమున అయోధ్యా కాండమున దశరథ మహారాజు అయోధ్యను రాజధానిగా కోసల దేశమును పాలించుచున్న సమయమున కళింగ నగరమున్నట్లును, అది కోసలదేశమునకు పడమరగా సోనా నది వొడ్డున ఉన్నట్లును పేర్కొన బడినది. శోనానది నేటి శోణ నది, గంగానదియొక్క ఉపనది. బౌద్ధ జాతక కథలందును సింహళ ద్వీపరాజుల ద్వీప వంశమందును, మహా వంశమునందును కళింగములోని సింహపురము, దంతపురముగా పేర్కొనబడినది. దంతపురమున బుద్ధుని దంతము ప్రతిష్ఠింపబడి,

దంతముపై మహా చైత్యము నిర్మింపబడి పూజింపబడుచుండెనని తెలియుచున్నది. ధంతపురమునగల మహాచైత్యము అశోకచక్రవర్తి నిర్మించినట్టిదిగా భావింపబడుచున్నది.

వంశధారానది ముఖద్వారముననున్న కళింగపట్టణము పూర్వము కళింగనగరముగా, రేవు పట్టణముగా ప్రసిద్ధిచెందినదని డాక్టర్ ఫ్లీట్ అభిప్రాయపడినారు. అలెంగ్జాడరు కనింఘమ్ గోదావరి ముఖద్వారమున రాజమహేంద్రవరమును, కళింగనగరముగా గుర్తించినారు. కాని అదిసరియైన గుర్తింపు కాదు. పవిత్రమైన ముఖలింగ క్షేత్రమే ప్రాచీన కళింగనగరమనియు, ప్రాచీన తూర్పుగాంగుల రాజధాని ఇదియేయనియు, పరిశోధనల వలన నిర్ణయించి చెప్పినవారు రావు సాహెబు గిడుగు రామమూర్తిపంతులుగారు.[1]

ముఖలింగమున పెక్కుశివలింగములు, దేవాలయములు ఉన్నవి. వందలకొలది శాసనములున్నవి. శాసనములందు శివుడు మధుకేశ్వరుడుగా, సోమేశ్వరుడుగా వర్ణింపబడినాడు. శాసనములలో "కళింగావనినగరే శ్రీమన్ మధుకేశ్వరాయ" అనివర్ణింపబడుటవలన ముఖలింగమే కళింగనగరమని భావించుట కవకాశ మున్నది. కామార్ణవుడను తూర్పుగాంగరాజు, నగరమను పట్టణము నిర్మించి, శివునికి దేవాలయనిర్మాణము గావించి మధుకేశ్వరుడను పేరిడినాడు. మధూకలింగము, మోహలింగముగా, కాలక్రమమున ముఖలింగముగా మారి ముఖలింగక్షేత్రమనబడినది. మధూక లింగమును ఒరియా భాషలో మోహాలింగమందురు. మోహాలింగము, ముఖలింగముగా మారుట సహజమే కదా; ముఖలింగము, కళింగనగరమని గిడుగు

---

1 Madras Jouraal of Lit Society 1889-1894 page 68

రామమూర్తి గారి భావముతో Dr. Hulzsch[1] R. D. Benerjee[2] V. A. Smith వంటి[3] చారిత్రకు లేకీభవించినారు.

## రాజ్య పరిపాలనా విధానము

శాతవాహన సామ్రాజ్య పతనానంతరము సువిశాలమైన సామ్రాజ్యము, భిన్న భిన్న ప్రాంతములుగా విడిపోయినది. దండ నాధులు, సామంతులు, ఆయుక్తులు, నియుక్తులు, మండలాధికారులు విషయాధిపతులు, స్వాతంత్ర్యము ప్రకటించి, తమతమ యధీనము నందున్న ప్రాంతములకు తామే రాజుల మని ప్రకటించు కొనిరి. దక్షిణాపథమున పల్లవులు విజృంభించి, ఆంధ్ర దేశభూభాగములను తమ కైవసము చేసికొనిరి. ఆంధ్రదేశ తూర్పుప్రాంతమున శాతవాహనుల సామంతులైన ఇక్ష్వాకు వంశీయులు విజయపురిని రాజధానిగా రాజ్యము స్థాపించి పాలింపదొడగిరి. శాతవాహన సామ్రాజ్యము చుటుకుల శాతకర్ణులు, ఆభీరులు, ఆంధ్రభృత్యులు, కళింగగాంగులు ఇక్ష్వాకులు మున్నగువారు పాలించు చిన్న చిన్న రాజ్యములుగా విడిపోయినది.అట్టితరుణమున కళింగదేశమున చిన్న చిన్న రాజ్యములు తలయెత్తినవి. అందు ముఖ్యముగా, మాఠర వంశము, గాంగవంశము లకు సంబంధించిన రాజ్యములు పేర్కొనదగినవి.

గాంగ వంశపురాజులు, కళింగము నేలిన తదితర రాజ వంశీయులు, పరిపాలనా విధానమున తమ ఏలికలగు శాతవాహనులనే యనుసరించిరి. రాజ్యమున రాజు సర్వాధికారి. రాజునకు సలహో నిచ్చుటకు మంత్రిమండలి యొకటి యుండెడిది. రాష్ట్రికులు, రాష్ట్రకూటులు, తదితర ప్రముఖులు, సామ్రాజ్యమున పరిపాలనా విషయమున రాజునకు చేదోడు వాదోడుగా నుండిరి. సామ్రాజ్యము పరి

1. E. I. vol I page 94
2. Early History of India page 498
3. History of Orissa page 42

పాలనా సౌలభ్యమునకై రాష్ట్రములుగా విభజింపబడెను. ఈ రాష్ట్రములనే విషయములని వ్యవహరించుచుండిరి. శాసనములందు పేర్కొనబడిన విషయములలో, విజయపురి, సంవ[1], భోగాపురము, ధర్మపురము, వరాహవర్తని,[2] కులవర్తని, జలమ్బోర విషయము,[3] మున్నగునవి ముఖ్యములు. ముఖలింగ నగరము కులవర్తని విషయములో నున్నట్లు తెలియుచున్నది.

సామ్రాజ్య విభజనము విషయములతో నాగక, విషయములు మండలములుగా, మండలము లుపమండలములుగా, ఉపమండలములు గ్రామముల కూటమిగా, గ్రామములు పన్నులు వసూలు ననుసరించి భోజకములుగా విభజింపబడియుండెను. విషయమునకు విషయాధిపతి సర్వాధికారి. ఇతఁడు రాజ బంధువుడై యుండును. విషయాధిపతి క్రింద మండలాధిపతులుండిరి. ఆయా మండలముల యభివృద్ధికి, మండలాధిపతులు, విషయాధిపతి పాటుపడుచుండిరి. కొన్ని మండలముల పైనధి కారముగల వాఁడు మహా మండలేశ్వరుఁడు. ఇతని అధికారమునకు లోబడి, మండలేశ్వరులు పరిపాలన సాగించుచుండిరి. రాజు సామ్రాజ్య మందంతటను సంచరించి, అక్రమములు జరుగకుండ జూచుచుండెను అప్పుడప్పుడచ్చట జరుగు అక్రమములను నివారించి, మండలాధిపతులకు, విషయాధిపతులకు,భవిష్యత్తులో నట్టి ఒడుదుడుకులు, అక్రమములు జరుగకుండ, దగిన సలహాల నిచ్చుచుండెను. సామ్రాజ్యమున అల్లరులు జరుగకుండ, ప్రజాపరిపాలనా సౌలభ్యమునకై, శత్రురాజుల దండయాత్రల వలని భయము ప్రజలకు లేకుండ, దేశరక్షణార్థము, సామ్రాజ్యపు సరిహద్దులందు అమాత్యులు నియమింపబడుచుండిరి,[4] గ్రామసీమలలో రాష్ట్రకూట ప్రముఖులు,

1 అనంతవర్మ విశాఖపట్టణ తామ్ర శాసనము
2. S.I.I. Vol V No. 1293.
3. ఇంద్రవర్మ దేవుని తామ్ర శాసనము. M.E.R. 1917-18.
4. S.I.I. Vol No 1101.

నాయకులు, రాజులు, మున్నగువారు యుద్ధకుశలులై యుద్ధ సమయములందు, రాజుకు, సైన్య సహాయ మొనరించుచుండిరి. యుద్ధములు లేని సమయములందు, దేశమున శాంతి భద్రతలను నెలకొల్పి, ప్రజల కష్టములను నివారించుచు, గ్రామ పరిపాలనా వ్యవస్థను పటిష్ఠ మొనర్చుచుండిరి. చిన్న చిన్న గ్రామములకు 'దణ్డాసి' యనునతఁడు గ్రామ రక్షకుడుగా నుండెను. అమ్మాంండి కొడుకు కవహార దణ్డాసి శాసనమునందు.[1] పేర్కొనబడినాడు. గ్రామములో నెచ్చట నైనను, దొంగతనములు జరిగిన యెడల గ్రామ రక్షకుఁడైన దణ్డాసి బాధ్యత వహించుచుండెను. నేడు ఆంధ్ర మండలములోని గుంటూరు మున్నగు ప్రాంతములలోని గ్రామములందు, గ్రామ కట్టడి ననుసరించి, ఏనాది కుటుంబముల వారు గ్రామ రక్షకులుగా వ్యవహరించుచున్నారు. వీరు సాము, గరిడీలలో కడు నేర్పరులు. గ్రామమున జరుగు దొంగతనములు చిన్నవి యైనను, పెద్దవి యైనను ఏనాది వారు బాధ్యత వహించి, దొంగలను పట్టి తెచ్చి పోయిన వస్తువులను వారిచేత నిప్పించుచుందురు. ఈ కట్టడివలన గ్రామ ప్రజలు, ఏనాది వారికి సంవత్సరమునకు, ధాన్యరూపముననో, ధనరూపముననో, ప్రతిఫలమును ముట్టజెప్పుదురు.

గ్రామీణులకు సౌకర్యములు సమకూర్చవలసివచ్చినపుడు, రాజుగాని, విషయాధిపతిగాని, మండలాధిపతిగాని సహాయపడుచుండిరి. రాజు అగ్రహారములను, దేవ భోగములుగనో, బ్రాహ్మదేయములుగనో నిచ్చునపుడు, రాష్ట్రకూట ప్రముఖ కుటుంబముల వారి నాహ్వానించి, వారి సమక్షమున, దానమిచ్చి, శాసనము వేయించుచుండెను. రాజొసంగిన దాన శాసనములను, మండలాధిపతులు, రాజోద్యోగులు, సామంతులు, విషయాధిపతులు, మహా మండలేశ్వరులు, పాలించుచుండిరి. రాజ్యమున ప్రజలలో సాధారణముగ అనైక్యతగాని, భూసంబంధమైన వివాదములుగాని లేకుండెను—

1. S.I I. Vol V No 1066.

రాజులు, ప్రజలచేగాని, మంత్రులచేగాని, తత్పూర్వపు రాజులచేగాని, పురప్రముఖులచేగాని రాజ్యపరిపాలనా భారము వహించుటకెన్నుకొనబడుచుండిరి. ప్రజాపరిపాలనము ప్రజలకను కూలముగ నుండెను ప్రజానురంజకముగ పాలింపని రాజును, రాజ్యభ్రష్టునిగావించుచుండిరి రాజు మంత్రుల సలహానుసరించి, ప్రజాభీష్టముననుసరించి, పాలించుచుండెను. భూమి పన్ను పంటలో $\frac{1}{10}$ వంతు, నీటి పన్ను, కప్పములు, ఇతర సుంకములు, వసూలు చేయుచు, రాజ్య సంరక్షణార్ధము సైన్యమును పోషించుచు, దాన ధర్మములకు, ప్రజాహిత కార్యములకు, రాజులు ప్రజలనుండి పన్నుల రూపమున వసూలు చేసియుంచిన ధనమును వెచ్చించుచుండిరి. ఆనాడుప్రజాక్షేమమును గోరి పరిపాలన చేయు రాజులుండిరి.

రాజు శాసనము వేయించునపుడు గ్రామమున అన్ని కుటుంబములవారి నాహ్వానించుచుండెను గ్రామీణుల సమక్షమున, గ్రామము నగ్రహారముగా దానమిచ్చి, శాసనము వేయించుచుండెను.[1] అగ్రహారముగానిచ్చిన గ్రామము పూర్వాగ్రహారములకు చేర్చబడు చుండెను. ఈ అగ్రహారములందు రాజభటులు ప్రవేశించుటకు వీలులేదు. అష్టాదశకరములలో ఏ పన్నైనను, అగ్రహారికులు రాజునకీయనవసరములేదు. అట్టి హక్కులన్నియు అగ్రహారికులకే చెందుచుండెను.

సామ్రాజ్యమున వివిధకులములకు సంబంధించిన వారుండిరి. కళింగము సంపన్నమైన దేశమగుటవలన, అన్యరాజుల దండయాత్రలు దేశముపై సాగుచుండెను ఆయా దేశముల రాజులు చేయు, దండయాత్రల సమయమున వచ్చిన, ఆంధ్రులు, పల్లవులు, హైహాయులు, చోళులు, కళింగమున స్థిరనివాసులైయుండిరి. భిన్న

1. హస్తివర్మ ఉర్లాము శాసనము - ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక మే 1926

భిన్న మతములకు కులములకు జెందిన ప్రజలీ దేశమున నివసించు చుండిరి. రాజులు, ధనాఢ్యులైన దాతలు, విద్యా సత్రములను కట్టించి, గురువులకిచ్చుచు, విద్యా వ్యాప్తికి పాటుపడుచుండిరి.[1] విద్యా సత్రమన నేటి పాఠశాలలవలెగాక, ఉచిత విద్యాబోధన, ఉచిత భోజన సౌకర్యములు, ఉచిత వసతి లభించు విద్యా సత్రము - ఈ సత్రములందు ఎండాకాలమున చలివేంద్రలు, శీతకాలమున నెగడులు నెలకొల్పబడుచుండెను. రాజుకుగల సైన్యమున వివిధ కులముల వారుండిరి. విప్రులు సైతము సైన్యమున గొప్పగొప్ప పదవులను నిర్వహించుచుండిరి.[2]

వర్తకనానాసనాధుడను అధికారి వర్తకుల యొద్ద సుంకము వసూలు చేసి రాజకోశాగారము చేర్చుచుండెను. ఉప్పు తయారు చేసి విక్రయించు బేహారులనుండి, సుంకము వసూలుచేయుచుండిరి. కళింగము సముద్రతీరముకల దేశము కావున, రాజులకు ఉప్పుపైన వచ్చు సుంకము ముఖ్యమైన ఆదాయముగ నుండెను. దొంగతనముగా ఉప్పును తయారుచేయువారిని శిక్షించుటకు లవణాధికారి యొకడు రాజుచే నియమింపబడి జాగరూకతతో మెలగుచుండెను [3] రాజులు వేయుంచు దానశాసనములను స్వర్ణకారులు చెక్కుచుండిరి. కాపులలో నెన్నియో భేదములుండెను. శూద్రులు యజమానులకు వృత్తివ్యవసాయములందు సహకరించి వృత్తిముకాపు, పంటకాపులని పిలువబడిరి. పలవకాపులను నొకకాపువారుండిరి.[4] గుడి సానుల కుమారులు నాయకులుగానుండి, భూమిపన్ను, వృత్తిపన్ను వసూలుచేయుచు, భూమినాయక, వృత్తినాయక బిరుదములతో వ్యవహరింపబడుచుండిరి

---

1. S I I. Vol V No 1342
2 S.I.I. Vol V No. 1064, 1006
3 S.I.I Vol V No. 1935
4. S.I.I. Vol V No. 1066

దండాసి యనుపంచములు గ్రామరక్షకులుగా నేడును కళింగమున కనిపింతురు. ఆకాలమున పంచములు మధుకేశ్వరాలయ ప్రవేశ మొనర్చి పూజాదికముల నిర్వర్తించి దానధర్మములు చేయుచు, శాసనములు వేయించుచుండిరి.[1] కాయస్థులను నొకతెగవారుండిరి. కాయస్థుడన కరణపుజాతివాఁడు. మాహిష్యస్త్రీయందు వైదేహునకు జన్మించినవాఁడు కాయస్థుడు. కాయస్థులు గ్రామములలో వసూలు చేయు పన్నులకు సంబంధించిన లెక్కలు, చేయుచుండిరి. అర్సవిల్లులో కాయస్థుల సంఖ్య ఎక్కువగా నుండెను. వీరి కన్యలను సేనా నాయకులు వివాహమాడుచుండిరి.[2] కాళింగులను జాతివారు కళింగ దేశముననున్నారు. వీరిలో బ్రాహ్మణులను భట్టులందురు. ఈభట్టులు దేవాలయార్చకులుగా నియమింప బడుచుండిరి.[3] నేడు మధుకేశ్వరా లయపూజారులు కాళింగ బ్రాహ్మణులే.

రాజ్యమున భూమి నాల్గువిధములుగనుండెను. 1, భూనీరునేల 2 ఖండ్రిక నేల 3. రాతినేల 4. నీరునేల. గాంగవంశీయులు పాలించుకాలమున సౌరమానము వ్యవహారమున నుండెను. ముఖ లింగేశ్వరాలయములోను, చుట్టుప్రక్కల గల ఆలయములలోను గల శాసనములందు మేష, వృషభాది సౌరమానమాసములు పేర్కొన బడినవి ఆంధ్రదేశవ్యవహారప్రభావము వలన కళింగములోని కొన్ని శాసనములందు కార్తీక, మాఘమాసాది చాంద్రమాన మాసములు కనిపించుచున్నవి.

ఈ కళింగ రాజులలో గాంగ వంశీయులు ముఖ్యులు. మాతర వంశీయులు పాలించిన కాలములోను కళింగము సకల సౌభాగ్య విలసితమై యుండెను.

---

1. S. I. I. vol. V No. 1066
2 S. I. I. vol V No. 1121
3. S. I, I, vol. V No 1118

**మత పరిస్థితులు :** కళింగము ప్రాచీనచరిత్రకల దేశము ఇచట వేద కాలము నుండియు, వైదిక మతము వర్ధిల్లినది. అశోక చక్రవర్తి కాలము నుండి, జైన బౌద్ధ మతములు దేశమున వ్యాపించి యుండెను. శాతవాహన రాజుల సమకాలికుఁడగు ఖార వేల మహారాజు చేటియ వంశీయుఁడు ఇతఁడు కళింగ దేశమును చాల కాలము పాలించెను. ఈతని హాథీగుంఫ ప్రాకృత శాసనమువలన ఈ మహారాజు జైన మతావలంబియని తెలియుచున్నది. బౌద్ధమతమీ కళింగ దేశమున వర్ధిల్లినట్లు నిదర్శనములున్నవి. కళింగాంధ్రమున నున్న రామతీర్థము, శ్రీకాకుళము జిల్లాలోని శాలిహుండము. అనకాపల్లి వద్ద నున్న శంఖవరము మున్నగు ప్రాంతములలో నున్న సంఘారామములు, విహారములు, స్తూపములు బౌద్ధమత మిచట వ్యాపించినట్లు తెలుపుచున్నవి. హ్యూయాన్‌త్సాంగ్ కళింగమున పర్యటించు నాటికి అచట బౌద్ధమతము క్షీణింప మొదలిడినది. ప్రజాభిమానము వైదిక మతముపై నుండెను. శంఖవరము కొండగుహలలో బౌద్ధ చిత్రములున్నవి. శంఖవరములోని బౌద్ధ స్తూపముల వద్ద, కొన్ని నాణెములు లభించినవి అందు సముద్ర గుప్తుని నాణె మొకటి కలదు. కావున కళింగ దేశమున, హ్యూయాన్‌త్సాంగ్ భారత దేశమునకు రాక పూర్వము, బౌద్ధమతము వ్యాపించినది. ఈ దేశమున నున్న బౌద్ధా రామ విహారములు, స్తూపములు మఠములు మున్నగువాటి నిర్మాణము, క్రీ. శ. మొదటి, రెండవ శతాబ్దములలో జరిగి యుండును.

అశోకునియనంతరము చేటియ వంశీయులు కళింగము నేలినారు. ఈ వంశమున మూఁడవ రాజగు ఖారవేలుఁడుతన 24 వ ఏట సింహాసనాసీనుడయ్యెను. ఖారవేలుడు వేయించిన హాథీగుంఫ శాసనము, కటకమునకు 19 మైళ్ళ దూరములోగల ఖండగిరి, ఉదయగిరి కొండగుహలలోని ఒక గుహాలో చెక్కఁబడినది. నేటి భువనేశ్వరమునకు నాలుగుమైళ్ళ దూరమున నున్నది. శాసనమున్న

కొండగుహా పదునై దడుగుల పొడవు, ఐదున్నర అడుగుల వెడల్పు గల ఈ శాసనము పదిహేడు పంక్తులలో నున్నది: ఈ శాసనము ప్రాకృత భాషలో బ్రాహ్మిలిపిలో వ్రాయబడినది. క్రీ పూ. రెండవ శతాబ్దము నాటిది. జైనులకు సంబంధించిన శాసనములలో హాథీగుంప శాసనము మొదటిది. ఖారవేలుఁడు జైనుడు. హాథీగుంఫ శాసనము, జైన చిహ్నములతో, జైన సంప్రదాయములతో, జైన గుహాలందు చెక్కబడినది. ఖారవేల మహారాజు జైన గురువులను గౌరవించి, జైన మతస్థులను పోషించెను. ఋషభ దేవుని విగ్రహము చెక్కించెను. శాసనారంభమున "నమో అర్హంతానాం, నమో సర్వసిద్ధానాం" అనియు, 'అర్హంతప పాదానాం, కాలింగానాం సమనానాం" అని జైనుల నందరిని సమభావముతో గౌరవించెను. మగధను పాలించు మొదటి నందరాజుచే కళింగ దేశము నుండి కొనిపోబడిన మొదటి జినఋషభదేవుని విగ్రహమును, ఖారవేల మహారాజు కళింగమునకు తీసుకొని వచ్చెనని శాసనమున చెప్పబడినది. ఖండగిరిగుహాలు ప్రాచీన కాలము నుండియు, ప్రశస్తి కెక్కినవి. జైన గురువులీ గుహాలను, క్రీస్తు. పూర్వమునను, క్రీస్తు తరువాత కాలములోను తమ యావాస ముగ జేసికొనినారు. ఈ గుహాలు గుహాలయములు, జైన మతము కళింగ దేశమున వ్యాపించుచున్న కాలమున జైన తీర్థంకరుల కొఱకు. జైన గురువులు, వారి శిష్యులు నివసించుట కొఱకు నిర్మింప బడినవి.

క్రీ. పూ. నాలుగవ శతాబ్ది నుండి. జైన మతము కళింగ దేశమంతటను వ్యాప్తిలో నుండెను. దీనికి నిదర్శనముగ ఖండగిరిలో గల 35 గుహాలు, గుహాలలోగల జైన మత చిహ్నములు జిన విగ్రహములు నిలిచియున్నవి. ఇచట బౌద్ధ మత సంబంధమైన కట్టడ ములు గాని, శిథిలములు గాని లేవు.

రామతీర్థమునందు లభించిన జైన ప్రతిమల ననుసరించియు, పాండవ పంచగుహాయందు, పూర్వచాళుక్యలిపిలో వ్రాయబడిన

జైనుల పేళ్ళను బట్టియు, క్రీస్తు పూర్వమును, క్రీస్తు తరువాత ఐదారు శతాబ్దుల కాలము వఱకు జైనమత మీ ప్రాంతమున వర్ధిల్లినట్లు భావింప వచ్చును. రామగిరి కొండలలో మొదట జైనము వ్యాపించి క్షీణించిన తరువాత బౌద్ధమత సన్యాసుల కాలవాలమై యుండెనని చెప్ప వచ్చును.

**రామతీర్థము**. రామతీర్థములోని గురుభక్తి కొండలపై బౌద్ధ మతస్థులకు సంబంధించిన మఠములున్నవి. ఇవి విశాఖపట్టణము జిల్లాలోని విజయనగరమునకు 8 మైళ్ళ దూరమున నున్నవి. రాముడీ ప్రాంతమున నివసించుట వలన రామతీర్థమని పేరీ కొండప్రాంతము లకు వచ్చినది. రామసరోవరమును రాముడు నిర్మించినట్లు స్థల పురాణమువలన తెలియుచున్నది. బౌద్ధ మఠమునకు కొలది దూరమున పశ్చిమ దిశలో బౌద్ధ స్తూపమున్నది. స్తూపమునకు తూర్పున చైత్యాలయమున్నది. దీని పొడవు 40'లు వెడల్పు 11'లు, ఎత్తు 6'లు. గర్భాలయము లేక డగోబా ఎత్తు 7'లు. బుద్ధుని స్మారక చిహ్నముగల భరణి డగోబాలో యుంచెడివారు. భరణిని కాపాడుటకు డగోబము, బౌద్ధభిక్షువులు, సన్యాసినీ సన్యాసులు పూజలు, ప్రార్థనలు చేయుటకు చైత్యాలయము, సన్యాసుల నివాసమునకు మఠము, విహారము నిర్మింపబడినవి. రామతీర్థములోని స్తూపమున డగోబాలో లభించిన భరణి, భట్టిప్రోలులో లభించిన భరణివలె నున్నది. భరణిలో బుద్ధదంతము, ఎముకలు, నవరత్నములు నాణెములు లభించినవి. ఇచటనే బౌద్ధ విహారమున్నది. కొండపైన ఐదారు చైత్యాలయములు, రెండు విహారములు, ముప్పది మాళిగలు డగోబములు, బుద్ధ విహారములున్నవి. చిత్ర లేఖనలుగల కుండలు, బొమ్మలు, పాత్రలు, మూతలు, పూసలు, ఇనుప కత్తులు, సీసపు నాణెములు, బౌద్ధ జైనమత సంబంధమైన విగ్రహము లిచట లభించినవి. ఆంధ్ర రాజుల నాణెములు కొన్ని లభించినవి. చైత్యము ఒక ప్రక్క 'సిరిశివమకవిజయురజశెలసగస' అని వ్రాసియున్నది. మఱి

యొక ప్రక్కన గురుభక్తి కొండకు పశ్చిమమున దుర్గ కొండకలదు. ఇందు దుర్గాలయమున్నది. ఇచటనే బౌద్ధ, హిందూ, జైన మత చిహ్నములున్నవి. స్తూపము, చైత్యాలయము, గుహాలయములు, జైన విగ్రహములు, మట్టి ముద్రలు, పాత్రలు, రాగినాణెములు, ఇనుప కత్తులు లభించినవి.

శంఖవరము దగ్గర తూర్పు పడమరలుగా బొజ్జన్న కొండలున్నవి. బౌద్ధమతానుయాయులకు సంబంధించిన మఠములు, గుహాలు స్తూపములు, విహారములు ఏక శిలావిగ్రములచటనున్నవి. తూర్పున నున్న కొండ ఎత్తైనది. ఇచటి కట్టడములతిప్రాచీనమైనవి. కొండ పడుమటి భాగమున అనేకములైన డగోబములు, గుహాలయములు, స్తూపములు, మఠములు ఉన్నవి వీనికి తూర్పున చైత్యాలయము పెద్ద స్తూపములు, గుహాలు ఉన్నవి.

చీనా యాత్రికుఁడగు హ్యూయన్‌త్సాంగ్ వ్రాతల వలన ఈక్రింది విషయములు తెలియుచున్నవి. ఇతఁడు ఓఢ్ర లేక ఒట లేక వ్రటు దేశము అనగా కళింగ దేశము చేరెను. కళింగ దేశము చుట్టుకొలత నూట నలుబది మైళ్ళు నాలుగు మైళ్ళ విస్తీర్ణము గల రాజధాని గల దేశము కళింగము భూమి సారవంతమై,ఫలపుష్పవృక్షసమూహముతో నొప్పారుచు ప్రకృతి శోభతో నలరారుచున్న దేశము కళింగ దేశము ఉష్ణమధికముగా నుండుటవలన ప్రజలు నలుపుగా నుండిరి పొడుగుగానుండి, నలుపురంగులో దృఢకాయలుగా జనులుండిరి జనులలో నదిక సంఖ్యాకులు బౌద్ధమతానుయాయులు. ఈ దేశమున 100 బౌద్ధమఠములు, ఆ మఠములందు, 10,000 విద్యార్థులు, మహాయాన శాఖకు జెందిన వారుండిరి. దేశమున 50 దేవాలయములుండెను. బుద్ధుడుపదేశించినచోట పద్ది అశోకవనముల్లుండెను పుష్పగిరి మఠము దేశమునకు నైఋతి దిక్కున గల కొండపైనుండెను. ఆ మఠములోని స్తూపపు శిఖరము నుండి రాత్రులందు, వింతగొలుప

దీపపు కాంతులు, మహిమాన్వితమై పైకి కనిపించుచుండెను. దీనికి ఈశాన్యమున మరియొక మఠముండెను. ఈ మఠము శిఖరాగ్రము నుండి రాత్రులందు కాంతి ఉజ్జ్వలముగా ప్రకాశించుచుండెను. ప్రజలామఠములను దేవతలు నిర్మించినారని భావించుచుండిరి

కళింగదేశమున కాగ్నేయమున సముద్రతీరమున నాలుగు మైళ్ళ చుట్టుకొలతకలిగి వర్తకులకు, యాత్రికులకు, వసతినిచ్చు చారిత్రపురమను నగరముండెను పట్టణమునకనతి దూరమున ఐదు బౌద్ధమఠములుండెను. ఈ మఠములత్యున్నతముగా, నిర్మింపబడి యుండెను. ఈ మఠములకు 400 మైళ్ళ దూరమున దక్షిణమున సింహళ ద్వీపముండెను. సింహళములోని బౌద్ధస్తూపముపైగల దీపముల కాంతి రాత్రులందు ఓఢ్రదేశములోని బౌద్ధమఠములపై నుండి చూచినవారికి కనిపించుచుండెను.

హ్యూయాన్‌త్సాంగ్ ఓడ్రలేక కళింగదేశమునుండి, కొన్యాధలేక కుంగ్యుటో దేశము చేరెను. ఈ దేశము చుట్టుకొలత రెండువందల మైళ్ళుండెను కొన్యోధదేశము రాజధాని వైశాల్యము నాలుగు మైళ్ళు. నగరము పర్వతమయమై సముద్రశాఖకు సమీపమున నుండెను. ఉష్ణమండలముననున్న దేశము కావున ప్రజలు పొడగరులుగను, నలుపురంగులోను ఉండిరి. దేశమున మంచి పంటలు పండుచుండెను. భాషభిన్నమైనది. ఓడ్రదేశములోను, తదితరదేశములలోను మాట్లాడబడు భాషలకి కొన్యోధదేశభాష భిన్నముగా నుండెను. ఇచటి ప్రజలు మర్యాద కలవాదు. ప్రజలలోనధికసంఖ్యాకులు హిందువులు. దేశమున 100 దేవాలయములుండెను. జైనమత సంబంధమైన ఆలయములు, చిన్నవి పెద్దవి కలిసి 10000 వరకుండెను. రాజధానినుండి, సముద్ర తీరము పొడవునను, వందలకొలది పట్టణములుండెను. సైనిక వ్యవస్థ పటిష్టముగా నుండెను. దేశమున బలమైన కోటలుండెను. శత్రురాజులు

కొనోగ్యధ దేశము వైపు కన్నెత్తి చూడకుండ, దేశమున, కోటలు, సైన్యము పటిష్టమైయుండెను. విలువైన వస్తు సముదాయ మీ దేశమున నుండెను. అతి ప్రాచీన కాలమున ఈ ప్రాంతీయులు, గవ్వలు, ముత్యములు, నాణెములుగా వాడుచుండిరి. మదగజములకు కొనోగ్యధ దేశము పుట్టినిల్లు.

మాఠర వంశీయులు కళింగమును పాలించిన కాలమున కళింగమున వైదిక మతము ప్రబలినది. జైన భౌద్ధములు క్షీణించినవి. మాఠర వంశపు రాజులు పరమ భాగవతులు. శివభక్తులు వైదిక మతావలంబులు. సకల కళింగాధిపతుల మని శాసనములందు చెప్పి కొనినారు. వీరు పర్వదినములందును వివాహాది శుభకార్యము లందును, దానము లొసంగినారు. గ్రామముల నగ్రహార ములుగా జేసి దానమిచ్చు సందర్భమున. ఆ గ్రామమునగల అన్ని కుటుంబముల వారి నాహ్వానించి వారి సమక్షమున దానమిచ్చు చుండిరి. దానమిచ్చిన గ్రామము నన్ని పన్నుల నుండి తప్పించి పన్నులు వసూలు చేయునధికార మగ్రహారికులకే నుండునట్లు చేయు చుండిరి. వీరొసంగిన దానములకు ప్రతిగ్రహీత లాంధ్ర బ్రాహ్మణులు.

మాఠర వంశీయుల తరువాత కళింగము నేలిన గాంగ వంశపు రాజులు వైదిక మతానుయాయులు అందు చివరి రాజులు తప్ప తక్కిన వారందరు పరమ మాహేశ్వరులు, గోకర్ణ స్వామి భక్తులు, బప్ప భట్టారక పాద భక్తులు.

భౌద్ధ, జైన మతములు పతన మందుచున్న కాలమున వైదిక మత విజృంభణము జరిగినది. కళింగ రాజులు శాసనములందు, గాంగ శకమును, విజయ రాజ్య సంవత్సరమును, వాడినారు వీరు బ్రాహ్మణుల కగ్రహారము లిచ్చు సందర్భమును పురస్కరించు కొని శాసనములు వేయించినారు. బ్రాహ్మణులు వేద విదులు వివాహ సమయము

లందు, యుద్ధ సమయములందు కష్ట కాలములందు, రోగ పీడితులయి నపుడు, తటాకారామాది సప్త సంతాన ప్రతిష్ఠా సమయములందు, ఉత్తరాయణ, దక్షిణాయన పుణ్యకాలములందు, చంద్ర సూర్య గ్రహణ పుణ్యకాలములందు, పట్టాభిషేక మహోత్సవ సమయము లందు, భూదానములు, అగ్రహారములు, బ్రాహ్మణులకు, దేవాలయ ములకు, దానమీయబడుచుండెను. దాన సమయములందు గ్రామము లోని రాష్ట్రకూట ప్రముఖుల నాహ్వానించి వారి సమక్షమున దాన మిచ్చుచుండిరి. కళింగ రాజులు అనేకములైన అగ్రహారములను, దేవ, బ్రాహ్మణ భోగములుగ నొసంగుటనుబట్టి ఆ కాలమున వైదిక మత ప్రాబల్య మెట్టిదో యూహించుటకవకాశము కల్గుచున్నది. కళింగ గాంగ రాజులు మహేంద్రగిరిపై గల గోకర్ణస్వామికి ఆలయ ములు కట్టించిరి శాసనములందు వారు, పరమ మాహేశ్వరుల మనియు, గోకర్ణ స్వామి పాద భక్తులమనియు చెప్పుకొనుటవలన ప్రజలు సైతము వైదిక మత మవలంబించి నారనియు, కళింగమున వైదికము, శైవము వృద్ధి చెంది జైన బౌద్ధమతముల పతనమునకు హేతువైనదనియు చెప్పవచ్చును. రాజులు, ఆర్యమతమును, సంస్కృత భాషను, వైదిక సంప్రదాయమును, ప్రవేశపెట్టి, వైదిక మత వ్యాప్తికి తోడ్పడినారు. ఆంధ్ర కళింగ దేశములందొకే విధమైన భాష, లిపి ఆనాడు వాడుకలో నుండెను రాజులు శాసనములు వేయించునపుడు" నా యొక్కయు, నా తల్లిదండ్రుల యొక్కయు పుణ్యాభివృద్ధికి, ఫలాని తిథి, ఫలాని మాసమున, ఫలాని వేదవేదాంగ వేత్తయు నగు వానికి' దానమిచ్చినట్లు చెప్పుకొనినారు.

తూర్పు గాంగ రాజులలో ప్రాచీనులు మహేంద్రగిరిపై వేంచేసి యున్న గోకర్ణ స్వామి భక్తులగుటవలన వారు దానము లన్నియు బ్రాహ్మణులకే నిచ్చినారు. జైనులకు గాని, బౌద్ధులకుగాని ఒక్కదామిచ్చినట్లు కనిపింపదు. గాంగరాజులు శివపూజా ధురంధరు

లగుటవలన, మధు కేశ్వరాలయము, రాజరాజేశ్వరాలయము, ముఖ లింగ క్షేత్రమునందలి ఇతరములైన ఆలయములు, భువనేశ్వరాలయములు, జగన్నాథాలయ మాది వందల కొలది దేవాలయముల నిర్మించి హిందూ మతోద్ధారకులైనారు.

**వ్యాపారము :** కళింగదేశీయులతి ప్రాచీనకాలము నుండియు నాగరకత కలవారు. పూర్వమాంధ్ర శబర జాతులతో కళింగ జాతి కలిసి యుండెను. బ్రహ్మాండ పురాణమునననుసరించి, కళింగులు మధ్యదేశమున, కోసల మగధ ఉత్కళ దేశీయులతోను, దక్షిణాపథమున ఆభీర, శబర, పుళింద జాతులవారితోను కలిసి యున్నట్లు తెలియుచున్నది. ఏజెన్సీ ప్రాంతములందును, గంజాం, విశాఖపట్టణము జిల్లాలలో ప్రాచీన కళింగాంధ్ర జాతుల వలస లున్నట్లు తెలియుచున్నది. అందుకు నిదర్శనముగా, నచట, కళింగమ, కొళంగి, కొళింగొదొళ, అంధవరం, బంధరొగాం, బంధ్రగుడ, పేళ్ళుగల గ్రామములున్నవి. ఆంధ్రులు, కళింగులు మొదట కలిసియే యుండిరని తెలియుచున్నది.[1]

ప్లిని యను చరిత్రకారుని వ్రాతల వలన, హిందూదేశమున 118 జాతుల వారుండిరనియు, అందు కళింగులు గంగానది ముఖ ద్వారమున నుండిరనియు, తెలియుచున్నది. టాలెమి, గంగానదీ ముఖ ద్వారమున కళింగులున్నట్లు వ్రాసినాడు. బౌద్ధ జాతక కథలందు, కళింగుల రాజ్య పటిమ, పరిపాలనా విధానము, కళింగ దేశ వర్తక, వ్యాపారము, కాళింగుల పౌరుషము, శౌర్యధైర్య సాహసములు, నౌకాయానమున కళింగులకు గల కౌశలము వర్ణింపబడినది. గంగా గోదావరి నదుల మధ్య ప్రాంతమందు కళింగులు నివసించిరనియు, కళింగ రాజులు బలవంతులనియు, యుద్ధములందు శత్రు రాజుల నోడించి విజయులై, ప్రజానురంజకముగ దేశమును పాలించి

1. భారతి - సంపుటము. 1926-27

రనియు, ప్రజలు భక్తి విశ్వాసములు కలిగి రాజును ప్రేమించుచు, యుద్ధసమయములందు, దేశ రక్షణార్థము ధైర్యముతో బోరాడుచు శాంతి సమయములందు, వర్తక వ్యాపారము, వ్యవసాయము, పరిశ్రమలు, బట్టలు నేయుట, మున్నగు పనులందు సామర్థ్యము కలిగి యుండిరని తెలియుచున్నది. కళింగదేశమున తూర్పు తీరమున గల రేవుపట్టణములగు దంతపురము, కుంభవతి ఆదులనుండి నావికులు బయలుదేరి తూర్పుదీవులు, సింహళము,బర్మా,సయాం, కంబోడియా దేశములకు పోవుచుండిరని తెలియుచున్నది.[1]

విజయుడను కళింగుడు లంకాద్వీపమునకు వలస పోయి, అచట రాజ్యమును స్థాపించెను. గంగానదీ ముఖద్వారము నుండి సింహళమువరకు సముద్రముపై రాకపోకలు సాగుచుండెను. కళింగ దేశమందును, ఆంధ్రదేశమున కృష్ణానదీ ముఖద్వారమునకు రేవు పట్టణములుండెను. కళింగాంధ్రదేశముల నావలు కలిసి, తూర్పు దేశములకు, దీవులకు వెళ్ళుచుండెను. విజయుని ఓడయందును, అతని భార్యల ఓడలందును, 700 జనులుండిరి. బౌద్ధ మతము నాటికిట్టి యోడలు మిక్కిలి పెద్దవిగ నిర్మింపబడి తెరచాపలచే నడుపబడు చుండెను. కళింగులాంధ్రులకు పొరుగుననున్న వారు కావున ఆంధ్రులవలె, విదేశములతో వ్యాపారము చేయుచు, వలస రాజ్య నిర్మాణమునకు, సముద్రయాన మొనర్చుటకు సమర్థులై యుండిరి. తూర్పుతీర పట్టణములతోను, తూర్పుననున్న బర్మా, సయాం, కంబోడియా, దేశములతోను, జావా, సుమిత్రా, సింహళము మున్నగు దీవులతోను, వ్యాపారము చేయుచుండిరి. అగాధసముద్రము పై పయనించి, ధైర్యసాహసములు ప్రదర్శించి, పశ్చిమ దేశములతోను తూర్పుననున్న దేశములతోను, వర్తక వ్యాపారములు చేయుచు, విశేషధన మార్జించుచు కీర్తి గాంచిరి.

---

1. I nd Ant Vol XVI

ఆనాటి నావికులు కడు సమర్థులు. గాలి, తెరచాప సహాయ ముున ఓడలను నడుపుచుండిరి. నావికులు సముద్ర మార్గముల గుర్తించి వేలకొలది మైళ్ళు సునాయాసముగ వెళ్ళుచుండిరి. ప్రయాణికులు సైతము, నావికుల సామర్థ్యము నెఱింగిన వారు కావున నిర్భయముగ వేలకొలది మైళ్ళు ఓడలపై ప్రయాణము చేయుటకు ముందంజ వేయుచుండిరి. మంచి గంధము, ఎఱ్ఱచందనము, ఆణిముత్యములు, పగడములు, వజ్రవైడూర్య, పుష్యరాగ, ప్రవాళాది నవరత్నములు సన్ననూలు బట్టలు, బియ్యము, సుగంధద్రవ్యములు, ఔషధములు మున్నగు వస్తువులు విదేశములలో విక్రయించుచు, అచటివస్తువులను ధనమును మనదేశమునకు గొని తెచ్చుచుండిరి.

కళింగాంధ్రులు 'పాలించిన కాలమున కళింగదేశమున బంగారు నాణెములు వాడుకలో నుండెను పణములు, చిన్నములు అను నాణెముల పేళ్ళు శాసనములందు కనిపించుచున్నవి [1]. నాణెములపై ఒక ప్రక్క, ఎడమవైపు తిరిగి యున్న వృషభము, పైన అంకుశము, రెండవ వైపు నాణెము వేయించిన రాజు విజయరాజ్య సంవత్సరము ముద్రింపబడుచుండెను[2]. పణములో $\frac{1}{8}$ వంతు నాణెములు కూడ ప్రజలలో వాడుకలో నుండెను. మాడలు, గంగమాడలు, గంధహస్తి మాడలను రాగి నాణెములు వాడుకలో నుండెను[3]. గంగమాడ లనగా గంగ వంశపు రాజులు ముద్రించిన నాణెములు. ఈ గంగ మాడలకొకవైపు వృషభము, రెండవ వైపు 'గంగమాడ' అను అక్షరమును నాగరలిపిలో పైనుండి క్రిందికి ముద్రింపబడినవి.

కళింగ రాజు లీకాలమున బర్మా, అరకాను, జావా, సుమిత్రా ప్రాంతములకు వలసబోయి అచట రాజ్యములను స్థాపించిరి వెస్సంతర

1. J.A H R S. Vol I Parrt III (Coins)
2. Ind Ant Vol XXXI P 330.
3. S.I.I. Vol V ముఖలింగ శాసనములు.

కళింగ బోధి, దండకాది భౌద్ధ జాతక కథల ననుసరించి, ఆ కాలపు నాగరకత తెలియుచున్నది ప్రజలు సముద్రములపై సులభముగా ప్రయాణము చేయుచుండిరి. తూర్పు దీవులతోను, సింహాళముతోను, సువర్ణ భూమితోను, ప్రజలు వర్తక వ్యాపారములు చేయుచుండిరి కళింగులు నౌకాయానమున పేరు పొందిన వారు కళింగ వ్యాపారులు, నావికులు క్రీ.పూ 10 వ శతాబ్ది నుండియు వర్తకము చేయుచుండిరని తెలియుచున్నది సింహాళమును జయించి పాలించిన విజయుడు కళింగుడు. కళింగ నావికులు, సన్న నూలు బట్టలు, ఏనుగులు, తదితరములను నావలపై విదేశములకు తీసికొనిపోవుచుండిరి జావాద్వీపములో కళింగ శిల్ప నైపుణ్యమును తెలుపు కట్టడములు నేటికిని కనిపించుచున్నవి. వర్తక నౌకలు కళింగ దేశపు రేపు పట్టణముల నుండి బయలుదేరి సింహాళము, సుమిత్రా, జావా, బలి, సువర్ణ దేశములలోని రేవు పట్టణములలో వ్యాపారము సాగించి, కళింగము చేరుచుండెను.

కళింగాంధ్రముతోపాటు, లాట, శ్రీపరాంత. అవంతి. నవభువన, పాండ్య, నాగ ద్వీపములు, ప్రముఖత గాంచుచు విదేశములతో వ్యాపారము, చేయుచుండెను దంతపురము, సింహాపురము, కంభవతి, ఈడ్జిత మొదలగు పట్టణములాంధ్ర నగరములతోపాటు ఐశ్వర్యముతో దులతూగుచుండెను. గాలి సహాయమున తెరచాపల సహాయమున ఓడలు పయనించుచుండెను, నావికులు నక్షత్రమండలి సహాయమున దిక్కులను, కాలమును తెలిసికొనుచుండిరి. ఓడలు, 700-800 మందిని తీసుకొని పోగలిగినంత పెద్దవిగా నుండెను. ప్రత్తి బట్టలు, ధాన్యము, నవరత్నములు లోహములు, లోహపు పనిముట్లు, ముత్యములు, మంచి గంధము, కళింగ రేవు పట్టణముల నుండి,. ఎగుమతి యగుచుండెను.

సముద్ర మార్గమునసే కాక భూమార్గ వ్యాపారమానాడు విశేషముగ సాగుచుండెను. ఏనుగులు, గుఱ్ఱములు, ఎద్దులు,. బండ్లు

వస్తువుల నొక చోటినుండి మరి యొక చోటికి తరలించుటలో నుపయోగపడుచుండెను. భూమి సారవంతమైన దగుటచే ప్రజలు పంటలు బాగుగా బండించుచు, సుఖమయ జీవనము గడుపుచుండిరి. ఈ కాలమున విదేశ వ్యాపారమున కనుకూలముగా, వర్తకపు టోడల సహాయార్థము మార్గమును చూపునట్టి దివ్వెలదిన్నె కళింగ తీరమున నిర్మింపబడెను. అది దిమిలగా ప్రసిద్ధి చెందినది. ఆంధ్ర, కళింగ దేశము లలోని కొన్ని భాగములు, ఆంధ్ర కళింగ, రాజుల పరిపాలనములో నుండుటవలన, ఈ రెండు దేశములలోని ప్రజల, ఆచార వ్యవహార ములు, నాగరకత, మత సంప్రదాయములు, దేవాలయ నిర్మాణ పద్ధతి, వ్యాపారము, పాడిపంటలు, ఒకే విధముగ నుండెననియు, విదేశ వ్యాపారము సమిష్టిగా జరిగినట్లుండెనని భావించుట కవకాశ మున్నది. కళింగాంధ్రదేశము ప్రాచీనకాలము నుండియు, నాగర కతకు, వర్తక వ్యాపారములకు, వలస రాజ్యస్థాపనమునకు ప్రసిద్ధి కెక్కినది.

**సాంఘిక జీవనము :** కళింగము సారవంతమైన భూముల తోను పాడిపంటలతో, వర్తకవ్యాపారములతో సంపన్నమైన దేశముగా వర్ధిల్లినది. ప్రజలు, రాజులు, వర్తకులు సామవంతులు రాజులు మేడలలోను, ఉద్యోగులు, వర్తకులు, ధనవంతులు మంచి మంచి ఇండ్లలోను నివసించుచుండిరి పేదవారు నివసించుటకు పూరిండ్లుగాని తాటియాకులతో నిర్మించిన గుడిసెలుగాని పుండెను కళింగము మొనట జైనులకావాసము అటు పిమ్మట బౌద్ధము కళింగమున వ్యాపించుటవలన, సంఘారామములు, మఠములు, దేవాలయములు, చైత్యములు, స్తూపములు, అసంఖ్యాకములుగా నిర్మింపబడినవి. రాతితోను, ఇనుముతోను, కర్రతోను నిర్మించిన కట్టడములిచట ఎక్కువగా నుండెను. నాగరికతను, ఐశ్వర్యమును సూచించు స్వర్ణరజిత పాత్రలు, అమూల్యమైన రాళ్ళతోను,

నవరత్నములతోను, చెక్కబడిన సింహాసనములు, ఊగుటూయలలు, సంపన్నుల గృహముల నలంకరించి యుండెను. రాజులు, మంత్రులు రాణివాసపుస్త్రీలు అమూల్యములైన పట్టువస్త్రములు ధరించుచుండిరి. వెండి, బంగారు, ముత్యాలహారములు, అంగుళీయకములు, మొల త్రాడులు, విలువైన ఆభరణములు ధరించుచుండిరి. అనాడన్ని విధముల్తైన కళలు వృద్ధిచెందెను. సంగీతము, నాట్యము, చిత్ర లేఖనము, నేర్పుటకు ప్రత్యేకమైన విద్యాలయములుండెను. మాగధి పైశాచి, ఆంధ్ర, కళింగ భాషలు జనసామాన్యమున వాడుకలో నుండెను ప్రజలలో, జైన, బౌద్ధ, వైదిక మతముల నవలంబించు వారుండిరి భూమి పన్ను, తదితరవ్యాపార వస్తువులపై రాజు సుంకము వసూలు చేయుచుండెను రాజు, ప్రజలచే నెన్నుకొనబడి మంత్రుల, పురోహితుల సలహాననుసరించి రాజ్యము పాలించు చుండెను. చతురంగ బలసమన్వితుడైన సేనాధిపతి రాజుకు లోబడి, రాజ్యమును శత్రువుల బారి నుండి రక్షించుచుండెను

కళింగ రాజులు బంగారు మేడలలో నివసించుచుండిరి. రాజ వంశమునకు సంబంధించిన స్త్రీలకు, మహారాజులకు ప్రత్యేకముగా అంతఃపురము లుండెను. నేరము చేసిన ఖైదీలకు చీకటి గదులుండెను సామ్రాజ్యమున ప్రజోపయోగముల్తైన, ఉద్యానవనము, విహారస్థల ములు, సత్రములు, చెరువులు, ధర్మసావిడులు, బౌద్ధులకు. మఠములు విహారములు, ఆరామములు, మున్నగు కట్టడములుండెను. రాజులు, నగరములు, కోటలు, బురుజులు అనేక అంతస్తుల మేడలు నిర్మించి చతురంగబలసమేతులై యుండి, ప్రజలనుండి, వివిధముల్తైన సుంక ములు వసూలుచేయుచు. ప్రజాక్షేమమునుగోరి పాలించుచుండిరి. ఆనాడు, వైదిక, బౌద్ధమతముల నాదరించు ప్రజలుండిరి. బ్రాహ్మణ పురోహితులు, ఋషులు, మునులు, సన్యాసులు రాజ్యమున వైదిక మత ప్రచారము గావించుచుండిరి. - వేదవేదాంగ విదులైన విప్రులు

రాజ పురోహితులుగా నుండి, పుణ్యకాలములందు రాజులచే నీయ బడు గ్రామములను పరిగ్రహించుచుండిరి. కళింగ దేశమున వేద మతము స్థిరపడిన పిమ్మట, ప్రజలలో చైతన్యము కలిగెను. ఆత్మ స్థిరమనియు చావులేదనియు, పునర్జన్మ కలదనియు ప్రజలు నమ్ము చుండిరి. ప్రజలు పాపపుణ్య కర్మలవలన కలుగు పుణ్య, పాప ఫలితములను కనుగొనుచుండిరి. రాజులు, బ్రాహ్మణులను, వైదిక మతమును, బౌద్ధ సన్యాసులను, బౌద్ధమతమును ఆదరించి తమ మత సహనమును ప్రకటించుకొనిరి బౌద్ధులకు మఠములు, ఆరామ విహారములు, చైత్యాలయములు రాజులుగాని, మతాభిమానము గల ధనాఢ్యులుగాని నిర్మించి ఇచ్చుచుండిరి. మూఢులు అనాగరికులై పిచ్చినమ్మకములతో, మంత్రతంత్రములపై గల గౌరవమున, చెట్లు చేమలను, రాక్షస, యక్ష. నాగ పిశాచగణముల నారాధించు చుండిరి

గృహ నిర్మాణము, సంగీత, నాట్యశిల్ప, చిత్రకళ లేఖనాది విద్యలలో ప్రజలు నిపుణులుగా నుండిరి వేదాంతము, మతవిద్య, శాస్త్రములు, కళలు, మొదలగు సర్వశాస్త్రములను బోధించుటకు, సర్వకళాశాలలు, కళాశాలలు, పాఠశాలలు దేశమున ఉండెను

కళింగాంధ్రమున, బ్రాహ్మణులు, వైశ్యులు, కాయస్థులు, కాపులు, పల్లవ కాపులు, గొల్లలు, అగశాలులు, తెలిక కాపులు, ఉన్నట్లు శాసనములవలన తెలియుచున్నది కళింగ బ్రాహ్మణులకును, ఆంధ్ర బ్రాహ్మణులకును, సంబంధ బాంధవ్యములున్నట్లు తెలియుట లేదు కాని, కళింగ దేశమున తెలుఁగు బ్రాహ్మణులు స్థిరపడి, తాము తెలుఁగు బ్రాహ్మణులమని చెప్పుకొనినట్లు తెలియుచున్నది. అట్టి తెలుఁగు బ్రాహ్మణులలో అనంతవర్మ చోడగంగు సేనాపతులిద్ద రుండిరి.[1] కళింగ విప్రులు గోత్రాదికములను తెలుపుకొనలేదు.

1. S I. I. Vol V No. 1042 & 1101

కళింగ విప్రులలో 'బణపతి' వంశీయులు, సింహాపురమున మాండలిక పదవిలో నుండిరి. కళింగరాజులవద్ద, కొందరు విప్రులు అధికారులుగ నుండిరి. అందు కళింగనగరమున, చాళుక్య గంగ్గరాజుకు పురవరి యైన దొమ్మనామాత్యుఁడు, మూలఘటి కాన్వయుఁడు కౌణ్డిన్య గోత్రుఁడు, మార్తాండ నాయకుని పుత్రుడు, కామదేవప్రెగ్గడ, ఆత్రేయ గోత్రుడైన బుడమూరి దొమ్మనాయకుడు ముఖ్యులు. ప్రెగ్గడ, అమాత్య బిరుదములవలె వారికి నాయక బిరుదముండెను. గొల్లలకు, బోయండు. అను పేరుండెను. కాయస్థులను శిష్టిలేక సృష్టికరణాలందురు కళింగదేశమున పూర్వమున్న కాయస్తులు, క్షత్రియులలోను, కమ్మవారితోను కలిసిపోయినారు. వీరిలో కరణీకపు వృత్తి నవలంబించువారు కరణపుకాయస్థులని, కరణీకపు వృత్తి నవలంబింపనివారు కాయస్థులు లేక కళింగులని వ్యవహరింప బడుచున్నారు.

బ్రాహ్మణులు, వైశ్యులు, తమ పేళ్ళముందు వింత పదము లను చేర్చుకొనుచుండిరి. ఈ పదములు బిరుదములవలెనున్నవి. "గంగ్గ బ్రహ్మమారాయుణ్డైన" "గంగ్గ మార్తాండ బ్రహ్మమా రాయుణ్డైన" అనియు, వైశ్యులు "గంగ్గ విద్యాధర వైశ్య మారాయుణ్డైన" అనియు కాయస్థులు "గంగ్గ సమారాయుణ్డు" "గంగ్గ విప్పఅయణ్డు" గంగ్గ వేలాణ్డైన" "రాయ రాయవిడ్పఅయణ్డు అను బిరుదములు ధరించినట్లు శాసనములవలన తెలియుచున్నది.

శాసనములందీ క్రింద పెర్కొనిన పదములు వ్యక్తులనామముల మొదటను, బిరుదములుగను కనిపించుచున్నవి. అజ్ఞల, కందు, దాసరి, ఒడయుల, ముప్పన, అన్నెము, దణ్డాసి, అల్లతవాడ, అడపం, సహావాసి, తొనిచి, అమృతవల్లి, అల్లాడ, జలమూరి, చీఅట్టాన, ఇబ్బారి, సీకా, బుడుమూరి మొదలగునవి. ఈ కాలపు ప్రజల పేళ్ళు సైతము వింతగా కనిపించుచున్నవి. చూతాడ్డి,

మాదాణ్డి, పెమ్మాన్ణి, నూకాణి, అమాణి, భూమాణి, అను స్త్రీల పేళ్ళు శాసనములందు కనిపించుచున్నవి. పోతి, పోతు పదములు కులీనులైన స్త్రీ పురుషులకు వాడబడుచుండెను. శాసనములందు ఎఱియపోతి, కచ్చిపోతి, వింజమపోతి అను స్త్రీ వాచకనామములు, వాజమపోతు, రేవపోతు, ఎఱపోతు అను పురుషుల నామములు కనిపించుచున్నవి. 'పోతి' ముఖలింగ శాసనములందున్నది. పోఱి, పోఱడు, పోతికి ప్రాచీన రూపములుం నేడు తెలంగాణమున వాడుకలో నున్నవి. కాని పోరి, పోరడని పిలుచుట తప్పుగా భావింతురు. నీ చార్థమున ఈ పదములుపయోగపబడుచున్నవి.

కళింగ రాజులు పాలించిన కాలమున పోతి,పోతు పదములు రాజ వంశీయులు గాని విప్రులుగాని వాడు చుండిరి. నాయకుడు,నాయకు రాలు, పదముంలు గౌరవసూచకములు. కాయస్థులలో వాడుకలో నున్నవి. కాని బ్రాహ్మణులు సైతము నాయక బిరుదమును ధరించి నట్లు తెలయుచున్నది కాయస్థులు శాసనములందు పేరొ్కనబడి నపుడు———తల్లి నాయకురాలికొడుకైన—"అని చెప్పుకొనినారు. కళింగ రాజులు పితృ భట్టారక పాదభక్తులు. కళింగమునగల కాయస్థులు మాతృ సేవాపరులు. రాజులలో పైత్రానుకమును, కాయస్థులలో మాత్రానుకమును ఉన్నట్లు తోచును.

మత సంబంధమైన కట్టడములలో కళింగ రాజు దంతపురములో నిర్మించిన బుద్ధదంతమునుంచు, గృహము ముఖ్యమైనది[1]. బౌద్ధాల యముల నిర్మాణమునకు గలప, రాయి, ఇనుము ఉపయోగించినారు. బావరిమఠ నిర్మాణమునకుపయోగించిన వస్తు సముదాయమును, కోసల దేశము నుండి, గోదావరి తీరము చేర్చినారు. ఈ మఠ నిర్మాణమునకు కలప నుపయోగించిరనియే భావింపవచ్చును[2].

1 Indian Antiquary Vol XIII P 87

2 Man Budha P. 334

కుంభావతిలో రాజ్యమేలిన కళింగ రాజు నివసించు మేడకుపై అంతస్థు ఉండెననియు, బుద్ధ దంతముంచు నట్టి గృహమున కేన్నియో అంతస్థులుండెననియు, పై అంతస్థులో వందల కొలది గదులుండె ననియు, తెలియుటనుబట్టి ఆనాటి కట్టడము లెంతటి విశాలమైన వియో, దృఢమైనవియో యూహింప వీలగుచున్నది చిత్ర అను రాజు కుమార్తె నుంచిన కారా గృహము, ఒంటి స్తంభము మేడపై నిర్మింపబడినది. ఆ కారాగృహము నుండి, రాణీవాసమునకు దారి యుండెను కారాగృహముయొక్క తలుపులోపలికి తిరుగుచుండెను గాలి-పై నుండి కారాగృహము లోపలికి వచ్చుటకు, ఒక రంధ్ర ముండెను. కారాగృహము అంతస్థులు గల కోటయై యుండెను. దానికి పది సింహ ద్వారములు, పదునొకండు తలుపులు, పండ్రెండు హాలులు, పదునేడు కిటికీలు, పదునాలుగు మేడ మెట్లు ఉండెను.

కళింగ రాజ్యమున నున్న నగరములకు ప్రాకారములుండెడివి. ప్రాకారకుడ్యములకు బురుజులుండెడివి. బురుజులపై ధ్వజ స్తంభము లుండెడివి. ఈ ధ్వజస్తంభములపై జెండాలు, తోరణములు, గొడు గులు, చాందినీలు ఉండెను.

బుద్ధ దంతమును భద్రపరచుగృహమునకు బంగారు పూతలు పూయుచుండిరి ముత్యాల సరములతో నలంకరింపబడిన నాగృహము బాల సూర్యునివలె ప్రకాశించుచు, కన్నులకు మిరుమిట్లు గొలుపున ట్లుండెను.

రాణులు, రాణీవాసపు స్త్రీలు ధరించు వస్త్రములు మిక్కిలి సన్నని దారముతో నేయుచుండిరి కళింగ శబ్దమునకు తమిళ భాషలో 'సున్నితమైన బట్ట' అని అర్థమిప్పటికిని కలదు. కళింగ రాజు, కోసలరాజుకు కానుకగా పంపిన దుస్తులను ధరించి ఆతని రాణి సభాప్రవేశమొనర్ప ఆమె అవయవములు పైకి కనబడుట చూచి సభికులు తలలు వంచుకొనుట వలన, కోసలరాణి సిగ్గుపడి లోపలికి

వెళ్ళినట్లు ఐతిహ్యమున్నది. ఏదెట్లున్నను, కళింగము సంపన్నమైన దేశముగ వర్ధిల్లి భారతావనియందే కాక విదేశములందును ప్రఖ్యాతి బడసినది.

రాజులు యుద్ధ సమయములందు ఛత్ర చామర సామజ ధ్వజ మకర తోరణ, కహాళశంఖ వృషభలాంచనములను వాడుచుండిరి. చతురంగబల సమేతుఁడై రాజు మంత్రి పురోహిత, సేనాపతి యువ రాజ దేవులతో కలిసి యుద్ధరంగమునకు బయలుదేరు చుండెను రాజులు స్కంధావారముల నేర్పరచి, యుద్ధరంగ విషయములను తెలిసికొని, ఎప్పటికప్పుడు, మంత్రి సామంత, సేనా నాయక, దండ నాయకులకు తగిన సలహాలనిచ్చి శత్రువులను గెలుచుచుండిరి. ఆనాఁడు న్యాయసమ్మతమైన యుద్ధములు జరుగుచుండెను. కుటుంబ సమేతముగా, మండలాధిపతులు, దండనాయకులు, తదితరోద్యోగులు యుద్ధమునకు తరలి వెడలుచుండిరి. ప్రజలు యుద్ధ సమయము లందు దేశ శ్రేయస్సునుగోరి తమ సర్వస్వము ధారవోయుటకు వెనుకంజ వేయకుండిరి. సైనికులకు. కావలసిన ఆహారధాన్యము లు, గజాశ్వ ముల కవసరమైన గ్రాసము ప్రజలు సమకూర్చు చుండిరి. యుద్ధ తంత్రము నడుపుటకు, సంధివిగ్రహ, మహామాత్యాదులు రాజుకు సహాయపడుచుండిరి.

**ఇతరములు :** ఆనాడు ప్రజావినోదములు కొన్ని వాడుకలో నుండెను. రాజులు, ప్రజలు, వేటాడుచుండిరి. వివిధములైన వస్తువు లను ప్రజలు వాడుకొనుచుండిరి. ముఖలింగము, నిలీశ్వరము, భువ నేశ్వరము, శ్రీకూర్మము, అర్సవిల్లి, ప్రాంతములందుగల దేవాలయ శిల్పములననుసరించి, ఆనాటి ప్రజలు, ఆభరణములు, వివిధాలంకార భూషణములు వాడుచుండిరని తెలియుచున్నది. వివిధములైన వస్త్ర ధారణ పద్ధతులను ప్రజలు తెలిసియుండిరి. వ్యవసాయమునకును, దైనందిన కార్యములందును, పీటలు, రథములు, నాగళ్ళు, పారలు,

బొంగలు, మున్నగు పనిముట్లను వాడుచుండిరి. ముఖలింగ క్షేత్ర మున గల ఆలయములలోని శిల్పము ననుసరించి, ఆనాటి ప్రజల ఆచార వ్యవహారము, ప్రజల శిరోజముల మార్పు, వస్త్రాభిధారణ పద్ధతులు, అలంకారోపకరణములు, ప్రజలు ఉపయోగించిన వస్తు చయము తెలియుచున్నది. ఆనాడు జరుగు వసంతోత్సవము లందు రాజు మొదలు సామాన్య పౌరుని వరకు పాల్గొనుచుండిరి. ఏరువాక పున్నమి-వంటి పండుగలను ప్రజలాచరించుచుండిరి.

**వాఙ్మయము** పిటకములు బౌద్ధ వాఙ్మయమునకు సంబంధించిన గ్రంథములు. ఇవి వివిధ ప్రాకృత భాషలలో వ్రాయబడినవి. గౌతమ బుద్ధుడు మాగధీ భాషలో బౌద్ధమత ప్రచారము గావించెను. మొదట 'మాగధీ' భాషలో వ్రాయబడిన తిపిటకములు, పాలి, తదితర ప్రాకృత భాషలలోని కనువదింపబడినవి సింహాళ తిపిటకములు పాలి భాషలో నున్నవి. ఇవి తక్కిన ప్రాకృత భాషలలో వెలసిన తిపిటకములకు మూలగ్రంథములని చెప్పుదురు. అశోక చక్రవర్తి కుమారుడు మహేంద్రుడు, మహేంద్రుని తల్లి విదిశానగర రాజ కుమార్తె, మహేంద్రుడు మాతా మహుని రాజ్యమున నుండి అచటి భాష నేర్చియుండును సింహాళమున బౌద్ధమత ప్రచారము చేయునపుడు మహేంద్రుడు మాగధి భాషను వాడియుండును. మాగధీ భాష ప్రాకృత భాషా భేదములలో నొకటి. మాగధీ ప్రాకృతము, పాలి భాష, ఒకే విధముగ నుండును. కావున పాలి భాషలో సింహాళమున వ్రాయబడిన తిపిటకములు ఒక విధముగ ప్రాకృత భాషలో వ్రాయబడినవని చెప్పవచ్చును.

దక్షిణా పథనమున కళింగము, ఆంధ్రము బౌద్ధ మతము నాదరించి పోషించిన దేశములు. కళింగాంధ్రములందానాడొకే విధమైన భాష వాడుకలో నుండెను. ఖారవేలుని హాథీగుంఫ శాసన భాష, ఆంధ్ర రాజులగు శాతవాహనులు వేయించిన శాసనములలోని

భాష, ఒకే విధముగ నున్నది. ఈ భాష కళింగాంధ్ర భాష, ఆనాడు ఆంధ్ర కళింగ దేశములందు వాడుకలో నున్న రాజ భాష. జన సామాన్యము వాడు భాష దేశి లేక తెలుఁగు. ఆనాటి ప్రాకృత భాషకును పాలి భాషకును భేదమంతగా లేదు.

'మహా వంశమను' గ్రంధమున కళింగ దేశము నేలిన రాజుల వంశ చరిత్ర కలదు. బౌద్ధమతాను యాయులైన రాజుల చరిత్ర మిందు వర్ణింపబడినది. ఆర్యులకును ద్రావిడులకును, విద్య, భాష, ఆచార వ్యవహారములు, సంప్రదాయములు, మత విషయములందు వ్యత్యాసము కన్పించును. ఆర్య నాగరకత, భాష, ఆచార వ్యవహార ములు కళింగ దేశపు దక్షిణ సరిహద్దు వరకు వ్యాపించినను, ద్రావిడ భాషా సంప్రదాయము, మత వ్యవస్థ, ఆచార వ్యవహారములు మార్పు చెందక కళింగాంధ్రములందు నిలిచిపోయినవి. కళింగము, ఆంధ్ర దేశము, కలిసియుండుటవలనను, ఆంధ్రులు, కళింగులకన్న ఆచార వ్యవహారములలోను, బాష, మత, సంప్రదాయములలోను, నాగర కత యందును, సంపదలోను మిన్నలై యుండుటవలన, కళింగ భాష, ఆచార వ్యవహారములు, మత సంప్రదాయములు, ఆంధ్ర దేశములోని ఆచార వ్యవహార, భాషా మత సంప్రదాయముల కతి సన్నిహితములుగ నున్నవి. ఆంధ్ర, కళింగ దేశముల విభాగములు, ఆంధ్ర ద్రావిడ భాషలకు కూడలిగా నున్న భాగములుగా నేర్పడినవి.

ఆంధ్రులు, దేశ సంపదలోను, మత విషయమునను, భాషా విషయమునను కళింగుల కన్న మిన్నలై యున్నారు. ఆంధ్ర రాజులు చక్రవర్తులుగా పేరు పొందినారు. పురాణములందాంధ్ర రాజులు క్షత్రియులుగా వర్ణింపబడినారు. ఆంధ్ర భాష, కొన్ని ఆచార వ్యవహారములు ద్రావిడ సంప్రచాయమునకుసంబంధించినవిగా నిలిచిపోయినవి. బౌద్ధమతము కళింగాంధ్రములలో వ్యాపించిన కాలమున, బౌద్ధ సాహిత్య మాదరింపబడి ప్రాకృత భాష పోషింప

బడినది. హాథీగుంఫ శాసనమువలన ఖారవేలుడు బాల్యమున వ్రాయను చదువను నేర్చెనని తెలియుచున్నది. ఖారవేలుని కాలము నాటికి తెలుఁగు దేశ మాంధ్ర రాజుల పరిపాలనలో నుండెను. ప్రాకృతము రాజ భాషగా ఆ కాలమున వర్ధిల్లినను, సంస్కృత భాష ఆదరింపబడు చుండెను. జన సామాన్యమున దేశి, వాడుకలో నుండెను. 'దేశి' యన దేశ భాష, అనగా సామాన్య జనులు వాడు భాష. అది తెలుగు భాష. తెలుఁగు భాషా పదములు, శాతవాహనుల కాలమున వెలసిన గాథా సప్తశతిలో నున్నవి.

**దండి మహాకవి:** దశకుమార చరిత్ర. కావ్యాదర్శమను గ్రంథములను దండి మహాకవి రచించెను తూర్పు చాళుక్య రాజగు జయసింహ వల్లభుని ప్రశంస దండి మహాకవి విరచిత దశకుమార చరిత్రలో కలదు. ఈ మహాకవి ఏడవ శతాబ్దము వాఁడు కళింగ దేశమున జరుపుకొను వసంతోత్సవములను తన కావ్యమున వర్ణించెను. ఆంధ్రుల నౌకా బలమును, ఆంధ్ర ప్రజలకుగల నౌకా సమర కౌశల మును వర్ణించెను

"కళిఙ్గ రాజస్సహాఙ్గనేన, సహచతనయ యా
సకలేన చనగరజనేన, దశత్రీణిచదినా ని—
——సైకతతటే——"————సాగరతీర కాననే
క్రీడారస జాతాసక్తి రాసీత్—ఆంధ్ర నాథేన
జయసింహోన సలిత తరణసాధానా నేతే నా నేక సఙ్ఘ్యై
నానీకేన———" దశకుమార చరితమ్ మంత్రగుప్త చరితమ్
—సప్తమోచ్ఛ్వాసః"

ఆంధ్ర నగరమును గూర్చి దండిమహాకవి "ఆంధ్ర నగరంత స్యనాత్యా సన్నే సలిలరాశి సదృశస్య కలహంస గణగళిత నళిదళ సంహాతి గళితకిఙ్జల్క శకల శారస్య సారస శ్రేణి శేఖరస్య సరస—" అని వర్ణించినాడు. కావున కొల్లేరు సరస్తీర ప్రాంతమున ఆంధ్రనగరి

యుండెనని భావింపవచ్చును. జయసింహ వల్లభ మహారాజు తన పేర సర్వసిద్ధి నగరమును నిర్మించెననియు అదియే ఆంధ్ర నగరి యని భావించుటకవకాశమున్నది. కళింగము నా కాలమున గాంగ వంశపు రాజులు పాలించుచుండుటనుబట్టి. కళింగము-లోని కొన్ని భాగములు తూర్పు చాళుక్యుల వశమై యుండుటనుబట్టి, ఆంధ్ర కళింగ దేశము లలోని ప్రజలు గాంగ, చాళుక్య రాజుల పరిపాలనములో నుండి, కళింగాంధ్ర భాషల నభ్యసించి, యుండిరని భావింపవచ్చును.

గాంగ వంశపు రాజులు, మాఠర వంశీయులు, సంస్కృత భాష నభిమానించి పోషించినారు. వీరు వేయించిన శాసనములన్నియు, సంస్కృత భాషలో నున్నవి, దాన ప్రతి గ్రహీతలు, వేదముల నభ్య సించిన వారు.సదాచారబ్రహ్మణులు.బ్రహ్మచారులు భూపేంద్ర వర్మ కుమారుడగు దేవేంద్రవర్మ వేయించిన చీడివలస తామ్ర శాసన మాతనిచే కోలువర్తిని యందలి కందలి వాడ గ్రామ వాస్తవ్యులగు ఆదిత్యభట్టు, యాజుభట్టు మొదలగు వారికి సివిడి ప్రదేశమును సర్వ కర పరిహారముగా, దానమీయబడినది. శాసనమున ప్రతిగ్రహీతలు వేదముల నభ్యసించిన వారు. "యజ్ఞములు చేయుట, వేదముల నధ్యయన మొనర్చుట, మొదలగు సత్కార్యములం దాసక్తి కల వారును సివిడి గ్రామ వాస్తవ్యులును, వేదములను వేదాంగములను చదివిన వారును, ఎప్పుడును శాస్త్ర బోధిత మయిన ధర్మమును నడుపు వారును సివిడి గ్రామార్జిత గోజా దీక్షిత వంశమునం బుట్టిన వారును, ఆంగిరస బార్హస్పత్య భారద్వాజ ప్రవరాన్విత భారద్వాజ గోత్రీకులును నగు ఆదిత్య భట్టు, యజభట్టు, శండి దేవరభట్టు మొద లగు వారి కొఱకు, సూర్యగ్రహణ సమయమున కందలి వాడ గ్రామ మందలి సివిడి ప్రదేశము ఏ విధమగు పన్నులు లేకుండ దానము చేయబడినదను, భావము వచ్చునట్లు శాసనమున చెప్పబడినది.

---

1 J A. H R S Vol. II P 2

ఈ కళింగ రాజులు వేయించిన శాసనములందు తెలుఁగు దేశమునకు, తెలుఁగు భాషకు సంబంధించిన గ్రామ గ్రామములు, విషయములు, వ్యక్తుల పేళ్ళు బిరుదావళులు పేర్కొనబడినవి. కళింగమును పాలించిన రాజులలో మాఠర వంశీయులు, గాంగ వంశీయులు ముఖ్యులు పీరికి సంబంధించిన ముఖ్యమైన శాసనములలోని తెలుగు దేశపు గ్రామ నామములు, విషయములిచట పేర్కొనబడు చున్నవి.

రాకలువ — శక్తివర్మ రాగోలు శాసనము

సకునక — M E. R. 1934-35 C. P. G. No 24

తొణ్డాపర
తెల్లవల్లివిషమే } E I. Vol XXIV

కిణ్డెప్ప
ఆచంట
పాగూరువిషయే | శృంగ వరపుకోట శాసనము J.A H R.S Vol VII page 13

తాణ్డీవాడ
కొణ్డమంచి | తాణ్డివాడ శాసనము E I. Vol XXIII p 88

కొహేతూరె — చండవర్మ కోమర్తి శాసనము E I Vol IX p 142

బృహత్ప్రోష్టమ్ — ఉమావర్మ బృహత్ప్రోష్ట శాసనము
E I Vol XII p 4-6

సారపల్లి — ప్రభంజనవర్మ చికాకోల్ శాసనము
Ind Ant Nol XIII p 48-50

దేయవాటి
చేకూర | ఉమావర్మ ధపళ పేట శాసనము J A H R S Vol X p 143-144

పులోక (పులక్) E I Vol p 104-108

చూయపాక
తానుపాక
కణ్ణి | పృథ్వీమాలుని గోదావరి తామ్ర శాసనము

సేవిది — అనంతవర్మ సేవిది తామ్ర శాసనము
భారతి - ఆగస్టు 1965
హోణరేజ్జ — ఉమావర్మ హోణరేజ్జ తామ్ర శాసనము
భారతి - డిశంబరు 1967

ఈ కాలమున వెలసిన శాసనము లన్నియు సంస్కృత భాషలో వేయింపబడినవి కొన్ని శాసనములందు ప్రాకృత భాషా ప్రభావము కనిపించుచున్నది. గాంగరాజులు, మాఠర వంశీయులు కళింగదేశము నేలు నాటికి సంస్కృత భాష దక్షిణాపథమున వ్యాపించినది. వైదిక మతములో పాటు సంస్కృతభాష ఆదరింపబడి, సంస్కృత కవి పండితులు పోషింపబడినారు. కళింగము ఆంధ్రదేశమునంటి యుండుటను బట్టి, కళింగ ప్రజలలో ఆ కాలమున ఆంధ్రులధికము గా నుండుటను బట్టి, సంస్కృత భాషతోపాటు ఆంధ్ర భాష వృద్ధిచెందినది. నాటి కళింగములోని ముఖలింగము, శ్రీకూర్మము, అర్సవిల్లి, దీర్ఘాసి, ప్రాంత దేవాలయములందు వెలసిన వందల కొలది తెలుగు శాసనము లాంధ్ర వాఙ్మయాభివృద్ధిని, వ్యాప్తిని సూచించిను—

జైన మతము వ్యాపించి ప్రచారమందున్న కాలమున బౌద్ధ మతము, బౌద్ధ వాఙ్మయము దాని స్థానమాక్రమించినది. ఆర్యుల సంపర్కము వలనను, ఆంధ్రదేశ ప్రభావము వలనను, కళింగ దేశమున వైదికమత విజృంబణము జరిగినది. గాంగ వంశపు రాజులు పరమ మాహేశ్వరులును,పితృభట్టారక పాద భక్తులును అగుట వలనను వేద విద్యలను ప్రోత్సహించి, వేద పండితులకు, వేదవిదులైన బ్రాహ్మణులకు అగ్రహారము లొసంగి, వైదిక మత విజృంభణకును, దేవాలయముల నిర్మాణమునకును కృషిచేసినారు.

కళింగ నగరము లేక ముఖలింగ దేవాలయము, శ్రీకూర్మము సంహాచలము, అర్సవిల్లి, దీర్ఘాసి మున్నగు దేవాలయ కుడ్యములపైనను, శిలాస్తంభములపైనను గల శాసన లాంధ్రభాషా

వికాసమున కమూలాల్యాలంకారములు. దీర్ఘాసి శాసనము ఆంధ్రభాషా పరిణామములో నూతన శకమును స్థాపించునట్లు, ప్రబంధ మార్గమున నడిచినది. ఈ శాసనమతి ప్రాచీనమైనది. ఆంధ్రదేశమున ఈకాలమున వెలసిన శాసన పద్యములవలె దీర్ఘాసి శాసన పద్యములున్నవి. అట్లే ఈ పద్యములు నన్నయ భారత పద్యములవలెనున్నవి. అట్లే ముఖలింగమున నున్న వందల కొలది శాసనములు[1] ఆంధ్రభాష అనాడెట్లు మహోన్నత స్థితి యందుండెనో తెలిసికొనుటకు తోడ్పడుచున్నవి.

**శిల్పము :-** కళింగదేశమునగల హిందూదేవాలయములలో భువనేశ్వరములోని పరమేశ్వరాలయము ప్రాచీనతమమైనది. ఈ ఆలయము గోపురాకారముగలది. ప్రధానాలయమునంటి ఆలయమంటప మున్నది. విశాఖపట్టణము జిల్లాలోని నిలీశ్వరాలయమును నిట్లే యున్నది. నిలీశ్వరాలయము నారాయణపురములో నున్నది. ముఖలింగ క్షేత్రమునగల ఆలయములలో వందలకొలది తెలుగు శాసనములున్నవి. ఆ శాసనములు ఆలయప్రాచీనతను తెలుపును. అనగా అందలి ప్రాచీనములైన శాసనములు వేయించుటకు పూర్వమే ఆలయ నిర్మాణము జరిగియుండును కావున స్తంభముల పైనను, ఆలయ కుడ్యములపైనను, శాసనములు చెక్కించినారు. క్రీ.శ. 1058 నాటికే ఈ ముఖలింగమున గల ఆలయము ద్వారతోరణ ప్రాకారసహితముగా నిర్మింపబడియుండును. రెండవ కామార్ణవుడు నగరమందు, మధుకేశవుడను లింగాకారమునకు ఆలయనిర్మాణము గావించినట్లు శాసనముల వలన తెలియుచున్నది. ఈ కామార్ణవుడు 8వ శతాబ్దములోనున్నవాడు

క్రీ.శ. 1069-77 వఱకు కళింగదేశమును పాలించినవాడును, అనంతవర్మ చోడగంగు తండ్రియునగు రాజరాజు కాలమునాటికి నారాయణపురములోని నిలీశ్వరాలయము సంపూర్ణముగా నిర్మింపబడినట్లు శాసనములవలన తెలియుచున్నది.

---

1. S I. I. Vol No. V

# కళింగ దేశములోని ఆలయ నిర్మాణ పద్ధతి.

ముఖలింగ క్షేత్రములోని ఆలయ నిర్మాణపద్ధతి అద్భుతముగా నుండును. ఆలయ పునాది చతురస్రముగానుండి, నాలుగువైపుల నాలుగు ద్వారములుండును. పునాదులపై కుడ్యముల నిర్మింతురు తోర్పుముఖమున ఆలయ ద్వారమునకు తావు విడుతురు దక్షిణ, పశ్చిమోత్తరములందు ద్వారములకు బదులు వెలుపలికి ముఖముండు నట్లు మూడు గుళ్ళను కట్టుదురు. తూర్పున కళిముఖముగానున్న ఆలయమున ప్రధాన శివలింగ ప్రతిష్ఠజరుగును తక్కిన వాటిలో పార్వతి, కుమారస్వామి, గణపతి విగ్రహములొక్కొక్క దానిలో నుంచెడివారు. కుడ్యములు నిడుపుగా నుండి, అటుపిమ్మట వర్తుల ముగా కట్టబడి, గోపురాకారముగ నిర్మించుచుండిరి. విగ్రహములు ప్రతిష్ఠచేయు గూండ్ల పైభాగములపై గోపురములు నిర్మింతురు. ఈ పిల్ల' గోపురములు ప్రధానాలయముపై కట్టబడిన గోపురమంత ఎత్తుండును ప్రధానాలయ గోపురమునకు నాలుగు వైపులను యోగీశ్వరుల ప్రతిమలుండును. ఇది ముఖలింగాలయ నిర్మాణ పద్ధతి.

ముఖ లింగములోని ఆలయములకన్న నారాయణపురములోని ఆలయములింకను వృద్ధిజెందిన శిల్ప సంపదతో నలరారుచున్నవి. ఆలయమున నాలుగు వైపుల విస్తరించియున్న మంటపము - ఒక్కొక్క మంటపమునంటి పెద్దద్వారము, ద్వారమున కిరుపార్శ్వ ముల గూళ్ళుండును. పునాదులపై నిడుపుగోడలు నిర్మించి, ఆ గోడలపై వంపు గోపురము, పండ్రెడు వైపులనుండి చిన్న చిన్న గోపురాకృతులును కట్టబడియుండును. అనగా ద్వాదశలింగములకు ఆలయ గోపురములు నిర్మించుటయగును. ప్రధానమైన ఆలయ గోపురాగ్రమునకు నల్గడల నొక్కొక్కవైపున ఒక్కొక్క చిన్న గోపురాకృతియుండి, దానిపై ఒక్కొక్క యోగి విగ్రహముంచ బడి చూచుటకు మనోహరముగ నుండును.

పునాది, కుడ్యములు, గోపురములన్నియు వర్తులా కారమును పొంది, ఎత్తైన ఆలయములు నిర్మింపబడిన అట్టికట్టడములు భువనేశ్వరాలయ నిర్మాణమువలె నుండును.

**ముఖ మంటపములు .-** ముఖలింగములోని ఆలయమునకును నారాయణపురములోని నిలీశ్వరాలయమునకును ముఖ మంటపము లున్నవి సాధారణముగ ప్రతి దేవాలయమునకు ముఖ మంటప ముండును. కాని కళింగముననున్న దేవాలయ ముఖమంటపముల నిర్మాణ మొుక ప్రత్యేకమైన పద్ధతిలో నున్నది నాలుగు పలకలుగల ఎత్తైన రాతి స్తంభములు, వరుసకు నాలుగు గొప్పున రెండు వరుసలలో నున్నవి. ఈ స్తంభములపైన, రెండేసి స్తంభములు నిలువుగా, అడ్డముగా కలుపుచు, స్తంభములవంటి శిలలు దూలములుగా నమర్పబడి యున్నవి. దూలములపై శిలా ఫలకములు కప్పబడియున్నవి మధ్యననున్న స్తంభములకు 4,5 అడుగుల దూరమున, రెండువైపుల స్తంభముల కంటె కురుచగనున్న కుడ్యములున్నవి ఈ రెండు కుడ్యములను కలుపుచు, ముఖమువైపునను, మధ్యను ద్వారమును వదలి ఏక గోడయున్నది. స్తంభాగ్రములనుండి ఈ గోడలపైకి పలకరాళ్ళు కప్పువలె వేయబడియున్నవి. ఇట్లు ఎత్తుగా, మధ్య సావడికప్పు, చుట్టు వసారా కప్పుకన్న రెండు మూడడుగులెత్తుగా నున్నది. మధ్యచావడి కప్పు చదునుగానున్నది ఈ కప్పులయొక్క మూరులు చిత్రములతో శోభిల్లుచున్నవి. ఈ చిత్రములు పురాణ గాథలకు సంబంధించినవి.

నారాయణపురమునగల నిలీశ్వరాలయమున, సముద్రమథన మాది కథలు, వసారా చూరులలో శ్రీరాముని జననము మొదలు పట్టాభిషేక మహోత్సవము వఱకు రామాయణ గాథ చెక్కబడి యున్నది.

భువనేశ్వరాలయ మంటపశిఖరములు మెట్లుమెట్లుగా పైకి పోయి, పై శిఖరముతో నంతమగుచున్నవి. రెండు, మూడు నాలుగు మంటపములొక దానికొకటి కలిపి నిర్మింపబడినవి,

**ఆలయ శిల్పములు :-** ముఖలింగేశ్వరము మహాక్షేత్రము. ఇచటి సర్వేశ్వరాలయ ద్వారమందు నిల్చిన ప్రతిమలు మహాద్భుత శిల్పసంపదతో నొప్పారుచున్నవి గంగాదేవి మకరము పైనను, యమున తాబేటిపైనను నిలిచి చేతులలో కలశముల ధరించి యొయ్యారముగనున్నవి. ఇట్టి శిల్ప సంపదతో కూడియున్న ప్రతిమలు, ముఖలింగేశ్వరాలయములోను, నారాయణపురము లోని నిలీశ్వరాలయములోను ఉన్నవి

ముఖలింగేశ్వరాలయ ముఖమంటప ద్వారమున చుట్టుఅమర్చ బడిన ఫలకములపై అద్భుత శిల్పమొప్పారుచున్నది ఒక లత వంపులుగా పాకినట్లును, ఆకులు, తీగలు, వళులతో జుట్టుకొనిత యున్నట్లును చిత్రింపబడినది. లతావంపులలో స్త్రీ, పురుషులు సొంపులతో, హావభావ, మనోభావ ప్రకటనము చేయు నటనలతో, లతావళుల కను గుణ్యముగా నుండునట్లు చెక్కబడినది. లతాపత్రముల ఈనెలు స్పష్టముగా కనిపించునట్లు చెక్కబడినవి. లతా చిత్ర ప్రదర్శనమున వంపులలో మానవాకృతుల శరీరావస్థలతో చూపు శిల్పములలో నది పెద్దది. అద్భుతమైనది అడగు వెడల్పులో చిత్రింపబడిన లతా చిత్రము తొమ్మిది యడుగులఎత్తు ఐదడుగుల వెడల్పుగల చతురస్రమునకు మూడు ప్రక్కల తిరిగియున్న లతా శిల్ప చిత్రము చూపరుల కాశ్చర్యముగొల్పును. ఇట్టి శిల్పము మరెచ్చటను కాన్పింపదు.

ముఖలింగాలయమునకుత్తరముననున్న చిన్న ద్వారము చుట్టుగల లత, అనేకావస్థలందున్న మానవాకృతుల మనోహరరూప, దృశ్యము చూడదగినది సర్వేశ్వరాలయ ద్వారబంధముచుట్టును అమర్చియున్న ఫలకములపై లతా వళులమధ్యనున్న మానవా కారమతిమనోహరముగ చెక్కబడినది నారాయణపురములోని నిలీశ్వరాలయోత్తరద్వారముననిట్లే చిత్రింపబడియున్నది

ముఖలింగేశ్వరాలయ ముఖమంటప ద్వారమున కెదురుగా 80' ల దూరమున విజయతోరణాకృతిలో ద్వారమున్నది. ఇది

చతుష్కోణాకృతిలో నున్నది దీని పై భాగము శిఖరముగా గాక చదునుగానున్నది. ద్వారబంధ కంబలముల మీద విగ్రహములున్నవి. ఆరు ఫలకల భాగములుగ విభజింపబడి, ప్రతి ఫలకము మీద ఒక పురుష విగ్రహము చెక్కబడినవి ఎడమవైపు జడలు ధరించిన యోగివరుల విగ్రహములు, కుడివైపు పిడిసిగలు వేసికొనినట్లున్న వన చరుల రూపములు, సహజ స్వరూపముతో చిత్రింపబడినవి. ఈ విగ్ర హములలోని యోగివరులు, వనచరులు, కట్టిన వస్త్రములు, ధరించిన ఆయుధములు, వారికి వారి మనో భావముల కనుగుణముగ నున్నవి. విగ్రహముల శరీర విక్షేపణలందుకు సరిపోవుటయేగాక, రెండు వైపుల ఆరుగురు నేకముఖులై పనిచేయుచున్నట్లును, ఎదురుగా నున్న ఆరుగురు చేయుచున్న పనికిసహాయపడుచున్నట్లు కనిపించును.

5′ ల పొడవు 2′ వెడల్పుగల ద్వారతోరణ ఫలకముపై లింగాకృతి పానవట్ట యుక్తముగానున్నది అంగముపై చామంతి పూవులున్నవి ఈ లింగాకృతిని పురుషులు రెండు వైపుల చేతులతో నెత్తికొని గగన మార్గమున పోవుచున్నట్లున్నది. కుడివైపునను, ఎడమ వైపునను ఈ పురుషుల విగ్రహములున్నవి. అందరు ఏక ముఖులై లింగమును గగన మార్గముగా తీసికొని పోవుచున్నటి చిద్రమద్భుతముగా నున్నది ఈ ద్వారా తోరణ ఫలకము తరువాత మరి యొక తోరణ స్తంభముపై నొక వృక్షము కుడిప్రక్క ఎత్తైన పీఠమునలంకరించిన గురువుగారును, తత్సమీపమున ఉచితాసనములపై శిష్య వర్గమును, ఏక పాద పీఠముపై కొన్ని గ్రంథములును ఉన్నట్లు చిత్రింపబడినది.ఈ ఫలకము పొడవు 6′ లు. వెడల్పు 2′ లు, ఈ చిత్రమున కెడమ వైపున వన్యజనులు తట్టలతో ఫలమూలములను తెచ్చి, దండాయమానులై నిలిచియుండ వారి నాయకుడు సాష్టాంగ నమస్కారము చేయుచున్నట్లున్నది. నాయకుని చేతిలో ఖడ్గమున్నది. తాపసుల యొక్కయు, వన్యజనుల యొక్కయు, శిరోవేష్టనము గుర్తింపదగినది. సహజముగా వారి వారి వేషములకు దగినట్లున్నది.

ఈ ద్వారము దాటిన తరువాత దేవాలయ ప్రాకారములో అగ్నేయదిశలో నొక ఆలయమున్నది. దాని తోరణ ఫలకము పై గజాశ్వరథ యోధనృపులు శత్రువులైన సవరలు సహజా కారాలంకారాయుధపాణులై యున్నారు. నైఋతి, వాయవ్యదిక్కులందుగల ఆలయముల ద్వార తోరణ స్తంభములపై సంగ్రామ చిత్రములు చిత్రితములై యున్నవి. ఈ మూడు ఫలకములలో నొక ఫలకముపై రాజుతో కూడ రాణియు, చిత్రింపబడియున్నది.

ముఖలింగేశ్వరాలయమున తోరణ స్తంభముల పై వైపున నొక ఫలక మమర్చబడినది. దీని పొడవు 6 లు. వెడల్పు 2′ లు, ఈ ఫలకమున ఎడమ వైపున, కృష్ణబలరాములు కంసుని నగరమునకు వెళ్ళుచున్న సమయమున మదగజ మడ్డుకొన, కృష్ణుడు దానిని, ఎగిరి నెత్తిమీద కాలితో తన్నుట వలన నదిముందు కాళ్ళపై కూలిపోయినట్లు చిత్రింపబడినది. ఈ చిత్రమునకు కుడివైపు, మల్లయుద్ధా విశారదులగు చాణూరముష్ఠికులతో యద్ధము చిత్రింపబడినది ఈ చిత్రమునకు కుడివైపున సింహాసనా సీనుడైన కంసుని మెడకు, నాగలి తగిలించి కృష్ణబలరాములు లాగుట, దానికి కుడివైపున కంసుడు సింహాసనము నుండి క్రిందబడి మరణించుట, సభికులు భయపడుచున్నట్లున్న చిత్రములున్నవి. ఈ శివాలయమున కృష్ణ చరిత్రము చిత్రింపబడుట ఆశ్చర్యకరము. మంటపమునకు గల కుడ్యములకు వెలుపల నున్న గూళ్ళలో వరాహ నరసింహ స్వామి, హిరణ్యకశిపుని చీల్చుట, వరాహ స్వామి భూమి నెత్తుటయు చెక్కబడి యున్నవి.

ముఖలింగేశ్వరాలయమున వసారాకప్పు, సావడికప్పులకు మధ్యనగల ఎత్తైన స్థలమున నొక ఫలకము వసంతోత్సవమునకు సంబంధించినది. అమర్చబడినది. ఈ ఫలకముపై, అరణ్యము, చెట్లు వేటుకాండ్రు మృగములు ఉన్నవి. ఒక వేట కాడు దుప్పిని కొట్టుచున్నట్లును, మరియొకడు అడవిపందిని బల్లెముతో పొడుచుచున్నట్లును చిత్రింపబడినది. ఈ చిత్రమునకు కుడివైపు దుప్పిని,

పందిని మోసికొనివచ్చుచున్నట్లున్నది. ఈ జంతువుల నాలుగు కాళ్ళు కట్టి కఱ్ఱపట్టెనందు దూర్చి, ఇద్దరు వేటకాండ్రొక్కొక్కవైపు భుజములపై పెట్టుకొని మోయుచున్నట్లున్నది. రాజు పీఠముపై గూర్చునియుండ వేటకాండ్రా జంతువులను రాజుకు చూపించుటయు ఈ ఫలకమందు చిత్రింపబడినది.

ముఖ మంటపము ఉత్తర దిశలోనున్న కుడ్యద్వారముపై గోడయందున్న ఫలకము 4' పొడవు అడుగు వెడల్పుననున్నది. ఇందు శివపార్వతులు జూదమాడగా, జూదములో శివుడోడిపోవ, శివుని ఆస్తి ఒక్కొక్కదానిని పార్వతీదేవి పరిచారికలు తీసుకొనిపోవు చున్నట్లు చిత్రింపబడినది.

ముఖలింగేశ్వరాలయమునకుత్తరమునగల గోడలలో గల గూళ్ళలో, భూ వరాహనరసింహామూర్తులు, నటరాజస్వామి విగ్రహములున్నవి. దక్షిణపు కుడ్యమున గల గూళ్ళలో, చేత దండములు కలిగి, బోడితలలపై ముసుగులు వేసికొనిన సన్యాసుల ప్రతిమలొక్కొక్క గూటిలోనొక్కొక్క ప్రతిమయున్నది. ఒక గూటిలో కిరీటకుండల ధారియైన విగ్రహమొకటియున్నది. అతనికుడిచేతిలో వజ్రాయుధ మున్నది. ఈ విగ్రహము వజ్రహస్త మహారాజుదని చారిత్రకులు నిర్ణయించినారు

ముఖలింగాలయమున గల చిత్తరువులు, పూర్వకళింగ శిల్పకళ యొక్క ఘనతను, శృంగారమును చాటుటయేగాక, చరిత్రకు సంబంధించిన అనేక విషయములను వ్యక్తపరచుచున్నవి. కళింగ దేశమున వ్యాప్తిలోనున్న మతములగు జైన బౌద్ధముల సమ్మేళనము నుండి ఆవిర్భవించిన హిందూమతాంతర శైవాచార సంప్రదాయమును ప్రతిబింబింపజేయు శిల్పమీ కళింగ శిల్పము కళింగదేశ ఆచార వ్యవహారములు, శిరోజముల కూర్పు, వస్త్రధారణ పద్ధతులు, అలంకారములు, ఆయుధములు ఈ శిల్పమున చిత్రింపబడినవి. ఈ చిత్రము

లందు, సామాన్య ప్రజలు వాడుకొను, పీటలు, రథములు, నాగలి, పార, బొరిగ, పనిముట్లు, ప్రజలుపయోగించు వివిధ వస్తువులు, కనిపించుచున్నవి రాజునుండి, సామాన్యకిరాతుని వరకు గలవారి ప్రతిమలు చిత్రింపబడినవి. ఈ శిల్పములివలన ప్రజల సిరిసంపదలు, సాంఘిక వ్యవహారములు, సాంఘిక స్థితిగతులు, ప్రజల ధైర్యశౌర్య ప్రతాపములు, యుద్ధయోధుల పరాక్రమము తెలియుచున్నది.

నారాయణపురమున గల నిలీశ్వరాలయమున గల ప్రతిమలు శైవ సంబంధమైనవి. ఇందు శివుని అవతారములు, పార్వతి, గణపతి కుమారస్వామి ప్రమథ గణములు చెక్కబడినవి.

ముఖమంటపముఖద్వార కంబమున కంటి యున్న రాతి ఫలకముపై ద్వారపాలక, అష్ట దిక్పాలక, విగ్రహములు లోతుగా జెక్కబడినవి, ద్వారమునకు రెండు వైపుల నున్న సూర్య చంద్ర విగ్రహములు, చెదరిపోయినవి తదితర విగ్రహములిప్పటికిని చెక్కు చెదరక నిలచి యున్నవి. ఇచట విగ్రహములు బలసిన అవయవము లతో మందస్మిత వదనములతో, విశాల వక్షస్థలము,నాభి, త్రివళులతో నొప్పుచున్న కక్షులతో, నుండి శిల్పి చాతుర్యమును చాటుచున్నవి. స్త్రీ విగ్రహములు యథోచిత పుష్టి లావణ్యములతో ప్రకాశించు అవయవములు కలిగి, జీవకళతో నొప్పారుచు, వికార వక్షోజములు లేకుండ, మధుర సుందర మధుర తరముగా నున్నవి.

దేవాలయ పశ్చిమ కుడ్యమునకు వెలుపల గల గూటిలో అర్ధ నారీశ్వరుని విగ్రహమున్నది శిల్పి స్త్రీ పురుష స్వరూపము లేక ముఖమంబు వ్యక్త పరచినాడు అలంకారము, ఆయుధములు, వాహన ములచేతనేగాక, సిగలు, ముఖలావణ్యము, పెదవుల సమ్మేళనము దృష్టులు, స్త్రీ పురుష భేదమును చూపునట్లు చెక్కిన శిల్పియొక్క చాతుర్యమెంతేని శ్లాఘింపదగినది.

ఉత్తరపు దిశలోనున్న గూటిలో నున్న విగ్రహమునందున్న శివ కేశవుల భిన్నరూపములను, ముఖకాంతులలో శిల్పి చూపించెను, ఆలయ శిఖరముపై నాలుగు దిక్కులందుంచబడిన నలుగురు భక్తుల విగ్రహము లంత యెత్తున నున్నప్పటికి స్పష్టముగనున్నవి. ఒక్కొక్కరాయి ఒక్కొక్క విగ్రహముగా అవయవములు స్పష్టముగ కనిపించునట్లు చెక్కబడిన విగ్రహము లవి. ఏ దిక్కునందుంచిన విగ్రహమాదిక్కునకు తదేక దృష్టితో చూచుచు నాదిక్పాలకునితో సంభాషించుచున్నన్నట్లుది. యథోచిత స్థానముల నాసీనులైన బోడితలల సన్యాసులచ్చట కూర్చొని యున్నట్లు తోచును.

ముఖలింగము, నారాయణపురము, శ్రీ కూర్మము, మున్నగు ప్రాంతములందున్న దేవాలయములలోని శిల్ప సంపదను పరిశీలించిన కళింగ శిల్పమతి ప్రాచీన తమమని తెలియుచున్నది.

### ఈ ప్రకరణము వ్రాయుటలో తోడ్పడిన గ్రంథములు


1 Madras Journal of Lit Society 1889 - 1894
2. Epigraphia Indica Vol I, V
3. Early History of India
4 History of Orissa
5 అనంతవర్మ విశాఖపట్టణతామ్రశాసనము
6 ఇంద్రవర్మ దేవుని తామ్రశాసనము M.E R. 1917-18
7 ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక 1926
8 భారతి 1926-27
9 Indian Anti - Vol XVI, XXXI, XIII
10. J.A H.R S. Vol I, II

8వ ప్రకరణము

# రేనాటి చోళ యుగము

విష్ణుకుండినులాంధ్రదేశము నేకచ్ఛత్రాధిపత్యముక్రింద పాలించు చున్నకాలమున కృష్ణానదీ దక్షిణప్రాంతములను కొందరు మాండలిక రాజులు పాలించుచుండిరి. అందు ముఖ్యముగా రాయలసీమలోని కడప, చిత్తూరు, అనంతపూరు మండలములను రేనాటి చోళులు, వైదుంబులు పాలించిరి. వీరు వేయించిన శాసనములు తెలుఁగు భాషలో నున్నవి. బాణరాజులు, వైదుంబులు తెలుఁగువారు. మొట్ట మొదట తెలుఁగు భాషలో శాసనములు వేయించిన కీర్తి రేనాటి చోళులకే దక్కినది.

చైనా యాత్రికుఁడగు హ్యూన్‌త్సాంగ్ క్రీ.శ. ఏడవ శతాబ్దమున భారతదేశమును దర్శింపవచ్చెను అతఁడు దక్షిణాపథము పర్యటించు సందర్భమున ఆంధ్రదేశము వచ్చి, సుప్రసిద్ధమైన బౌద్ధక్షేత్రములగు అమరావతి, నాగార్జున కొండలను దర్శించెను. అతఁడు చుళియ దేశమును చూచినట్లు తెలియచున్నది. చుళియ దేశము ధాన్యకటకమునకు నైఋతి దిశలో నున్నది. చోళవంశీయులు పాలించిన దేశము చోళదేశము. హ్యూన్‌త్సాంగ్ చోళ శబ్దమును 'చుళియ'గా పేర్కొని నాడు ఈ చోళవంశీయు లాంధ్రదేశీయులు. వీరి మొదటి నివాసమగు చోళవాడి తెలంగాణములోని నేటి నల్లగొండ, మహబూబునగర ప్రాంతమని ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారి అభిప్రాయము [1] వీరు చోళవాడి ప్రాంతమును స్వతంత్రముగ పాలించి

---

1 ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి.

యుండిరి కాలక్రమమున వీరు పల్లవ, విష్ణుకుండిన, బాదామి చాళుక్యుల సామంతులుగ వ్యవహరించినారు. రేనాడు ఏడువేల దేశము. అనగా ఏడువేల గ్రామములున్న దేశము. ఇట్టి దేశమును పాలించినవారు కావున వీరికి రేనాటి చోళులను పేరు వచ్చినది

ఈ చోళమండలము, భయంకరమైన అడవులతో నిస్సారమైన భూములతో, క్రూరులైన మనుష్యులతో దోపిడిగాండ్రతో, కూడి యుండెనని హ్యూయాన్‌త్సాంగ్ వ్రాతలవలన తెలియుచున్నది. మూఁడు వందల యేండ్లకు పూర్వ మీ ప్రాంత పరిస్థితి హ్యూయాన్‌త్సాంగ్ వ్రాతల కనుగుణ్యముగ నుండియుండుటచే ఈ ప్రాంతము 'చుళియ'దేశమనియే నిర్ణయింపవచ్చును. రేనాటి చోళులకును, దాక్షిణాత్య చోళులకును ఎట్టి సంబంధమును లేదు. ఈ రాజన్యులు తాము పాలించిన దేశమును రేనాడు ఏడువేల దేశమని శాసనములందు పేర్కొనినారు. వీరు వేయించిన శాసనముల వలన వీరు కరికాలచోడుని సంతతివారనియు, సూర్య వంశీయులనియు, కాశ్యప గోత్రులనియు తెలియుచున్నది.[1] వీరికి సంబంధించిన శాసనములు కడపమండలములోని జమ్మలమడుగు, ప్రొద్దుటూరు తాలూకాల ప్రాంతములలో లభించినవి శాసనములందు పేర్కొనఁబడిన రాజులలో నీ క్రిందివారు ముఖ్యులు.

ధనఞ్జయుఁడు
చోళమహారాజు
పుణ్యకుమారుడు
విక్రమాదిత్య చోళమహారాజు
పృథ్వీవల్లభుడు
సత్యాదిత్యుడు

ఏడవ శతాబ్ది పూర్వార్థమున హిందూదేశమునకు వచ్చిన హ్యూయాన్‌త్సాంగ్ పేర్కొనిన చుళియ దేశమీ రేనాటి చోళులపాలన

1. S I.I. Vol X No. 594.

ములో నున్న దేశమే ఈ వంశీయుల శాసనములు క్రీ శ 575 నుండి యున్నట్లు పరిశోధనలవలన తెలియుచున్నది. Epigraphia Indica Vol XXVII లో ప్రకటించిన శాసనములనుబట్టి మొట్ట మొదటి తెలుగు శాసనము, ఎరికల్ముత్తు రాజు ధనంజయుని కలమళ్ళ శాసనమని చెప్పవచ్చును. ఈ శాసన కాలము క్రీ శ. 575.

చోళరాజులలో రెండవ కరికాలుని వంశీయులు ఒరయూరు రాజధానిగా గల్గిన చోడదేశమునుండి, ఆంధ్రదేశమునకు వచ్చి, స్థిర నివాసులై, సామంత మాండలికులుగను, సామంతులుగను పాలించి నారని కొందరి చారిత్రకుల అభిప్రాయము. కరికాలుడు పరాక్రమ వంతుఁడైనరాజు ఈతఁడు త్రిలోచన పల్లవుని యుద్ధమున జయించి, అతనిచే కావేరీనదికి గట్టులు పోయించినట్లును, పల్లవరాజుచే సేవలు గొనినట్లును తెలియుచున్నది కరికాలుడు ఆంధ్రదేశములోని చోళ వాడి నుండి విజృంభించి దక్షిణా పథమున దక్షిణ ప్రాంతము నాక్ర మించినట్లు భావింపవచ్చును కొందరు చోళరాజులు క్రీ శ. 550 ప్రాంతమున పల్లవులకు సామంతులుగా నుండి కడప మండలమును పాలించిరి పుణ్యకుమారచోళుని తామ్రశాసనమునుబట్టి, ఈ వంశీయు డగు నందివర్మ క్రీ శ 550–575 మధ్య కడప మండలము నేలినట్లు తెలియుచున్నది నందివర్మకు సింహావిష్ణువు, సుందరవర్మ, ధనంజయ వర్మలను ముప్వురు కుమారు లుండిరి. తండ్రి యనంతరము ముప్వురు పుత్రులు రాజ్యమును పాలించినారు అందు ధనంజయుడు కలమళ్ళ శాసనమును క్రీ శ. 575 లో వేయించెను

సుందరవర్మ కుమారుఁడు పరిప్రతాపచోళుఁడు క్రీ. శ. 575–600 మధ్య కాలమున హిరణ్యా రాష్ట్రమును పాలించినట్లు తెలియుచున్నది. ఇతనికి మహేంద్ర విక్రమవర్మ, ముదిత శిలాక్షర, నవరామాది బిరుదము లుండెను ఈ మహారాజునకు గుణముదిత, పోర్ముఖ లేక పుణ్యకుమార చోళు లను కుమారు లుండిరి.

పుణ్యకుమారుడు క్రీ శ 600-625 మధ్య హిరణ్యా రాష్ట్రము ను పాలించెను. పుణ్యా కుమారుని యనంతర మాతని పుత్రుఁడు విక్రమాదిత్య చోళరాజు, క్రీ శ 625-650 వరకు పాలించెను. ఇతనికి చోళ మహా రాజాధిరాజ బిరుద ముండెను. విక్రమాదిత్య చోళుని పిదప శక్తి కుమారుడు, క్రీ శ. 650-675 వరకును, సత్యాదిత్యుఁడు 675-700 వరకును చోళ దేశము అనగా రేనాడును పాలించిరి. సత్యాదిత్యుఁడు రేనాటి రాజ్య మేడువేల గ్రామములు, సిద్ధివెయ్యి గ్రామములును పాలించెను. అతని తరువాత ఎళం చోళరాజు రేనాటిని పాలించినట్లు నల్ల చెఱువుపల్లి శాసనమునుబట్టి తెలియుచున్నది. ఎళం చోళరాజు పరిపాలనా కాలము 700-725, చోళ ముత్తరాజు, ధనుంజయయెళ చోళరాజనువారు గాంగ, పల్లవ రాజుల సామంతులుగా గండికోట రాజధానిగా, తెలుగుదేశ ప్రాంతము నేలినట్లు రైసుపండితుని వ్రాతల వలన తెలియుచున్నది. ధనంజయ ఎరిగ చోళు డను రాజు ఎనిమిదవ శతాబ్దిలో అల్వాడి 600 గ్రామముల కధిపతిగా నున్నట్లు తుంకూరు జిల్లాలోని శాసనముల వలన తెలియుచున్నది

ఆరవ శతాబ్దిలో కమ్మనాటిని చోడరాజులు పాలించినట్లు తెలియుచున్నది. వీరప్రతాప చోడుడు బాపట్లలోని భావనారాయణ స్వామికి భావపట్ల, ఆముదాలపల్లి గ్ర మములను, క్రీ. శ 593 లో దానమిచ్చినట్లు లోకల్ రికార్డులలోని బాపట్ల కైఫియత్ వలన తెలియుచున్నది. కడప ప్రాంతమును పాలించిన పరిప్రతాప చోడుడే వీరప్రతాప చోడుడని చారిత్రకులు నిర్ణయించినారు.

పరిప్రతాపచోడుని తరువాత, ఎరియమ, విజయకామ, వీరార్జున అగ్రగణిపిడుగు, కొక్కిలి మహేంద్రవర్మ, ఎళచోళ, నృపకామ, దివాకర, శ్రీకాంత చోళులు పాలించినట్లు శ్రీకాంతచోళుని శాసనముల వలన తెలియుచున్నది. పైన పేర్కొనబడిన రాజులు క్రీ.శ.600-850

వరకు పాలించినారు అటుపిమ్మట వీరు చాళుక్యుల సామంతులుగా వ్యవహరించిరి

కడప మండలమును పాలించిన చోడులు రేనాటిచోడులు తెలుఁగు భాషలో తొలుదొల్త శాసనములను ప్రకటించిన కీర్తి రేనాటి చోళులకే లభించినది. కాలక్రమమున వీరు పాకనా డాక్రమించి చిన్న చిన్న కుటుంబములుగా చీలి రాజ్యములను స్థాపించి పాలించినారు. వీరిలో రేనాడు, పొత్తపినాడు, కోణిదెన, నెల్లూరు ప్రాంతములను పాలించిన చోడవంశీయులు ప్రసిద్ధులు.

రేనాటి చోడులకాలపు ఆంధ్రుల సాంఘిక చరిత్ర కా రాజన్యులు వేయించిన శాసనములును, వైదుంబరాజుల పాలనాకాలమున వెలిసిన శాసనములును ముఖ్యములు. వీరి శాసనములలో నాంధ్రభాష స్థాన మాక్రమించి ప్రాకృత ప్రభావయుతమై, తెలుగుభాష ప్రాథమికదశను సూచించును. ప్రాకృత పదములతో కలిసియున్న తెలుగు పదములు వింతవింత రూపములతో కనిపించి ఆంధ్రభాషా వికాస పరిణామమును సూచించును

**పరిపాలనావిధానము .–** రేనాటి చోడులు స్వతంత్రముగ కడప, చిత్తూరు మండలములను పాలించినను, కొంతకాలము, విష్ణు కుండినులకు, పల్లవులకు సామంతులుగ వ్యవహరించిరి ఈ వంశీయులు పాలించిన కాలమునం దాంధ్రదేశము సుఖితముగ నుండెను. ప్రజలు సుఖమయ జీవనమును గడుపు చుండిరి. వీరు సూర్యారాధకులు చోడ మహారాజు ఆజ్ఞగొని, జేయమయ్యరు సూర్యగ్రహణ నిమిత్తమున సూర్యునికి దేవాలయమును నిర్మించి దేవభోగార్థము కొంత భూమిని, ఒక గానుగును, దానమిచ్చినట్లు చిలంకూరు శాసనము[1] వలన తెలియుచున్నది.

---

1. S I. I Vol X No 593.

ఆ కాలమున రాజులేకాక, సామాన్య ప్రజలు, ధనాఢ్యులు రాజోద్యోగులు, దేవాలయము లను నిర్మించి, భూదానము లొసంగి శాసనములు వేయించుచుండిరి దాత పుత్రకళత్ర సహితుడై దాన మిచ్చు చుండెను

రేనాటి చోళుల పరిపాలనా కాలమున భూమిని ప్రితుడ్లలోను, మఱుతుడ్లలోను కొలిచెడివారు శాసనము లొసంగునపుడు సాతు లుగా నాలుగు స్థానంబుల వారు నియమింపబడుచుండిరి పన్ను సిద్ధాయ మనబడుచుండెను గద్యలు వాడుకలో నుండెను నేడు వైశాఖ పౌర్ణమినాడు రైతులు ఏరువాక పున్నమి పండుగ చేసికొను నట్లు నాడు ఎవోఁకపున్నమి పండుగవాడుకలో నుండెను.[1] కొన్ని ప్రాంతములందు జ్యేష్ఠ పున్నమినాడీ పండుగ చేసికొందురు.

దేశము మండలములుగాను, విషయములుగాను, విభజింప బడెను పరిపాలనా సౌలభ్యమున కట్టి విభజనముగావింపబడెను విషయ ములు, మండలములు గ్రామములుగా విభజింపబడెను గ్రామములందు రట్టోడ్లు లేక రాట్టులు లేక రెడ్లు ప్రాముఖ్యము వహించుచుండిరి వీరు గ్రామములందుగల రైతులనుండి భూమి పన్ను వసూలుచేసి రాజు కోశాగారము చేర్చుచుండిరి. రట్టోడ్లు వారి భార్యాపుత్రులును శాసన ములను వేయించుచుండిరి "తురుమునూడ్ల బాదెయ రట్టోడ్లు గుడ్లు ఎత్తిఇచ్చిరి వారి పెణ్డంబు మారకణ్డరు, వారి కొడుకు చాముణ్డెయ సత్యాభిమాని పెట్టిఇచ్చె సాసనబిదిగల్లు" అని శాసనమందున్నది.[2] ఆ కాలమున శాసనములను విశ్వబ్రాహ్మణులు, అనగా పంచాణము వారిలో నొకరగు కమ్మరులు వ్రాయుచుండిరి శాసన లేఖకుడు లేక శిల్పి అని ఇతని నందురు రేనాటి చోళుళ శాసనములలో నొక శాసనాంతమున "విరిపటితి కమ్మరి వినియణ వ్రాసె"[3]అని యున్నది.

---

1 S I I Vol X No 593.
2 S I I. vol X No 598
3 S I I vol X No 604

బ్రాహ్మణులకుగాని, దేవాలయములకుగాని దానమిచ్చిన భూమిని 'పన్నశ' అని పిలుచుచుండిరి. పొలమును, చేను అని నేడు వాడుకలో నున్నట్లే పిలుచుచుండిరి. ఆచమానమగు మఱుతుడ్లలో భూమి కొలువబడుచుండెను. 'మఱుతుడ్లు' కొన్ని శాసనములలో మఱుతులు, మఱుతురులు మఱులు అనియు ప్రయోగింపబడినది.

రేనాటి చోళులు పాలించిన కాలమున జరిగిన యుద్ధములలో వీరు లొకరినొకరు కత్తులతో పొడిచికొని మరణించిన సంఘటన లెక్కువగా జరిగినట్లు శాసనమువలన తెలియుచున్నది యుద్ధమున మరణించినవారు స్వర్గలోకము పోవుదురను నమ్మక మానాడు ప్రజలలో వ్యాపించియుండెను.[1]

(శ్రీ) గణ్డ సజ్కలియ్య మఱది కొఅనడిప్ప బీరెయ, వల్లెపప్ప యెళువాన్టు చోడఱతోడ పొడిచ్చి వీరలొ కమ్బెగె [2]

కొన్ని శాసనములందు 'సోరవాడి' అను పదము వాడబడినది చోళవాడి అనుటకు బదులు, సోరవాడి, సోరమడి, అనియు శాసనము లందు కనిపించుచున్నది[3]. పురుషులకు కుళ్ళమ్మ, 'రెసెఱఖ కుమ్బళు' అను పేళ్లుండెను. చమూపతిని సేనాపతి యని పిలుచుచుండిరి [4]

వైదుంబ రాజన్యులును రేనాణ్డేడు వేలు పాలించినవారు. రేనాటి చోళుల అనంతరము కడప, చిత్తూరు మండలములను వీరు పాలించినారు వీరి కాలమున వెలసిన శాసనములలో నధికముగా యుద్ధములకు సంబంధించినవి కలవు [5]

---

1 S I I Vol. X, No 621.
2 S I.I Vol. X, No 628.
3 S I.I Vol. X No 629
4. S I I vol X No 637
5 S. I. I. vol X No 639

రేనాటి చోళులు, వైదుంబులు, యుద్ధములందు ద్వితీయ బల పరాక్రమ శౌర్య, ధైర్య సాహసములను ప్రదర్శించినారు. వైదుంబ రాజు లనేక సమర సంఘట్టనములందు విజయులైన వారు. ఈ రాజన్యులు పరిపాలనాదక్షులు. రేనాడ్డేడు వేల నేల పాలించినవారు కావున, వీరికి సంబంధించిన శాసనములుకూడ కడప, చిత్తూరు మండలములందు కనిపించుచున్నవి.

రాజు దైవాంశ సంభూతుడనియు, మానవాతీతుడనియు ఆ కాలపు ప్రజలు భావించుచుండిరి. "రాజు సార్వభౌముఁడు పృథ్వీపతి, అశ్వమేధము లాచరించుటకు దగినవాడు. రాజ్యమునకు సర్వాధికారి. నిరంకుశుడని" హిందూమత ధర్మ, పౌరాణిక గ్రంథములు పేర్కొనుచున్నవి. రేనాటి చోళులు వైదుంబులు చిన్నచిన్న రాజ్యములు పాలించినను చక్రవర్తికి గాని మహారాజాధిరాజుకుగాని సామంతులుగ వ్యవహరించినను స్వతంత్రముగనే పాలించిరి రాజు "సప్తాంగముల రక్షించుచు చతుర్విధోపాయముల నెఱింగి రాజ్యమునురక్షించుచు తనకు శత్రువులెవరో, మిత్రులెవరో తెలిసికొని ప్రజాభీష్ట ప్రకారము రాజ్యము చేయుచుండెను అంతియేకాక రాజ్యమున ఏవ్యక్తి రాజ్య రక్షణమునకర్హుడో, సామంత రాజులలో ఎవరెట్టివారో, మాండలికులలో ఎవరెట్టివారో వారివారి మనస్తత్వము లెట్టివో, ఏ ప్రాంతమున భూమి సారవంతమైనదో, ప్రజల కష్టసుఖములు, ప్రజల అవసరము లెట్టివో రాజు తెలిసికొని యుండవలెను. రాజున కాయుధములే తెలివి తేటలు, సప్తాంగములు శరీరము, పని రహస్యము రక్షణము, రాజ ప్రతినిధులు కండ్లు, ప్రజలు ముఖము. మంచినడవడి జీవితముగా భావించి సామ్రాజ్యమున సుఖశాంతులు వర్ధిల్లుటకు తోడ్పడుటయే రాజు తన ధర్మముగా భావింపవలయునని, శాస్త్రములు చెప్పుటవలన హైందవ రాజులాశాస్త్రముల ప్రకారము రాజ్యపరిపాలనము చేయుచుండిరి.

రేనాటి చోళులాంధ్రదేశమును పాలించుచున్న కాలమున దేశము మండలములుగా విభజింపబడి, ఆయామండలములను పాలించుటకు మండలాధిపతులు నియమింపబడుచుండిరి. రాజులు, మంత్రులు, మండలాధిపతులు వంశ పరంపరగా వచ్చుచుండిరి రాజులు, మంత్రులు, సామంతులు, మండలాధిపతులు, రాజకీయ రహస్యములనుదాచి, ప్రజా క్షేమముగోరి పరిపాలనము చేయుచుండిరి మంత్రులు వీరులుగాను, తత్క్షణక ర్తవ్య నిర్వాహకులగను, సకల శాస్త్ర పారంగతులుగను ఉండెడివారు. మంత్రులలో ప్రధానామాత్యుడు, సామ్రాజ్య రక్షకుడుగా, శత్రురాజుల మనోభావముల నెఱింగినవాడుగా, సామ్రాజ్య భార వాహకుడుగా, అనేక సద్గుణములు కలిగి సకలశాస్త్రపారంగతుడై యుండెను

కార్య ఖడ్గ ధురంధరుడు, చమూపతి, ధనాధ్యక్షుడు లేక భాండాగారాధ్యక్షుడు, క్రోష్ఠాధికారి, కోశాధికారి, మహామాత్యుడు, అమాత్యుడు, దండనాయకుడు మున్నగు వారు రాజ్యమున అధికారులు వీరు రాజు ఆజ్ఞలకు లోబడి పరిపాలనా వ్యవహారములు చూచుచుండిరి కొందరి మంత్రులకు ప్రధాని లేక ప్రెగ్గడ అను పేరుండెను. రాజు, మంత్రిమండలికి అధ్యక్షుడుగా వ్యవహరించెడివాడు. సంధి విగ్రహి అను యుద్ధమంత్రియు, సంధి విగ్రహి ముఖ్యుడను నాతడు యుద్ధ ముఖ్యమంత్రిగ వ్యవహరించుచుండిరి, ధనాధ్యక్షుడు, కోశాధికారి, కొట్టారి, భండారి అనువారు రాజభాండాగార రక్షకులు. శాసనము లిచ్చునపుడు రాజు, మంత్రి పురోహిత సేనాపతి, యువరాజు, రాష్ట్రకూట ప్రముఖ కుటుంబముల వారి సమక్షమును గోరుచుండెను.

రేనాటి చోళులు పాలించు కాలమున గ్రామ పరిపాలన మత్యంత పటిష్టముగ నుండెను. గ్రామములలో నధికారులుగా, గ్రామణి, రట్టొడి లేక రట్టడ్లు, రాట్ లేక రెడ్లు నియమింపబడు

చుండిరి. తలారి గ్రామ రక్షకుడుగా వ్యవహరించుచుండెను. దుర్గములు గల నగరములు, నగరాధ్యక్షునిచేగాని, దుర్గాధ్యక్షునిచేగాని పాలింపబడు చుండెను ప్రజలు, సైనికులు, వ్యాపారులు, ప్రభువులు ప్రజాహిత కార్యములను నిర్వహించుచుండిరి

**సైనిక వ్యవస్థ :-** రాజ్యమునకు సైన్యము ముఖ్యమైనది. కేంద్రవ్యవస్థ, మాండలిక వ్యవస్థ, సామంత సైనిక వ్యవస్థలుండెను. సైనికులు, దండనాయకులు, సైన్యాధ్యక్షులు, సామ్రాజ్య రక్షణ భారము వహించుచుండిరి. దుర్గాధ్యక్షులు, సామంత మాండలికులు, యుద్ధ సమయములందు, తమ సైన్యమును రాజుకు సహాయముగా పంపుచుండిరి. దండనాయకులకు, చమూపతులకు జీతబత్తెములక్రింద సైన్యమునకగు వ్యయముక్రింద రాజు భూముల నిచ్చుచుండెను. సేనా నాయకుల ప్రశంసనీయమైన సేవలకు ప్రతిఫలముగా రాజు వారికి విశాల భూభాగముపై నాధిపత్య మొసంగుచుండెను. కొందరు మంత్రులు సేనా నాయకులుగ వ్యవహరించుచుండిరి, సంధి విగ్రహి, సేనాధిపతి, కార్యఖడ్గ ధురంధరుడు, సమస్త సేనాధిపతి లేక సర్వ సైన్యాధ్యక్షుడు సైనిక వ్యవస్థలో ముఖ్యమైన అధికారులుగనుండిరి

**ప్రజాహిత కార్యములు:-** రేనాటి చోళుల కాలమున తటాకములు నిర్మింపబడి కాలువలు త్రవ్వింపబడినవి చెఱువులు, కాలువలు త్రవ్వించుట హిందూమత సంప్రదాయము ప్రకారము సప్తసంతాన ప్రతిష్ఠలలో నొకటి. రాజులు చెఱువులు త్రవ్వించి దేవాలయముల కొసంగి చెఱువు నీటితో పారు పొలములను బ్రాహ్మ దేయములుగను, దేవభోగములుగను చేసి దానమిచ్చినారు

భూమిపై వచ్చుపన్ను ఆదాయములో ముఖ్యభాగము కావున రాజులు వ్యవసాయాభివృద్ధికి కృషిచేయుచుండిరి. రాజ్యమునగల భూమి, వ్యవసాయ యోగ్యము, వనములు, తోటలు, బీళ్లు అను

విభాగములుగ నుండెను రాజు లేక, మంత్రి సామంతాదులు, ధనాఢ్యులు, భూస్వాములు, దేవాలయములకు, బ్రాహ్మణులకు భూమి దానము చేయుచుండిరి దేవ భోగములకు, బ్రాహ్మణులకు ఇచ్చిన భూమిపై పన్ను లేకుండెను ప్రజలు సుఖముగానున్నను, యుద్ధములు విశేషముగానున్నట్లు తోచుచున్నది రేనాటి చోళులు పాలించిన కాలముునను, వైదుంబుల కాలముునను, చిన్నచిన్నసామంత రాజ్యములు, కడప చిత్తూరు, అనంతపూరు జిల్లాలలో నుండెను. ఆరేడు శతాబ్దములలో విష్ణుకుండినుల ,తూర్పుచాళుక్యులు, పల్లవులు ఆంధ్రదేశమున ఆధిపత్యమునకై పోరాడుచున్న సమయమున రేనాటి చోళు లాంధ్ర దేశమున కొన్ని భాగములను పాలించుచుండుటనుబట్టి వీరు సామంతులతోను, మాండలికులతోను, యుద్ధములు చేయవలసి వచ్చెను ఐనను ప్రజోపయోగ నిర్మాణము లందిరాజు లాసక్తి చూపిరి.

**భాషాస్థితి:**—రేనాటి చోళులు పాలించిన కాలమున ఆంధ్ర వాఙ్మయ మారంభదశలోనుండెను తెలుగు పద్యములను బోలిన పద్యములు వీరిశాసనములందు కనిపించినను నవి గణయతి ప్రాస నియమ రహితముగ నున్నవి ఈ కాలమున వెలిసిన శాసనములలో ధనుంజయుని కలమళ్ళ శాసనము ముఖ్యమైనది. ఇది క్రీ శ 575 లో వేయింపబడినది ఇప్పటికి ప్రకటింపబడిన తెలుగు శాసనములలోనిది మొదటిది. రేనాటి చోళులు వేయించిన శాసనములు, కడప మండలములోని ప్రొద్దుటూరు జమ్మల మడుగు ప్రాంతములలో లభించినవి. శాసనములందు పేర్కొనబడిన రాజులలో నందలును రేనాడు ఏడు వేల దేశమును పాలించినవారే

చాళుక్యులకు బూర్వము వెలసిన భాష శాసనాత్మకమైనది. ఇక్ష్వాకులు, పల్లవులు, ఆనంద గోత్రికులు, బృహత్పలాయినులు, శాలంకాయనులు విష్ణుకుండినులు, ప్రాకృతములోను, సంస్కృతము

లోను శాసనములు వేయించినారు కాని దేశభాష యందభిమానము గల రేనాటి చోళులు, తెలుఁగు భాషలో శాసనములు వేయించినారు. ఈ కాలమున వేయింపబడిన సంస్కృత శాసనములలోను గ్రామ నామములతోపాటు వానికి సంబంధించిన వివరములు తెలుఁగుభాషలో వ్రాయబడినవి.

ఈ కాలపు శాసనములు గద్యమయములు. ఇందు వృత్తగంధి వాక్యములున్నవి పుణ్యకుమారుని మాలెపాడు శాసనమున రగడ, వెంకయచోడుని దొంగలసానికనుమ శాసనమున మహాక్కరయున్నట్లు తెలియుచున్నది ఈ పద్యములలో గణములు సరిపోయినను యతి ప్రాసలలో వ్యత్యాసము కనిపించుచున్నది

క్రీ.శ. 575 నుండి వేయింపబడిన రేనాటి చోళుల శాసనము లన్నియు దాన విషయమును తెలుపును. రాజు పేరు విజయరాజ్య సంవత్సరము, శాసనములందు పేర్కొనబడును. కొన్ని శాసనములందీ విజయరాజ్య సంవత్సర ప్రశంస శాసనానంతమున నున్నది ప్రధాన మైన దాన విషయము శాసనమధ్యమున వర్ణింపబడుటయేగాక, దత్త ములగు గ్రామములు, క్షేత్రములు, వాటి సరిహద్దులు, ఫలశ్రుతి చెప్ప బడును. ఉదాహరణముగ ఈ కాలపు శాసనములందు ఫలశ్రుతి ఓకే విధ ముగ నున్నది. దానమును కాచినవారి కశ్వమేధయాగ ఫలముకలుగు ననియు, వక్రము చేసినవారికి వారణాసిలో బ్రాహ్మణులను, కపిల గోవులను చంపిన పాపము కలుగుననియు చెప్పబడినది ఫలశ్రుతి యనంతరమాజ్ఞప్తి కర్త లేఖకుల పేళ్ళు శాసనమున చేర్చబడును కొన్ని శాసనములందీ ఆజ్ఞప్తి కర్తృ లేఖకల పేళ్ళు లేవు.

ఈ కాలమున వెలసిన శాసనములలోని తెలుఁగు భాషా పద ములు, భాషాభివృద్ధిని తెలిసికొనుట కుపయోగపడుచున్నవి శాసనము లలో ప్రాకృత శబ్దప్రయోగము విరివిగ కనిపించుచున్నది

| | |
|---|---|
| దుజయరాజులు<br>దుకరాజులు<br>పన్నస | ఎఱ్ఱగుడిపాడు శాసనము |

ఆణతి — రామేశ్వర స్తంభశాసనము

పణం — చిలంకూరు శాసనము

అణపోతుల—పొట్లదుర్తి మాలెపాడు శాసనము

శాసనములలో కొన్ని తెలుఁగు పదములు అపరిచిత రూపములతో నుండి అన్యదేశ్య పదములవలె గన్పట్టును.

రేవణకాలు, కుణ్డికాళ్ళు, నివబుకాను, రట్టకుట్ట, పుద్దణకాలు, అచ్చువాన్డు, పుళొంబున, ముట్ళు, ఇల్లికాను, ఆడ్లపట్టు మొదలైనవి.

రేనాటి చోళుల శాసనములందు భూత తద్ధర్మ క్రియలు కనిపించును. కాని అసమాపక క్రియావాక్యములు ఎక్కువగా నున్నవి సమాసక క్రియావాక్యము లిచట ఉదహరింప బడుచున్నవి.

విరిపఱితి కమ్మరి వినియణ వ్రాసె—రామేశ్వర స్తంభ శాసనము.

మరుతున్డు ప్రసాదచేసిరి—చిలంకూరు శాసనము

| | |
|---|---|
| కోసియావాఅకిచ్చిరి.<br>కాచేఱుపాఱ ఎఅకిచ్చిరి<br>కుట్టులికున్నడా అనువాన్డు కుట్టె | పెల్దుర్తి శాసనము |

దన్త్రియమన్సుతోళన్ పొడిచిపడియెన్ —బూడిదగడ్డపల్లి శాసనము

దీనికి వక్రంబువచ్చిన వారు పంచమాపాతకు అగు — ఉరుటూరు శాసనము

అఱువదివేలేండ్లునరకయోని నుండుదురు — ఏడువాడల పాలెపుశాసనము

కొన్నిచోట్ల తచ్ఛబ్దానుగత క్రియాజన్యవిశేషములు క్రియలుగా వాడబడినవి.

దీనికి వక్రమ్బు వచ్చువాన్డు బారనాసి వేవురుపా

జమ్పిన వాన్డు-రామేశ్వర స్తంభ శాసనము,

కొన్ని శాసనములలోని వాక్యముల అర్థము భూతకాల క్రియా విశేషణములలో వ్యక్తీకరింపబడినవి

ఎఱిగల్ దుగరాజుల్ ఇచ్చిన పన్నస—ఇందుకూరుశాసనము
అగ్గిశమ్మఁణరికిచ్చినదతి—వెల్దుర్తి శాసనము.

శాసనములందు సంబంధబోధక సర్వనామములతో రెండు వాక్యము లొకే వాక్యముగ కలిపి వ్రాయుట కనిపించును.

ఇచ్చిన పన్నస పెన్నాలు ఇశెఱేనికిన్
తేఁ అచ్చిన వాన్డుపఞ్చ మహాపాతకున్డకున్
పొట్లదుర్తి మాలెపాడు శాసనము

రేనాటి చోళుల శాసనములన్నియు తెలుఁగు భాషలో వేయింపబడినవి. ఈ కాలమున వేయించిన ఇతర శాసనములలోనున్న గ్రామ నామాదులు తెలుగు భాషా సంబంధము కలిగియున్నవి ఆరేడు శతాబ్దులలో వెలిసిన తెలుగు శాసనములు వచనరూపములో నున్నవి ఐనను అందలి పదములు ప్రాచీన రూపములోనుండి తెలియరాని స్థితియందున్నవి ఈ శాసనములలోని పదములు దాక్షిణాత్య భాషలగు తమిళ, కర్నాటాదులతో సన్నిహిత సంబంధము కలిగియున్నది. తెలుఁగు భాషా పరిణామ వికాస విధానమును సూచించు పదము లిందు కనిపించును ఈ కాలపు తెలుఁగు భాషపై ప్రాకృత ప్రభావ మెక్కువగ కనిపించును శాసనములలోని పదములు సులభ గ్రాహ్యములు కావు ఆంధ్రభాష ప్రాచీనతను తెలుపుటకివి లోడ్పడుచున్నవి. తెలుఁగు పలుకు బళ్ళు, ప్రాచీన ద్రావిడ సంప్రదాయమును, ప్రాకృత భాషాసంపర్క ప్రభావమును కలిగి క్రొత్త పరిణామమును పొంది తెలుగుభాషావికాస పరిమితిని పరిణామమును సూచించుచున్నవి

| | | |
|---|---|---|
| అసివైరువు లిఖితమ్ | — | ఉరుటూరు శాసనము |
| అణచిపోతులు | — | మాలెపాడు శాసనము |
| దుగరాజు<br>దుగిరాజు | | ఇందుకూరు శాసనము |
| నివఋ కాను<br>పన్నస<br>ఇరువదియాది నాల్కుమఱుతుట్లు | | E 1 Vol. XXVII, P 228 |
| చీకున | — | E 1 Vol. XXVII P. 223 |
| పూల్లవట్టమ్బున | — | E.1. Vol XXVII P 235 |
| కోటుఖన<br>రట్టగుళ్ళ | | చిలంకూరు శాసనము |

మున్నగు వింత పదములును ఈ శాసనములందు కనిపించుచున్నవి. పన్నస, దత్తి, మఱుతు, ఇత్యాది పదములు తూర్పు చాళుక్యుల శాసనములందును, తరువాతి శాసనములందును కొలది మార్పులతో కనిపించుచున్నవి. అప్పటికి ఆంధ్రభాష కావ్యభాషగా రూపు దిద్దుకొనినది శాసనములందు కనిపించు, పన్నన, దత్తి, మఱుతు మున్నగు పదములు వింతగానున్నను ఆ కాలమున జనసామాన్యమున వాడుకలో నుండెను.

పన్నస—పణ్ణెయ—పెద్ద పొలము—సేరి.

దత్తి—దానము—దత్తము లేక ఈయబడినది

మఱుతు—భూమి కొలమానమునకొక పరిధి.

మఱుతు—నివర్తనము.

నివర్తనము—పది హస్తముల దండముతో ముప్పది దండములు కొలచిన ఒక నివర్తనము [1] ఆ కాలమున నీరు నేల అనగా తరి

---

1. దశహస్తేన దండేన త్రింశద్దండా నివర్తనమ్,
 పంచవింశతిభిర్దండై రుభయోస్తు నివర్తనమ్.

భూములను మట్టులలోను మెట్టనేల అనగా ఖుష్కి భూములను పుట్టలోను కొలిచెడివారు.

తెలుఁగుభాష ప్రారంభ స్థితిలో నున్నను ఈ కాలమున ముఖ్యముగా ఆంధ్రదేశ తూర్పుతీర ప్రాంతమున భాషాభివృద్ధి జరిగినది. కొన్ని శాసనములు దేశీయచ్ఛందస్సునకు సంబంధించిన జాత్యుపజాత్యాది పద్యములలో వ్రాయబడినవి. అట్లే ప్రాకృత ప్రభావయుత పదములతోనున్న తెలుగు శాసనములలో తెలుగు కవితా వాసనలు కనిపించుచున్నవి. సంస్కృతభాషలో వాడుకలోనున్న ఛందస్సు ననుసరించి ఆంధ్రభాషలోని మార్గకవితా రూపకల్పన గావింపబడినది. మార్గకవితకు పూర్వమాంధ్ర దేశమున దేశిరచనలో జాతులు, ఉప జాతులు పేర్కొనదగినవి. ఈ జాత్యుపజాతులు, ప్రాఙ్నన్నయశాసనములందు కనిపించుచున్నవి దేశిరచనా విధానము క్రీ శ ఆరవశతాబ్ది నుండి అమలులో నున్నను, పరిపక్వస్థితిని బొందలేదు ఆరవ శతాబ్ది నుండి ఆంధ్రదేశములోని కొన్ని మండలములను పాలించిన రేనాటి చోళులు వేయించిన శాసనములలో తెలుఁగు కవిత కనిపించుచున్నది.

రేనాటి చోళుల శాసనములలో ధనుంజయుని కలమళ్ళ శాసనము, తిప్పలూరి శాసనము, రామేశ్వర స్తంభశాసనము, పొట్లదుర్తి మాలెపాడు శాసనము, చిలంకూరు శాసనము, బూడిదగడ్డపల్లి శాసనము ఏడు వాడల పాలెపు శాసనము ముఖ్యమైనవి. ఈ శాసనముల లోని తెలుగుభాష ప్రాకృత ప్రభావము కలిగియుండుటయేగాక, మాత్రాగణములతో గూడి తెలుగుభాష ప్రాథమికదశను, తెలుఁగు ఛందస్సుయొక్క ప్రథమదశను సూచించుచున్నది.

రేనాటి చోళుల శాసనములందున్న వృత్తగంధి పద్యములలో ముఖ్యమైనవి పేర్కొనబడుచున్నవి.

1. పుణ్య కుమారుండు గణ్యమానుండు — తిప్పలూరు శాసనము.
ఇది ద్విపదపాదము — ఇందు ప్రాసయితి వాడబడినది,

2 విరిపత్త్రి కవమ్మరి వినియణ వ్రాసె—రామేశ్వర స్తంభశాసనము
ద్విపద పాదము - యతి సరిగా నున్నది

3 శ్రీ మహేన్ద్రిన్ మానర విమాఱురా పిడుగు
పంచమాత్రకములగు నాలుగు గణము లీపాదము నందున్నవి ఈ పాదము ద్విరదగతిరగడకు సంబంధించినది. యతిమాత్రములేదు.

4. మగడుపుదలయేలువాడు కాడి చోళముత్తరాజు.
నాలుగేసి సూర్యగణములతో కూడిన రెండు పాదములు తురగ వల్గనర గడకు సంబంధించినవి యతిలేదు

5. అచ్చెర్వా నను నరివరజముండ న్వాడు దన్తియనుంగుతోడన్
పొడుచిపడియెన్—బూడిదగడ్డపల్లి శాసనము.
కొలదిమార్పులతో సీసపద్యమువలెనున్నది. కాని యతులు లేవు.

6 అణపోతులు రేవణకాలుపుద్దణకాలు
ఇచ్చిన పన్నసపెన్పార ఇశెరేనికిన్.
—పొట్లదుర్తి మాలెపాడు శాసనము.

అణపోతులు రేవణకాలుపుద్దణకాలులో ప్రాసయతి యున్నది. రెండవ పాదమున సమాక్షరయతి యున్నది యతిస్థానములు సమస్థానమున లేవు. ఐదేసి మాత్రలకొక గణము విరుగుటలేదు. మొదటిపాదమున పదిహేను మాత్రల తరువాతను, రెండవ పాదమున పదమూడు మాత్రల తరువాతను యతి యున్నది. మూఁడవ గణాద్యక్షరము యతిగా లేదు. ఆద్యంత ప్రాసలు లేవు. మాత్రానియమము మాత్రము కనిపించుచున్నది. ద్విరదగతిరగడ లక్షణమును లేదు, మాత్రల లెక్కనుబట్టి చూచిన ప్రతిరచనయు ఏదో ఒక పద్యపాదమునకు సరిపోవును. ఇది ద్విరదగతి రగడకాదు. వృత్తగంధికాదు. ఈ పాదము లందలి మాత్రలు విరుగుటలేదు. ఆంధ్రవాఙ్మయారంభదశలో వేయింపబడిన రేనాటి చోళుల శాసనములం దీ విధమైన వృత్తగంధిరచనలుండుట విశేషము. అప్పటికే తెలుఁగు భాష జనసామాన్యమున వ్యాపించి,

శాసనస్థమై, గద్య పద్య రచనా విశేష సామర్థ్యమైన భాషగా రూపొందినదని భావింపవచ్చును. ఈ కాలపు శాసనములందు, సీస పద్య పాదములు సైతము కనిపించుచున్నవి.

వక్రంబువచ్చిన-వార్వారణాసియు
శ్రీ పర్వతంబు వ్రచ్చిన...

S I I Vol. X, No. 593.

ఇందు సీసపద్య లక్షణములు కనిపించుచున్నవి.

ప్రభుచోళ రట్టోడి-పరహితు డితడు.

ఇది ద్విపద పాదము.

కట్టించె కవికపొం-పట్టంబు హణులుగు
— కొసినేపల్లి శాసనము S.I.I. Vol. Vol X No 593

ఇది సీసపద్య పాదపూర్వార్థము-

దేవస్వంబులంచంబు గొన్నవాడు, వారణాసి వ్రచ్చిన పాపంబు
గొన్నవాండు

S I. I. vol X No. 611

ఇవి తేటగీతి పాదములు. ఇందుయతిలేదు. 'స్వ'ను తేల్చి పలుకవలెను.

పనియు ఆోగొన్నవాడు నిచ్చినవాడు
చెడువాడు క్షొచ్చినవాడు వెంట.

I. I, vol X No 6I2.

ఇది సీసపాదము. ఇందు యతిలేదు

దొంగలసాని కనుమశాసనమున మహాక్కరయున్నది. మహాక్కరలో నొక సూర్యగణము, 5 ఇంద్రగణములు, ఒక చంద్రగణముండును. ప్రాసముండును. పంచమగణాద్యక్షరము యతిస్థానము.

వెంకయాచోళ్ల మహారాజు బెంకణాదిత్యుండు
కొమరురర భీముండు పుసిఇల్లదాష్మనీ ధర్మమా
చంద్రార్కతారకం బునువార్ధిలుచునుండు.

ఇందు గణములు సరిపోవుచున్నవి. కాని ఒకటవ పాదమందలి చంద్రగణమునందొకమాత్ర ఎక్కువగ నున్నది. రెండవ పాదమందలి చంద్రగణమునందొకమాత్ర తక్కువగను ఉన్నది.

మొదటిపాదమున నాలుగవ గణాద్యక్షరము యతిస్థానమున నున్నది. ఇది ప్రాసయతి కాని లక్షణప్రకారము 5వ గణాద్యక్షరము యతిస్థానముననున్నది. ఇది ప్రాసయతి. కాని లక్షణ ప్రకారము 5వ గణాద్యక్షరము యతిస్థానమున నుండవలయును. రెండవ పాదమున యతిప్రాసలులేవు. దీనిని మహాక్కర యనుటకన్న ఆపాదములుగల వృత్తగంధియనుట సమంజసము.

రేనాటిచోళుల కాలమున ప్రారంభదశలో నున్న తెలుఁగు భాష తూర్పు చాళుక్యుల కాలమున పరిణతిపొంది నన్నెచోడుని కుమారసంభవ కావ్యరచనకు తగినభాషగా రూపుదిద్దుకొనినది.

**మతము:** రేనాటి చోళుల కాలమునందాంధ్ర దేశమున వైదిక మతము వృద్ధి జెందినది విష్ణుకుండిన ప్రభువులు వైదికమతానుయాయులై యజ్ఞయాగాది క్రతువు లాచరించుచున్న కాలమున రేనాటి చోళులాంధ్రదేశములోని కొన్ని మండలములను పాలించు చుండిరి. శైవమత మాంధ్ర దేశమున వ్యాపించెను. విష్ణుకుండిన నాలుగవ మాధవవర్మ ఏకాదశాశ్వమేధ అవభృధ అవధౌత జగత్కల్మష మొదలగు క్రతువులు నిర్వర్తించుచుండ. కడపమండల ప్రాంతమును పాలించు రేనాటి చోళులు హిందూమతానుయాయులై వైదిక మతోద్ధరణకు పాటు పడినారు. రేనాటి చోళులు పల్లవులకు, విష్ణుకుండినులకు, తూర్పు చాళుక్య ప్రభువులకు సామంతులుగ వ్యవహరించిరి చోడ మహారాజు రేనాటిని పాలించు సమయమున రేయమయ్యారు అను నతడు సూర్యగ్రహణ నిమిత్తమున సూర్యునికి ఒక దేవాలయమును నిర్మించి, చోడమహారాజు ఆజ్ఞగొని, సిఱుమూర, ఆలయమునకు కొంత భూమిని ఒక గానుగును దానమిచ్చినట్లు తెలియుచున్నది.

"......సిరుమూర
తేయమయ్యరు ఆదిత్యగ్రిహంబు
నిల్పి శూజ్యగ్రహన నిమిత్తంబున
చోడమహారాజు వేణ్ణికొనియా
......భటరలకు నిచ్చినది య్యారిపడుమ
......ణయుత్తరంబున రాజమానం...
ప్రితుడ్లు నేలయునొక్కొగాను గు
నిచ్చిన దీనికి వక్రంబు వచ్చినవారు..."1

సూర్యారాధన మానాడు విశేషముగ వ్యాప్తిలో నుండెను. రాజులు, దండనాథులు, సూర్యదేవుని కాలయములు నిర్మించిరి ఆలయమున నిత్యారాధన, నిత్యసేవలు, దూపదీప నైవేద్యములకు, అంగరంగ భోగములకుగాను, భూదానము చేయుచుండిరి. గ్రామము లందుగల అధికారులు, ముఖ్యముగా రెడ్లు లేక రట్టోడ్లు దేవాలయ ములను నిర్మించుచుండిరి. వారి సతులు, సుతులు, శాసనములు వేయించుచుండిరి. బాదెయ్య రట్టోడ్ల భార్యమారకణ్ణరు వారి కొడుకు చాముణ్డెయ శాసనమును వేయించినట్లు తెలియుచున్నది [2] అనగా సామాన్యులైన గ్రామాధికారులు, రట్టోడ్లు, దేవాలయము లను నిర్మించునంతటి భాగ్యవంతులై యుండిరనియు, దైవభక్తి, పాప భీతి, పుణ్య కార్యాచరణయందుత్సాహము కలిగి యుండిరనియు భావింపవచ్చును. వసన్తి పోటిచోళ మహాదేవి, వసన్తీశ్వరంబున వసం తీశ్వరునికి 300 మర్తునేల, రెండుతోటలు, విరిపర్తిలోను, 12 మర్తుల నేల వాన పోతుల ముచ్చియకు, దైవమునకు సేవలొనర్చుట కొసంగి నట్లు శాసనమువలన తెలియుచున్నది.[3]

వల్లభ మహారాజు పాలించు కాలమున పెర్బాణ వంశీయుండగు భుజంగడి భూపాదిత్యుడు వంగనూర్లి చరువశర్మ కుమారుడగు

1. S I I. Vol X No. 593
2. S I. I. Vol X No. 598.
3. S. I. I. Vol X No 599.

విన్నశర్మకు భూమిదానమిచ్చినట్లు, అరకతవేముల శాసనము వలన తెలియుచున్నది [1]

బ్రాహ్మణులు సైతము ధనవంతులైయుండి, ప్రతిగ్రహీతలు గనే కాక, గుళ్లు, గోపురములుకట్టించుచు, దేవాలయములకు దానము లిచ్చుచుండిరి. భారద్వాజ గోత్రీకుడును జేచపశర్మ కుమారుడును నగు రేవశర్మ స్వయముగా గుడికట్టించినట్లు కలమళ్ళ శాసనమందు న్నది.[2] రేనాటి చోళులు పాలించిన కాలమునందచ్చటచ్చట మత యుద్ధములు జరుగుచుండెనని తెలియుచున్నది దేవాలయమునకు వచ్చు ఆదాయము నపహరించిన కలుగు పాపమును తెలుపుచు ప్రత్యేక ముగ శాసనములు వేయింపబడినవి. దైవద్రవ్యాపహారణము చేయు వారుండిరనియు, వారికొఱకు ప్రత్యేక శాసనములు వెలిసినట్లును భావింపవచ్చును. సాధారణముగ, ప్రతిశాసనము చివర దానమును పాటించిన కలుగుఫలము, దానము చెఱచినవారికి కలుగు పాప ఫలము చెప్పబడును. పెద్దముడియం శివాలయమునగల శాసన శకల మున [3] దేవస్వంబు లఞ్చంబుగొణ్న వాన్డు వారనాశివ్రోచ్చిన బాపంబు గొణ్నవాన్డు" అనికలదు.

చోడవంశీయులు మొదట నివసించినభూమి మహాబూబునగర మండలమనియు, అదియే చోళవాడియగునని ఆచార్య శ్రీ ఖండ వల్లి లక్ష్మీరంజనము గారు తెలిపిన విషయమున కనుగుణముగా, పాలమూరు మండలమున, పదునొకండవ శతాబ్దిలో వేయింపబడిన చోడవంశీయుల శాసనములు కనిపించుచున్నవి. ఈ చోడవంశీ యులు రేనాటి చోడవంశీయులలో నొక తెగవారు కావచ్చును. మహబూబునగరం జిల్లా కల్వకుర్తి తాలూకాలోని రాచూరు గ్రామ

1. S. I. I Vol X No. 604.
2. S I. I. vol X No. 608.
3. S I I vol X No. 611.

మునగల పశ్చిమ చాళుక్యుల కాలమున నిర్మింపబడిన శివాలయమున నున్న శాసనమున ఉదయనచోడమహారాజు ప్రశంసయున్నది ఈతడు శాసనమున "సూర్యవంశోద్భవ కులతిలక కాశ్యపగోత్ర కరికాలాన్వయ నామాది సమస్త ప్రశస్తి సహితులైన శ్రీ మన్మహామండలేశ్వర కోడూరి ఉదయనచోడ మహారాజని" పర్ణింపబడినాడు. ఈశాసనము శక సంవత్సరము 1014లో వేయింపబడినది. ఇదిశాసనసంపుటిలో ప్రకటింప బడినది శాసనశిల నల్లగా నుండి,మూడువైపుల మూడు శాసనములును ఒకవైపు మహానాగమును చెక్కబడినవి ఈ మూడు శాసనములలో నొకటి ఉదయనచోడమహారాజు ప్రశంసగల శాసనము. శ.సం. 1014 లోను, శ్రీమత్త్రైలోక్యమల్ల గంగాపురము త్రిభువనమల్ల బ్రహ్మ దేవర శెట్టి రెండవ శాసనమును శ సం. 1081 లోను, రావితొాటిరి పెగ్గడమల్లి సెట్టి మూఁడవశాసనమును శ.సం. 1081 లోనువేయించి నట్లు తెలియుచున్నది ఈ శాసనమున్న ఆలయ మతి ప్రాచీనమైనది శివాలయము, గర్భగుడి, మంటపము విశాలమై యున్నది. ఆలయము ముందు ఆవరణలో, చక్కని నల్లరాతితో చెక్కబడిన పెద్ద గణపతి విగ్రహమున్నది.

ఈ కాలమున దానధర్మములు చేయుటయందును, సప్తసంతాన ప్రతిష్టలు చేయుటయందును ప్రజలుత్సాహము బూపుచుండిరి. వన ప్రోలు అపిమనగంగు, ఒక చెఱువు నిర్మించినట్లు బూడిదగడ్డపల్లి శాస నము వలన తెలియుచున్నది [1] శైవమత మీ కాలమున వృద్ధి చెంది నది. పల్లవరాజులు, తూర్పుచాళుక్యులు, వైదికమతానుయాయులై, దేవాలయముల నిర్మించుచు వేద పండితుల నాదరించి, పోషించి, అగ్రహారముల నొసంగుచుండుటవలన ప్రజలు తత్ప్రభావమున శైవము నాదరించుచు, శివాలయములకు భూదానము లిచ్చుచుండిరి.

---

1. S 1.1 Vol X No. 633.

జైన బౌద్ధమతముల నాదరించు ప్రజలు ఆ మత సన్యాసుల ప్రవర్తనల ననుసరించి జైన బౌద్ధముల నిరసించి వైదికమతావలంబు లగుచుండిరి. జైనమతమునం దేర్పడిన కాపాలిక జైన విభాగమువలన జైన కాపాలికుల మధుమాంస భక్షణము, కాపాలిక స్త్రీలతో విహారము, ప్రజలలో సంచలనము బయలుదేర దీసినది. ఇవి, బౌద్ధమున నేర్పడిన వజ్రయాన బౌద్ధమత విభాగమువలనను, బౌద్ధసన్యాసుల యొక్కయు, సన్యాసినులయొక్కయు అవధులు లేని ప్రవర్తన ప్రజలలో నసహానము కలిగించి, వైదికమతమువైపు వారి మనస్సులను మరల్చినది. ఈ మతములలో వచ్చిన మార్పులవలన ప్రజలలో నంతకు పూర్వమున్న గౌరవాదరములు సన్నగిల్లి, జైన, బౌద్ధమతముల పతనమునకు దారితీసినది బౌద్ధ జైనమతముల పతనము వైదిక మతము ముఖ్యముగా శైవమత విజృంభణకు దోహదమైనది. శైవ మున రానురాను కాలాముఖాది భేదము లేర్పడినవి. క్రమముగా వైష్ణవమతము, శైవమునకు ప్రతిస్పర్థిగా వచ్చినిలిచినది ఈ రెండు మతములు సమానస్థాయిలో దేశమున వ్యాపించి, ప్రజాభిమానమును, గౌరవాదరములను, భక్తిప్రపత్తులను సంపాదించుకొనినవి

**సాంఘిక పరిస్థితులు :-** రేనాటి చోళులు పాలించిన కడప, చిత్తూరు మండలములలోని ప్రజలు సుఖమయ జీవనము గడుపు చుండిరి సంఘమున వర్ణవ్యవస్థ యేర్పడియుండెను. బ్రాహ్మణులు మతాచార వ్యవహారముల నెఱింగి రాజులచేతను, ప్రజలచేతను గౌర వింపబడుచుండిరి. రాజులు, దండనాయకులు, సేనాపతులు, ధనా ఢ్యులు విద్యావంతులైన బ్రాహ్మణులకు భూములను దానమిచ్చు చుండిరి ప్రజలలో నధిక సంఖ్యాకులు వ్యవసాయము ముఖ్యవృత్తిగా కలిగియుండిరి సంఘమున అన్ని వృత్తులవారును ఉండిరి రేనాటి చోళులు ఏడు వేల గ్రామములు, సిద్దివెయ్యి గ్రామములుగల దేశమును పాలించిరి. బహుశః ఈ గ్రామములు చిన్నవి పెద్దవి కలిసి ఏడువేలై

యుండవచ్చును. గ్రామములు కూటములుగా, గ్రామకూటములు మండలములుగా, మండలములు దేశముగా నేర్పడియుండవచ్చును. గ్రామములు కూటమి మండలములుగా నేర్పడి యుండుటనుబట్టి మండలాధిపతుల యధికారమున కొన్ని గ్రామకూటములు, గ్రామ కూటముల అధిపతుల క్రింద కొన్ని గ్రామములుండి, గ్రామములు రట్టొడ్లచేత పాలింపబడు చుండెను.

ప్రజలు సంఘీభావముతో జీవించుచుండిరి. రాజాజ్ఞలను మండ లాధిపతులు పాటించుచుండిరి. ప్రజలు తమతమ వృత్తుల నవలం బించుచు ప్రశాంతమైన జీవితము గడుపుచుండిరి.

ప్రజలలో కొన్ని కట్టుబాట్లుండెను ఒకానొక సమయమున 108 మంది కలిసి, వారిలో ఎవరైనను, లంచమిచ్చినను, తీసికొన్నను, పాపము వడయుదురని నిర్ణయించుకొనినట్లు పెద్ద ముడియము శివాల యమున నున్న శాసనము వలన తెలియుచున్నది.

"స్వస్తిశ్రీ నూటయెణు
బొన్డఇద్దస-
మయంబు...ఱ్ఱు
పాల ఆజెవియ న్తయే-
నియుఱోగొణ్ణ వాన్ఱునిచ్చి
నవాన్ఱు చెడువాన్ఱు క్ఱొచిన
వాన్ఱు వెణ్ణవడ్డచి......
కుణ బ్రమ్మవడ్డచి......"[1]

భూమిని మణుతులతో కొలిచెడివాడు రాజులకు ప్రియపుత్రు లుండిరి అందు ప్రథమ ప్రియపుత్రుఁడు భూదానములిచ్చు అధికారము కలిగి యుండెను విక్రమాదిత్యుడను రాజు ప్రథమ ప్రియపుత్రుడు క్షేత్రము దానమిచ్చెను.

1. S.I.I. Vol. X No. 612

" .....బు పె
విక్రమాది-
త్యచే......
త్య......రాజు
ప్రథమ ప్రి
యపు-
త్రున్హు ఇచ్చి-
నక్షేత్రంబు......"[1]

పురుషులలో కొందరికి త్రిభువన సింగంబను బిరుదముండెను.[2] వైదుంబరాజుల కాలమున జరిగిన సోరవడి కయ్యంబు చారిత్రక ప్రసిద్ధి చెందిన యుద్ధముగ తోచుచున్నది. ఈ కాలమున వెలసిన అనేక శాసనములందీ యుద్ధ ప్రశంస యున్నది.

యుద్ధమున మరణించినవారి గుణగణములను ప్రశంసించుచుం శాసనములు వేయించు చుండిరి. యుద్ధములందు సాధారణ ప్రజలు పాల్గొనుచుండిరి. వీరులు, యోధులు యుద్ధములందు ప్రాణములకు తెగించి పోరాడుచుండిరి వీరస్వర్గమలంకరించుటయే వీరుని ఆశయమైనట్లు తెలియుచున్నది యుద్ధములలో మరణించినవారు ఇంద్రలోక మేగుదురను నమ్మకము వీరులలోను, ప్రజలలోను ఉండెను. వైదుంబరాజుల కాలమున వెలసిన శాసనములలో ఎక్కువ శాసనములు యుద్ధవీరుల మరణమునకు ముఖ్యముగా సోరవాడి కయ్యంబున మరణించిన వారికి సంబంధించినవే యున్నవి. రాజులు, వీరయోధులు చోళులతో యుద్ధము లెక్కువచేసినట్లు తెలియుచున్నది. పురుషుల పేళ్లు, స్త్రీలపేళ్ళవలె కనిపించు చున్నవి అట్టి పేళ్ళు శాసనములందున్నవి. "ఊమణ్ణాళ (శ్రీ) జయమాయి రెసెఅళుకుమ్మాళ కొడుకు

1 S 1.1 Vol. X No 617
2. S 1 1. Vol. X No 618

కుళమ్మ" అని గంగిరెడ్డిపల్లి శాసనమునందున్నది. [1] కొందరు ధనాఢ్యులు తటాకముల త్రవ్వించుచుండిరి. వణ్రాలు అపిమనగంగు కెస్సరాజు చెఱువు నిర్మించినట్లు బూడిదగడ్డపల్లి శాసనము [2]వలన తెలియుచున్నది వైదుంబుల చేతపట్టం కట్టబడిన గండర ముత్రాజు యుద్ధమున మరణించినట్లు ముదివేడు శాసనమునన్నది. సంఘమున విశ్వబ్రాహ్మణులు, ముఖ్యముగ శాసనాక్షరములను చెక్కు శిల్పులు గౌరవింప బడుచుండిరి. పంచాణము వారిలో కమ్మరులు శాసనములను చెక్కెడివారు. రామేశ్వరములోని రామలింగేశ్వరాలయ స్తంభ శాసనమును విజిపటితి కమ్మరి వినియణ వ్రాసినట్లున్నది. భూమి కొలతలు "పన్నిస"లలో కొలిచెడివారు ఆనాడు 'చేను' అనుపదము పొలమునకు మారుగా ఉపయోగించుచుండిరి. మఱుతులు, మఱు తురులు, మఱులు భూమి పరిమాణమును సూచించుచు మఱుతు యొక్క రూపవైవిధ్యపదములు.

ప్రజలలో వినోద ప్రదర్శనలను ప్రోత్సహించు వారుండిరి. ఆ కాలమున వాడుకలో నున్న కోడిపందెములు, మేషమహిష యుద్ధములు, పండుగలు, ఏరువాక పున్నమి వంటి పండుగలు ప్రజావినోదములుగ పరిగణింపబడు చుండెను జనులలో దైవభక్తి, పాపభీతి యుండెను ప్రజానురంజకముగా రాజులు పరిపాలించుచుండిరి

స్త్రీలు, కర్ణాభరణములు, ముక్కరలు, కొప్పులకు పూవులు కంకణములు ధరించుచుండిరి వివాహములు సాధారణముగా నాలుగు రోజులు జరుగుచుండెను బాలికలు, బొమ్మలాటలు, పర్వదినములందు ఆయా పండుగలకు సంబంధించిన ఆటలాడుచుండిరి.

---

1 S I I Vol. X No 631.
2 S I.I V.l X No. 633.
3. S I I Vol. X No. 640

వేటలనినను, యుద్ధములనినను ప్రజలుత్సాహము చూపు చుండిరి. యుద్ధములందు స్త్రీలు-పురుషులకు సహాయమొనర్చుచుండిరి. ఈ కాలమున ప్రజలనేక చిన్నచిన్న యుద్ధముల తాకిడి నెదుర్కొన వలసి వచ్చెను. చిన్న చిన్న రాజులు, ఒకరితోనొకరు పోరాడుచుండుట వలన ప్రజల సాంఘిక జీవనమునకు కొంతవర కంతరాయము కల్గు చుండెనని భావింపవచ్చును.

**వ్యాపారము - ఆర్థికస్థితి :-** రేనాటి చోళులు పాలించిన కాలమందు దేశము చిన్నచిన్న మండలములుగ విభజింపబడినను, ప్రజలు వ్యవసాయము ముఖ్యవృత్తిగా గలిగి, ధనధాన్య సమృద్ధి గలిగి సిరిసంపదలతో వర్ధిల్లినారు దేశమున వర్తక వ్యాపారములు విశేషముగ సాగుచుండెను. చక్కని రాజమార్గములుండెను. రేనాటి చోళులు, వైదుంబులు, చిన్నచిన్న మాండలికులతోను, తదితర రాజ వంశీయులతోను యుద్ధములు చేయవలసివచ్చుచుండెను. ఈ యుద్ధము లందు సేనలు నడుచుటకు చక్కని రహదారులుండెను యుద్ధములు లేని సమయములందీ మార్గములు, వాణిజ్యమున కుపయోగపడు చుండెను. దేశమున పెద్ద పెద్ద నగరములను కలుపుచు రాజ మార్గ ములు వేయబడెను బండ్లు, గుఱ్ఱములు, ఎద్దులు సరుకుల నొకచోటి నుండి మరియొక చోటికి తీసుకొనిపోవుటకు ఉపయోగపడుచుండెను ఒంగేరు మార్గము, ఆంధ్రపథము తదితర రాజ మార్గములు ఆనాడు ముఖ్యమైన స్థలములను, పట్టణములను రేవు పట్టణములను కలుపు చుండెను

వర్తకము చేయువారు రాజునకు వర్తక సుంకములిచ్చు చుండిరి. వర్తకపు సుంకముల వలన వచ్చు ఆదాయమును రాజులు వ్యాపారాభివృద్ధికి వినియోగించుచుండిరి. పట్టణములలోను, నగర ములలోను వర్తకపు టంగడులుండెడివి.

రేనాటి చోళులు పాలించిన కాలమున గొప్ప దేవాలయములు వెలసినట్లు కాన్పింపదు. ఆంధ్రదేశము నందితర ప్రాంతములందు నిర్మించిన దేవాలయ శిల్పము గురించి పల్లవ విష్ణుకుండిన, యుగను లకు సంబంధించిన ప్రకరణములందు తెలుపబడినది.

## ముఖ్యాధార గ్రంథములు


1. ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి-ఆచార్య శ్రీ ఖండపల్లి లక్ష్మీరంజనం బాలేందు శేఖరం.
2. South Indian Inscriptions Vol X.
3. Epigraphia Indica Vol XXVII.


